# ప్రకాశకుల తొలిపలుకు

దివ్యజ్ఞానసమాజము స్థాపించినతరువాత అనేకరహస్య విషయములను బోధించుచు హెచ్. పి. బ్లవట్స్కీ, ఆనిబిసెంటు మొదలగువారు అనేకగ్రంథములు రచించిరి. ఆ గ్రంథములలోని బోధలు (Theosophy) 'దివ్యజ్ఞాన'మని ప్రపంచములో ప్రసిద్ధికలిగినవి. ఆ విషయములనే ఆధునిక భౌతికవాదులకు నచ్చునట్లు శ్రీ సి. జినరాజదాసాగారు ఆంగ్లమున "First Principles of Theosophy" అనే ఉద్గ్రంథమును రచించిరి. ఆ గ్రంథము అనేకభాషలలోనికి అనువాదముచేయఁబడెను. మన దేశములో హిందీభాషలోనికి ఇదివఱకే తర్జుమాచేయఁబడెను. తెలుఁగులోనికి అనువాదముచేయుటకు సోదరులు శ్రీ తోపల్లె కృష్ణబ్రహ్మశాస్త్రిగారు పూనుకొని మిక్కిలిశ్రద్ధతో భౌతికశాస్త్ర పారిభాషికపదములను భావములను ఇంగ్లీషుతెలియనివారికందరికి బోధపడునట్లు చక్కటిశైలిలో "బ్రహ్మవిద్యా ప్రాథమికసూత్రములు" అను పేరున రచించి కృతార్థులైరి. ఈ అనువాదము వారి జీవితసేవాకార్యముగాయెంచి వారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున ప్రకటింపించి ధన్యులైరి.

ఎంతసులభమైన గ్రంథమైనను ఒకభాషలోనుండి మఱియొకభాషలోనికి అనువదించునప్పుడు కొన్నిలోపములు సంభవించకతప్పదు. అట్టి లోపములు ఈ గ్రంథములో కొన్ని ఉండిననుండవచ్చును. కాని మూలగ్రంథములోని భావములు బహు

రమ్యముగా వ్యక్తీకరింపఁబడినవని నిశ్చయముగా చెప్పనగును. శ్రీ కృష్ణబ్రహ్మశాస్త్రిగారు ఈ గ్రంథమును వసంతా ఇనిస్టిట్యూట్ తరపున వసంత గ్రంథమాలలో 4 వ కుసుమముగ ప్రచురింపఁ గోరి తమ స్వంతద్రవ్యముతో అచ్చువేయించి యిచ్చినందున వసంతా ఇన్స్టిట్యూట్, శాస్త్రిగారికి కృతజ్ఞతాభివందనములర్పించు చున్నారు.

ఆంధ్రలోకములో దివ్యజ్ఞానమూల తత్త్వములను ప్రకటిత మగునట్లు నుత్తమమైనగ్రంథములను ప్రచురించుట ఇన్స్టిట్యూట్ యొక్క ముఖ్యోద్దేశము. అట్టి గ్రంథములు అనేకములు ఇదివ లలో ప్రకటింపఁబడినవి. కాని ఈ “ బ్రహ్మవిద్యా ప్రాథమిక సూత్రములు ” అను గ్రంథములో నొకవిశేషమున్నది. అది ఏమనఁగా భౌతికశాస్త్రవాదుల అభిరుచికితగినటుల హేతుపూర్వ కముగ ప్రాచీనార్షసాంప్రదాయికవిషయములు దీనిలో విపులీక రింపఁబడినవి. దివ్యజ్ఞానము శాస్త్రసమ్మతమైనదనియు విజ్ఞాన శాస్త్రమేయనియు చదువరులకు ఈ గ్రంథమే ఋజువుచేయును. ఈ గ్రంథమువలన వసంతా ఇన్స్టిట్యూట్ వారి ఉద్దేశము నెరవేఱఁగలదని ఆశించుచు ఆంధ్రదేశమునకు దీనిని అందచేయు చున్నాము.

రాజమండ్రి.
3—1—1959.

తాడి వెంకట శివరామకృష్ణారావు,
సెక్రటరి, వసంతా ఇన్స్టిట్యూట్.

# విజ్ఞప్తి

పాఠక మహాశయులకు నా హృదయపూర్వకశుభాకాంక్షలు. నేను ఆస్తికుఁడను; కాని తత్త్వతః ఏవిషయమును గ్రుడ్డిగానమ్ము అలవాటులేదు. హేతువాదాని కనుగుణముగ నుండి. విజ్ఞానశాస్త్రదృష్ట్యా సమర్థనీయమని తోఁచినప్పుడే అంగీకరించువాఁడను. మీఁదుమిక్కిలి తాత్త్వికదృష్టితో పరిశీలనచేయు స్వభావము కొద్దిగ అలవడినది. మతములుబోధించు శాశ్వతసత్యములను నాబుద్ధి గ్రహింపఁగలిగినంతవఱకు తెలిసికొనవలెనను అభిలాష హెచ్చు. వీలైనంతవఱకు మత, తత్త్వగ్రంథములను, వ్యాఖ్యానముల సాహాయ్యముతోఁగాక, మూలపఠనమున స్వతంత్రించి అర్థముచేసికొనవలెననుకాంక్షమెండు. కాని సంస్కృతభాషాజ్ఞానము లేని కారణమున ఆంధ్రాంగ్లానువాదములపై ఆధారపడి విషయములను తెలిసికొన ప్రయత్నించుదును; అందులోను ఆంగ్లానువాదముల ద్వారా సేకరించిన విషయములను ఆంగ్లభాషాజ్ఞానములేని నా సోదరులకు తెలుఁగులో చెప్పుచుండుట నాకు పరిపాటిఅయినది. పైనపేర్కొన్న నా ఆశయములన్నింటికి. ఈ గ్రంథము. అనుగుణముగనున్నదని నాఅభిప్రాయము.

కాకినాడ గౌతమ లాడ్జిలో నాలుగు సంవత్సరముల క్రిందట, యువకసభ్యులొక సాంస్కృతిక శిబిరమును ఏర్పాటుచేసి, అందులో అధ్యయనము కొఱకు సి. జినరాజదాసాగారి

'First Principles of Theosphy' అను గ్రంథమును ఎంచుకొని, నన్నా అధ్యయన తరగతులు నడిపింపుమని కోరియుండిరి. ఆ శిబిరములో అధ్యయనము చేయుటకు ప్రారంభించి, తరువాత పదునెనిమిది నెలలకు ( వారమునకు రెండు గంటల చొప్పున చదివి) పూర్తి చేసినాము. దీనిని తెలుఁగుభాషలోనికి పరివర్తింపవలసినదని నామిత్రులందరు ప్రోత్సహించినారు. నాకు తెలుఁగులో భాషాజ్ఞానముకన్న దానియందు ప్రేమాభిమానములు హెచ్చు. ఆ కారణమున, మాతృభాషగాన, వ్యావహారిక భాషలోనైనను వ్రాయలేకపోవుదునా అను ధైర్యముతో, నావలె మూలమును చదువుటకు తగిన భాషాజ్ఞానము లేక అనువాదములపైన ఆధారపడువారికి ఉపయుక్తముగనుండునని యెంచి, నా మిత్రుల ప్రోత్సాహముననుసరించి, నా పూజ్యమానసిక గురువర్యులకు, నా అఱువది ఒకటవ జన్మదినము నాఁడు ఒకమాల సమర్పించు కుతూహలముతోను, ఋషిఋణము కొంతవఱకు తీరునని ఎంచి ఈ సాహసకార్యమునకొడంబడితిని.

ఆధ్యాత్మిక, తాత్త్విక విషయములను శాశ్వతసత్యములను, హేతువాదశాస్త్రదృక్పథము గలిగిన ఆధునికులకు అంగీకారయోగ్యముగ నుండునట్లు, సాధారణమానవులకు కూడ సులభముగ అర్థమగునట్లు రచించిన గ్రంథములలోకెల్ల 'బ్రహ్మవిద్యాప్రాథమిక సూత్రములు' మేటి అని చెప్పవచ్చు. నాల్గువందలపుటలుమాత్రము గల్గిన ఈచిన్నగ్రంథములో అపారమైనట్టి బహుక్లిష్టమైన కర్మ పునర్జన్మ మరణానంతర

జీవితము, మొదలగు అనేకసిద్ధాంతములను వివరములసహా, సంక్షిప్తముగా రచయిత పొందుపఱిచినారు. జిజ్ఞాసువులకు అనగా, "ప్రణిపాతేన, పరిప్రశ్నేన, సేవయా" అను మన సూత్రముగలవారికి కొంతవఱకు ఈ సిద్ధాంతములనుగూర్చిన సందేహములు, నాకుతీరునటులనె, తీరవచ్చుననియు, మన సంతృప్తికలుగునని, నేను అభిప్రాయపడుచున్నాను. ప్రత్యే కించి ఆంగ్లభాషతో ఎక్కువపరిచయములేనివారికి, మహో త్కృష్టమైన ఇట్టిగ్రంథములలోని విషయములు తెలియవల యుననిన, వానిని అనువదించుట ఎంతో ఆవశ్యకమని అనేకు లతోపాటు, నేనుకూడ అభిప్రాయపడుచున్నాను. అట్టి వారినుద్దేశించియే ఈఅనువాదమునకు పూనుకొన్నాను. ఈ అనువాదములో మూలగ్రంథమున గల భావచమత్కృతిని, అందమును ఎంతవఱకు నేను వ్యక్తముచేయఁగలిగినది నిర్ధా ణరచేయవలసినది పాఠకులే. అందునిమిత్తము ఈ అనువాద లేఖకను, మూడునాల్గుసార్లు పరిశీలించియుంటిని.

ఈ అనువాదమునకు నాతీరికసమయము నుపయోగిం పగా రెండుసంవత్సరములు కాలముపట్టినది. 6 నెలలక్రిందట పూర్తిచేయఁగలిగితిని. ఈ ఆఱునెలలలోను ముద్రణకార్య క్రమముయావత్తు పూర్తికావలసియున్నది. దాదాపు నూరు లైనుబ్లాకులు, 16 హాఫ్‌టోనుబ్లాకులు, 3 రంగుబ్లాకులు, కావలసియున్నవి. సమయమునకు కాగితముకూడ కరవైనను అతిధైర్యముతోను, శ్రద్ధతోను ఈకార్యమునకు పూనుకొని పరికరములన్నియు చేకూర్చునప్పటికి నవంబరునెల జరుగుచు

న్నది. నవంబరు 15 న ముద్రణప్రారంభముఅయినది. సరిగా రెండు నెలల కాలములో ముద్రణ పూర్తి కావలసియున్నది, స్టార్ అండ్ కో., ప్రొప్రయిటరు, నామిత్రులు అయిన కనుమూరి సూర్యనారాయణ ఆచార్యులుగారు, ఆయన సిబ్బందివారు, ఎంతో అభిమానముతోను శ్రద్ధతోను ఈ విష యమునకు పూనుకొన్నందున నే అనుకొన్న సమయమునకు ముద్రణపూర్తి చేయఁగలిగితిమి.

ఈగ్రంథమును పరిశోధించవలసినదని (revise) శ్రీ పీఠికాపురాధీశప్రభుత్వకళాశాల రిటైర్డుపండితులు, ఆంధ్ర సాహిత్య ఎకాడమీ సభ్యులు అయిన బ్రహ్మశ్రీ కోపల్లె శివకామేశ్వరరావుగారిని నేను కోరిన వెంటనే వారు కొద్దిగా అస్వస్థతతోనుండియు అంగీకరించి గ్రంథ పరిశీలన, అంతిమ అచ్చుపత్రముల పరిశోధన (final proof reading) గూడ త్వరితముగ జరిపి అందిచ్చినారు. ది 23-1-1959 సం॥ తేదీని ఈ గ్రంథ ఆవిష్కరణను జరిపితీరవలయుననెడి లక్ష్యమును మనస్సులోపెట్టుకొని ముద్రణాలయమువారికి ఒత్తిడి కలుగ చేసినకారణమున అచ్చటచ్చట స్వల్పముగ అచ్చుపొరపాట్లు వచ్చియున్నవి. వానిని తప్పొప్పుల పట్టికలో సూచించినాను.

నాకు ఈవిషయములో సాహాయ్యమొసంగిన మిత్రులు పండిత కోపల్లె శివకామేశ్వరరావుగారికి అనువాదమునకు అనుమతినిచ్చిన థియోసాఫికల్ పబ్లిషింగ్ హౌస్ వారికి ఈ పుస్తకమును ప్రచురించుటకు అంగీకరించిన "వసంత

యిన్‌స్టిట్యూట్ "వారికి నన్ను ప్రోత్సహించిన దివ్యజ్ఞాన సమాజ, సమాజేతరసోదరులకు నాకృతజ్ఞతాపూర్వక వందనములు అర్పించుచున్నాను.

ఇట్టి ఆధ్యాత్మిక, తాత్త్వికవిషయమునన్ని అభిరుచి కొందరికిమాత్రమే యుండునని నాకు తెలియును; కాని యీనాడు అనేకులదృష్టి కొద్దికొద్దిగా ఈవిషయములపై మరలు చున్నట్లు స్పష్టముగా చిహ్నాలు కనిపించుచున్నవి. ఇట్టిస్థితిలో యిటువంటి అనువాదములు నేటిప్రజానీకమునకే గాక, భావి తరములవారికిఁగూడ ప్రయోజనకారులుగానుండఁగలవనియు, ఈనాఁడు సందిగ్ధావస్థలోఉండి విషజ్వాలలతో నిండియున్న ప్రపంచమునకు మనశ్శాంతి, సుఖము, ఇట్టి గ్రంథములె చేకూర్పఁగలవని, విరివిగా ఇట్టిగ్రంథములు ప్రచారములోనికి రావలెనని ఆశించుచున్నాను. ఈగ్రంథము ఆస్తికులకే గాక, ప్రమాణబద్ధులైన నాస్తికులకు కూడ అభిరుచిగలిగింప గలదని నా అభిప్రాయము. భగవంతుఁడు పాఠకమహాశయులకు తదితరులకు వేయేల సర్వులకు ఆయురారోగ్యైశ్వర్య శుభములు, శాంతి, తుష్టి ప్రసాదించుగాక అని ప్రార్థించుచున్నాను.

"సర్వేజనా స్సుఖినోభవన్తు"

కాకినాడ,
20-1-59.

తోపల్లె కృష్ణబ్రహ్మశాస్త్రి,
అనువాదకర్త.

•

# పండితవచనము

ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః

విద్యుద్విలాసవపుషశ్శ్రియముద్వహన్తీం
యాన్తీం స్వవాసభవనాత్ శివరాజధానీమ్ ।
సౌషుమ్నవర్త్మకమలాని వికాసయన్తీం
దేవీం భజే హృది పరామృతసిక్తగాత్రీమ్ ॥

మిత్రులు బ్రహ్మశ్రీ తోపల్లె కృష్ణబ్రహ్మశాస్త్రిగారు రచించిన 'బ్రహ్మవిద్యా ప్రాథమికసూత్రము' అను గ్రంథము నామూలాగ్రము చూచితిని. వ్యావహారికగ్రాంధికాంధ్రభాషా సమ్మేళనమిందుఁగలదు. సుడికారమున మూలానుగుణాంగ్లభాషా విన్యాసము కలిమి యీ గ్రంథమునందలి విశేషమనవచ్చును.

ప్రమాణానుసరణమునఁ గర్మజన్మముల సంబంధము, ముక్తి, నిర్ణయించుటకై నేఁడు ప్రచలనమున నున్న పరిణామవాదము పరిపూర్ణముగాఁ జర్చింపఁబడిన గ్రంథమిది. తదనురోధముగాఁ దక్కిన భౌతికశాస్త్రసంప్రదాయములన్నియు మిక్కిలిగంభీరమైన విందుఁ గరతలామలకముగాఁ దెల్పఁబడినవి. ఇది యాంధ్రులకెల్ల నత్యంతోపయుక్తమగు విషయము.

రాయి మొదలు పరిణామక్రమమున నరుఁడగువఱకు నొక శరీరి యనుభవించు జన్మపరంపరలఁ బతనోత్పతనదశావిశేషములచేఁ గ్రమభంగము కలుగవచ్చునని యీసిద్ధాంత మంగీకరించును.

నరుఁడై నపిదప మరల నధఃపతనము లేదనియుఁ, గ్రమోత్పతన దశయే శరీరి యనుభవించుననియు నీ సిద్ధాంతముచేయు బోధము. ఈ సిద్ధాంతము తక్కిన మోక్షశాస్త్రములయుఁ, గర్మధర్మశాస్త్రములయు మార్గమున కతీతమైనది. ఇదియే యెల్లవానికి నీ మతమునం దాశాజనకస్థానము.

సర్వమానవసౌభ్రాత్రము, సర్వమతసామరస్యమనునవి ముఖ్యముగాఁ గావలయుననెడి నేఁటి ప్రపంచపురోభివృద్ధికాముల వాంఛాపరిపూర్తి కీగ్రంథమును దోహదముచేయును.

కాకినాడ.
17–1–1959

విద్వద్విధేయుఁడు,
కోపల్లె శివకామేశ్వరరావు.

# విషయసూచిక.





—: రంగు బొమ్మలు :—

1. పుష్పాకారమునసున్న సూర్యమండలము – 132 వ బొమ్మ. దీనినిగూర్చిన వివరాలు 388 వ పేజీలోనున్నవి.
2. 302, 303 పేజీల మధ్యనున్న రెండు రంగుల చేవలనుగూర్చిన వివరములు 302 వ పేజీలోనున్నవి.

మను పేరుతో వ్యవహరింపఁబడుచున్న జ్ఞానమును ఒక ముద్దగా చేసి మనకొసఁగియున్నారు.

ఒకవిధముగఁ జూచిన దివ్యజ్ఞాన మీశ్వర ప్రసాదితమై యున్నది. కాని దీనిని తెలియని వారలకు అది గ్రహించి తెలిసికొన్నవారు ఈజ్ఞానమును అందిచ్చియున్నారు. అందు వలన నిది ప్రారంభదశలో ఆధారముగ (hypothesis) మాత్రమే నుపయోగపడఁగలదు. ప్రయోగానుభవముల ద్వారా అది క్రమేణా స్వాంతవ్యక్తిగత జ్ఞానముగ పరిణమింపఁగలదు.

నేఁడు దివ్యజ్ఞానములో అన్నివిషయములను గూర్చిన సమగ్రమైన జ్ఞానమింకను వెల్లడి చేయఁబడలేదు. కొద్దిగా ముఖ్యసత్యములు, సూత్రములు మాత్రము తెలియఁజేయఁబడినవి. ఇంకను బాగుగ పరిశోధనచేసి నూతనవిషయములు కనిపెట్టునటుల పురికొల్పుట కింతవఱకు నియ్యఁబడిన జ్ఞానము సరిపోవును. కాని మన మింకను అనేకలోపములను పూరింపవలసియున్నది. ఇట్టిలోపములను పూరించుటకు వ్యక్తిగతముగ కొందఱు పూనుకొన్నారు. జ్ఞానసాగరములో బిందువంత జ్ఞానము మాత్రమే ఇంతవఱకు బహిర్గతము చేయఁబడినది; కాని ఇది బహుస్వల్పమైనను అతిరమ్యముగాను ఆకర్షణీయముగాను ఉండుటచేత అన్నివైపుల నూతనోత్సాహమును సౌందర్యమును వ్యాప్తముచేసినది.

దివ్యజ్ఞానము జీవపరిణామముతో నెక్కువ సంబంధము కలిగియున్నట్లగపడును. ఆధునికవిజ్ఞానశాస్త్ర మన్ని

రంగములందు సంగ్రహించి పెట్టిన రూపపరిణామజ్ఞానము కూడ నీసనాతనజ్ఞానములోనిభాగమే. ఈనాఁటికికూడ నీరెండును అసంపూర్ణములుగ నేయున్నవి. న్యాయముగ ఆలోచించి చూచినచో నీరెండు నొకదానికొకటి అనుబంధముగా నున్నవి.

ప్రతివిజ్ఞానశాస్త్రపాఠ్యగ్రంథములోవలె నీ గ్రంథరచనలోకూడ రెండుప్రధానవిషయము లిమిడియున్నవి. శాస్త్రపరిశోధకులలో నధికసంఖ్యాకు లంగీకరించిన మూలసూత్రములను, గ్రంథకర్త ఈగ్రంథములో విపులీకరించి వ్రాయుటయే గాక, తానింకను అల్పసంఖ్యాకులు చేసినట్టిపరిశోధనల ఫలలితములనుకూడ నీగ్రంథములో నుదహరించియున్నాఁడు. వాని సత్యాసత్యములవిషయమై కొంత ఋజువు అవసరమైయుండవచ్చు. గ్రంథకర్తకు నిర్దిష్టమైన శాస్త్రశిక్షణలేనందుననో, అబుద్ధిపూర్వకముగనో నీరెండువిధానములకు సంబంధించిన అంశములను విడమర్చి చూపింపకపోవచ్చును. అదే ప్రకారము ఈగ్రంథములోని ముఖ్యసూత్రములు, 'దివ్యజ్ఞానము'నకు సంబంధించియుండి పరమగురువులు ప్రకటించిన జ్ఞాననిజస్వరూపమే అయియున్నను, కొన్నిభాగములు మాత్ర మావిశిష్టతకు తగినట్లుండవు. సత్యమనునది చివఱకు ఎవరికి వారన్వేషించి తెలిసికొనవలసిన విషయము గాన, ఆమార్గమును సూచించుట మాత్రమే ఇతరులకర్తవ్యము అయియున్నది. శాస్త్రములందలి సిద్ధాంతములు, వ్యక్తిగతమైనఅభిప్రాయములు,పొరపాటు అభిప్రాయములు,అన్నియు,

ఈ ప్రమాణమునకు సరిపడినది లేనిది పరీక్షించి చూచుకో వలసియున్నది.

దివ్యజ్ఞానమూలసిద్ధాంతములన్నియు అపౌరుషేయములే అయినను ఏవ్యక్తియు తన కంగీకారములేనిచో వానిని ప్రమాణముగ స్వీకరింపనవసరము లేదు. అయినను ప్రతి వ్యక్తి తనహృదయమునకు మనస్సునకు నచ్చిన ఉత్తమాధారములద్వారా, అభ్యుదయము చెందుటకుఁ గాని, పతితుఁడగుటకు గాని సంసిద్ధుఁడై యుండవలసినందున, అట్టి ఉత్తమోత్తమమైన ఆధారము దివ్యజ్ఞానమునందున్నదని తెలియఁజేయుటకే ఉద్దేశించి ఈగ్రంథము రచించియున్నాను.



# 1. అధ్యాయము

## జీవోపాధుల పరిణామము

దివ్యజ్ఞానమును బాగుగ అవగాహన చేసికోవలెనని నచో, స్థూలముగనైన, ఆధునికవిజ్ఞానశాస్త్రజ్ఞాన మవసరము. విజ్ఞానశాస్త్రము విషయములను సేకరించి వానిని గూర్చి ఒకజాబితా తయారుచేసి అటుపిమ్మట సూత్రములను కనిపెట్టును. ఆవిషయములనే, 'దివ్యజ్ఞానము' కూడ నుపయోగించి ఇంకొకపద్ధతిలో వానిని సమకూర్చి ఇంచుమించుగా అట్టి నిశ్చయమునకేవచ్చును. ఈరెండింటిసిద్ధాంతములలో అప్పుడప్పుడు తేడా ఉండుటకుగల కారణము విజ్ఞానశాస్త్రము ఇప్పటికి కనిపెట్టని, లేక వదిలిపెట్టిన విషయములను 'దివ్యజ్ఞానము' యోజనలోనికి తీసికొనుటయే కాని విజ్ఞానశాస్త్రవిషయములను సందేహించుటవలన కాదు. శాస్త్రములలోని అన్నివిషయములు ఒకేమాదిరి యున్నప్పుడు శాస్త్రమంతయు నొక్కటే అయియుండును. కచ్చితమైన శాస్త్రజ్ఞానమే దివ్యజ్ఞానము. నిజమైన దివ్యజ్ఞానము అన్నివిషయములతోను అనుగుణముగానుండి ఉత్కృష్టమైన శాస్త్రపద్ధతిలోనుండును. ప్రాణికోటి మనుగడకు సంబంధించిన సంఘటనలన్నియు పరిణామవిధానమున మూలాంశములనెడు 'భావన'ను జిజ్ఞాసులకర్పించుటయే, ఆధునికవిజ్ఞానశాస్త్రము నిర్వహించిన మహాకార్యము. విజ్ఞానశాస్త్రదృష్ట్యా పరి

ణామవాదమనఁగా నేమో స్థూలముగా తెలిసికొన్నచో దివ్యజ్ఞానదృష్ట్యా దానిని సులభముగా తెలిసికోఁగలము.

మొట్టమొదట 'ఓరియన్' (Orion) లోని తేజో మండలమునుగూర్చి యోజించుదము (మొదటిపటము). లక్షలాదిమైళ్ల వ్యాసముకలిగి అగినిమంటలతో నిండియున్న కలగాపులగపుముద్దవలె నది కనపడును. అదిపొగవలెనుండి బహుశక్తిమంతముగానుండును. కాని, మనకు తెలిసినంత వఱకు అది ఎందుకును పనికివచ్చుశక్తి మాత్రముకాదు.

మనకు గోచరమగుచున్న తేజోమండలములలో అభ్యుదయము చెందుచున్నవి కూడ నున్నవి. 'కేన్సు వెనాటిసి' (Canes Venatici) అను తేజోమండలము ఒకే కేంద్రము చుట్టును తిరుగుచుండుటయే గాక అనేక నిర్దుష్టఖండములుగా విడిపోవుచున్నటుల కూడ కనుపించుచున్నది (2వ పటము). అట్లు విడిపోయిన ఖండములు కూడ కేంద్రముచుట్టును తిరుగుచు తమచలనమును సాగించుచు క్రమముగా ఏవో కొన్ని మూలబీజములచుట్టు కరుడుగట్టును. ఇట్టి మూలబీజము లేక బిందువే నక్షత్రమగును.

పరిణామవిధానములోని తరువాతమెట్టు కూడ ఇట్టి రీతినే యుండునని ఊహింపవలసియున్నది. ప్రతినక్షత్రపదార్థము మార్పుచెందుచునేయుండును. దాని ఆంతరంగికపరిస్థితిని బట్టిగాని, లేదా, దారినిపోవు నక్షత్రప్రభావమువలనఁ గాని, ప్రతినక్షత్రము కొన్ని 'సహాయకేంద్రములను' పెంపొందించుచుండును. ఆ తేజఃపదార్థ మాసహాయకేంద్రములచుట్టు ఘనీభ



1 వ పటము

ఓరియన్ (మృగశీర్ష) లోని బృహత్తేజోమండలము



2 వ పటము

కేనస్ వెనాటిసీ లోని మరచుట్టాకారపు
తేజోమండలము



14 వ పటము



15 వ పటము

లెమూరియను జాతులు



16 వ పటము



17 వ పటము



18 వ పటము

అట్లాంటియను జాతులు



19 వ పటము



20 వ పటము

ఆర్యను జాతులు

వించును. అప్పుడవి నెమ్మది నెమ్మదిగా ప్రధాన నక్షత్ర కేంద్ర బీజముచుట్టు తిరుగు ఉపగ్రహములగును. మనకు సంబంధించిన 'తార' యగు సూర్యునివిషయములో పరిణామవిధానము నిర్వహించిన దేమిటో గుర్తునకు తెచ్చుకొందము. కేంద్రమున సూర్యుఁడుండి, ఆయనచుట్టు నిత్యమును గ్రహములు తిరుగుచున్న ఒకక్రమబద్ధమైన సూర్యమండలముగా నేఁడది విరాజిల్లుచున్నది.

## సూర్యమండలము




(౩ వ పటము)

దీనితరువాతస్థితి యేమిటి? పరిణామమింతవఱకు వచ్చు సరికి, సూర్యమండలములో తేలికైన రసాయనిక మూలపదార్థములు గోచరించినవి. ఉదజని, కర్బనితము, నత్రజని, ప్రాణవాయువు, భాస్వరము, కార్షియము, ఇనుము మొదలగునవి కూడ అందున్నవి. ఇవన్నియు నొకదానితో నింకొకటి కలియునపుడు మొదటిసారిగా జీవచైతన్యము ప్రభవించును. ఇప్పుడు ఈమూలపదార్థములో కొంత, జీవకణమగును. ఇదే ప్రథమజీవచైతన్యమున కుపాధి. తరువాత నేమిజరుగును?

ఈజీవకణము, అనేకవర్గములుగను, మిశ్రమములుగను ఏర్పాటుచేసికొనును. అదే తరుగుల్మలతాదులుగను, తిర్యగ్జంతువులుగను రూపొందును. అది వృక్షమగుసరికి, ఏమి జరుగునో గ్రహింతము.

ఈజీవపదార్థములో మొదటినుండియు రెండువిధములైన లక్షణములు గోచరించుచున్నవి. మొదటిది ఆహారము తీసికొనుచు వీలైనంతవఱకు జీవించియుండవలెనను కోరిక; రెండవది తనవలెనె మఱియొకవ్యక్తి నుత్పత్తిచేయవలెనను కోరిక ఈరెండు సహజప్రేరణములవలనను జీవకణ మభివృద్ధి చెందును. అనఁగా దీని నిర్మాణములో సరళతపోయి క్లిష్టత ఏర్పడుచుండును. అంతరువు తరువాత నంతరువులో నిట్టి విధానమే కొనసాగి మనభూమిపైనవలెనే ప్రతిగ్రహముపైన కూడ వృక్షవర్గ ముద్భవించును.




(4 వ పటము)

వెనుకటిస్థితినే ఆధారముగఁ జేసికొని భావిస్థితి పెంపొందుచుండును ; ఉత్తమసంతతి నుత్పత్తిచేయుటకొఱ కవసరమైనచో ఆయుర్దాయము పొడిగించుకొనునట్లు అవి ఏర్పాటుచేయఁ

బడినవి. గతించినజాతి పరిణామముకన్న రాఁబోవు జాతిపరిణామము హెచ్చుగానుండును. బేక్టీరియా, ఆల్గై, ఫంగై మొదలగు ఏకకణప్రాణులనుండి నాచువంటి మొక్కలుపుట్టును. ఇవి క్రొత్తవిధమున తమసంతతిని వ్యాప్తము చేయును; తరువాతస్థితిలో విత్తనములద్వారా సంతతి అభివృద్ధియగును. తదుపరి పుష్పములే, విత్తనములుగా నుపయోగపడును. దీనివలన ఎక్కువశక్తి వ్యయము చేయనవసరము లేకుండ తన ప్రాణము నిల్పుకొనుచు ఉత్పత్తి సాగించును. ఇట్లు క్రమ క్రమాభివృద్ధిచెంది ప్రాణి యంగనిర్మాణములో 'క్లిష్టత' ఏర్పడుచుండును. ఇట్టి 'క్లిష్టత' వలన జీవి ఎక్కువ సంతృప్తి కరమైన జీవితము గడుపుటకు సహాయకారిగనుండి తక్కువ శక్తిని వ్యయపఱిచి తనకంటెబలమైన, శక్తిసమన్వితమైన, పటిష్ఠమైన, సంతతి నుత్పత్తిచేయుచు తన ఆయుర్దాయమును పెంపొందించుకొఁగలుగును.

జీవకణములో తిరిగి ఇదేప్రకారము పరిణామవిధానము పనిచేయగా జంతువర్గముద్భవించినది. ఏకకణప్రాణుల నుండి, వెన్నెముకలేని ప్రాణులు క్రమశః బయల్వెడలినవి.




ప్రత్యేక భాగానికి చెందిన జాతుల సంఖ్యయొక్క స్థూలమైన అంచనా.
టి. డబ్ల్యు. గాలవేస్ యొక్క "ప్రాధమిక జంతుశాస్త్రము" అనుగ్రంథమునుండి సేకరించబడినది.

(5 వ పటము)

ఏకకణప్రాణులనుండి ధాతునాడీప్రసారణమండలములు గల బహుళకణప్రాణులు వృద్ధిచెందుసరికి క్రమేణా వర్గము తరువాత వర్గములో క్లిష్టత ఎక్కువగుట మొదలుపెట్టెను. తదుపరి మధ్యనాడీ మండలములకు 'ఒర'వలె వెన్నెముక ఏర్పడెను. అప్పుడు వెన్నెముకజాతికిచెందిన జంతువులు పుట్టుట ప్రారంభమైనది. వీనిలో, ప్రాంకెడు జంతువుల ఆధారమున పాలిచ్చు జంతువు లుద్భవించినవి. పాలిచ్చు జాతికిచెందిన ఉత్తమజంతువులలో ఉచ్ఛస్థితికిచెంది మంచి అంగసౌష్ఠవముకలవాఁడు మానవుఁడు.

జంతువర్గమునందు సహితము స్వయంపోషక శక్తి, ఉత్పత్తిశక్తి, సహజముగనున్నవి. అంగనిర్మాణము క్లిష్టమైన కొద్ది మారిపోవుచున్న పరిస్థితులను తట్టుకొను అగ్రతగలిగి తక్కువ ప్రయాసతో తనవలె ప్రాణులను సృష్టించు శక్తి ఆ జంతువునకుండును. వెన్నెముక జంతువులలో, ఉన్నతమగు తరగతికిచెందినవానిలో నొక వినూత్నచైతన్యము గోచరించును.

"పరిణామవిధానములో క్రింది తరగతికిచెందిన కృతకములు, తమను తమజాతిని పోషించుకొనుటలో తమ యావచ్ఛక్తి వినియోగించి పాటుపడును. జాతి అభివృద్ధిచెందిన కొలఁది పోషణవిధానము సులభమగుచుండును; తగుమాత్రము ఆహారము తిని దానివలన లభించుశక్తితో తనను, తన సంతతినికూడ పోషించుకొనఁగలుగును; ఇంక కొంతశక్తి అనుపయోగముగా కూడ మిగులుచుండును. ఉత్తమవిధ

జంతువులలో అట్లు మిగిలిపోయిన శక్తి ఎక్కువగుచుండును. అందువలన ఆహారాన్వేషణకు ఎక్కువకాలము వినియోగింపకుండ, విరామసమయము మధికముచేసికొనుచుండును. విరామ సమయములందు, మిగులు శక్తిని తమకు ఆనందము నిచ్చు ఆటపాటలలో, వ్యయపఱుచును. ఈ సామాన్య సత్యమును ఉత్తమశ్రేణి జంతువులలోను, మానవులలోను కూడ, మనము గుర్తింపవలసియున్నది. మానవుఁడు ప్రగతి చెందినకొలఁది శ్రమపడుకాలమును తగ్గించుకొనుచు, విరామమునకెక్కువకాలము మిగుల్చుకొనుటకు ప్రయత్నించును. ఆ విరామకాలము ఆటలయందు, ఆనందమునిచ్చు విజ్ఞానమందు, కళలయందు, ప్రయాణములందు, గడుపును". (హెర్బర్టు స్పెన్సరు వ్రాసిన లైఫీయ గ్రంథమునుండి సేకరించినది).

ఏనాఁడో గోచరించిన అస్పష్టతేజోమండలము మొదలు మేధావియైన నేఁటి మానవునివఱకు కొనసాగించిన విధానమునే 'పరిణామము' అనెదరు. కలగాపులగముగానుండిన ప్రపంచము మానవుఁడు అర్థముచేసికొని సూత్రములను నిర్ణయించుకొనుటకు వీలగునట్లుగా క్రమబద్ధముగా రూపొందినది. అస్థిరమైన అధర్మము స్థిరమైన ధర్మముగా మాఱినది. ఏకత్వమునుండి అనేకత్వము, అరాచకమునుండి క్రమపద్ధతి, సాధించుటలో ప్రకృతి అనుసరించిన సూత్రములేవియో 6 వ పటములో పొందుపఱిచినాను.

## పరిణామ సూత్రములు

స్వస్వరు

| | | | |
|---|---|---|---|
| | | నుండి | నకు |
| | ఏకత్వము<br>అనిర్దిష్టము<br>సరళము | | అనేకత్వము<br>నిర్దిష్టము<br>క్లిష్టము |
| | నీచతరగతి ప్రాణులు<br>నీచతరగతికి చెందిన సంఘము<br>ఒకదానినిపోలిన అనేకభాగములు<br>ఒకేరకమైన పనులు | | ఉత్తమ తరగతి ప్రాణులు<br>ఉత్తమ తరగతికి చెందినసంఘము<br>బిన్నబిన్న భాగములు<br>బిన్నభిన్నములైనపనులు |
| | ఒకదానిప్రక్కను ఒకటిగా వుంచబడిన సమతుల్యమైన భాగములు | | ఒకదానిపైన ఒకటి ఆధారపడిన వి చిన్నభాగములతో కూర్చబడిన ఏకైకసంపుటి |
| | అధ్వాన్నస్థితి<br>అధర్మము<br>అరాచకము | | సృష్టి క్రమము<br>ధర్మము<br>క్రమపద్ధతి |

(6 వ పటము)

పరిణామ విధానమెప్పుడు ప్రారంభమైనది, ఎట్లు ఇంతవఱకు కొనసాగినది ఏ మానవుఁడు చూడలేదు. కావున ఆ విధానములోని ప్రతిఘట్టము ప్రత్యక్షముగా చూచి వర్ణించి, పరిణామము నిజమని ధ్రువపఱుపఁగలిగినవారు లేరు. వివిధ తేజోమండలములను, గతించిన అనేకజంతువుల అస్థిపంజరములనుబట్టియు లేదా, ఒకచోట కనుపించిన తోఁకతో ఇంకొకచోట కనుపించిన ఱెక్కను ముడిపెట్టియు, పరిణామ సిద్ధాంతమును మనము పునర్నిర్మాణము చేసికోవలెను. కొన్ని వేల సంవత్సరములక్రింద అనఁగా చరిత్రకు పూర్వము ఈ ప్రపంచము ఇప్పుడున్నంత క్లిష్టముగా లేదని ఎవరు

చెప్పఁగలరు. రేపే ఈ ప్రపంచము అంతమైపోదనికూడ ఎవ్వరును చెప్పలేరు. కేవలము వర్తమానములో జరుగు కొద్ది విషయములతో మానవుఁడు సంతృప్తి చెందఁడు. ప్రకృతిని ఏదోవిధముగా భావనచేసి, భూతమును భవిష్యత్తును నిర్మించుకొనును. పరిణామవిధానములో భూతభవిష్యత్తులు సాదృశ్యములనుబట్టి ప్రతిపాదింపఁబడుచున్నవి. ఒకవిధముగా చూచిన 'పరిణామసిద్ధాంతము' ఒక ఆధారమువంటిది. కాని, మానవచరిత్రలో నిది బహుసంతృప్తికరమైన ఆధారమని చెప్పకతప్పదు. ఇది అంగీకరించిననాఁడు, అన్నిరంగములలోను పరిణామ మందఱిదృష్టికి గోచరించును.

ఇట్లాధునికవిజ్ఞానశాస్త్రము ప్రవచించిన పరిణామ సిద్ధాంతముదృష్ట్యా బ్రహ్మాండావలోకనము ఎంత ఆకర్షణీయ ముగనున్నను, ఒక విచారకరమైన విషయమిందు గోచరింపక మానదు ; అది ఈ అంతులేని నాటకములో వ్యక్తి నిర్వహిం చుచున్న అప్రధానపాత్ర. ప్రకృతి యుపాధి తరువాత నుపాధిని నిర్మాణము చేయుటలో తనశక్తిని మిక్కుటముగా దుర్వ్యయము చేయును. తాను పోషింపఁగలిగినవానికన్న ఎక్కువ ఉపాధులను ఉత్పత్తిచేయుచు చాల దుబారాగా వ్యవహరించుచున్నట్లు మనకగపడును. కాలమూ గణనకు రాదు. బ్రతికియున్న కొద్దికాలము స్వల్పముగా తప్ప వ్యక్తి అన్న బొత్తిగా లెక్కలేదు. అతను పృథ్విపై జీవితముగడపు కొద్దికాలములో ప్రకృతి అతనికొఱకే ప్రతివిషయము ఆలో చించి పథకము వేసినట్లుగా బహుప్రసన్నమైన వదనముతో

తనను లాలనచేయుచున్నటుల కనుపించును. కాని ప్రకృతికి బద్ధుఁడై ఆమె చెప్పినట్లుచేసి, పిల్లలను కని, కొంతమందిని సుఖపెట్టి వారి పరిస్థితులలో మార్పు తీసికొనివచ్చునంతలో మరణ మతనిని మాయముచేయును. ఎన్ని కష్టములను ఎదుర్కొనుచున్నను ఏలాగో జీవించియుండుచు సుఖాన్వేషణ చేయుచుండవలెనని ఎల్లప్పుడు ప్రేరేపించు దేహాత్మకూడ నశించును. ఏలయనఁగా, విజ్ఞానశాస్త్రదృష్ట్యా జాతికిమాత్రమే విలువ యున్నది. కాని వ్యక్తికి లేదు. "అందువలననే ఒకజాతి సౌష్ఠవముపట్ల నెక్కువజాగ్రత్త కనపరచుచు వ్యక్తివిషయములో బహునిర్లక్ష్యము కనపఱుచుచుండును." "ఒకనాఁడు ఉత్కృష్టమైన నాగరికత ననుభవించిన ఆ బేబీలోను, ఆ నినేవా, ఆ గ్రీకుసామ్రాజ్యపు శోభ, ఆ రోమను వైభవము, ఈనాఁడేవీ!

"ఇది రేయింబవళ్లను గదులు గలిగిన చతురంగపుబల్ల. దీనిపై 'విధి' వ్యక్తులు అను కాయలతో ఆటసాగించును. తనఇచ్ఛవచ్చినట్లు వ్యక్తులను ఇటు అటు ఆడించి లాలించి చివఱకు సంహరించును. తదుపరి ఆ 'కాయలు' తామువచ్చిన 'పెట్టె'లోనె తిర్గి ప్రవేశించును. కావున విజ్ఞానశాస్త్రదృష్ట్యా చూచిన పరిణామసూత్రమొక, నిర్దాక్షిణ్యమైన, గంభీరమైన, సర్వశక్తిమంతమైన యాంత్రికవిధానమువలె కనపడును. ఏది ఎటున్నను ఇదికూడ ఒకవిధానముగనుక మనకు నచ్చుట, నచ్చకపోవుట, అను వ్యక్తిగతాలోచనలకు తావు లేదు. అయినప్పటికి, యోజనాపరులమైన స్త్రీపురుషులము కాఁబట్టి

మనకు సంబంధించిన జీవితతత్త్వవిషయములో వ్యక్తిగతాభిప్రాయముల ప్రభావముండకమానదు. వ్యక్తిగతముగా ఈ పరిణామసిద్ధాంత మంత ఉత్సాహజనకముగా కనపడుటలేదు. ఎందువలన ననఁగా మనప్రసక్తి ఏమాత్రములేకుండ సముద్రములోని బుడగలవలె పుట్టి, మనచేతులోలేని ఒకవిధానము ననుసరించి, గిట్టుచున్నాము. అనఁగా మనము స్వప్నములోని చిత్రములవలె నిద్రలోనే పుట్టి, నిద్రలోనే మాయమగుచున్నాము.

పై విధముగాఁ గాక, పరిణామవిధానము, ఆశాజనకముగాను, ఉత్సాహకరముగాను ఉండునని చెప్పుటకువీలగు విధానమేమైన నున్నదా ? ఉపాధిపరిణామముద్వారా, జీవపరిణామముసాగుచున్నది అని దివ్యజ్ఞానము ప్రవచించిన సిద్ధాంతమే ఇందుకు తార్కాణము.

విజ్ఞానశాస్త్రవేత్త ప్రకృతిలో పధార్థమును శక్తియు అవిభాజ్యముగా నున్నవని కనిపెట్టెను. మూఁడవదియగు ప్రాణమనునది, ఈ రెండింటి సంయమము ఫలితమని వారందురు. అతఁడు పదార్థములోనే జీవచైతన్యముల అవకాశమును చూడఁగలుగుచున్నాఁడు. పదార్థము వినా ఈ రెంటికిని అస్తిత్వములేదని అతని విశ్వాసము. స్థూలదృష్టితో చూచిన ఇది నిజ మనిపింపవచ్చును. కాని, దివ్యజ్ఞానదృష్ట్యా ఇది కొంతమార్పు చెందవలసియున్నది.

శక్తిసమన్వితముకాని పదార్థ మెట్లులేదో, అట్లే పదార్థముపై తన ప్రభావము కనపఱుపని శక్తికూడ లేదు.

ఈమాదిరిగనే ప్రాణమునకు, పదార్థమునకుకూడ సంబంధము కలదు. ఈ రెండును ఎన్నఁడు విడివడియుండవు కాని ఒకదాని నుండి రెండవది ఉత్పత్తి కాలేదు.

జగత్తులో, మన ఇంద్రియములకు గోచరముకాని, అతిసునిశితమైన పనిముట్లవలన కూడ తెలిసికొన వీలులేని బహుసూక్ష్మాతిసూక్ష్మమైన పదార్థము లనేకములుగలవు. అనేక స్వరూపములుగ వ్యక్తమగు శక్తి కలదు. అందు కొన్నిమాత్రమే ఇప్పటికి మానవుఁడు కనిపెట్టినాఁడు. కొన్ని రకముల భౌతికాతీత పదార్థములతో సంయోగించి పనిచేయు నొకవిధమైన శక్తినే ప్రాణమని యందుము. ఈ జీవమే పరిణామము చెందుచుండును. అనఁగా అది నెమ్మదిగా అంతకంతకు క్లిష్టమగుచుండును.

ఇంద్రియములద్వారా మనము గ్రహించిన పదార్థములో జీవిత కార్యకలాపములలోని క్లిష్టపరిస్థితి, నిర్మాణ జీవులవలన కలుగఁజేయఁబడినది (ఇంకను ఇతరవిధములైన కార్యకలాపములు కలవు. కాని, ప్రస్తుతము మన ఇంద్రియములచే గ్రహింపఁగలిగిన వానినిగూర్చిమాత్రమే ఆలోచింతము). ఈ జీవమే కొంతకాలమువఱకు కొన్ని రసాయనిక మూలద్రవ్యముల సమూహమును సజీవముగనొనర్చును. ఆ స్థితిలో అట్టి ఉపాధిద్వారాకలిగిన అనుభవములవలన ఆ ప్రాణికి బహుత్వము కలుగును. స్థూలోపాధినుండి విడివడి దానితో సంబంధములేకుండ కొంతకాలము వేఱుగానుండుట కొఱకు దానినుండిఉపసంహరింపఁబడుట అనునదే 'మరణము'.

అయినప్పటికి ఆ ప్రాణము భౌతికాతీతమైన వస్తువులతో కలిసియుండును. తాను స్థూలోపాధిలోనున్నప్పుడు సంపాదించిన అనుభవములను, జీవి, ప్రాణోత్క్రమణసమయములో తానునేర్చిన అలవాటుల స్వరూపమున తనలో దాచుకొనును ఇవన్నియు ఉపాధి నిర్మాణమునకు పనికివచ్చు నూతనశక్తులుగా మాఱి నూతనోపాధినిర్మాణకృషిలో అవి ఉపయోగపడఁగలవు.

7వ పటమును పరిశీలించినయెడల దివ్యజ్ఞానదృష్ట్యా జీవపరిణామమున నేమో అవగాహన కాఁగలదు. ఉపాధులనుగూర్చిమాత్రమె యోజనచేసినచో, పరిణామమును పాక్షికముగమాత్రమే తెలిసికొనినవార మగుదుము. ప్రతి ఉపాధివెనుక జీవమున్నది. మొక్క నశించినను, పరిస్థితిని తట్టుకొని జీవించుటకు, దానికి చైతన్యవికాసములనిచ్చిన జీవి మాత్రము నశింపదు. గులాబి పండి, రాలిపోయి, మట్టిలో కలిసిపోయినను అందలి పదార్థముమాత్రము నశింపలేదని మనకు తెలియును. ఆ పదార్థములోని ప్రతికణము ఇప్పటికి, ఉండియేయున్నది. ఏలయన పదార్థము నాశనముచేయఁబడదు; అటులనే రసాయనిక మూలపదార్థములతో గులాబిని నిర్మించుకొన్న జీవికూడ నశింపదు. అది తాత్కాలికముగ అదృశ్యమగును. తిర్గి వేఱొక గులాబిరూపములో వ్యక్తమగును. ఎండ, వాన, తుపాను మొదలగునవి తట్టుకొనుటలో మొదట గులాబి మొక్కకు కలిగిన అనుభవములు, అంతకంటె

పటిష్ఠముగ జీవించి తనజాతిని బాగా వృద్ధిచేయు మహాలోక గులాబి నిర్మాణములో ఉపయోగపడఁగలవు.




(7 వ పటము)

ఏవిధముగా, సంఘములో ప్రాణి కనీసమైన భాగమో అదేవిధముగా 'జీవకళ' సమూహాత్మలో నొక కనీసమగు భాగము. వృక్షవర్గములోని వృక్షములన్నిటికి, వెనుక, వృక్ష సమూహాత్మ కలదు. వృక్షోపాధులను నిర్మాణముచేయుటవలన క్లిష్టమగుచున్న ప్రాణశక్తుల 'నిధి'యే 'సమూహాత్మ'. ఈ 'సమూహాత్మ'కు చెందిన ప్రతిప్రాణియు, గతించిన ప్రాణి అనుభవముల నన్నింటిని జీర్ణించుకొని, భూలోకములో జన్మించును. మరణించినదనుక, జీవాంశ 'సమూహాత్మ'లో

చేరినప్పుడు, తాను పరిస్థితులను తట్టుకొనుటకు సంపాదించిన సాధనములను తనతో తీసికొని వెళ్లును. ఇదే ప్రకారము జంతు వర్గములో కూడ జరుగును. ఈ 'సమూహాత్మ'లో వివిధవర్గములకు, జాతులకు, కుటుంబములకు 'ఉపసమూహాత్మ'లుకూడఁ గలవు.

మానవునిపట్లకూడ ఈ సూత్రము లే వర్తించును. కాని అతఁడు సమూహాత్మస్థితి అధిగమించిననాఁడు మానవునికి ప్రత్యేకమైనవ్యక్తిత్వముగలదు. తనతోడివారలతో సోదరత్వముద్వారా మర్మముతో కూడిన అనేకమైన పద్ధతులతో పెనవేయఁబడి యున్నప్పటికి, తనమార్గమున తాను పోవుచు తన భవిష్యత్తును తానే నిర్మాణముచేసికొనఁగలఁడు. జన్మపరంపరలలోఁ గడచిన యనుభవములను తనకిష్టములేనియెడల ఇతరులకు పంచ నవసరము లేదు. తనకొఱకే పూర్తిగా వినియోగించుకోఁగలఁడు.

మరణమనఁగా సర్వనాశనము కాదు. కొంతకాలము ప్రాణి నూతనోపాధిని నిర్మాణము చేసికోఁగలిగినశక్తితో సహా భౌతికాతీతలోకములోనికి ఉపసంహరింపఁబడును. ఉపాధి తరువాత ఉపాధి రాకపోకలు జరుగుచున్నప్పటికి ఈ పరిణామనాటకములో జననమరణములన్నియు ఒకే జీవి "ప్రవేశనిష్క్రమణములు"గా ఎంచవలసియున్నది. పదార్థము నశించినట్లే అనుభవములుకూడ ఏమాత్రము బీరుపోవు.

ఇంతకు పూర్వము చెప్పినట్లు 'జీవి'కూడ పరిణామము చెందును. ఉపాధుల పరిణామముద్వారానే జీవపరిణామము కూడ జరుగును. వెనుకటి ఉపాధులకన్న పటిష్ఠమై, ప్రస్తుతపరిస్థితులను తట్టుకొని అవసరమైన సర్దుబాట్లుచేసికొనఁ గలిగిన నూతనోపాధులద్వారా వ్యక్తమగుటయే సమూహాత్మలోని ప్రతిభాగమునకు లక్ష్యము అయియున్నది. ఈ ఉపాధులు, 'జీవి' ఆంతరంగిక ప్రేరణకు తగినట్లు సునిశితముగా స్పందింపఁగలిగియుండవలెను. సమూహాత్మలోని ప్రతిభాగము, అన్నిరకముల, అన్నివర్గముల ప్రాణులు ఈలక్ష్యమును కలిగియున్నవి. కనుకనే ప్రకృతిలో నిత్యము భయంకరమైన సంఘర్షణ జరుగుచునేయుండును. ప్రకృతి రక్తసిక్తమైన దంతనఖములతో నున్నట్లు అనిపించును. కాని మనుగడకొఱకు జరుగు ఈసంఘర్షణ నిజముగా ఏమాత్రము వ్యర్థముకాదు. క్రొత్తఉపాధులను నిర్మాణముచేయుటకొఱకే పాతవి నశించును. ఇట్లు అనేకజన్మలద్వారా తాను ఏఉపాధి కొఱకన్వేషణసాగించుచున్నదో ఆ ఉపాధిని క్రమేణా జీవాత్మ పొందును. జీవమెన్నడు నశింపదు. నిత్యము మార్పుచెందు స్థితిగతులకు అనుగుణముగా ఉత్తమోపాధులను నిశ్చయింపుటకొఱకే ఈనిర్దాక్షిణ్యమైన సంఘర్షణ జరుగుచున్నది. పైకి, అనేక ఉపాధులనశింపు వ్యర్థముగా కనపడినను, నిజముగా ఇది ఉత్తమోపాధినిర్మాణమునకత్యంతావసరము.

ఒకప్రత్యేకపరిస్థితిని తట్టుకొనఁగలిగిన సమర్థమైన ఉపాధులు తయారైనప్పుడు, సమూహాత్మలోని ఆప్రత్యేకభాగము

వానిద్వారా సంపూర్ణముగను బలముగను తనచైతన్యమును ప్రసారము చేయును. దాని ప్రభావమువలన ఉపాధి నిర్మాణములో నూతనశకమారంభమగును. ఆపరిస్థితిమాఱఁగనే తిరిగి నూతనోపాధులనిమిత్తమన్వేషణ ప్రారంభమగును. అన్నిటికన్న ఎక్కువ అర్హతగలిగిన ఉపాధి నిలుచునిమిత్తము జరుగు సంఘర్షణలో, వృక్ష, జంతుసమూహాత్మలలోని వివిధ వర్గములమధ్య పోరాటము నిత్యము జరుగుచుండును. కాని ఈసంఘర్షణలో ఒక్కజీవాంశముకూడ నశింపదు. సమర్థమైన ఉత్తమోపాధిని నిత్యాన్వేషణద్వారా కనుఁగొని తద్వారా తమశక్తులను వికసింపచేయుటకొఱకు పాటుపడిన యావత్తుసమూహాత్మకు జయము చెందునుగాని ప్రత్యేకించి ఏ ఒక్కవర్గమునకుమాత్రమే ఈవిజయము చెందదు.

జీవి దశాక్రమమున పరిణామము చెందును. అది మొదట భౌతికాతీతపదార్థముతో ఉపాధులను నిర్మించుకొనును. దానిని మనము 'భూతాత్మ' వర్గజీవితమందుము ('Elemental' life) నిర్మాణక్రియలో ఇంతవఱకు సేకరించిన అనుభవముతో రసాయనికమూలపదార్థములలో ప్రవేశించి 'ఖనిజసమూహాత్మ' యగును. తమపరి 'జీవకణమును' (Protoplasm) నిర్మించి వృక్షోపాధులలో ప్రవేశించును. తరువాత కొంత కాలమునకు జంతువుల ఉపాధులలో జీవి ప్రవేశించును. ఆ తరువాతదశకు చెందినవాఁడే మానవుఁడు. ఇప్పుడు జీవి, యోజనాశక్తి, ప్రేమ, త్యాగబుద్ధి గల్గి ఆదర్శపాత్రుఁడు కాఁగల మానవులను సృష్టించుకొనును.

ఈ అత్యల్పమైన పిపీలిక మానవుఁడను శిఖరము చేరు టకుఁగాను ఈమెట్లన్ని ఎక్కవచ్చును.

కాని ఈగొలుసుకట్టు పరిణామమున మానవుఁడు కడపటికొక్కముమాత్రము కాదు.

పరమాణువు మొదలు మానవునివఱకు జరుగుచున్న ఈవిశ్వవిధానమును బాగుగ అవగాహన చేసికొనలేనన్నచో ఒక్క విషయమును ముఖ్యముగా లెక్కలోకి తీసికొనవలసియున్నది. అదేమనఁగా పదార్థము ఏకతత్త్వమునుండి, బహుత్వమునకు, అనిర్దిష్టతనుండి నిర్దిష్టతకు, సరళత్వమునుండి క్లిష్టత్వమునకు పరిణమించును. కాని జీవిమాత్రము అట్టివిధముగా పరిణామము చెందదు. పదార్థపరిణామము అణువులకూర్పులోని వివిధమైన మార్పులవలనను, సరదుబాట్లవలనను, కలుగును; కాని జీవపరిణామములో క్రమక్రమముగా ఒకదాని తరవాత నొక ఆచ్ఛాదన తొలఁగి వికాసము హెచ్చుగుట జరుగును. కాళిదాసు, త్యాగరాజు మన మవగాహన చేసికోలేని స్థితిలో మొదటి జీవాణువులోనే యుండియున్నారు. ప్రకృతి లక్షలాదిసంవత్సరములు అనుపైన కలయిక నచ్చువఱకు పదార్థమును పర్చికూర్పఁగా తుదకు జగన్నాటకములో ఏదో ఒకరంగములో ప్రధానపాత్రవహించుటకు కాళిదాస త్యాగరాజులు ప్రకృతిగర్భంనుండి బయటకు వచ్చెదరు. కాని ఈలక్షలాది సంవత్సరములపాటు జీవి సీరని గుప్తముగా తనలో దాచి ఉంచినది. జీవపరిణామవిధానములో ఇచ్చుటయే గాని పుచ్చుకొనుటయనునది లేదు. జీవికన్న

ఉత్కృష్టమైనది, దానికి మూలాధారమై, కేవలము దాని గుండెకాయవంటిది చైతన్యము. ప్రథమజీవాంకురమునకు ఆయన తన యీచ్ఛాశక్తి, ప్రేమ, సౌందర్యము వేయేల తన సర్వస్వము దత్తముచేసెను. బహుసౌందర్యవంతమైన పర్వత శ్రేణి దృశ్యమునంతను ఏప్రకారము ఒకబిందువులో నిముడ్చ వచ్చునో అదేప్రకారము ప్రతిజీవకణము ఆ అనంతాస్తిత్వ నాభీబిందువు. ప్రతిజీవకణమునందు ఈశ్వరుఁడు సంపూర్ణ ముగ అధివసించియున్నాఁడు ; ఆయనదర్శకత్వముక్రింద, తగినసమయ మాసన్నమైనపుడు, కాళిదాసు, త్యాగరాజు రంగముమీఁదకు వత్తురు. దీనినే మనము పరిణామమందుము.

ఆధునికవిజ్ఞానశాస్త్రరీత్యా ఉపాధి పరిణామమును గూర్చిన విజ్ఞానము, విశ్వమునుగుఱించి మనకు తెలిసిన వెను కటి అభిప్రాయములను, బాగుగదిద్ది సరిచేసి, విస్తృతపఱిచి నచో జీవపరిణామమును గూర్చిన జ్ఞానము ఇంతకన్న గంభీర మైనఫలితాలను ఇయ్యఁగలదు. జీవపరిణామములో క్లిష్టమైన నూతనాంశములు గోచరించును. వానినిగూర్చి యోజన చేయుట అనునదే ఈపరిణామవిధానపు నూతనమగువిలువ. ఈక్లిష్టతతో సంబంధించిన మొదటివిషయ మేమనఁగా, విజ్ఞాన శాస్త్రజ్ఞుఁడు శోధనచేసిన ఉపాధులకు సంబంధించి అనేక సమాంతరప్రవాహములతో కూడిన పరిణామజీవులు ఉన్న ట్లును, అవిచాలభాగము ఒకదానితో నొకటి నిమిత్తము లేకుండ అభివృద్ధిచెందుచున్నట్లు తేలుచున్నది.

ఈప్రవాహములలో నొకటి మానవపరిణామమునకు, దానికి సమాంతరమైన ప్రవాహ మింకొక్కటి దేవతాపరిణామమునకు సంబంధించియున్నవి. ఇదివఱకు చెప్పినట్లు జంతువృక్షఖనిజదశలు మానవదశకు పూర్వదశలు దేవతాపరిణామమునకు దారితీయుప్రవాహములు ఖనిజవర్గమునఱకు వచ్చి ఇంకొకదిశగా మరలిపోయినది. అయినప్పటికి వృక్షజంతువర్గములుగా రూపొంది తదుపరి 'ప్రకృతిభూతగణము' గను "మోహిని," "గంధర్వులుగను" పరిణామము చెంది,

**వివిధ రకముల పరిణామము**

| 1 మానవులు | 2 దేవతా పరిణామము | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|
| సమగ్ర మానవుడు | దేవతలు | | | | | |
| మానవుడు | ప్రకృతి భూతములు (కామలోకము) | | | | | |
| జంతువు | ప్రకృతి భూతములు (ఆకాశ పదార్థము) | | | | | |
| వృక్షము | జంతువు | | | | | |
| ఖనిజము | వృక్షము | | రసాయనిక భూతములు | | | |
| భూతాత్మవర్గము | ఖనిజము | అణు జీవితము | అణువులు | | | |

(8 వ పటము)

తుదకు దేవతలుగా రూపొందును. ఇంకొకప్రవాహము, జీవకణముల జీవితమునకు సంబంధించినది. దీనివివరము లింకను బాగుగ తెలియవు. విద్యుత్కణములు, అయములు, రసాయనికమూలద్రవ్యములకు సంబంధించిన జీవప్రవాహ మొకటి ప్రత్యేకముగా నుండవచ్చును. ఇంకను ఎన్నియో విధములగు పరిణామప్రవాహములు మన సూర్యమండలమున నున్నవి.

కాని వానినిగూర్చి తగిన విజ్ఞానము లేనందున ప్రస్తుతము యోజించునవసరము లేదు.

9 వ పటములో ఉపాధులు. పరిణామము చెందు విధానము వర్గీకరించి చూపఁబడినది. జీవి, ఘన, ద్రవ, వాయు పదార్థములతో నిర్మింపఁబడి ప్రాణుల నుపయోగించును. ఇదియునుగాక సూక్ష్మమైన ఆకాశపదార్థము సూక్ష్మాతి సూక్ష్మమైన తాను, మానసికపదార్థములనుకూడ ఉపయోగించి ఉపాధులను నిర్మాణము చేయును. ఖనిజస్థితివఱకు వచ్చి అచ్చటినుండి మరలిపోయిన 6 వేర్వేఱు జీవప్రవాహములు 9 వ పటములో కనఁబడును. అందులో కొన్ని జీవన్ముక్త దశకు, కొన్ని అరూపదేవతలదశకు తీసికొనిపోఁగలవు. అటు పైని నీయుభయులు ధ్యాన'చోహన్లు'గా పరిణమింతురు. వీనిలో 1,3 ప్రవాహములకు చెందిన జీవవర్గములు, సూక్ష్మాకాశపదార్థము నుపయోగించి తరువాత కామలోకపదార్థము నుపయోగించి 'సిల్ఫుల'ను నిర్మింపఁగలవు. ఒకప్రవాహము జలచరములను, మిగిలినమూఁడు భూచరములను నిర్మించును. వీనియన్నిటిలో ఒక్కప్రవాహము మాత్రమే మానవనిర్మాణమునకు దారితీయును. మిగిలిన అయిదుప్రవాహములు దేవతానిర్మాణముతో సంభవించినవి.

జీవపరిణామమునకు కూడ ఒకవిధమైన సాంప్రదాయము, పారంపర్యము కలదని గుర్తుంచుకోవలెను. ఈసాంప్రదాయమునకు, ఉపాధిపరిణామమునకు సంబంధించిన సాంప్రదాయమునకు, ఏమీ సంబంధము లేదు. పాలిచ్చుజంతువులకు




(9 వ పటము)

పక్షులకు ఆధారము పాముజాతి. ఇది ఉపాధికి మాత్రమే పరిమితమై యున్నది. సముద్రపుతెల్లు, నాచు, గడ్డి, ఫంగై మొదలైనవి ఒక్కవంశమునకే చెందినవి (అనగా ఏకకణజల ప్రాణులు) అయినను, ఇవినాల్గు వేలు వేలు జీవప్రవాహాము లకు చెందియున్నవి. ఇదేవిధముగా పక్షులు, పాలిచ్చుజంతు వులు కూడ ఉపాధిదృష్ట్యా ఒకేవంశమునకు చెందినవైనను

పక్షులు, క్రమక్రమముగా ఆకాశపదార్థోపాధులు కావు పదార్థోపాధులు గలిగిన యక్ష, గంధర్వ, కిన్నర, కింపురుషులుగాను దేవతలుగాను పరిణామము చెందఁగలవు; కాని పాలిచ్చుజంతువులు పరిణామము చెంది మానవవర్గములోకి చేరును.

కఱ్ఱలపోగులోని సందులనుండి గాలి ఎట్లు దూరిపోఁగలదో అట్లే సూక్ష్మాకాశపదార్థనిర్మితోపాధులు బండరాతిలోనుండి నీటిసందులనుండి కూడ దూరిపోఁగలవు. మనము కేవలము ఘనపదార్థములని ఎంచు వస్తువులద్వారా నీసూక్ష్మాకాశపదార్థములు స్వేచ్ఛగా సంచరించుటకు తగిన, చర్మచక్షువులకు గోచరముకాని, సందులు రంధ్రములు గలవు. ఇట్టి ప్రాణులు భూమిలోపల సముద్రములోపల శీతోష్ణములచేను, పీడనశక్తియు బాధ పొందకుండ నివసింపఁగలవు.

ఒక్క మానవవర్గమును గూర్చి పర్యాలోచించినను ప్రాణులలో ఇట్టి సాధారణభేదములు గోచరించును (10 వ పటము చూడుఁడు).

మానవవర్గముపైపు పురోగమించుచున్న జీవప్రవాహములో, మొదటినుండియు అనఁగా ఖనిజవృక్షజంతుస్థితులనుండియు కొన్ని ప్రత్యేకమైన లక్షణములు గోచరించును. జంతువర్గములో ప్రవేశించుసరికి ఈలక్షణములకు రూపమేర్పడును. ఈలక్షణములు ఏడు విధములుగా నున్నవి. అనఁగా మానవులలో స్థూలముగాచూచిన ఏడువిధముల తత్త్వములు గలవారున్నారు. ఒక్కొక్క తత్త్వములో మిగిలిన




(10 వ పటము)

ఆయుతత్త్వములవలన కొన్నికొన్ని మార్పులు కలుగుచుండును. ఇట్టి మేళవింపువలన ఉపతత్త్వములనేకములు కూడ మనకు గోచరించును. స్పష్టముగా గోచరింపక పోయినను, ఈనాడు మానవుడు ఏతత్త్వమునకు సంబంధించియున్నాడో అదే తత్త్వలక్షణము ఆజీవి ఖనిజవర్గములోనేగాక అతఃపూర్వ స్థితిలో కూడ కల్గియుండును. శునకమార్జాలజీవితములకు సంబంధించిన లక్షణములు మొదటినుండియు వేర్వేరుగనే యుండును. ఏనుగులక్షణములు ఈరెండింటికిని భిన్నముగా నుండును. తోడేలు నక్క మొదలగు జన్మలెత్తి జీవి చివరకు కుక్కజాతికి సంబంధించి పుట్టినది. ఈజాతిలో పెంపుడుకుక్క

అగ్రశ్రేణికి చెందిన జంతువు. ఈప్రకారమే, మార్జాలము లకు, అశ్వములకు, గజములకు మర్కటములకు కూడ, క్రూరమైన వన్యమృగములుగా జీవించిన పూర్వజన్మలు కలవు. (ఈ విషయములనుగూర్చిన వివరములన్నియు 7వ అధ్యాయములో మీరు మరల చదువఁగలరు)

జీవి మానవవర్గమున ప్రవేశించినతరువాత గోచరించు వివిధస్వభావములు లేక తత్త్వములను (Types)ను గూర్చి యోజనచేసినప్పుడు. మానవజాతినిగూర్చి మనల నెక్కువగ ఆకర్షించు సుందరదృశ్యము వెల్లడికాఁగలదు. శునకజీవి మానవవర్గమున ప్రవేశించినప్పుడు ఆమానవునిలో భక్తిలక్ష ణములు మెండుగానుండునని బహుసులభముగా చెప్పవచ్చు. 11వ పటములో సూచించిన విభజన సమగ్రమైనదని చెప్ప వీలులేదు ; అది సూచనప్రాయమే గాని, మానవతత్త్వముల రహస్యజాలమునకు సరియైన కీలకము అని చెప్ప వీలులేదు. ఏడురకముల తత్త్వములు లేక స్వభావములు స్పష్టముగా గోచరించుచున్నవి. ఒకదానికంటె నొకటి మంచిదనిగాని ఎక్కువైనదనిగాని అనుకోకూడదు. ఇన్నిరకముల తత్త్వ ములు ఈ మహాపరిణామనాటకములో అవసరమైయున్నవి. ఈశ్వరసంకల్పానుసారము, ప్రతితత్త్వము, ఏకైకదివ్యజీవ చైతన్యములను వికసింపచేయుటలో వహింపఁగల పాత్రనుబట్టి వాని ఆధిక్యము వ్యక్తముకాఁగలదు.

మనకు సన్నిహితులుగానున్న వారిలో భక్తితత్త్వము గలవారిని పరీక్షగా చూచినచో కొందఱు హృదయము



(11 వ పటము)

ద్వారాను, మనస్సుద్వారాను ఈశ్వరసాక్షాత్కారమును బడసినట్లును, మఱికొందఱు జీససు ప్రభువు, కృష్ణభగవానుఁడు మొదలగు అవతారమూర్తులను సగుణముగా ఉపాసించినగాని భగవంతుని అవగాహనము చేసికోలేనట్లును కనిపెట్టఁగలము. ఇంకను కొందఱు జీవితమును నాటకతరంగముల పరిభావనమునకు లోనై ఆత్మబలిదానము నిచ్చగింతురు. కాని వీరు దర్పము

కొఱకుగాని ప్రశంసాపాత్రులగుటకుఁగాని ఇట్లు చేయరు; వీరికి నిత్యము కళతో మేళవింపఁబడని జీవితములో వాస్తవమైన భక్తితత్పరత కానరాదు. అందుకనియే వీరు ఇట్లు చేయుదురు. భక్త్యావేశమట్టి నిత్యకళాజీవితమునందు వీరు పొందఁగలరు. ఎల్లప్పుడు బీదసాదలతో కలసిమెలసియుండి వారి సుఖదుఃఖములతో తాదాత్మ్యమొందుచు ఈజగన్నాటకమున తగుపాత్రవహించుటయే, నిజమైన భగవద్భక్తి అనియు అదే క్రీస్తును అనుసరించి జీవించుట అనియు టాల్స్టాయిమహాశయుని నిశ్చితాభిప్రాయము; ఇట్టిది కానిచో క్రీస్తువలె జీవించుట యనునది అర్థరహితమని ఇటునంటివారి అభిప్రాయము.

ఇట్లే ప్రేమతత్త్వముకలవారిలో పలుతెఱఁగులవారు కలరు. కొందఱు ఏదో యొక వ్యక్తిని గాఢముగా ప్రేమించుటయే తమజీవితలక్ష్యముగా పెట్టుకొందురు. రోమియో, జూల్యెట్లు ఆకోవయందలి వారు. వీరు అట్టి వ్యక్తిప్రేమకొఱకు సర్వసంగపరిత్యాగము చేయుటకు సంసిద్ధులై యుందురు. మఱి కొందఱు తమప్రేమను ఒక్కవ్యక్తిపైనమాత్రమే కేంద్రీకరింపక, వారిప్రేమసౌరభమనేకులపైన వెదజల్లుచు, విశాలవిశ్వములో వీలైనంతదూరము తమప్రేమపరిమళమును విస్తరింపఁజేయుచు, అనేకసంఘసంక్షేమసేవాకార్యకలాపములలో పాల్గొని, తద్వారా సంతోషమును తృప్తిని డసెదరు.

పైన పేర్కొనఁబడిన కళాస్వభావముగలవారిజీవితము ఇంపుగానున్నను, తఱుచుగా నది అపార్థమునకు గుఱి యయ్యెను. జీవిత మొకనాటకరంగముగా నున్నగాని, వారికది వాస్తవ మనిపించదు. జీవితమెల్ల ఒకనాటకము 'అందులో నాపాత్రి నేను సామర్థ్యముతో నిర్వహింతును' అన్నట్లుగా నున్నప్పుడే అతనిసుఖము, నిజమైనసుఖము. సర్వము కన్నీళ్ల మయమయినప్పుడే, అతని దుఃఖము దుఃఖమగును. ఆత్మగా నొకప్పుడు, అనాత్మగా మఱొకప్పుడు భావించుకొనుచు, ఇందుకు తగిన ద్వంద్వపాత్రాభినయ మలవఱుచుకొనుచు తమజీవితములో నాటకరంగమునకు కొందఱాకర్షింపఁబడు దురు. తాత్త్వికప్రవృత్తిగలవారి ప్రభావములోపడి కొందఱు నాటకరచయిత లగుదురు. వీరిలో కొందఱిని అధికారపు హోదా ఆకర్షించును. అట్టివారిలో రాచకీయనాయకుఁడో, యోధుఁడో కావలెనను వాంఛ మెండుగ నుండును.

వైజ్ఞానికస్వభావముగలవారిలో 'సిద్ధాంత' భాగమునకు చెందినవారు కొందఱు, 'ప్రయోగ' భాగమునకు చెందిన వారు కొందఱు ఉందురు. 'పూజ్య' భావమునకు చెందిన మూఁడవరకము ప్రస్తుతము చాల అరుదు. వీరికి నిజముగా శాస్త్రపరిశోధనలలో ఉత్సాహము మెండు, అయినను ఈవిశ్వమంతయు ఈశ్వరుని మఱుఁగుపఱుచు సజీవమైన వస్త్ర మని ఎల్లప్పుడు భావించుచునే యుండెదరు. తనవిధానములో డంబము దర్పము గలిగిన శాస్త్రజ్ఞుఁడు, నాటకతత్త్వము కలవారి ప్రభావమునకు లోనైనాఁడని తెలియవలెను. ఇట్టి

విధానమునకు అహంభావముగాని, గర్వముగాని కారణము కాదు. ఇది ఇతని నైసర్గికలక్షణముకాని మఱొకటి కాదు.

పాలకవర్గము లేక అధికారవర్గమునకు సంబంధించిన వారిలో రెండు రకములవారు కలరు. మొదటివారు నాటక తత్త్వమునందలి వారు. రాచకీయనాయకులలో నీతత్త్వము స్పష్టముగా గోచరించును. రెండవవారు 'ఆకర్షణ' తత్త్వమునందలి వారు. వీరు తమ తాబేదార్లలో ప్రభుభక్తిని పురికొల్పుచు తాముమాత్రము పని సరిగా జరిగిపోవుచున్నంత కాలము వెనుకనుండియే నడిపించుట కిష్టపడుదురు. డాంబికము, దర్పము వీరికి గిట్టదు. తాత్త్వికస్వభావముగలవారివిషయమై ఎక్కువగా చెప్ప నవసరములేదు. జీవితవిధానమునుగూర్చి వీరుప్రదర్శించు వివిధదృక్పథములకు కారణము వీరి ఆంతరంగికాభివృద్ధిలోని భేదమే. వివిధదృక్పథములకు తార్కాణముగా తత్త్వవేత్త లనేకులు గలరు. హెర్బర్టుస్పెన్సరు రస్కిన్, కార్లైలు, అరిస్టాటిల్, ప్లేటో, స్పినోజా, హెగెలు మొదలగు వారు శంకరరామానుజమధ్వాదులు వివిధతాత్త్వికదృక్పథములు ప్రదర్శించిరి.

ఇంకొక రేఖవారు సాంకేతికచిహ్నా (Symbolism) విధానమువలన ఎక్కువగా ఆకర్షింపఁబడెదరు. అంతరార్థము లేక రూపకాలంకారముతో కూడియుండని జీవితము వీరికి అసత్యముగ కనపడును. 'రెవెలేషను' (Revelation) అను గ్రంథము వ్రాసిన సెంటుజాన్ (St. John) అను నాతఁడు ఈ శాఖవాఁడు. అతనికి, చిహ్నములు, రూపకాలంకారములు,

అంతరార్థముగలవిషయములు అనినచో మిగుల ఆనందము, కర్మకాండము, సంస్కారములు, కలిగియున్నప్పుడే నిజమైన మతమని భావించువారుకూడ కొంతవఱకు కీశాఖలోనివారే. అలంకారములు, ఉత్సవములు, ధూపదీపనైవేద్యములు షోడశోపచారపూజావిధానము మొదలైనవి వీరిని ఎక్కువగా ఆకర్షించును.

తన పనిలో సహాకరింపవలె నను ఉద్దేశముతో ఈశ్వరుఁడు తన బిడ్డలకు అనేకవిధములైన శిక్షణనిచ్చెను. ఆయన దృష్టిలో అందఱు సమానులే. ఒక్కొక్కరికొక్కొక్కమార్గ మాయన ఏర్పాటుచేసెను. ఇతరులతో చేతులుకలుపుకొనుచు ఎవరిమార్గము వెంట వారు సాగిపోవుటయే ప్రతిమానవుని కర్తవ్యము. (జ్ఞానోద్భవమునకు అవసరమగు, ఆలోచనాపరిశీలనలకు అనువగుమార్గమును సూచించినాను.)

ఈ విషయము మిగుల ఆకర్షణీయమైనది. జీవపరిణామమునుగూర్చి తెలియుటకొఱకు అవసరమైనంతవఱకు చెప్పియున్నారు. ఇంకను ఈవిషయజ్ఞానము పెంపొందించుకొనుటకు అవసరమైన యోజన పరిశీలన చేయుటకు తగినవిధానముకూడ సూచించినాను.

ఓరియనువద్ద ప్రారంభింపఁబడి, మానవునివఱకు సాగింపఁబడిన ఈ సృష్టిక్రమమును అతివేగముగా సింహావలోకనము చేసితిని. దీనినిబట్టి ఏకత్వమునుండి అనేకత్వము సిద్ధించిన రీతి మనకు ద్యోతకము కాఁగలదు. అనేకత్వములో

భాగమైన ప్రతివ్యక్తి స్వీయాభివృద్ధికొఱకు కృషిసలుపుట
గాక, సకలము తాను, నొకటియే అనుభావము జీర్ణించుకొని,
ఇతరులకు సేవచేయుటమీఁదనే తన భావిపురోభివృద్ధియు
ఉత్తమగతియు ఆధారపడియున్నదను సత్యమును నెమ్మదిగా
గ్రహింపఁగలుగును. ఒకదానినొకటి పోలియున్న భాగములను
దగ్గఱగా కూర్చుటగాక, పోలికలేని వివిధభాగములతో కూడిన
అఖండమున నొకదానిమీఁద మఱొకటి ఆధారపడి, ముందుకు
సాగిపోవుటయే ఉపాధిపరిణామములోని మూలసూత్రము
(Key-note) ఒకే ఒక స్వభావముకాదు; ఒకే ఒక మతము
కాదు; ఒకే రకమైన ఆరాధన కాదు. వివిధమతములు, వివిధ
స్వభావములు, అనేకవిధములైన ఆరాధనలు కలిగియు,
ఈశ్వరసంకల్పము నెఱవేర్చుటకొఱకు ఇవన్నియు ఒకకట్టుగా
కలిసి ఈశ్వరునితో సహకరించి పనిచేయుటయే ఎప్పటికీ జీవ
పరిణామపు మూలసూత్రము అయియున్నది.



# 2 అధ్యాయము

## నాగరికతల క్షీణౌన్నత్యములు

ఈనాఁటి ప్రపంచస్వరూపము 12 వ పటములో చూపఁబడినది. ఇందలి ప్రాక్పశ్చిమముల, ఉత్తర దక్షిణ ముల వివిధభాగములలో అనేకమతములవారు, అనేక జాతులవారు నివసించుచున్నారు. ఈజాతుల లక్షణములను సాంప్రదాయమములను ఆచారములను గూర్చిన పరిశీలన మత్యంతాకర్షకముగానుండును. మానవులలోని వివిధజాతుల లక్షణములనుగూర్చి సల్పినపరిశోధనాఫలితములను పొందు పఱిచిన శాస్త్రమే జాతిశాస్త్రము (Ethnology). ఈ నాఁడు ప్రపంచములో నున్న జాతులనుగూర్చి ఆధునిక




(12 వ పటము)

విజ్ఞానశాస్త్రము తెలిపియున్నది. విషయములను పరిశీలించిన తరువాత, దివ్యజ్ఞానము నాగరికతల క్షీణౌన్నత్యదశలను గూర్చి చెప్పు విషయములను సులభముగా అర్థముచేసికొనఁ గలము.

ప్రపంచములో మానవులను అనేక పద్ధతులుగా విభజింపవచ్చును. అందులో ప్రత్యేకించి రెండింటిని నమ్మకమైన ఆధారములుగ గుర్తించిరి. ఎక్కువ మార్పులేకుండ వంశ పారంపర్యముగా నిలిచియుండు చిహ్నములు (1) తల ఆకారము (2) వెంట్రుకల స్వభావము. ఈరెండును ఎక్కువగ ఆధారపడతగిన లక్షణములని కనిపెట్టిరి. ఇందులో 'తల ఆకారము'నకు సంబంధించి నిర్ణయింపఁబడినవారిలో మూఁడు వర్గముల వారు కలరు. (1) పొడుగుతలవారు (2) అడ్డ లేక పొట్టితలవారు (3) నడిమిరకపుతలవారు. ఈ మూఁడు వర్గములను తల పొడుగు వెడల్పుల శాతమును బట్టి నిర్ణయము చేసినారు. తల పొడుగు నూరుప్రమాణములనుకొన్నచో, వెడల్పు డెబ్బదిఅయిదునకు తక్కువగానున్నచో 'పొడుగు తల'వారనియు, ఎనుబదికి మధ్యనున్నచో నడిమిరకపు తల వారనియు, ఎనుబదికిపైనున్నచో 'అడ్డ లేక పొట్టితల'వారనియు, శాస్త్రజ్ఞులు నిశ్చయించిరి.

'వెంట్రుకల స్వభావము'నుబట్టి నిర్ణయింపఁబడిన వారిలో కూడ మూఁడు వరములవారు కలరు. (1) 'జడలు కట్టిన వెంట్రుకలవారు (Wooly and Kinky), (2) మెలి కలుతిరిగిన ఉంగరాలజుట్టువారు (Curly and wavey),

(3) నున్నని నిడుపు వెండ్రుకలవారు (Smooth and straight). జడలుకట్టిన వెంట్రుకలలో ప్రతి రోమము 'రిబ్బనువలె' చదునుగను బల్లపఱుపుగను ఉండి దానియందలి వ్యత్యస్త విచ్ఛేదమును (Transverse section) ఒక సూక్ష్మదర్శిని ద్వారా చూచినయెడల నొక చదునైన దీర్ఘవృత్తము (Flat ellipse) వలె నగుపడును. 'నున్నని నిడుపు జుట్టులో'ని వెంట్రుకలు తీఁగవలె గుండ్రముగా నుండును. సూక్ష్మదర్శిని చ్ఛేదము (Section) దానిని వృత్తమువలె కనపఱచును. 'మెలికలుతిరిగిన ఉంగరాలజుట్టు' లోని వెంట్రుకలు అండాకారమునకు వృత్తాకారమునకు మధ్యగానుండి సూక్ష్మదర్శినిలో దాని భేదము (Section) అండాకృతిగల్గిన దీర్ఘవృత్తము (Ovel Ellipse) వలె నుండును. ఈ నిర్మాణ లక్షణములనుబట్టియే వెంట్రుకలలో పైమూఁడురకముల లక్షణములు గోచరించును.

13 వ పటములో పై రెండు తరగతులకు చెందిన అంశములను సంక్షిప్తపఱచి వ్రాయుడమైనది. బ్రోకా (Broca) అను శాస్త్రజ్ఞుని విభజనప్రకారము ప్రజలలో ముఖ్యముగా మూఁడు రకములకు చెందినవారు కలరు. ఏ ఒక్కజాతిలోను ఒకేరకమునకు చెందినవ్యక్తులుండరు. ప్రతిజాతిలోను మూఁడురకముల శిరస్సులు గల్గినవారుందురు. కాని ఇందులో ఏదో ఒకరకమునకు చెందినవా రధికసంఖ్యాకులుగ నుండుట సంభవించును. దానినిబట్టియే 'జాతి'లక్షణము నిర్ణయింప వీలగును. ఒక్కొక్కప్పుడు 'వెంట్రుకల స్వభావము'నుబట్టి

ఫలానాజాతి అని స్పష్టముగా కనఁబడుచున్నను, కలగాపులగ ముగానుండి ఏ వర్గమునకు చెందియున్నారో ఇదమిద్ధముగా శాస్త్రజ్ఞుఁడు నిర్ణయించుటకు వీలుకలుగదు.

| జాతులశాస్త్ర రీత్యా ఏర్పరచిన విభజన | |
|---|---|
| బ్రోకా | 1. నిడుపు జుట్టు<br>(అ) పొడుగు పాటితల: ఎస్కిమో<br>(క) పొట్టితల - ఎఱ్ఱ ఇండియను, పెరూవియను, మంగోలియను, వగైరా<br>2. ఉంగరాలజుట్టు:<br>(అ) పొడుగుతల: ఆంగ్లోసేక్సనులు, స్కెండినేవియన్లు బస్కులు, బర్బర్లు, సెమైట్లు, ఇండోఆర్యన్లు, నూబియన్లు.<br>(క) పొట్టితల: ఫిన్నులు, కెల్టులు, స్లావులు, ఇరానియన్లు<br>3 ఉన్నిబొచ్చుజుట్టు: బుష్మన్లు, కాఫర్లు, నీగ్రోలు |
| ఫ్లవరు మరియు లిడెక్కరు | 1. ఎథియోపియను: నీగ్రాయిడ్, మెలనేషియను, నగ్రో, బుష్మన్లు ఆస్ట్రేలియను<br>2. మంగోలియను: మంగోలు్స, మలయాస్, పాలినేషియను<br>3. కకేషియను:<br>(అ) పల్చనివెండ్రుకలుగల, స్లావ్. ట్యూటను. శ్వేత సెల్టులు<br>(క) నల్లవెండ్రుకలజాతి: దక్షిణ యూరోపా, అరబ్బులు హిందువులు. ఆఫ్గన్లు. |

(13 వ పటము)

ఫ్లవరు, లిడేక్కరు (Flower and Ledekkar) అను శాస్త్రజ్ఞులు చేసిన విభజనకు పైవిభజనకు భేదమెక్కువగా లేదు. వీరు పై చెప్పిన చిహ్నములను మాత్రమేగాక, ముఖ కోణము, శరీరముల, వెంట్రుకల రంగు మొదలగు విషయము లను కూడ ఆధారముగ తీసికొనిరి.

13 వ పటములో సూచించిన రెండు పద్ధతులను బట్టి కూడ నేఁటి ప్రపంచములో ముఖ్యముగా మూఁడురకముల జాతులవారున్నట్లు తేలుచున్నది. (1) ఎథియోపియను జాతి వారు:- నల్లటి శరీరము, తుట్టపెదవులు, పొడుగుతల, జడలు

కట్టిన నల్లటిదున్ని బొచ్చునంటె జుట్టు వీరి స్వరూపలక్షణములు. (2) మంగోలియనులు :— ఎత్తుగానున్న గడ్డపుబొమికెలు, పసుపు లేక ఎఱుపు రంగు శరీరము, నల్లని నున్నటి నిడుపు వెంట్రుకలుగల తల యుండును. వీరిలో పురుషులకు ముఖము పైన వెంట్రుకలుండవు. (3) ఆర్యులు లేక కకేషియన్లు :— వీరిలో కొందఱు తెల్లగాను కొందఱు మేడిపండురంగుగల వారుగాను, నల్లగాను, ఎఱ్ఱగానుండి ఉంగరాలజుట్టుగలిగి ఉందురు. కొందఱు సాధారణముగ గడ్డము పెంచెదరు.

14, 15 బొమ్మలలో చూపఁబడినవారు ఎథియోపియన్లు. వీరిలో జడలుకట్టిన బొచ్చు జుట్టు, వెడల్పుముక్కు, తుట్టపెదవులు స్పష్టముగా కనుపించును. మన ప్రమాణముల ప్రకారము వీరు అందమైనవారని చెప్పుటకు వీలులేకపోయినను అంత అసహ్యముగ మాత్రము లేరు. 14 వ బొమ్మలో కనపఱిచినవారిలో బలము, దర్పము ఎక్కువగ కనపడుచున్నవి. 15 వ బొమ్మలోనివారు రోడిన్ (Rodin) అను కళాకారునికి సైతము ఆనందము కలిగించు కళాచతురత ఆమోటుతనము లోనే కలిగియున్నారు.

16, 17, 18 బొమ్మలలోనివారు పైన పేర్కొనఁబడిన రెండవ వర్గమునకుఁ చెందినవారు. 16 వ బొమ్మలో బ్రిటిష్ కొలంబియాలోని ఎఱ్ఱఇండియను జాతికి చెందిన స్త్రీ కనపఱుపఁబడినది. ఆమె ఎత్తగు గడ్డము, పొడుగైన జుట్టు ఆమె జాతిని స్పష్టము చేయుచున్నవి. 17, 18 బొమ్మలలోనివారు స్పష్టముగా రెండవవర్గమునకు చెందినవారని చూచుటతోడనే

తెలియఁగలదు. 17 వ బొమ్మలో యునైటెడ్ స్టేట్సునకు చెందిన రెడ్ ఇండియను వ్యక్తి, 18 వ బొమ్మలో చైనీస్ మెండారిన్ (Chinees Mandarin) వ్యక్తియు చూపఁబడినవి. నున్నని (వెంట్రుకలులేని) ముఖము, ఎత్తుగానున్న గడ్డమును బట్టి వారేవర్గమునకు చెందినది స్పష్టముగ తెలియుచునే యున్నది.

నేఁటి ప్రమాణములకు ఇంచుమించుగ కకేషియను జాతి, అందమువిషయములో సరిపోవచ్చును. నున్నగ గీయించుకొన్న గడ్డము గల హిందువు (19), గెడ్డము పెంచిన ఆంగ్లేయుఁడు (20), ఈ బొమ్మలలో నున్నారు. ఈ జాతివారు శరీరసౌందర్యములోనేగాక, తెలివితేటలలోఁగూడ సునిశిత ములైన భావములు, సంకల్పములు కలవారై కళలలోను, తత్త్వజ్ఞానములోను, ఉత్కృష్టమైన స్థానము పొందఁగలిగిరి.

నేఁటి ప్రపంచప్రజలలో పలురకముల నాగరికత లున్నవి. కాని ఏవియును శాశ్వతములు కావు. గ్రీసు దేశము లోని 'నినేవా' నాగరికతకు. 'రోము' దేశములోని 'టైరు' నాగరికతకు, ఏగతిపట్టినదో అన్నిటికి అదే గతి పట్టఁగలదు. కొన్నినాగరికతలు వానిజాడకూడ లేకుండ పూర్తిగా నశించి నవి. కాని గ్రీసునాగరికతవంటివి ప్రపంచమునకు 'జీవిత మంటే కళసుమా' అను మహత్తరసందేశము నిచ్చినవి. చరిత్రద్వారా నాగరికతల క్షీణోన్నత్యములు కొంతవఱకు తెలిసికొనుటకు వీలున్నను చరిత్రవలన, ప్రాచీనవిషయ ములను 'దృష్టినివకించు కాలము, సాంప్రదాయము'

(Refracting medium of time & tradition) అను రెండు సాధనములద్వారా నే చూడఁగలుగుచున్నందున మనకు తెలిసిన విషయములు, సరియైనవనిగాని, పాక్షికమైనవి కావనిగాని, నమ్మకము లేదు. అయినప్పటికి మానవజాతి పూర్వచరిత్రి తెలియనిదే ప్రస్తుతస్థితిని విచారించుటకుఁ గాని, భావిపద్ధతి నిర్మాణము చేసికొనుటకుఁ గాని వీలుపడదు. మన 'జీవిత తత్త్వము' యథార్థవిషయములకు సరిపడి యుండనేరదు.

గతించిపోయిన నాగరికతలను అర్థము చేసికొనుటకు, దివ్యజ్ఞాన మొక నూతనపద్ధతిని కనిపెట్టినది. ప్రస్తుతము దీనిప్రకారము భూతకాలము వర్తమానములో విలీన మొనర్పఁబడినది. వ్రాఁతప్రతులతోఁ గాని, సాంప్రదాయములతోఁ గాని దీనికి నిమిత్తము లేదు.

వివరించివ్రాయుటకు కష్టమైన విషయమైనను ఇది అస్తిత్వ మూలసత్యములలో నొకటి గనుక ఈగ్రంథములో పదేపదే ఈవిషయము గుర్తుకు తీసికొని రావలసియున్నందున, ఈవిషయమై వ్రాయుటకు ప్రయత్నము చేయకతప్పదు.

జీవోపాధుల వెనుక వానికి మూలకందమువంటిది 'మహా చైతన్య' మొకటియున్నది అని 1వ అధ్యాయములో సూచించినాను. ఈశ్వరుని ఆవిష్కరణమే పరిణామవిధానము. "ఆయనలోనే మనము నివసించుచు, చరించుచు జీవితము గడుపుచున్నాము." ఆయననే దివ్యజ్ఞానసామాజికులు 'లోగోస్' (ఈశ్వరుఁడు) అని అందురు. మహాచైతన్యమునకు 'కాల'

మనునది లేదు. గతించిపోయినదని మన మనుకొనునదంతయు వారిలో ఈ నాఁడు కూడ జరుగుచున్నట్లే యుండును. ఈశ్వరునకు భూతకాలము కూడ వర్తమానమువంటిదె. గతించిన క్షణములోని సంఘటన ప్రస్తుతము కూడ ఆయనలో జరుగుచున్నటులనే యుండి, నేఁటికిని ఆయనలో భాగముగా కనిపించును. 'శాశ్వతవర్తమానము' ('Eternal Now') అను ఇట్టివిషయమును సాధారణమానవుఁడు గ్రహించుట కష్టము. కాని ఇది సత్యములలోకెల్ల పరమసత్యము. ఇది గ్రహించిననాఁడు అన్నివస్తువులకు **నూతనమైన** విలువలు కనుపించును.

'శాశ్వతవర్తమాన'మను విషయము, అత్యంతగహనమైనది, నమ్ముటకు శక్యముకానిది. అయినను దానినిగూర్చి కొంత తెలిసికొనుట అవసరము. పరిణామపథములోనున్న 'ప్రత్యగాత్మ' అయిన మానవుఁడు నిజమునకు తన సృష్టికర్త 'ప్రతిమ' వంటివాఁడు. ఎప్పటికైన సృష్టికర్తవలెనే మానవుఁడు కూడ సంపూర్ణుఁడగును. మానవచైతన్యములో దాగియున్న శక్తులు అభివృద్ధి చెందినయెడల ఇప్పుడు కూడ మానవుఁ డీశ్వరచైతన్యోపరిభాగమును స్పృశింపఁగలిగి, ఈశ్వరునితోపాటు ఇదివఱకే జరిగిపోయినవిషయములన్నియు ఇప్పుడుజరుగుచున్నటుల చూడఁగలఁడు. పరిశోధకుఁడుచూచుచుండఁగా జరిగి ప్రక్కకు నిష్క్రమించుచున్న దృశ్యమువలెఁ గాని, నాటకరంగముపై తనయెదుట బహిర్గతము చేయఁబడిన దృశ్యమువలెఁగాని, యుండదు. పరిశోధకుఁడు అట్టి ప్రాచీన

కాలములో నివసించి ప్రత్యక్షముగా చూచుచున్నట్లుండును. ఏ కాలమునకు చెందిన దృశ్యము చూడవలెనని తాను సంకల్పించునో ఆక్షణమే తన కది గోచరమై తాను దానిలో నిమగ్నుఁడగును. గట్టిపడుటకు పూర్వము మన భూభాగపు స్థితి ఎట్లుండెనో చూడఁగోరెదవా? తక్షణము నీవు లక్షలాది సంవత్సరములకు పూర్వ మున్న స్థితిని ప్రత్యక్షముగా చూడఁగలవు. అప్పుడు నీచుట్టు భూమి కుతకుత ఉడుకుచు న్న ద్రవరూపములో నున్న లోహములతోను మంటలతోను కనుపించును. అచ్చటి ప్రేలుడుశబ్దములు వినఁగలవు. ఆ వేడి పీడన మనుభవింపఁ గలవు. భూతకాలపు సంఘటనల ప్రత్యక్షానుభూతి నీకు కలుగును. ఇది స్వప్నము కాదు. నీవు ఎక్కువ రద్దీగల పట్టణమునకు వెళ్లినపుడు, మనుష్య యంత్రశకటాదుల అలజడివలన కలుగు ధ్వని ఏలాగు వినఁబడునో సూర్యుని, మేఘములను, ఎట్లు చూడఁగలవో అట్లే అచ్చటి ప్రతివిషయమును చూడఁగలవు; వినఁగలవు. ఏమీ! నీవు పెరికిల్సు ఉపన్యాసము వినఁదలఁచితివా లేక సీజరు విజయోత్సవము చూడఁదలఁచితివా? తక్షణమే నీవు ఆ నాఁటి ఏథెన్సులోనో రోములోనో యుండఁగలవు. ఆనాఁటి ప్రజా జీవితములో నీవు మునిఁగియున్నట్లు నీకు తోఁచును. ఆ నాఁటి గ్రీకుల సంగీతమును ల్యాటినుభాషను వినఁగలవు. అచ్చటి జీవితరంగములోని పాత్రలను చూడఁగలవు. 'కాలగ్రంథము' (Book of time) నీయెదుటనే తెఱచియుండును. ప్రాచీన కాలము నాఁటి ఏ అపూర్వసంఘటననుగూర్చి తెలిసికొనఁ

గోరెదవో అది మాత్రము నీవు ఎంచుకొన్న చాలు. అప్పుడు నీవు ఈశ్వరస్మృతి (Memory of the Logos) స్పృశింపఁ గలిగెదవు. తద్ద్వారా భూతకాలము వర్తమానకాలము కాఁగలదు. అప్పుడు నీ కీనాఁడున్న ప్రజ్ఞాబుద్ధులతో దానిని పరిశీలింపవచ్చును.

భూతవర్తమానకాలములకు చెందిన దివ్యజ్ఞానపరిశోధకు లీ పృథ్వి పూర్వచరిత్రను ఈశ్వరస్మృతిలో నిట్టిభాగమునకు సంబంధించిన వివరములను బట్టి తెలిసికొనఁగలిగినారు. దివ్యజ్ఞానసత్యములలో కొన్ని యీ పద్ధతిని సేకరింపఁబడినవి. ప్రాచీననాగరికతలనుగూర్చి వారి పరిశోధనలతో సేకరించిన విషయము లీదిగువ నుదహరించుచున్నాను.

పది లక్షల సంవత్సరములకు పూర్వము ప్రపంచములోని సముద్రభూభాగముల స్వరూపము 21 వ పటములో చూపినరీతిగా నుండెడిది. భూమ్యుపరిభాగము నిత్యము మార్పు చెందుచునే యున్నది. ఒకనాఁటి భూభాగము ఈనాఁడు సముద్రముగా మాఱుటయు, ఒకనాఁడు సముద్రమున్న చోట భూఖండము లేచుటయు జరుగుచునే యున్నది. ఇట్టి స్థితిలో పది లక్షల సంవత్సరములక్రింద ప్రపంచస్వరూపమెట్లుండినదో కచ్చితముగా తెలియుట ఎట్లు? పై చెప్పిన విధానమురీత్యా దానిని తెలిసికొనుట సాధ్యము. మొట్టమొదట ఈశ్వరస్మృతిలోని 'కాలగ్రంథము'ను పరిశీలించి తరువాత మహాశ్వేతసోదరబృందమువారి విచిత్రవస్తుశాలలోని విశేషములను బాగుగ పరిశీలించి అవగాహనచేసికొన




(21 వ పటము)

వలెను. 'మహాశ్వేతసోదరబృందము' వారు మానవసృష్టి ప్రారంభమైనప్పటినుండియు, ప్రపంచములో జంతు, మానవ వర్గముల క్రమాభివృద్ధిలక్షణములను సూచించెడి అనేకము లగు నమూనాలు, వ్రాతప్రతులు, అస్థిపంజరములు, చిత్రపటములు, దేశపటములు మున్నగు చిహ్నములను వారి విచిత్రవస్తుశాలలలో భద్రపఱచి యుంచిరి. సంపూర్ణస్వార్థత్యాగమువలన, మానవసేవాతత్పరతవలన, ఇట్టి అపూర్వమైన హక్కును సంపాదించిన జిజ్ఞాసులకు, మహాత్ముల విచిత్ర వస్తుశాలలోని ప్రాచీననాగరికతలయు, ఉపాధులయు, పరిశీలనము నిత్యానందకరముగ నుండును. జీవన్ముక్తులైన వారు ప్రాచీన నాగరికతను పరిశోధనచేసి భావిసంతతివారి ఉపయోగము నిమిత్తము ఓర్పుతో యుగయుగాలనాటి వివిధఘట్టములలో ప్రపంచస్వరూప మేరీతిగా నుండెనో తెలుపుటకు బంక

మట్టితో తయారుచేసి భద్రపఱచిన నమూనాలను దివ్యజ్ఞాన పరిశోధకుఁడు చూడఁగలడు. ప్రత్యక్షముగా ప్రపంచము లోని మార్పులను పరిశీలించి పైచెప్పిన నమూనాలనుబట్టి సరిచూచి వ్రాయఁబడినట్టివే 21 మొదలు 24 వఱకు పటము లలో చూపఁబడ్డ విశేషములు.

21 వ పటము చూచినయెడల, కొద్దిమినహాయింపు లతో నేఁటి భూభాగము చాలవఱకప్పట్లో జలమయ మని, ఆ నాఁటి భూభాగము నేఁడు చాలవఱకు సముద్రమయ మని తెలియఁగలదు. భూమధ్యరేఖకు ప్రక్కగను దక్షిణముగను అనఁగా ప్రస్తుతము చాలభాగము 'శాంతి మహాసముద్ర మున్న'చోట ఆ నాఁడు 'లెమూరియా' అను మహాభూఖండ ముండెడిది. 'లెమూరియా'అన్న పేరు దివ్యజ్ఞానసామాజిక్షు లిడిన నామము. అప్పట్లో భూభాగ మంతటను మెండుగా 'లెమూరియా కోతు' లుండినటుల స్క్లేటరు (Sclater) అను ప్రకృతిశాస్త్రవేత్త వ్రాసినదానినిబట్టి 'లెమూరియా' ఖండమని పేరుపెట్టిరి. ఆ భూఖండములో కూడ మానవ జాతి యుండెడిది. ఆ జాతికి చెందినవారే 14, 15 పటము లలో చూపఁబడినవారు. ఈ నాఁటి నీగ్రోలు, ఇతర 'ఉన్ని బొచ్చు' వెంట్రుకల జాతులవారు లెమూరియన్ల సంతతికి చెందినవారే వారికన్న వీరు కొంచెముకుఱుచగా నుందురు. అంతకన్న భేద మేమియు లేదు.

కొన్ని సంవత్సరములుగడుచుసరికి, ప్రపంచస్వరూపము 22 వ పటములో చూపినట్లుగా మార్పుచెందెను. ఈనాఁడు

'అట్లాంటిక్' మహాసముద్ర మున్నచోట 'అట్లాంటిస్' (Atlantis) అను భూఖండముండెడిది. ఈనామము 'ప్లాటో' (Plato) మహాశయుఁడు పెట్టినాఁడు.




(22 వ పటము)

ఫ్లవరు-లిడెక్కరు (Flaver-Lydekker) అను శాస్త్రజ్ఞులు చెప్పిన రెండవ రకమునకు చెందిన 'సున్నని నిడుపు వెంట్రుకలు' 'ఎత్తుగానున్న గడ్డపుబొమికెలు గలిగిన, మంగోలియన్లు ఈ భూఖండమున నుద్భవించిరి. వారు 'అట్లాంటిస్' (Atlantis) నుండి అనేకదిశలకు వలస వెళ్లిరి. నేఁటి చైనీయులు, ఉత్తరదక్షిణఅమెరికాలలో నేఁడు క్రమేణా తగ్గిపోవుచున్న, రెడ్ ఇండియన్లు; వీరి సంతతివారే. 23 వ పటములో ఈనాఁడు చాలభాగము నశించిపోయిన 'లెమూరియా' 'అట్లాంటిస్' ఖండములు చెందినమార్పులు చూడవచ్చును. 24 వ పటములోని స్వరూపము చెందు నాఁటికి 'అట్లాంటిస్'

భూఖండము చాలవఱకు సముద్రగామియై అందలి స్వల్ప భాగము ఒక లంకగా మిగిలినది. ప్లాటో (Plato)కు పూర్వీకుడైన 'సోలను'నకొక ఈజిప్టుదేశపు మతగురువు ఈ భూభాగము సముద్రములో కలిసిన వృత్తాంతమునుగూర్చి చెప్పిన సంగతులు 'ప్లాటో' తానువ్రాసిన 'టెమియాస్ అండ్ క్రిటియాస్' గ్రంథములో వివరించియున్నాడు. క్రీ. పూ. 9564 లో భూగర్భములో బ్రహ్మాండమైన కలవరము అలజడి పుట్టి 'అట్లాంటిస్' ఖండములోని ఈ స్వల్పభాగముకూడ




(23 వ పటము)

అతిత్వరితముగ సముద్రముపాలైన కారణమున ఒక పెద్ద ఉప్పెన వచ్చి పల్లముగా నుండిన భూభాగములు కూడ జలపూరితములై వినాశకరమగు ఉద్ధృతమైన వరద సంభవించెను. 'అట్లాంటిస్' భూఖండము సముద్రగామి యగు సమయమునకు 'సహారా' సముద్రమునుండి 'సహారా యెడారి' పైకి లేచెను. ఇదే సమయములో మధ్యఆసియా

అంతర్భాగములోని ఒక చిన్నసముద్రము 'గోబి' (Gobi) ఎడారిగా మారెను. అప్పటినుండి ఇంచుమించుగా నేఁటివఱకు ప్రపంచస్వరూపములో ఎక్కువమార్పులు రాలేదు.




(24 వ పటము)

'అట్లాంటిస్' భూఖండ మొక 'మిధ్య' కాదని 25 వ పటము చూచిన సులభముగా తెలియగలదు. ఈ పటము వలన 'అట్లాంటిక్' మహాసముద్రగర్భములోని వివిధభాగముల లోతు తెలిసికొనవచ్చును. ఎజోర్సు చుట్టు నున్న సముద్రతీరము సాధారణ తీరములవలె క్రమక్రమముగా ఏటవాలుగా క్రిందికి దిగక, ఒడ్డునొద్దనే ఒక కొండదిగుచున్నట్లు అగాధమైన నరకముగా నుండును. 'అట్లాంటిస్' భూఖండమున్నపుడు ఇప్పటి 'ఎజోరు' ఉన్నచోట మనుష్యులెక్కుటకు అలవికాని మంచుశిఖరములు కలిగిన ఒక ఎత్తైన పెద్ద పర్వత ముండెడిది. అదియే యీ నరకమునకు కారణము.




(25 వ పటము)

'అట్లాంటిస్' భూఖండము అంతరించుటకు పూర్వమే మధ్యఆసియాసముద్రమునకు దక్షిణతీరమున నొక క్రొత్త జాతి మానవు లుద్భవించిరి. వీరే 19-20 బొమ్మలలో చూపఁబడిన 'ఆర్యులు' లేక 'కకేషియన్లు' వీరు అచ్చట నుండి పశ్చిమదక్షిణదిశల వైపునకు వలసలు వెళ్లిరి. వీరే నేఁటి హిందువులు, అరబ్బులు, పారశీకులు, గ్రీకులు, రోమన్లు, సెల్టులు, స్లావులు, ట్యూటన్లు అయియున్నారు.

ఈరీతిని 'లెమూరియా' అట్లాంటిస్' 'ఆసియా' దేశములలో మూఁడు జాతులు బయలుదేరినవి. ఈ మూఁడు జాతుల సంతతియే నేఁటి ప్రజానీకము.

నాగరికతల క్షీణౌన్నత్యములు 'రేయింబవళ్లు' అనుగళ్లలో 'విధి' మానవులను చతురంగబలముతో వేయు ఎత్తుల వంటివియు లేదా యాంత్రిక మైనట్టివియు కావు అని దివ్యజ్ఞానము బోధించుచున్నది. దేశములు పుట్టుటయు, గిట్టుటయు నొక

ప్రణాళిక ననుసరించి జరుగుచుండును. మానవజాతి ప్రారంభ దశనుండి ఈశ్వరుడు ఆ యా మానవుల కుపయోగపడు జాతులను, మతములను, శాస్త్రములను ఎప్పుడు ఏక్రమములో బహిర్గతము చేయవలెనో ఆలోచించి ఒక ప్రణాళిక నేర్పాటు చేసెను. ఈశ్వరుని భూలోకప్రతినిధులైన 'మహాశ్వేత సోదరబృందమువారు' ఆ ప్రణాళికను నడుపుచున్నారు. దృశ్యాదృశ్యములైన ప్రకృతిశక్తుల నన్నిటిని వినియోగించి వారే ఈ లక్షలాది సంవత్సరములనుండి పరిణామవిధానమును నడిపించుచున్నారు. ప్రతిమూలజాతివిధివిధానములను తీర్చి దిద్దునట్టివారు, ఈబృందమునకు చెందిన యిద్దరు 'మహాత్ములు'. అందులో నొకరిని 'మను'వందురు. వీరు అంతకు పూర్వమున్న జాతిలక్షణములతో, ఈశ్వరప్రణాళిక కనుగుణముగా ఎట్టి మార్పు చేయవలెనో యోజించి క్రొత్త జాతిని తగు లక్షణము లతో తయారుచేయుచు తద్విధముగా తజ్జాతిభౌతికాభివృద్ధిని, నడిపించుచున్నారు. ఈ 'మనువే' నలసలు ఏర్పాటుచేయును. తగిన రాజ్యాంగమును ప్రసాదించును. ఏజాతి చేయవలసిన విధుల నాజాతిచేత నిర్వర్తింపజేయును. రెండవవారిని 'బోధి సత్త్వ'లందురు. వారే జాతికి 'జ్ఞానగురువులు'. వారు జాతి వైజ్ఞానిక కళాభ్యుదయములనుగూర్చి కనిపెట్టుచుందురు. ఈశ్వర ప్రణాళికలో నుదహరించినరీతి నెవరిపాత్ర వారు నిర్వహించుచు టకు తగిన మతము, కళలు, శాస్త్రములు ఏర్పాటుచేయుదురు.

ఈశ్వరప్రణాళిక ననుసరించి మానవజాతి భూమిపై పూర్తిపరిణామము చెందుకాలములో ఏడు మూలజాతు

లుద్భవించును. మానవజాతిపరిణామములో నేటివఱకు ఐదు 'మూలజాతులు' మాత్రమే వ్యక్తము చేయఁబడినవి. మొదటి రెండు మూలజాతులు నశించిపోయి లక్షలాది సంవత్సరములగుటచేత వారిసంతతివారు ప్రపంచములో లేరు.

ప్రతిమూలజాతిలోను ఏడుపజాతు లున్నవి. ఉపజాతిలో మూలజాతిలోని ముఖ్యలక్షణములు వ్యక్తమగుటయే గాక, ప్రత్యుపజాతికి నొక విశిష్టలక్షణము కూడ నుండును. 26 వ పటములో, 14 మొదలు 20 వఱకుబొమ్మలలోచూపిన మూఁడు మూలజాతులపేర్లు వ్రాయఁబడినవి. 3 వ మూలజాతి అయిన లెమూరియను జాతికి చెందినవారి జాడ కూడ దొరకలేదు. నీగ్రోలు, నెగ్రిల్లోలు మొదలైన 'ఉన్నిబొచ్చు' వెంట్రుకలవారు 'లెమూరియను' జాతిలోని చివరి ఉపజాతులకు చెందినట్టివారు. స్వచ్ఛముగ కలగాపులగము కాకుండ ఉన్నట్టి మూలజాతి లేనేలేదు, ఇతరజాతులతో కలసినప్పటికి ఆ మూలజాతి ప్రత్యేకలక్షణములు కొంతవఱకు కనఁబడక మానవు.

మూఁడవ మూలజాతిలోని సప్తమోపజాతినుండి నాల్గవ మూలజాతి అయిన 'అట్లాంటియను' జాతిని ఆ జాతి 'మను'వు తయారుచేసెను. దీనిలోకూడ 'సప్తో'పజాతులు కలవు.

నాల్గవ మూలజాతిలోని మొదటిరెండు ఉపజాతుల సంతతివారెవ్వరును, ఇప్పుడు జీవించిలేరు. కాని 'ఘర్యాళ్

| మూలజాతులు వాటి ఉపజాతులు | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| III లెమూరియన్ | | IV అట్లాంటియన్ | | V ఆర్యన్ | | VI | | VII |
| 4 | | | | | | | | |
| 5 | నీగ్రో, నెగ్రిటో | | | | | | | |
| 6 | నెగ్రిల్లో | | | | | | | |
| 7 | | 1 | ర్మో ఆహాలే | | | | | |
| | | 2 | ట్లవట్లి | | | | | |
| | | 3 | టాల్టెక్ | | | | | |
| | | 4 | మొదటి తురేనియన్ | | | | | |
| | | 5 | అసలు సెమైట్ | 1 | హిందు ఈజిప్టియను | | | |
| | | 6 | అక్కేడియను | 2 | ఆర్యన్ సెమైట్ | | | |
| | | 7 | మంగోలియను | 3 | ఇరానియన్ | | | |
| | | | మలయా-జపానులు | 4 | సెల్టిక్ | | | |
| | | | | 5 | ట్యుటానిక్ | | | |
| | | | | 6 | ఆస్ట్రో. అమెరికన్ | 1 | | |
| | | | | 7 | లేటిన్-అమెరికన్ | 2 | | |
| | | | | | | | | |

(26 వ పటము)

మనుష్యుని ' అస్థిపంజరమునుబట్టి అతఁడు మొదటి ఉపజాతి వాఁడనియు 'క్రోమేగ్నను మనుష్యుని' అస్థిపంజరమును బట్టి అతఁడు రెండవ ఉపజాతివాఁడని ఊహింపఁబడినది. దక్షిణ, మధ్య, అమెరికాలలోని 'ఇండియోాన్ ' అనువారు, యునైటెడ్ స్టేట్సు (అమెరికా)లోని 'రెడ్ ఇండియన్లు' కూడ, 3 వ ఉపజాతి అయిన 'టాల్టెక్కు ' జాతికి చెందినవారు నాల్గవ ఉపజాతివారు 'అట్లాంటిస్ 'నుండి తూర్పుదిశకు వలస వెళ్లి బేబిలోనియా దాటి 'యెల్లో ' నదియొడ్డుననున్న చైనా దేశములోని బల్లపఱుపు ప్రదేశములన్నియు ఆక్రమించినారు. వారిప్పటికిని చైనా దేశములో అచ్చటచ్చట కన్పించెదరు. పొడుగుగానుండి పసుపుపచ్చని రంగు కలిగియుండురు. వీరు

7 వ ఉపజాతిలక్షణములకు భిన్నమైన లక్షములు కల్గియుండిరి. శ్వేతశరీరులైన 'యూదులు' ఉత్తరాఫ్రికాలోని 'కబైల్సు' 'అసలుసెమైట్సు' (5 వ ఉపజాతి) సంతతివారు. మెడిటరేనియను సముద్రములో వ్యాపారవాణిజ్యములు జరిపిన 'ఫోనీషియన్లు' ఆఱవ ఉపజాతి అయిన 'అకేడియన్లకు' చెందినవారు. 7 వ ఉపజాతివారైన 'మంగోలియన్లు,' 4 వ ఉపజాతివారైన 'తురేనియన్ల'నుండి అభివృద్ధిచెందిరి. వీరే ప్రస్తుతచైనా దేశీయులు 'జపానీయులు' 'మలయన్లు'. వీరు ప్రత్యేకించి ఏఒక్క ఉపజాతికి చెందరు. వీరిలో రెండు మూడు ఉపజాతుల కలయిక గోచరించును. 'జపానీయులు' నాల్గవ మూలజాతికి మకుటమువంటివారు. వీరిలో నాల్గవ మూలజాతి పరాకాష్ఠ చెందినదని చెప్పవచ్చును. అందు వలన సప్తమోపజాతికి చెందిన 'చైనీయుల'తో పోల్చినచో వీరిలో అనేకభిన్నమైన గుణములు కలవు.

అయిదవ మూలజాతి మనువు (వైవస్వతమనువు) 'కలయికలేని సెమైటు' (5 వ ఉపజాతి) నుండి తన 5 వ మూలజాతిని అభివృద్ధిచేసెను. 5 వ మూలజాతి ('ఆర్యను' జాతి)లో కూడ ఏడు ఉపజాతులు కలవు. కాని ఇంతవఱకు అయిదు ఉపజాతులు మాత్రమే బహిర్గతమైనవి. 'ఆర్యను హిందువులు' 'ప్రాచీనఇజిప్షియన్లు' (వీరు ఉత్తమరాజ కుటుంబములకుచెందినవారు) 5 వ మూలజాతిలో మొదటి ఉపజాతికి చెందినవారైయున్నారు. స్వతస్సిద్ధమైన సెమైట్సుకు (4 వ మూలజాతిలోని 5 వ ఉపజాతికి) భిన్నమైనట్టిది

ఆర్యనుజాతిలోని రెండవ ఉపజాతి 'ఆర్యనుసెమైట్లు'. ఈ ఉపజాతిసంతతివారే నేటి 'అరబ్బులు' 'మూరులు'. పూర్వకాలపు 'పెరిషియన్లు' వారిసంతతికి చెందిన 'ఇరాని యన్లు' 'పార్శీలు' మూడవది అయిన 'ఇరానియను' ఉపజాతికి చెందియున్నారు. నాల్గవఉపజాతికి 'సెల్టులు' పూర్వకాలపు 'గ్రీకులు, 'రోమన్లు' నేటి 'ఇటాలియన్లు' ఫ్రెంచివారు, 'స్కాట్సు' 'వెల్షు' (Welsh) మొదలైన వారు చెందుదురు.

'స్లావులు, స్కాండినేవియన్లు, డచ్చి, జర్మన్లు, ఇంగ్లీషు వారును' వీరిసంతతివారును కూడ 5 వ ఉపజాతిఅయిన 'ట్యుటానిక్కు' ఉపజాతికి చెందినవారు. అనేకోపజాతులను కలిపి 6వ ఉపజాతిని మనువు ఇప్పుడు తయారుచేయుచున్నాడు. దానికి మేము 'ఆస్ట్రలు-అమెరికన్' అని నామకరణము చేసితిమి. ఈజాతి ఇప్పుడు 'యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా' లోను, ఆస్ట్రేలియాలోను, న్యూజీలాండులోను రూపొందు చున్నది. ఏడవ ఉపజాతి బహిర్గతమగుట కింకను చాల కాలము పట్టును. కాని దాని చూచనలు అత్యల్పముగా బ్రెజీలు దేశములో కొద్దిమందిపిల్లల ముఖవర్చస్సులో పొడ గట్టుచున్నవి. వీరిని 'లాటిన్-అమెరికన్'జాతి అని పిలువ వచ్చును. 6 వ మూలజాతిమనువు (సూర్యసావర్ణి) తన జాతికి వి త్తనములను 5 వ మూలజాతిలోని 6 వ ఉపజాతినుండి తీసి కొనును. కొన్ని లక్షల సంవత్సరముల తరువాత 7 వ మూల

జాతిమనువు తనమూలజాతిని 6 వ మూలజాతియందలి సప్తమోపజాతినుండి ఎంచి తయారుచేయును.

తన పిల్లలయిన మానవులను వారి కనుభవము నిచ్చుకొఱకే మూలజాతులలోను ఉపజాతులలోను జన్మించునట్లు చేయవలె నని ఈశ్వరుని సంకల్పము. ఈ రూపముగా ఈశ్వరుని లీలానాటకములో, మూలజాతులు, ఉపజాతులు తమ పాత్రల నిర్వహించుచున్నవి. ఇందుకొఱకే 'మనువు' శరీర లక్షణములలోను రంగులలోను భేదములను కల్పించి, మానవులు పర్వతప్రాంతములలోను సముద్రప్రాంతములలోను పుట్టునట్లు చేయుచుండును. ఇందుకొఱకే 'బోధిసత్త్వులు', వివిధోపజాతులకు ఒకే సత్యమును, వారి పర్యవేక్షణకింద,

## జాతుల లక్షణములు

| | అట్లాంటియన్ | | ఆర్యన్ |
|---|---|---|---|
| 1 | ర్మొఅహాల్ - మహాకాయము - ఎరుపు | 1 | హిందు - తాత్త్విక<br>ఈజిప్షియను - క్రియాత్మక |
| 2 | ట్లవట్లి - కొండవాడు-ఎరుపునలుపు మిశ్రమం | 2 | ఆర్యన్ సెమైటు - తెగలు సంబంధించిన |
| 3 | టాల్టైక్కు - పరిపాలకులు-రాగి-ఎరుపు | 3 | ఇరానియను - వ్యాపారం |
| 4 | టురేనియను-వలసపోవు-పసుపుపచ్చ | 4 | సెల్టిక్కు - భావోద్రేక ఆదర్శప్రియ |
| 5 | అసలుసెమైటు - యోధులు - తెలుపు | 5 | ట్యుటానిక్కు వాణిజ్య వైజ్ఞానిక. వ్యక్తిత్వ |
| 6 | అక్కేడియను- నౌకావాణిజ్యం-తెలుపు | 6 | ఆస్ట్రల్ - అమెరికను సమాజజ్ఞానము సహకారము - సోదర భావము |
| 7 | మంగోలియను-కర్షకులు-పసుపచ్చ | | |

(27 వ పటము)

కాలముగడపుచు ఒకవిధమైన ధైర్యస్థైర్యముల కలవడును. 'ఇరానియను'గ పుట్టి వణిగ్జీవితము జయప్రదముగ కొనసాగించుటకు చేయుప్రయత్నములద్వారా కొత్తసంగతులు కనిపెట్టుశక్తి, కష్టపడి పనిచేయుట, ఋజువర్తనము, ఉత్సాహముగనుండుట మొదలైనవి నేర్చుకొనును. ఎక్కువగ మాటలాడలేకపోవచ్చును; యోజనాశక్తిలో నెక్కువసమర్థత కనపడకపోవచ్చును; కాని అతనిలో కవిత్వధోరణి లేకపోయినను, అతని భావములు రసవంతముగ నుండుటవలన తద్దీత్యా నూతనవిషయములను నేర్చుకొనఁగలుగును. 'సెల్టు'లలో జన్మించి గ్రీకుదేశస్థుఁడుగా జీవితమునుగూర్చిన అనేక నూతన భావములకు లోనగును." భూమిపైన, సముద్రముపైన దేవత లున్నారని నమ్మచు తానువారి సంతతికి చెందినవాఁడననియు, జీవితము నొకకళగా చేసికొనుటయే తనప్రధానోద్దేశమనియు, అందువలన ప్రతివిషయమునుగూర్చి ఏదో కొంత నేర్చుకొనుట తన లక్ష్యమనియు, ఎంచుచు సహృదయత, సుస్వభావము వృద్ధి చేసికొనును; లేదా 'రోము' దేశములో పుట్టి, మత కుటుంబ ప్రభుత్వవ్యవస్థ లన్నియు సమానముగా గౌరవింపతగిన వని విశ్వసించుచు చట్టములబద్ధమైన జీవితము గడపుచు తద్వారా పరిపాలనాక్రమమును నేర్చుకొనును. 'ఫ్రెంచి' దేశములోనో 'ఇటాలియ'ను దేశములోనో పుట్టి, సులభముగ ఆ వేశమునకు లోనగుచు. భావోద్రేకపరులై భౌతికప్రయోజనములతో నిమిత్తము లేకుండ కేవలము భావములకే దాసుఁ డగుచుండును. తదుపరి 'ఐర్లండు'లో

ప్రక్షి, ఉత్సాహనిరుత్సాహములకు తలుచు లోనగుచు స్వప్నములు, ఆత్మపరిబోధము గలిగిన జీవితము గడపును.

'స్కాండినేవియా' లేక 'ఇంగ్లండు', లేక 'అమెరికా' దేశములలో 'ట్యూటానిక్' ఉపజాతిలో జన్మించి, వాస్తవిక దృక్పథము, శాస్త్రపరిశోధనాఫలితమైన నిష్పాక్షికత, వ్యాపారానుభవములవలన కచ్చితము, వ్యక్తిస్వాతంత్ర్యము మొదలగు సద్గుణములను సంపాదించును. ఈ జీవికి త్యాగరాజ నటరాజ కాళిదాసులు మొదలైన కళానిపుణులు వినూత్నమైన జీవిత సందేశ మీయలేరా?

ఇప్పుడిప్పుడే అమెరికాలోను, ఆస్ట్రేలియాలోను, న్యూజిలాండులోను బయలుదేలుచున్న 'ఆస్ట్రలు-అమెరికన్' జాతిలక్షణములను కొన్నిటి మన మూహింపవచ్చును. తల్లిదండ్రులకు పిల్లలకు మధ్య 'సోదరభావ'ము సూచించు నూతన దృక్పథ మేర్పడుట, వ్యాపారములలో సహకారపద్ధతి విరివిగా ప్రవేశపెట్టబడి, వ్యాపారముల మేళవింపులకు కలయికలకు ఎక్కువ ప్రోత్సాహము నిచ్చుచు తద్వారా భౌతికసంపదభివృద్ధి చేయబడుట, ప్రాంత సంప్రదాయములకు కట్టుపడక నూతనభక్తిని అంతర్వాణిపరిబోధముతో శక్తివంతముగ ప్రపంచసమస్యల నెదుర్కొనుట, సంఘములుగ కూడి గాలిలోను, ఎండలోను ఎక్కువకాలము గడపుట, మొదలగు లక్షణములు వారిలో నుండును.

ఇక ఏడవ ఉపజాతిసంగతి ఏమైయుండును? ఇది ఇంకను కాలగర్భముననే దాగియున్నను, సంగీతము, పద్యరచన, గృహనిర్మాణము మొదలగువానియందు లేటిన్ అమెరికాలో నేడు కనపడుచున్న, ఆసక్తియే ఏనాడో

రాఁబోవు ఏడవ ఉపజాతియొక్క లక్షణము లని దృశ్యా దృశ్యముగ తలంపవచ్చును. ఒకనాఁడు మహావైభవ మనుభవించియు నేఁడు అదృశ్యమైపోయిన గ్రీకు, రోమను నాగరికతలు ఈ సందర్భములో జ్ఞాపకమువచ్చుచున్నవి. ఏడవ ఉపజాతి కాలగర్భమునుండి బైటకు వచ్చి ఉచ్చస్థితి వచ్చిననాఁడు గ్రీకులు, రోమన్లు కలలుకూడ కనియుండని సమగ్రజీవితము ఆనాఁటి ప్రజ లనుభవించెదరు. అప్పుడు తనహృదయములోను మనస్సులోను నిబిడీకృతమై యున్న సౌందర్యాలగనిని, కని, భగవదంశసంభూతుఁడ నని, సృష్టి ద్వారా తాను దివ్యత్వమునుబడయఁగల నని మానవుఁడు గ్రహించును.

ఈవిధముగా నాగరికతల క్షీణౌన్నత్యము వలన మానవుని సుగుణములు క్రమక్రమముగా వృద్ధిచెందును. ఈవిధానమునకే 'పునర్జన్మ' యని నామకరణమిడిరి. జన్మ పరంపరలలో మన పరిణామమున కవసరమగు అనుభవముల నిచ్చి శిక్షణ గఱపుటమాత్రమే వచ్చి పోవుచున్న నాగరికతల ఉద్దేశమైయున్నది. ఈశ్వరుఁడు ఈ నాగరికతల నన్నిటిని, దుమ్మునుండి సృష్టించి వానిపాత్ర నవి ఔచిత్యముతో నభినయించునటుల ఏర్పఱిచి, తుదకు సముద్రగర్భములో ముంచియో, మంటలలో కలపియో వానిని నాశనము చేయును. అవన్నియు, ఆయనబిడ్డలమైన మనకొఱకు ఆడించిన జగన్నాటకములోని వివిధరంగములు. మనము మన పాత్రలను నుచితరీతిని నిర్వహించి ఏనాఁటికైన తనంతటివార మగుదు మని ఈశ్వరుని ఆశయము.

—✿—

# 3 అధ్యాయము

## పునర్జన్మ సూత్రములు

పది, పదేను వేల సంవత్సరముల కొకసారి హఠాత్తుగ నొక మహా శక్తివంతమైన నూతన్న భావ ముదయించును. దానితో పాటే ఒక నూతనశకము ప్రారంభమగును. క్రిందటి శతాబ్దములలో నట్లుదయించిన మహత్తరభావము పరిణామసిద్ధాంతము. అంధకారమందలి మెఱుపువలె దాని కాంతి మూల మూలలకు ప్రసరించినది. అప్పటినుండియు మానవుఁడు ప్రకృతి కేవలము నిర్హేతుకమైనదికాదని దాని కార్యాచరణవిధానము చూచి గ్రహింపఁగలిగినాఁడు. అటులనే ఏనాఁడో సృష్ట్యారంభదశలో 'పునర్జన్మ' సిద్ధాంతము ఉద్భవించినది.

'పునరపి జననం పునరపి మరణం'తో కూడిన విధానమే పునర్జన్మ. ఈ సిద్ధాంతరీత్యా, జీవి, ఒకదాని తరువాత నొకటిగా అనేకశరీరములను గ్రహించుచు వానిలో కలిగిన అనుభవములద్వారా క్రమక్రమముగా, సమగ్రమైనట్టి, ఉత్కృష్టమైనట్టి, సంకల్పభావనాశక్తుల వికాసముద్వారా పరిణామము చెందుచుండును. పరిణామము అనఁగా ఉపాధి, జన్మపరంపరలలో క్రమేణా అంగనిర్మాణము క్లిష్టమగుచు అభివృద్ధిచెందుట. ఈ రెండు సిద్ధాంతములు (పరిణామ – పునర్జన్మములు) జగన్నిర్మాతకు కుడి ఎడమ భుజముల

వంటివి. ఇందులో ఏ ఒక్క సిద్ధాంతమునవలనను ప్రపంచ సమస్య పూర్తిగా పరిష్కారముకాదు. ఈ రెండు సిద్ధాంతములు అవిభాజ్యమని ఒకదాని కొకటి అనుబంధ మని ఎంచినచో మానవుడు తన పరిణామముతోపాటు ఈ భావము కూడ వికాసము చెందుచున్నదని గ్రహింపఁగలఁడు.

'పునర్జన్మ' అను భావము మానవలోకమునకే చెందిన దని సాధారణముగ అనుకొన్నను, నిజముగా నది యావత్ప్రాణికోటికి సంబంధిచిన దయియున్నది. ఎండిపోయిన గులాబిమొక్కలోని 'జీవకళ' తన ప్రత్యేకవర్గమునకు సంబంధించిన 'సమూహాత్మ'లో చేరి వేఱొక గులాబి మొక్కగ పుట్టును. ఒక జాతికి చెందిన కుక్కపిల్ల చనిపోయినపిదప తన వర్గమునకు సంబంధించిన 'సమూహాత్మ'లో కలిసిపోయి తిరిగి ఇంకొకజాతిలో జన్మించును. మానవుఁడు మాత్రము 'ప్రత్యగాత్మ' కావున ఎట్టి 'సమూహాత్మ'కు చెందఁడు; కాని పూర్వజన్మలలో సంపాదించిన శక్తిని ఇతరులెవ్వరికి పంచిపెట్టఁడు. అందువలన అది తరిగిపోదు. క్రొత్తజన్మ ఎత్తి ఆ అనుభవములను, ఆ శక్తులను తన వెంట తెచ్చుకొనును.

సాధారణపరిభాషలో పునర్జన్మసిద్ధాంతము మానవులకు మాత్రమే పరిమితము చేయఁబడినది. అది ఈదిగువ నిర్వచింపఁబడిన మూఁడు విధములలో ఏదో ఒకవిధముగ గ్రహింపఁబడుచున్నది.

(1) పుట్టుకతోపాటు క్రొత్తగా మానవునికి ఆత్మ ప్రసాదింపఁబడదు. తత్పూర్వమే, ఆత్మవస్తువు ఒకవిధమైన ఆధ్యాత్మికస్థితిలో వ్యక్తమై యుండును. ఒక్కసారిమాత్రమే మానవజన్మ ఎత్తును. అదే అంతిమదశ అని కొందఱి అభిప్రాయము దీనినే ప్రీఎక్సిస్టెన్సు (Preexistence) సిద్ధాంతము నెదరు.

(2) ఆత్మ, కొంతకాలము మానవశరీరములోను, కొంతకాలము వృక్ష జంతూపాధులలోను ఇదివఱలో ఉండియున్నది. అప్రకారముగనే మరణానంతరము, మానవ జన్మ ఎత్తుటకు పూర్వము ఆత్మ జంతువృక్షరూపములలో జన్మలు తిరిగి ఎత్తవచ్చును. (దీనిని 'మెటిమ్సైకోసిస్' సిద్ధాంత మందురు. (Doctrine of Metempsychosis).

(3) ఆత్మ 'వ్యక్తీకరణా'త్పూర్వము జంతువృక్షవర్గములలో పుట్టును. కాని అటుతరువాత మానవశరీరములోనే పుట్టుచుండును. ఒకసారి మానవశరీరధారిగా జన్మించుసరికి శాశ్వతచైతన్యముతో కూడిన 'ప్రత్యగాత్మ' యగును. కావున తిరిగి వృక్షజాతిలోఁ గాని జంతుజాతిలోఁ గాని ఇంక పుట్టదు. మానవజాతిలోనే జన్మించుచుండును. దీనినే పునర్జన్మసిద్ధాంత మనెదరు.

ఒకసారి మానవుఁడుగ జననమొందిన 'ఆత్మ' తిరిగి వృక్షజంతువర్గములలో నెన్నఁడు పుట్టదని దివ్యజ్ఞానము బోధించుచున్నది. కావున దివ్యజ్ఞానసమాజమువారు పైచెప్పఁబడిన త్రివిధములలో మూఁడవ విధానమును అనుసరించుచు

న్నారు. ఆధునిక దివ్యజ్ఞానసారస్వతములో 'పునర్జన్మ' యనఁగా 'వృక్షజంతువర్గములలో' తిరిగి జన్మించుట యన్నది కానే కాదు. ఇట్లు వృక్షజంతువర్గములలో తిరిగి పుట్టుట సంభవించు నెడల ఇది 'తిరోగతి కాఁగలదు.' ఇదే నిజమైనచో 'ఆత్మ'కు పరిణామమునలన ప్రయోజనము లేదని యే చెప్పవలసియున్నది.

ఇది దివ్యజ్ఞానపాఠ్యగ్రంథము గావున 'పునర్జన్మ' సిద్ధాంతమునుగూర్చిన వాదప్రతివాదముల కిచ్చట తావు లేదు. విజ్ఞానశాస్త్రపరిశోధకుఁడు పరిణామవిధానమును పరీక్షాపరిశీలనలద్వారా ఎట్లు కనుఁగొనునో అటులనే 'జిజ్ఞాసువులు, పునర్జన్మ' సిద్ధాంతవిశేషములను తమకు తామె తెలిసికోఁగలరు. యోగశాస్త్రపరిశోధనలద్వారా కనిపెట్టఁబడిన సూత్రముల ననుసరించి 'జీవి' ఏప్రకార మనేకజన్మముల నెత్తుచుండునో ఆసూత్రములను ఈ అధ్యాయములో వివరించితిని.

అనేకజన్మ లెత్తుచున్న దేది లేక ఎవరు? అన్న విషయమును గూర్చి మొట్టమొదట మనము స్పష్టముగ తెలిసికొనవలసియున్నది. ఇందుకొఱకు ఆత్మ యనఁగా నేమి? వాని ఉపాధులు లేక ఉపకరణములు ఎట్టివి అని కూడ తెలిసికోవలసియున్నది.

మానవాత్మ యనునది ఒకవిధమైన అదృశ్యపదార్థముతో నిర్మింపఁబడిన ఉపాధిలో నివసించెడు, శాశ్వతవ్యక్తిగతచైతన్యము ఒకవిధమైన ఉత్తమమానసికపదార్థము కలిగియున్న ఆత్మోపాధినే ఆధునికదివ్యజ్ఞానసారస్వతములో

కారణశరీర మనెదరు. ఇది మానవాకృతి కలిగియున్నను, దేవతాసాంప్రదాయమునకు చెందినది. దీనికి స్త్రీపురుష లక్షణములు రెండును లేవు దీనిని 'అగాయిడిస్' (Augoides) అందురు. ఇది కోడిగుడ్డు ఆకారము గలిగి అగ్నిహోత్రము వంటి తేజోమయపదార్థముచే ఆవరింపఁబడి యుండును. ఈ పదార్థము సూర్యాస్తమయంలో ఆకసమందుకనపడు లేఁత ఛాయలకన్న బహుసునిశితమైనది. ఈ కారణశరీరమే 'ఆత్మ'కు శాశ్వతనివాసస్థానము. 'ఆత్మ'పనిచేయు అన్నిలోకములలోని అత్యుత్తమమైన సంకల్పములకు, భావములకు, క్రియలకు, జన్మస్థానము, కారణభూతము ఇదే గనుకనే దీనిని 'కారణశరీర' మనెదరు. ఈ 'కారణశరీరము' శాశ్వతుఁడు అమృతుఁడు అయిన 'ఆత్మ'కు నివాసస్థానము. 'ఆత్మ'కు చావుపుట్టుకలు గాని, బాల్యయౌవనజరావస్థలు గాని లేవు. యుగములు గడచిన కొద్ది ఇతనిలో, ప్రేమసంకల్పక్రియా శక్తులు వృద్ధిపొందుచుండును. తాను సంపాదించిన అనుభవములద్వారా కొన్నివిషయములలో పరిణత సంపాదించుచు, ఈశ్వరప్రణాళికావిజయమునకు సహకరించుచు తద్వారా ఆనందానుభూతి పొందుటకు, తాను శాశ్వతమైన జీవితము గడపుచుండును.

| ఆత్మయొక్క ఉపాధులు | | | | |
|---|---|---|---|---|
| మానసిక లోకము | శుద్ధ మానసిక | కారణ శరీరము. | పరిణామం చెందుటకు | ఆదర్శములు / అరూప సంకల్పములు |
| | అశుద్ధ మానసిక | మానసిక శరీరము | ఆలోచన చేయుటకు | అభిప్రాయములు / రూప సంకల్పములు |
| కామలోకము | | కామ శరీరము | భావములు పొందుటకు | భావములు / కోరికలు |
| స్థూలలోకము | | భౌతిక శరీరము | కర్మ చేయుటకు | ఇంద్రియసంచలనం / కార్యకలాపములు |

(28 వ పటము)

తా నుండు లోకమునకు క్రిందిలోకములలో జీవితము ప్రయోగాత్మకముగా గడపుటద్వారా ఆత్మ అభివృద్ధిచెందుట ప్రారంభమగును. అందుకొఱకు 'పునర్జన్మ'. అనగా

(1) తాను నీచమానసికపదార్థమును ప్రోగుచేసి మానసిక శరీరమును రూపొందించుకొనును. ఆ శరీరముతో ఆలోచనలు సల్పుచుండును. అనగా బాహ్యప్రపంచవిషయములను, సంకల్పసూత్రముల రూపేణా గ్రహించుచుండును.

(2) భావోద్రేకములకు ఆలవాలమైన కామశరీరమును, కామపదార్థము ప్రోగుచేసి తయారు చేసికొనును. బాహ్యప్రపంచమును వ్యక్తిగతవాంఛాభావముల స్వరూపమున గ్రహించుట కిది ఉపయోగించును.

(3) ఇతని కార్యకలాపములకు సరిపడిన స్థూలశరీర మితని కొసఁగఁబడును. ఆ శరీర ముపయోగించి పదార్థముల గుణములైన శీతోష్ణములు, గురులఘుత్వములు, చర స్థిరములు మొదలగు వానిరూపేణా ప్రపంచమును తెలిసికొనఁగలుగును.

ఆత్మ, పై చెప్పినవిధముగా ఈమూఁడు శరీరములు ధరించువిధానమును, 'పునర్జన్మ' సిద్ధాంత మందురు.

స్థూలశరీరము సజీవముగ నున్నప్పుడు, నరములను చలింపఁజేయు ప్రతిస్పందము మొట్టమొదట మెదడులో నొక విధమగు సంచలనమును కలుగఁజేయును. ఈ సంచలనముల ఇష్టానిష్టములను గ్రహించునది కామశరీరము, కామశరీరానుభవములను మానసికశరీరము తెలిసికొనును. ఇట్లు తెలిసికొనుటను 'సంకల్ప' మందురు. ఈ సంకల్పమును చివరకు 'కారణశరీరనివాసి'అయిన ఆత్మ గ్రహించును. మనోమయకోశముద్వారా కామశరీరమునకు, తద్వారా మెదడునకు, 'ఆత్మ' స్థూలప్రపంచవిషయములను తెలియఁజేయుచుండును. తెలివిగనున్న ప్రతిక్షణము కారణశరీమునుండి పైకి క్రిందికి తంతివార్తలు ప్రసారమగుచునే యుండును. ఈ రీతిగా అనేక భావములను సేకరించి ఆత్మ వానినన్నిటిని క్రమప్రకారము

విభజించి పట్టిక తయారుచేసి చివఱకు ఇట్టి అనుభవముల నన్నింటిని క్రోడీకరించి ఆదర్శములను నిర్మించుకొనును. ఈ రూపేణా 'ఆత్మ' ప్రపంచవిషయములను 'శాశ్వతభావ రూపములుగా' మార్చి తనలో అంతర్లీనము చేసికొనును.

ఆత్మ తన శాశ్వతనివాసమునకు, మరలి వెళ్లిపోవు విధానమును మరణ మందురు. దీని వలన కారణశరీరములోని ఆత్మలో ఏవిధమైన భేదము కలుగదు. మొట్టమొదట ఆత్మచే స్థూలశరీరము త్యజింపఁబడును. అందువలన బాహ్యప్రపంచ విషయావగాహన యుండదు. కాని కామమానసికశరీరములు పనిచేయుచునేయుండును. తదుపరి ఆత్మ కామశరీరమును త్రోసిపుచ్చును. అప్పుడు భువర్లోకవిషయానుభవ ముండదు. చివఱకు మానసికశరీరమునుకూడ విసర్జించును. అట్లన్ని తొడుగులను విడిచి, ఆత్మ నిజస్వరూపమునందు కారణశరీరము నందు తిర్గిప్రవేశించును. (6 వ అధ్యాయములో ఇందును గూర్చి ఎక్కువవివరము లిచ్చియున్నాను).

ఆత్మ తిర్గి స్వగృహము చేరుకొన్నది. వాస్తవమునకు ఆత్మ కారణశరీరమును పూర్తిగావదిలి వెళ్లలేదు. తన ఇచ్ఛా చైతన్యములలోని స్వల్పాంశము మాత్రము తన క్రింది ఉపాధులలో కేంద్రీకరించెను. దీనికే 'పునర్జన్మ' అని శాస్త్రజ్ఞులు నామకరణము చేసిరి. ప్రతిజన్మలోను ఉపాధులను, తన కవసరమున్నంత మేరకు ఉపయోగించి తదుపరి వానిని ఒకదాని తరువాత నొకటి త్యజించును. మనము జననమరణములని

అనునవి, ఆత్మకు స్వచైతన్యాంశసంబంధములగు ప్రవృత్తి నివృత్తులు.

ఆత్మలు స్థూలశరీరముధరించుట వానిలో జీవించుట వానిని త్యజించుట తదుపరి కామమానసికశరీరములనుండి విడివడి తిరిగి కారణశరీరములో పరిపూర్ణమైన స్వస్వరూపములో నివసించుట మొదలగు నంశములు పునర్జన్మసూత్రము నర్థముచేసికొని సిద్ధాంతీకరించుటకొఱకు పరిశీలనముచేయ వలసియున్నది. ఈ విధానమునందు జరుగు ప్రతికార్యము 'ఈశ్వరస్మృతిఫలకము'పై లిఖింపఁబడును. ఆ స్మృతిఫలకమునువీక్షింపఁగల పరిశోధకులందఱు, జీవాత్మల జన్మపరంపరల నవసరమైనప్పుడు కనిపెట్టి తెలిసికోఁగలరు.

ఇదివఱకే ఇట్టిరీతిని పరిశోధనలు సలిపి, సూత్రములఁ బడయుటకు సరిపడిన విషయములను సమకూర్చియుంచిరి. జీవుల వివిధరీతులనుబట్టి పునర్జన్మసూత్రములలో తేడాయుండు నన్న విషయము ఈ సిద్ధాంతములో ప్రధానాంశమైయున్నది. ఏ ఒక్కకాలములోను ఆత్మ లన్నియు సమానమైన శక్తి కలిగియుండవు. వీనిలో వయోభేదము గలదు. ఇందులో కొన్ని వార్ధకమున మఱికొన్ని యువకదశలోను కొన్ని శైశవములో నున్నవి. (7 వ అధ్యాయములో ఈ వయోభేదమునకు తగిన కారణములను వివరముగా తెలిపెదను). ఒక్కొక్క జన్మలో పొందిన అనుభవములద్వారా ఆత్మ క్రమేణా అన్నిరంగములలో అభ్యుదయము చెందుటయే 'పునర్జన్మ'లక్ష్యము. ఈ పరిశోధనలలో తేలినవిషయములను

బట్టి, ఆత్మలు, కొన్ని తొందరగను, కొన్ని నెమ్మదిగను స్వానుభవముద్వారా పాఠములను నేర్చుకొనఁగలవు. ఒక్కొక్క అనుభవముద్వారా పాఠము నేర్చుకొనుటకు నెమ్మదియైనజీవులు, అనేకజన్మ లెత్తవలసి యుండును. దీనికి వయోభేదమే కారణము. వృద్ధాత్మ గ్రహింపఁగలిగినంత తొందరగ యువకాత్మ గ్రహింప లేదు. ఈ వయోభేదమును బట్టి జీవులను అయిదుతరగతులుగా విభజించిరి.

**పునర్జన్మ ఎత్తు వివిధ రకముల జీవాత్మలు.**

1. **జీవన్ముక్తుడు** (నిరుద్ధ) – జన్మలు అవసరము లేదు.
2. **"శిష్యపథము"** (ఏకాగ్ర) – గురువు పర్యవేక్షణలో తక్షణమే తిరిగి జన్మ ఎత్తును. స్వర్గలోక జీవితాన్ని త్యజిస్తాడు
3. **విజ్ఞాని** (విక్షిప్త) –
   (అ) ఒక్కొక్క ఉపజాతిలో రెండుసార్లు జన్మఎత్తును. సగటున 1200 సం॥ములు స్వర్గలోకంలో గడుపును
   (ఆ) ఒకే ఉపజాతిలో రెండుసార్లుకన్న ఎక్కువసార్లు జన్మించును స్వర్గలోకంలో సగటున 700 సం॥లు గడుపును.
4. **అమాయకుడు** (మూఢ)
5. **ఆటవికజాతి** (క్షిప్త)
   } ఒక్కొక్క ఉపజాతిలో అనేకసార్లు జన్మించును.

(29 వ పటము)

హింసాపూర్ణములు మోటునైన కోరికలను నిరోధించుటకు తగిన మానసికాభివృద్ధి లేనివారినే శైశవావస్థయందలి జీవు లందురు. ఈ తరగతివారే ప్రపంచములోని కోయ జాతులు, ఆటవికులు, అనాగరికులు, నేరములొనర్చు జాతులు (29 వ పటములోని 5 వ తరగతివారు). వీరికంటె కొద్దిగా

అభివృద్ధి చెంది ఆటవికస్థితిని దాటియు ఇంకను అమాయిక స్థితిలోనుండి అవగాహనశక్తిలేక స్వతంత్రించి పనిని ప్రారంభముచేయఁగల సమర్థతలేనివారినే 'అమాయికులు' 'మూఢులు' అందురు (29 వ పటములోని 4 వ తరగతి). ప్రపంచములో నూటికి తొంబదిమంది ప్రజలు ఈ రెండు తరగతులకు చెందియున్నారు.

తమ బుద్ధిని తెలివితేటలను కుటుంబ ప్రాంతీయదృక్పథములతో సంకుచితపఱుపక, ఒక ఆదర్శమును కాంక్షించుచు బుద్ధిపూర్వకముగా అట్టి ఆదర్శసిద్ధి వాంఛించుచు పనిచేయుచున్న విజ్ఞానవేత్తలు విద్యాధికులు 29 వ పటములోని మూఁడవతరగతికి చెందినవారు. జీవితోద్దేశము, 'స్వార్థత్యాగము' 'ఆత్మార్పణము' అని తెలిసికొని 'శిష్యపథము'లో పోవుచు ఎఱుక కలిగి వారిభవిష్యత్తును రూపొందించుకొనఁగలరు. ఇట్టివారు చాల అరుదు (29 వ పటములోని రెండవతరగతివారు). మానవవృక్షముపై వికసించుచున్న అపురూపమైన పుష్పములు జీవన్ముక్తులు. వీరు జ్ఞానసంపూర్ణులు. వీరే పృథ్వీతలమున భగవత్ప్రతినిధులుగా, తమ ఛాయను ప్రసరింపఁజేయు జ్యేష్ఠసోదరబృందము. వీరు ఈశ్వర సంకల్పానుసారముగ పరిణామమును నడపించుచున్నారు (29 వ పటములో మొదటివారు).

పునర్జన్మలు ఉపజాతులలోనే కలుగుచుండును. పునర్జన్మసూత్రములు పనిచేయువిధానమును తెలిసికొనఁదలఁచినచో మొదటి రెండుతరగతులలోనివారిని అందుండి తగ్గింప

వలసియున్నది. జీవన్ముక్తునకు పునర్జన్మావశ్యకత లేదు. అనుభవముల నన్నింటిని పూర్తిగా పొంది యతఁడు పరిపూర్ణుఁడైనాఁడు. మానవుని నిర్మాణము చేయుటలోఁగల ఉద్దేశమును పూర్తిగా నతఁడు నెఱవేర్చినాఁడు. అతఁడు ఈశ్వరాలయములో నొక స్తంభమునంటివాఁడైనను ఇట్టి వారిలో చాలామంది స్వచ్ఛందముగ మానవజన్మలనెత్తి, ప్రజామధ్యమున తిరుగుచు, వారికి సలహాల నిచ్చుచు, మార్గదర్శకులుగనుండి వారందఱి ముక్తికొఱకు కృషి సలుపుచుందురు. జీవన్ముక్తుఁడు తన భావిని స్వయముగ తానే నిర్మించుకొఁగల సమర్థుఁడు. కాన అతఁడెచ్చట ఎప్పుడు జన్మించునది స్వయముగ నిర్ణయించుకొనును.

మోక్షమార్గాన్వేషులు, శిష్యవర్గమునకు (2 వ తరగతికి) చెందెదరు. వీరు మరణానంతరము కొద్ది మాసములకో సంవత్సరములకో నూతన స్థూలశరీరములతోను, పూర్వపు కామమానసికశరీరములతోను తిరిగి జన్మింతురు. సామాన్యముగ స్థూలకామమానసికశరీరము లొకదాని వెనుక నొకటి పతనమగును. స్థూలకామశరీరముల పతనానంతరము జీవి సువర్లోకములో కొన్నివందల సంవత్సరముల కాలము గడపును. ఈ స్వర్గలోకమును దివ్యజ్ఞానసమాజమువారు 'దేవభాన్' అని యందురు. జీవి తన ఈప్సితార్థములు నెఱవేర్చుకొనుచు 'దేవభాన్'లో చాలకాలము సుఖముగ జీవితము గడుపుచు కొన్ని వందలసంవత్సరము లీ ఆనందములో కాలముగడుపగా జీవి చేసికొన్న పుణ్యము క్షీణించును.

అప్పుడు మానసిక శరీరమును, కూడ పరిత్యజించును. అంతటితో ఆ అవతారము సమాప్తమగును. అంతట జీవి, తాను పొందవలసిన అనుభవములను ఆదర్శప్రజ్ఞల రూపముగ మార్చి వానితో సహ కారణశరీరములో ప్రవేశించును. కాని జీవి ఇంకను, సంపూర్ణతఁబడయనందున, తిరిగి మూఁడు క్రొత్తశరీరములు ధరించి మరల జన్మమెత్తును.

శిష్యుని పరిణామపద్ధతి, ఈ సాధారణపరిణామవిధానమునకు, మినహాయింపుగా నెంచవలసియున్నది. భూలోకమున తన గురుదేవుని కార్యకలాపములను నిరాటంకముగ కొనసాగించుకొఱకు శతాబ్దములతరబడి ఆనందములో గడపవలసిన స్వర్గలోకజీవితమును అఁతడు స్వచ్ఛందముగ వదలుకొనును. అందుకొఱకు తాను న్యాయముగ పొందవలసిన ఆనందమును, మానవసేవాతత్పరత కలిగి త్యాగము చేయును. ఇతఁడెక్కడ ఎప్పుడు పుట్టవలెనో అతనిగురుదేవుఁ డేర్పాటు చేయును. అందుకొఱకు భౌతికశరీరమునుమాత్రము నూతనమైనదానిని ధరించి పూర్వములగు కామమానసికశరీరములతోనే తిరిగి జన్మించును.

30–33 పటములలో తెలియఁబఱిచిన అంశములనుబట్టి 3–4–5 తరగతులవారికి సంబంధించిన పునర్జన్మసూత్రములను కనుఁగొనవచ్చును. ఈ పటములలో నలుగురు వ్యక్తులకు సంబంధించిన పూర్వజన్మవృత్తాంతములను పట్టికారూపములో చూపఁబడినది. ఈ నలుగురు వందలకొలఁది జన్మలెత్తియున్నారు. వారింతవఱకుఁ గడపిన జన్మలలో చివర గడపిన

కొన్ని జన్మలుమాత్రమే పరిశోధననిమిత్తము గ్రహించి పరిశీలింపఁబడినవి. ఈ నలుగురు విక్షిప్తమను (3 వ) తరగతి వారు. వీరి పరిణామమునుగూర్చి పరిశోధనలు చేయుటలో మిగిలిన రెండు తరగతులకు (4-5) చెందిన వ్యక్తులను గూర్చిన వృత్తాంతముకూడ కొంత తెలియఁగలదు.

ఈ పట్టికలలో తెలియఁబఱచిన స్థలము, కాలము, లింగము, జాతి జన్మలమధ్యకాలము మొదలగు అంశములను బట్టి యీక్రింది సూత్రములు తేలినవి.

(1) 'విక్షిప్త'మను తరగతివారిలో రెండు వర్గము లున్నవి. అందొకవర్గమువారిజన్మల మధ్యకాలము సగటున 1200 సంవత్సరములవఱకు ఉన్నది. (వీరు 30-31-33 పటము లలోని అ, క, గ వ్యక్తులు). రెండవ వర్గముజన్మల మధ్య కాలము సగటున 700 సంవత్సరములు (32 వ పటములోని 'చ' అను వ్యక్తి). జన్మల మధ్యకాలము చాలవఱకు దేవభాన్ లోకములోనే గడపెదరు. ఆ లోకములో వారు గడపవలసిన కాలపరిమితి వారి భూలోకజీవితములోని ఆశయశుద్ధి నిష్పత్తినిబట్టి యుండును. క్షిప్త మూఢములను (5-4) తరగతుల వారు భూలోకములో 60 సంవత్సరములకాలము జీవించి యున్నయెడల, దేవభాన్ లోకములో 5 వ తరగతివారు 5 మొదలు 50 సంవత్సరములవఱకును, 4 వ తరగతివారు సుమారు 2-3 శతాబ్దములును గడుపుటకు దగిన ఆధ్యాత్మిక శక్తి కలిగియుందురు. కాని, వీరు బాల్యయౌవనాద్యవస్థల లోనే మరణించినచో ఆధ్యాత్మికశక్తిసంపాదన తక్కువగా

| 'అ' అనువాని యొక్క 20 పూర్వజన్మలు<br>సగటు భూలోక జీవితము 60½ సం॥లు.<br>జన్మలమధ్యకాలము. సగటున 1208¼ సం॥లు. | | | | | |
|---|---|---|---|---|---|
| పుట్టిన ॥సం॥ | జన్మభూమి | జాతి | లింగము | వయస్సు | జన్మల మధ్యకాలము |
| క్రీ.పూ. 23650 | ఉ. అమెరికా | 4·1 | మగ | 56 | 929 |
| 22665 | " | 4·2 | " | 64 | 1135 |
| 21466 | పాశిడోనిస్ | 4·3 | " | 84 | 1826 |
| 19556 | బేక్ట్రియా | 4·4 | " | 71 | 1276 |
| 18209 | ఉ. ఆఫ్రికా | 4·5 | " | 69 | 1266 |
| 16874 | పాశిడోనిస్ | 4·6 | ఆడ | 51 | 1041 |
| 15782 | టూర్జరి | 4·7 | " | 85 | 1167 |
| 14530 | కేనడా | 4·1 | " | 57 | 819 |
| 13654 | పాశిడోనిస్ | 4·2 | మగ | 54 | 1505 |
| 12095 | పెరు | 4·3 | " | 82 | 2238 |
| 9775 | చైనా | 4·4 | " | 14 | 143 |
| 9618 | పాశిడోనిస్ | 4·5 | ఆడ | 54 | 1262 |
| 8302 | ఎట్రూరియా | 4·6 | " | 44 | 1241 |
| 7017 | ఈజిప్టు | 5·1 | మగ | 68 | 1314 |
| 5635 | ఇండియా | 5·1 | " | 47 | 1551 |
| 4037 | ఈజిప్టు | 5·1 | " | 70 | 1143 |
| 2824 | క్రీటు | 5·4 | " | 37 | 830 |
| 1907 | అరేబియా | 5·2 | " | 45 | 1338 |
| 524 | గ్రీసు | 5·4 | " | 70 | 2301 |
| క్రీ.శ. 1647 | ఇంగ్లండు | 5·5 | " | 87 | |

(30 వ పటము)

నుండి 'దేవభాన్'లో బహుస్వల్పకాలమే గడపెదరు. విక్షిప్త మను (3) తరగతివారి భూలోకజీవితము 60 సంవత్సరము లుండినయెడల వారు సాధారణముగ 'దేవభాన్'లో వెయ్యి మొదలు 1200 సంవత్సరముల కాలము గడపెదరు. అనఁగా వారిశక్తి ప్రజ్ఞగా మారుటకు అవసరమైనంత కాలము 'దేవభాన్'లో గడపెదరు. 3 వ తరగతికి చెందినవారిలో 32 వ పటములో చూపఁబడిన 'చ'వంటి వ్యక్తులతోకూడ నీచిన్నవర్గ మొకటి కలదు. వీరు కూడ 'దేవభాన్'లో 1200 సంవత్సరములు గడపుటకు తగిన ఆశయసిద్ధి సంపాదిం

చినవారేగాని బుద్ధిపూర్వకముగ తమ స్వర్గలోక జీవితమును 700 సంవత్సరములవఱకు తగ్గించుకొనిరి.

**క్రమవాని వెనుకటి 24 జన్మలు.**

భూలోక సగటు జీవితము 53½ సం॥లు.

జన్మల సగటు మధ్యకాలము 1017½ సం॥రంలు.

| పుట్టిన సం॥ | జన్మభూమి | జాతి | లింగము | ఆయుస్సు | జన్మల మధ్యకాలం |
|---|---|---|---|---|---|
| క్రీ॥పూ॥23875 | హవాయి | 4-2 | మగ | 60 | 837 |
| 22978 | మడగాస్కర్ | 4-2 | ఆడ | 57 | 713 |
| 22208 | మలాకా | 4-7 | " | 56 | 612 |
| 21540 | ద ఇండియా | 4-1 | " | 36 | 0 |
| 21504 | " | 4-2 | " | 48 | 0 |
| 21456 | " | 4-2 | " | 64 | 1775 |
| 19617 | బేక్ట్రియా | 4-4 | మగ | 71 | 1245 |
| 18301 | మొరాకో | 4-5 | " | 67 | 1006 |
| 17228 | పాసిడోనిస్ | 4-6 | " | 91 | 1447 |
| 15690 | టార్టరీ | 4-7 | " | 58 | 1125 |
| 14507 | కెనడా | 4-1 | " | 56 | 780 |
| 13671 | పాసిడోనిస్ | 4-2 | ఆడ | 38 | 1543 |
| 12090 | పెరూ | 4-3 | " | 85 | 2319 |
| 9686 | చైనా | 4-4 | " | 13 | 70 |
| 9603 | పాసిడోనిస్ | 4-5 | " | 39 | 1239 |
| 8325 | ఎట్రూరియా | 4-6 | " | 65 | 1502 |
| 6758 | టార్టరీ | 4-7 | " | 52 | 1007 |
| 5629 | ఇండియా | 5-1 | " | 62 | 1552 |
| 4015 | ఈజిప్టు | 6-1 | మగ | 71 | 1208 |
| 2735 | ద.ఆఫ్రికా | 5-2 | " | 48 | 809 |
| 1879 | పెర్షియా | 5-3 | " | 17 | 341 |
| 1521 | ఏషియామైనరు | 5-4 | " | 31 | 991 |
| 499 | గ్రీస్ | 5-4 | " | 76 | 2020 |
| క్రీ॥శ॥1597 | వెన్నీసు | 5-4 | " | 23 | 276 |
| 1896 | అమెరికా | 5-5 | " | | |

(31 వ పటము)

(2) పై పేరాలోని మొదటి వర్గమునకు చెందిన (1200 సంవత్సరముల దేవఖాన్ జీవితముగలవారు) విక్షిప్త వర్గమువారు, ఒకే మూలజాతికి చెందిన ఒకే ఉపజాతిలో అధమపక్షము రెండుసార్లయినను వరుసగా పుట్టెదరు.

30 వ పటములోని 'అ' అను వ్యక్తి అట్లాంటియన్ మూల జాతిలోని (4 వ మూలజాతి) మొదటి ఉపజాతిలో క్రీ. పూ 23650 లో జన్మించినాడు. వరుసగా ఆ మూలజాతి సంబంధములగు ఉపజాతులలో అతఁడు అనేకపర్యాయములు జన్మ లెత్తెను. 6 వ ఉపజాతిలో జన్మించుసరికి లింగభేదము కలిగెను. తదుపరి 7 వ ఉపజాతిలో పుట్టి తిరిగి 4 వ మూల జాతిలోని 1 వ ఉపజాతిలో పుట్టెను. ఈ సందర్భములో 2 వ ఉపజాతిలో నొకమారు 5 వ ఉపజాతిలో నొకమారు లింగభేదము కలిగెను. రెండవతూరి ఆ ఉపజాతులలోనే పుట్టెనుకాని 7 వ ఉపజాతిలో మాత్రము పుట్టలేదు. ఆ ఉప జాతిలో పుట్టి గడింపవలసిన గుణములను ఇంకొక ఉపజాతిలో సంపాదించిన కారణమున తిరిగి 7 వ ఉపజాతిలో పుట్టలేదు అని మనము గ్రహించుకోవలెను. ఇదివఱ కొకసారి 7 వ ఉపజాతిలో గడపిన జీవితముతో అతని కవసరములు తీరి పోయిన వని ఊహింపవలసియున్నది. ఆప్రకారమే ఒకే ఉప జాతిలో వ్యక్తి ఎక్కువసార్లు పుట్టినచో, తన జీవితోద్దేశము నెఱవేరుట కావ్యక్తికి అన్నిజన్మలు ఒకే ఉపజాతిలో అవసర మని ఎంచవలసియున్నది. పై చెప్పిన రెండవ వర్గమునకు చెందిన 'చ' అను వాఁడుకూడ ఏదో ఒక కచ్చితమైన విధానము ననుసరింపవలెను. కాని 32 వ పటములోని అంశ ములను పరికించినచో అట్టి నిరూఢవిధాన మేమియు తేలుట లేదు. ఇట్టివారి పూర్వజన్మవృత్తాంతము లింకను లోతుగా పరిశీలించినచో ఏదో ఒక సిద్ధాంతము తేలఁగలదు.

| చే అనువాని వెనుకటి 30 జన్మలు★<br>భూలోక సగటు జీవితము 72⅔ సం॥లు<br>జన్మల సగటు మధ్యకాలం 706 సంవత్సరములు | | | | | |
|---|---|---|---|---|---|
| పుట్టిన సం॥ | జన్మభూమి | జాతి | లింగము | వయస్సు | జన్మల మధ్యకాలం |
| క్రీ.పూ. 22662 | ఉ. అమెరికా | 4-2 | స్త్రీ | 84 | 819 |
| 21759 | ఇండియా | 4-6 | " | 17 | 275 |
| 21467 | " | 4-2 | పురుష | 85 | 808 |
| 20574 | " | 4 3 | " | 109 | 911 |
| 19554 | చైనా | 4 4 | " | 69 | 600 |
| 18885 | మధ్య ఏషియా | 5-1 | " | 79 | 597 |
| 18209 | పాసిడోనిస్ | 4-5 | " | 71 | 674 |
| 17464 | ఉ. ఆఫ్రికా | 5-1 | " | 60 | 528 |
| 16876 | మధ్య ఆసియా | 4-6 | " | 84 | 797 |
| 15995 | " | 5-1 | స్త్రీ | 58 | 535 |
| 15402 | ఇండియా | " | " | 79 | 772 |
| 14551 | " | " | " | 91 | 809 |
| 13651 | పాసిడోనిస్ | 4-2 | " | 82 | 692 |
| 12877 | ఇండియా | 5-1 | పురుష | 82 | 702 |
| 12093 | పెరూ | 4-3 | " | 90 | 821 |
| 11182 | ఇండియా | 5-1 | " | 71 | 682 |
| 10429 | " | " | " | 73 | 684 |
| 9672 | పాసిడోనిస్ | 4 5 | " | 86 | 811 |
| 8775 | ఇండియా | 5-1 | " | 83 | 840 |
| 7852 | " | " | " | 78 | 798 |
| 6986 | ఈజిప్టు | " | స్త్రీ | 77 | 945 |
| 5964 | ఇండియా | " | " | 17 | 312 |
| 5635 | " | " | " | 47 | 618 |
| 4970 | " | " | " | 69 | 866 |
| 4035 | ఈజిప్టు | " | " | 75 | 901 |
| 3059 | ఇండియా | " | పురుష | 81 | 798 |
| 2180 | " | " | " | 56 | 586 |
| 1528 | పర్షియా | 5-3 | " | 87 | 811 |
| 630 | ఇండియా | 5-1 | " | 71 | 1183 |
| క్రీ.వె. 624 | " | " | " | 70 | 1201 |
| 1895 | " | " | | | |

(32 వ పటము)

(3) లింగము మారుట విషయములో ఈ నలుగురి లోను చాల వ్యత్యాసములు కలవు. కొన్ని గుణములు పురుషుఁడై జన్మించియు, మఱికొన్ని గుణములు స్త్రీవలె జన్మించియు, సులభముగ గడింపవచ్చును. అందుకొఱకు

లింగభేదము ఉద్దేశింపఁబడినది. అనుభవములను ఇముడ్చుకొనుశక్తి వివిధజీవులలో భేదముగ నుండును. కావున జన్మలు గడచినకొలఁది అవసరములలోకూడ భేదము కలుగుచుండును. కావున స్త్రీరూపములోను పురుషరూపములోను ఎన్నిజన్మలెత్తవలెనో దానినిగుఱించి నిర్దిష్టమైన సూత్రములేమియు లేవు. స్త్రీపురుషులు ఏ ఒక వర్గములోను వరుసగ ఏడుసారులకు ఎక్కువగఁగాని మూఁడుసారులకు తక్కువగఁగాని పుట్టుట యుండదు. కాని ఈ పద్ధతికి మినహాయింపులు గలవు. 30 వ పటము చూచినయెడల 'అ' అను నతఁడు మొదట వరుసగా మూఁడుసారులు పురుషుఁడుగా

"ట" అనువాని తుది 17 జన్మలు
భూలోక సగటు జీవితము 56½ సం॥లు
జన్మల సగటు మధ్యకాలము 1221¼ సం॥లు.

| పుట్టిన సం॥ | జన్మభూమి | జాతి | లింగము | వయస్సు | జన్మల మధ్యకాలం |
|---|---|---|---|---|---|
| క్రీ.పూ. 19245 | చాల్డియా | 4-6 | మగ | 76 | 2022 |
| 17147 | ఈజిప్టు | 4-5 | " | 72 | 1787 |
| 15288 | పాసిడోనిస్ | 4-3 | " | 44 | 498 |
| 14746 | ఎస్కిమో | 4-1 | స్త్రీ | 55 | 653 |
| 14038 | ఉ. అమెరికా | 4-2 | " | 62 | 1187 |
| 12089 | పెరూ | 4-3 | " | 85 | 2367 |
| 9637 | చైనా | 4-4 | " | 12 | 22 |
| 9603 | ఉ. అట్లాంటిస్ | 4-5 | " | 39 | 995 |
| 8569 | ఎట్రూరియా | 4-6 | " | 59 | 1053 |
| 7457 | జపాన్ | 4-7 | " | 65 | 1513 |
| 5879 | ఈజిప్టు | 5-1 | మగ | 75 | 1772 |
| 4032 | ఇండియా | 5-1 | " | 45 | 1829 |
| 2158 | అరేబియా | 5-2 | " | 68 | 1517 |
| 573 | పెర్షియా | 5-3 | " | 12 | 41 |
| 520 | ఏథెన్సు | 5-4 | " | 71 | 1952 |
| క్రీ.వె. 1503 | జర్మనీ | 5-5 | " | 19 | 332 |
| 1854 | ఇంగ్లండు | 5-5 | " | 79 | |

(33 వ పటము)

జన్మించి తరువాత రెండుసార్లు స్త్రీగా జన్మించెను. తరువాత జన్మలో తిరిగి పురుషుండాయెను. తొమ్మిదిసార్లు వరుసగ ఒక జీవి స్త్రీజన్మ మెత్తినటుల కూడ పరిశీలనలో తేలినది.

స్థూలశరీరములోని జీవితకాలనిర్ణయమును గూర్చిన సాధారణసూత్రమేదియును లేదు. సాధారణముగ స్వర్గలోక జీవిత మంతమైనపిదప తిరిగి జీవి మర్త్యలోకములో జన్మించును. కాని మరణకారణమును మాత్రము కర్మదేవతలు ముందే ఏర్పాటుచేయుదురు. ప్రతిమానవుని జీవితము అంత మగు సరికి అతఁడు చేసిన పుణ్యాపాపకార్యములలో మొత్తము మీఁద పుణ్యమే కొంచె మెక్కువగ మొగ్గుచూపునటుల సరుదుబాటు చేయుచు తద్వారా ఈశ్వరసంకల్పము నెఱవేఱుటకు ఎల్లప్పుడు పనిచేయు దేవతలనే 'కర్మదేవత' లందురు. వ్యక్తి భావజీవితమునకు శ్రేయస్కర మని వారెంచిన యెడల ఒక ప్రమాదమువలన లేక రోగమువలన ఆ వ్యక్తి జీవితమును త్వరలో నంత మొందించెదరు. అతనికి దీర్ఘాయువు ప్రసాదించినచో ఒక గొప్ప సుగుణము సంపాదింపఁగలఁ డని వారికి తోఁచినచో అయుర్దాయము దీర్ఘముగా నొనర్చెదరు.

జీవి కర్మనుబట్టి ఇతరులకు తాను, తన కితరులు చేయ వలసిన సేవనుబట్టి, ఒకవ్యక్తిజీవితమందలి ముఖ్యఘట్టములను మరణకాలమును కర్మదేవతలు ముందేర్పఱచి యున్నను వ్యక్తి తన యత్నమువలనను, ఇతరులుచేసిన కర్మయొక్క ప్రభావము సోకుటవలనను కర్మదేవత లేర్పాటుచేసిన తన జీవితవిధానములో కొన్నిమార్పులు సంభవించుచుండును.

(ఉదాహరణకు) మరణ మొకప్పుడు ప్రమాదమువలన సంభవించినను అది, కూడ తెలుచుగ కర్మదేవతల ఏర్పాటు ప్రకారమే జరుగుచుండును. కాని అట్టిఏర్పాటు లేకపోయినను కొన్ని నూతనశక్తుల జోక్యమువలన కూడఁ గలుగుట అప్పుడప్పుడు సంభవించుచుండును. అట్టిస్థితిలో ఆజీవియొక్క పరిణామపథకానికి కొంచెము అంతరాయము కలిగినను, ఆజీవి అభ్యుదయమున కేవిధమైన భంగము కలుగకుండ కర్మదేవతలు ఆజీవి మఱుసటిజన్మలోని ప్రారంభదశలోనే సర్దుబాటు చేయుదురు.

ఆత్మహత్య ఎన్నఁడు కర్మదేవతలచేత నిర్దేశింపఁబడదు. ఇట్టిపని చేయుటలో బాధ్యత యావత్తు జీవిదే అయివున్నది. కాని ఒక్కొక్కప్పుడాబాధ్యతలోను ఇతరులు కూడ పంచుకొనెదరు, ఆత్మహత్యలలో అనేకవిధములు కలవు ; కొందఱు తామొనర్చిన దుష్కార్యముల ఫలమునుండి తప్పించుకొనుటకు, కొందఱు మతిచలించిన కారణమున, మఱికొందఱు సదుద్దేశముతోను చేయుచుందురు. ఆయాకారణముల ననుసరించియే ఆకర్మఫలము లుండును.

చివరి ఒక యుపజాతియం దనేకపర్యాయములు జనించిన యనంతరమే తరువాతిమెట్టునకుఁ బోవునట్లుగా నమాయికులు నాటవికులు నగు రెండుతెగల జీవుల పునర్జన్మవిధానము కొలఁదిగా సంస్కరింపఁబడినది. అన్నిసార్లు జన్మించినఁగాని వారు తగిన అనుభవము సంపాదింపలేరు. జన్మల

మధ్యకాల మందువలన కొద్దిసంవత్సరములు మాత్రమే యుండును. ఒక్కొక్కప్పుడు 2-3 శతాబ్దము లుండవచ్చును. వారు తమ సాధారణ పరిణామస్థాయిలో విక్షిప్తశ్రేణివారి కన్న లక్షలాదిసంవత్సరములు వెనుకపడియుందురు. ఈ 4, 5 తరగతులు దళితస్థితియందుండుటలో వారి లోప మేదియు లేదు. ఇందుకు ఆత్మలోఁగల వయోభేదమే కారణము. వారు యువకాత్మలు. విక్షిప్తశ్రేణిమానవులు నేఁడు స్వభావసిద్ధముగ వ్యక్తముచేయుచున్న సహానుభూతి విశాలదృష్టి మున్నగు సద్గుణములు భవిష్యత్తులో ఏదోఒకప్పు డీక్రిందితరగతులవారుకూడ వ్యక్తముచేయఁగలరు. ఈ అనంతజీవితములో జీవులన్నియు ఆలస్యముగనో త్వరగనో అభివృద్ధిచెంది తీరఁగలవు.

జీవయాత్రలకు సంబంధించిన వివరములతోఁగూడిన ఈ పటములను చూచి వానిలో ఉదహరించిన దేశ కాల జాతి వివరణములను తెలిసికొన్నప్పుడు యోగపరిశోధకుఁడు వాని సత్యాసత్యములనుగూర్చి ఎట్లు నిశ్చయింపఁగలఁడో తెలిసికొనవలెనను కుతూహలము మీకుండవచ్చు. పాసిడానిస్‌లో 'ట'అను పురుషుఁడుగా జన్మించినవ్యక్తి, ఆతరువాత జన్మములో ఎస్కిమోజాతిలో స్త్రీగా జన్మించిన వ్యక్తి ఒకరే అని చెప్పుట ఎట్లు? ఈశ్వరస్మృతి నిజమని ఎంచినను ఈ విషయములు కనుఁగొనుట ఎట్లు?

ఇట్టి సందేహము స్వాభావికముగా జనించును. విజ్ఞాన శాస్త్రపరిశోధకుల విధానమునకును యోగశాస్త్రపరిశోధకుల

విధానమునకును తేడా ఎక్కువగా లేదని, రానున్న అంశముల ననుబట్టి మీకు తెలియఁగలదు. ఒకవ్యక్తి జన్మించిన దేశమును నిర్ణయించుట కష్టమయినపనికాదు. పరిశోధకుఁడు వ్యక్తి జన్మించినచోటు తెలిసికొని పరిసరప్రాంతములను పరికించి చూచి అచ్చట కనుపించు పర్వతములను, సముద్రములను, సరస్సులను, నదులను గుర్తుపెట్టుకోవలెను. అప్పుడు తనకు భౌగోళికజ్ఞానముతో అస్థలము నిర్ణయింపవచ్చు. ఆసంఘటన అతిప్రాచీనయుగమునకు సంబంధించి ఆదేశము అపరిచిత ముగానున్న యెడల, ఆదేశరూపము ఏలాగునున్నది తీవ్రముగా పరిశీలించి మనుపటిక్షణములో ఆ దేశమునకుసంబంధించిన ఈశ్వరస్మృతితో సంస్పర్శకలిగించుకొన్నచో ఈనాఁడు ఆ స్థలమునుగూర్చిన వివరములు తెలియుటవలన భౌగోళికు లాదేశమున కేమిపేరుపెట్టినారో అప్పుడు తెలిసికొనవచ్చును.

జాత్యుపజాతుల వివరములు తెలియవలెనన్న కొంత వఱకు జాతిశాస్త్ర (Ethnology) జ్ఞానము కలిగియుండ వలెను. ఎక్కువగా ప్రపంచపర్యటన సల్పినవారు సులభముగ చైనాదేశీయుఁడెవఁడో, జపానుదేశస్థుఁడెవఁడో తెలిసికొనఁ గలరు. అటులనే ఫ్రెంచిసెల్టూకు, ఇటాలియనుసెల్టుకుఁ గల భేదము తెలియఁగలదు. జాతివిశిష్టలక్షణములు, అందులోను ముఖ్యముగా ఉపజాతులలోని సూక్ష్మశరీరముల తేడాలు, బాగుగ పరిశీలించి తెలిసికొనఁగలిగినయెడల పరిశోధకునకు కావలసిన ఫలితములు లభింపఁగలవు.

కాలనిర్ణయము చేయుట మిక్కిలి కష్టమైన పని. పరిశోధకుఁడు 'ఈశ్వరస్మృతి'లోని అంశములను పరికించినప్పుడు ప్రపంచవృత్తాంతములను తన కిష్టము వచ్చినట్లు నెమ్మదిగఁగాని ఆలస్యముగఁగాని కనిపెట్టఁగలుగును. అతనికి తోఁచిన యెడల వేలాది సంవత్సరములకు పూర్వము గతించిపోయిన ఏదో ఒకదినమున, ప్రతినిమేషము జరిగిన విశేషములన్నియు తెలిసికొనవచ్చును, లేదా కొన్ని క్షణములలో తాను అనుకొన్న దేశములోని ఋతువులన్నియు ఒకదానితరువాత నొకటి కనిపెట్టి ఆఋతువుల సంఖ్యనుబట్టి కాలపరిమితి నిర్ణయింపవచ్చును. సరిగా ఎన్నిసంవత్సరములక్రింద ఈసంఘటన జరిగినది తేల్చుకోవలెననినచో క్రమముగా త్వరితగతి మాఱిపోవుచున్న జంతువులను లెక్కపెట్టి దాని ప్రకారము, సంవత్సరముల లెక్క తేల్చుకొన వచ్చును. మనకు తెలిసియున్న చారిత్రకవిషయమైనచో ఉదాహరణకు- పరిశోధకుఁడు 'ఈజిప్టు'లోని ఒకదృశ్యమును చూచుచున్నాఁ డనుకొందము. అతనికి దానినిగూర్చి సరియైన తేదీ కావలెనన్నచో బహుశః, ఆకాలపు ఫెరోవాలదర్బారుదృశ్యము నొకదానిని పరిశీలించి అచ్చటి వ్యక్తు లుచ్చరించు మాటలనుబట్టి, ఆ ఫెరోవా పేరు గ్రహించి ఏదైన నొక సర్వసంగ్రహనిఘంటువు (Encyclopedia) ను బట్టి ఆఫెరోవా పరిపాలించిన తేదీ తెలిసికొని నిర్ణయము చేయనచ్చు. అలాగుననే ఆకాలపు వ్యక్తిఒకఁడు గ్రీసుదేశములో ఉత్తరము వ్రాయుచుండగ ఆఉత్తరములో అతఁడుదహరించిన తేదీనుండి లేదా ఆనాఁటి

'మరాథను' యుద్ధమువంటి ముఖ్యమైన ఘట్టము ఒకటితీసికొని దానినుండియే తనకు కావలసిన సంఘటనముల కు ముందు ఇకో వెనుకకో సంవత్సరములు లెక్కించి కాలనిర్ణయము చేయవచ్చును. అలాగుననే రోములో జరిగిన విషయములను కూడ అట్టి ఉత్తరములలోని తేదీలకు సంబంధించిన అంశము లనుబట్టిగాని లేదా ఏదైన విధానసభ, లేక పండితసభ చర్చిం చెడి అంశములనుబట్టి గాని, వారి పేరులనుబట్టి గాని, తేదీలు నిర్ణయింప వీలగును. ఒక్కొక్కప్పుడు 'అట్లాంటిస్' భూఖం డము పూర్తిగా జలమయమయిన క్రీ॥ పూ॥ 9564 సం॥నుండి వెనుకకుంగాని, ముందునకుంగాని లెక్కపెట్టి తేల్చవచ్చును. లక్షలాది సంవత్సరములు లెక్కపెట్టవలసి వచ్చినప్పుడు, పరి శోధకునకు ఖగోళశాస్త్రజ్ఞానముకూడ కొంత అవసరము. భూమి ఇరుసునకు సంబంధించి, ధ్రువనక్షత్రము ఉండుప్రదే శమునుబట్టి కూడ వేలాదిసంవత్సరముల కాలము సులభముగ లెక్కపెట్టవచ్చును. ఆధునికవిజ్ఞానశాస్త్రపరిశోధనలోవలెనే యోగశాస్త్రపరిశోధనలో విలువకూడ ఆ సాధకుని పరిశీలనా దక్షతపైన అతని సంస్కృతివిజ్ఞానములపైన, పరిశీలించిన విషయములను క్రమబద్ధమైనపద్ధతిలో ప్రకటింపంగలిగెడి శక్తిపైన నాధారపడియున్నది.

సాధకుఁడు బహుజాగ్రత్తతో శోధనచేసినచో శరీర ములోనుండు జీవాత్మను పొరపాటులేకుండ గుర్తుపెట్టుకో వచ్చును. భౌతికశరీరము ప్రతిజన్మలోను మారుచుండును, గాని జీవాత్మఁడునికిఅయిన కారణశరీరముమాత్రము మారదు.

ఒక్కసారి ఈ శాశ్వతశరీరమును గుర్తుపట్టినచో భౌతికశరీరములు మాఱుచున్నను శాశ్వతుఁడైన జీవాత్మను అన్నిజన్మలలోను గుర్తుపట్టవచ్చు. ఆ కారణశరీరమే జీవాత్మను గుర్తుపట్టుటకు ముఖ్యమైన చిహ్నము. అదిమాత్రము మాఱదు. ఎల్లప్పుడు అది ఒక్కమాదిరిగనే యుండును.

ఈ అధ్యాయము ముగియులోపున 34–35 పటములలోని వివరములఁగూర్చి తెలియపఱుపవలసియున్నది. మన మిదివఱకు ఒకసారి పరిశీలించిన 'అ' 'క' 'చ' అను ముగ్గురు వ్యక్తులు చిరకాలమునుండి చాల సన్నిహితులు. వివిధజన్మలలో వారిమధ్యముననుండు ప్రేమానుబంధము బలపడఁజొచ్చెను. ప్రతిజీవి స్వయంకృషి నొనర్చి తన ప్రత్యేకమైన శాశ్వతలక్షణముల ప్రభావమువలన పరిణామము చెందుచుండును. కాని ముక్తికొఱకు తా నొక్కఁడు మాత్రమే మోక్షమార్గమునంటిపోకుండ తనప్రియమవ్యక్తులతో కలసియే యాత్రసాగించును. ఉపాధుల మధ్యముననుండు ప్రేమకన్న ఆత్మల మధ్యముననుండు ప్రేమయే నిజమైనది. ఉపాధుల మధ్యమున ప్రేమ ఎట్లుండినను ఆత్మనుండి ఆత్మకు ప్రేమ మెఱుపువలె ప్రసరించుచుండును. భౌతికప్రేమసంబంధము అతిస్వల్పవిషయము. కర్మదేవతలు ఎట్టి స్థూలదేహ మొసఁగినను బహువ్యాప్తి యగు ప్రేమశక్తి నిత్యము. అది సేవా ప్రేమల రూపములలో వ్యక్తమగుచునే యుండును.

34 వ పటములో 'అ' 'క' అను వ్యక్తులు 1200 సంవత్సరములు — 700 సంవత్సరములు స్వర్గలోకజీవితము

| క | అ | అ | చ |
|---|---|---|---|
| | | భర్త | భార్య |
| భార్య | భర్త | బావమరది | బావమరది |
| ముత్తాత | మునిమనుమడు | సోదరుడు | సోదరుడు |
| | | సోదరుడు * | సోదరుడు * |
| | | భార్య | భర్త |
| కుమారుడు | తల్లి | | |
| తల్లి | కుమారుడు | భర్త | భార్య |
| స్నేహితుడు | స్నేహితుడు | సోదరుడు | సోదరుడు |
| స్నేహితుడు | స్నేహితుడు | కుమార్తె | తండ్రి |
| తల్లి | కూతురు † | | |
| | | తండ్రి | కూతురు |
| భార్య | భర్త | సోదరుడు * | సోదరి * |
| స్నేహితుడు | స్నేహితుడు | ప్రేయసి | ప్రియుడు |
| కుమారుడు † | తండ్రి | | |
| కుమారుడు | తండ్రి | | |
| స్నేహితుడు | స్నేహితుడు | స్నేహితుడు | స్నేహితుడు |

† దత్తుడు     * కవలలు

(34 వ పటము)

గడిపిన వర్గములకు చెందినవారని ఇదివరకే మీరు గ్రహించి యుందురు. అందువలన 'చ' అను వ్యక్తితోపాటు అన్ని జన్మలలోను 'చ' 'క' వ్యక్తులుకూడ పుట్టి జీవితము కలసి కడపుట కుదురదు. వీరుకూడ 'చ' మాదిరిగ ప్రతిజన్మ

లోను అతఁడు జీవితము గడపిన కాలములోనే తాముకూడ భూలోకజీవితము గడపి 700 సంవత్సరములుకాలము మాత్రమే దేవభాన్‌లోకములో గడపినచో అట్లు కలసియుండుట సంభవించును. 34 వ పటము ఈ ముగ్గురి జన్మములనుగూర్చిన కొన్నిముఖ్యాంశములు పేర్కొనఁబడినవి. 'చ' 31 జన్మ ఎత్తుసరికి 'అ' 19 జన్మలు 'క' 23 జన్మలు మాత్రము ఎత్తిరి. ఈ పటమునుబట్టి మొదటిజన్మలో 'అ' 'చ'ల మధ్యమున భార్యాభర్తృసంబంధ ముండినది. కాని ఈ జన్మలో 'అ' తన స్నేహితుఁడైన 'క'ను కలియలేదు. మఱుసటి జన్మలో 'అ' అను వ్యక్తి 'క' అను వ్యక్తికి భర్తఅగును. 'చ' అను వ్యక్తికి బావమఱఁది అగును. ఈలోగా 'క' మూఁడుజన్మలు, 'చ' ఒకజన్మ ఎత్తిరి. కాని 'అ' అను వ్యక్తిని వీరు కలియలేదు. 'చ' తన 31 జన్మలో 'అ'ను పంౘెండుసార్లు 'అ' 'క'లను ఏకముగ 8 సార్లు కలిసెను. దీనినిబట్టి 'అ' 'చ'ల మధ్యమున ప్రేమబంధము ఎక్కువబలమైనది అని తెలియఁగలదు. వారిమధ్యమున నున్న బంధము ప్రాపంచికదృష్ట్యా ఎట్టిదైనను – భార్యాభర్తలు సోదరీసోదరులు వివాహముకాని ప్రియసీప్రియులు ఆత్మలమధ్య అనుబంధము బలమైనది. ఒకప్పుడు 'క' అను నామె 'అ' అను చిన్నపిల్లను దత్తము చేసికొనును. తిరిగి ఇంకొనజన్మలో 'అ' అను వాఁడు 'క' అను చిన్నబాలుని దత్తము చేసికొనుటతో ఈకర్మఋణము చెల్లిపోయినది.

35 వ పటములో 'త' 'ప' అను వ్యక్తుల 14 జన్మల వివరణము లియ్యంబడినవి. వీరి మధ్యమున ఈ 14 జన్మల లోను వివిధమైన సంబంధములు కలిగినవి. 'త' స్త్రీజన్మ ఎత్తి నప్పుడు 'ప' ఒకజన్మలో కొడుకు, ఇంకొకజన్మలో భర్త అయినాడు. 'ప' అను వ్యక్తి పురుషుడై పుట్టిన మూడు జన్మలలోను, 'త'కు పురుషస్నేహితుడై కలిసికొనును. వీ రిద్దరి మధ్యమున ఎక్కువ అన్యోన్యత పెరుగును. మఱుసటి జన్మలో 'త' ఒక దేవాలయమునకు పురోహితుడుగ

| "త" "ప" అను వ్యక్తులు. | | |
|---|---|---|
| దేశము | (త) | (ప) |
| అట్లాంటిస్ | సవతిసోదరుడు | సవతిసోదరి |
| ఇండియా | భర్త | భార్య |
| స్కేండినేవియా | భర్త | భార్య |
| పెరూ | తండ్రి | కుమార్తె |
| — | తల్లి } | { కుమారుడు |
| పెర్షియా | భార్య } | { భర్త |
| ఉ-అమెరికా | స్నేహితుడు | { స్నేహితుడు |
| అస్సీరియా | పురోహితుడు | దేవాలయములోని అనాధబాలిక |
| ఇండియా | భర్త | భార్య |
| ఈజిప్టు | ప్రేయసి | ప్రియుడు |
| అరేబియా | ప్రియుడు | ప్రేయసి |
| గ్రీకువలసు | — | స్త్రీ |
| రోము | భర్త | భార్య |
| నేడు | పురుషుడు మోక్షమార్గములోనున్న | స్త్రీ ఇంకను కలియలేదు |

(35 వ పటము)

నుండును. అప్పుడు 'ప' దేవాలయములో చేర్చబడు నిమిత్తమొక అనాధబాలికగ తనయొద్దకు తీసికొని రాబడును.

# 4 అధ్యాయము

## కర్మసిద్ధాంతము

"ఒకజన్మలో బానిసగపుట్టి శ్రద్ధతో సత్కర్మము నాచరించుటవలన, యోగ్యతాగ్రతలు సంపాదించి మఱుసటిజన్మలో రాజగును. తాను చేసియు చేయనట్టియు కర్మములవలన, నేటి సార్వభౌముఁడు భావిజన్మలో బిచ్చగాఁడై పుట్టవచ్చు."

— ప్రాగ్జ్యోతినుండి (Light of Asia)

మానవునిలో జ్ఞానము వృద్ధిచెందినకొలఁది తాను నివసించు ప్రపంచము ధర్మబద్ధమైనదని నెమ్మదిగా తెలిసికొనును. ప్రకృతి మన స్వాతంత్ర్యమును కొంతవఱకు పరిమితము చేయుచున్నదా అనిపించును. కాని లోతుగా ఆలోచించినచో ఇది మన ఇచ్ఛాశక్తిని ఎక్కువ విడుదలచేయఁగలదని తేలును. మనము చేయు ప్రతికార్యము, మన ఆంతరంగికప్రపంచమునకు చెందిన అనేకసంకల్పభావనాశక్తుల ప్రేరణఫలముగా జరుగుచున్నది. కాన అట్టి ఆంతరంగికాదృశ్యప్రపంచము సత్యమనియు, ధర్మబద్ధమైన దనియు, మానవుఁడు తెలిసికోవలసియున్నది. దివ్యజ్ఞానము బోధించు ఈ మహత్తరమైన కర్మసిద్ధాంతము, మానవునికి తనలో నిబిడీకృతమైన శక్తిని కొంతవఱకు వెల్లడిచేసి తద్ద్వారా, అతఁడు క్రమక్రమముగా తనచుట్టునున్న పరిస్థితులకు లొంగిపోకుండ వానిని త్రిప్పికొనఁగలుగునిమిత్త ముపయోగించును.

ప్రపంచ మంతయు ఒకవిధమగు శక్తిస్వరూప మని విజ్ఞానశాస్త్ర మిదివఱకే ప్రవచించినది. అల్పమైన అణువు మొదలు నక్షత్రమువఱకు ప్రతివస్తువు శక్తిసముదాయమె. ఈ శక్తిస్వరూపము నిత్యము మాఱుచుండును. చలనశక్తి, ఉష్ణముగనో, జ్యోతిగనో, విద్యుచ్ఛక్తిగనో, బరువైన రసాయనికద్రవ్యము బహుతేలికైన పదార్థముగనో మాఱుచుండును. మానవుఁ డిట్టిశక్తిని నిలువచేయు ధనకోశమువంటి వాఁడు. ఆహారమువలన అతనిశక్తి వృద్ధియగుచుండును. ఆ శక్తి శరీరమునందు చలనరూపమున వ్యక్తమగుచుండును. మానవుఁడు తనశక్తి పరోపకారముకొఱకు వినియోగించినచో 'సత్కర్మ' మనియు, పరపీడననిమిత్త ముపయోగించినచో 'దుష్కర్మ' మనియు అనఁబడును. మానవుఁడు తన జీవితమంతయు ఇట్లు ఏదో రూపముగ శక్తిని మార్పుచేయుచుండును. మానవుఁడు తనలో నిబిడీకృతమైయున్న ఈశ్వరశక్తిని, హింసాసేవల నేదోయొకరూపముగ మార్చివేయుచుండును

మానవుఁ డివ్విధముగ శక్తిని కార్యరూపముగ మార్చుటలో, కార్యకారణసంబంధమును తెలుపునదియే కర్మసిద్ధాంతము. విజ్ఞానశాస్త్రమువలె, నొక్క దృశ్యప్రపంచమును మాత్రమె గాక, మానవునకు స్వాభావికము, యథార్థము వాని ప్రవర్తనముకు మూలస్థానము అగునట్టి మహత్తరమైన అదృశ్యలోకవిషయములనుగూడ ఈసిద్ధాంతము గణనకు తీసికొని విమర్శచేయును. కనుఱెప్పపాటువంటి అల్ప

చలనమువలన కలిగిన స్పందము స్థూలప్రపంచములో వ్యాపించి అందలి సమతకు భంగము కలుగఁజేయుచున్నది. అట్లే మానవుని భావసంకల్పములు తనకు బాహ్యప్రపంచము నకుఁ గల అన్యోన్యసంబంధములో కొంతవఱకు మార్పుతీసి కొని వచ్చుచున్నవి.

మనము కర్మసిద్ధాంతమును అవగాహన చేసికొను నప్పుడు శక్తులను వానిఫలములను గూర్చి వ్యవహరించు చున్నామని తెలిసికొనుట ప్రధానాంశమైయున్నది. ఈ శక్తి ముల్లోకములకు సంబంధించినది. ఈ మూఁడువిధములైన శక్తి మన ముపయోగించుచున్నాము. ఈ శక్తి కార్యకలా పములతో సంబంధించిన స్థూలలోకమునకుఁ గాని, రాగద్వే షాదిభావరూపసంబంధమైన కామలోకమునకు గాని, సంకల్ప రూపసంబంధమైన మానసికలోకమునకు గాని, చెందియుం డును. కావున స్థూలలోకసంబంధమైన కర్మమువలన పృథ్వీలోక శక్తిని, భావములవలన భువర్లోకశక్తిని, రూపారూపసంక ల్పములవలన మానసికశక్తిని, ఉపయోగించుచుందుము. కర్మముచేయుట ఇచ్ఛగించుట, సంకల్పించుట, స్వప్నము గనుట, భావించుటమున్నగునవి ఈ ముల్లోకములలోని శక్తులచలనమునలననే సాధ్యము. ఈ త్రివిధశక్తులను మన ముపయోగించు విధానమునుబట్టియే 'ఉపకారము' 'అపకారము' చేయుట జరుగుచుండును.

ముల్లోకములకుసంబంధించిన శక్తి అంతయు కేవలము ఈశ్వరశక్తియే. ఆ శక్తిని నిత్యము మార్పుచేయుటయే మన

పని. ఈశ్వరసంకల్పమునకు విజయము చేకూర్చుట కీశక్తిని వినియోగింపవలసినదిగా ఈశ్వరాదేశము. ఆ'సంకల్పముతో' సహకరించి పనిచేయుట 'పుణ్య'మనియు, దానిని నిరోధించుట 'పాప' మనియు ఎఱుఁగవలెను. నిత్యము ఈశ్వరశక్తి మనము వినియోగింపవలసియున్నది. కావున ప్రతిక్షణము తత్సంకల్పమునకు తోడ్పడుటయో వ్యతిరేకించుటయో జరుగుచునే యుండును

బహుసంఖ్యాకులతో కూడిన ఒక పెద్దసంఘము నందలి వాఁడు మానవుఁడు. ఎవరితోను సంబంధములేకుండ ఏకాకిగ జీవితము గడపుట అసంభవము. వాని సంకల్పములు, భావనములు, కార్యకలాపములు ఇతరుల ప్రభావమునకు లోనగుచుండును. ఇతరమానవుల సన్నిహితత్వమునుబట్టి ఆ ప్రభావము మఱింత హెచ్చుగా నుండఁగలదు. మానవుఁడు శక్తి నుపయోగించుటద్వారా సలుపుచున్న 'సత్కర్మ', 'దుష్కర్మ'ములవలనకొన్ని ఫలములు కలుగును. 36 వ పటములో కర్మలను వానిఫలములను గూర్చిన వివరములు పొందుపఱుపఁబడినవి.

ఎవరికైనను మనము హాని కలుగఁజేసినప్పుడొక దుష్టశక్తిని ప్రపంచమున ప్రవేశపెట్టుచున్నాము. ఆ దుష్టశక్తి 36 వ పటములో నల్లని చతురముగా చూపఁబడినది. ఆ విడిచిపెట్టినశక్తి ఫలముగ ఇంకొకనికి హాని కలుగును. అనఁగా ఇతరులకు హాని కలుగుటద్వారా ఆశక్తి అంతమగును. దెబ్బతిన్నవానివలన దెబ్బకు కారకుఁడైనవానికి

| కార్యము ద్వారా ప్రతిక్రియ | | | | |
|---|---|---|---|---|
| ఆత్మిక స్థాయి | సదాశయము | ఆదర్శము | ☆ | 125 |
| మానసిక స్థాయి | ప్రశంస<br>విమర్శ | ప్రోత్సాహము<br>చికాకు | ○<br>○ | 25<br>25 |
| భావావేశ | సహానుభూతి<br>ఆగ్రహావేశము | సంతోషము<br>దుఃఖము | △<br>▲ | 5<br>5 |
| భౌతిక | సహాయకరమైన కార్యము<br>హానికరమైన కార్యము | సౌఖ్యము<br>బాధ | □<br>■ | 1<br>1 |

(36 వ పటము)

విశ్వమునకు మధ్యమునఁ గల సమతకు భంగము వాటిల్లును. తప్పుచేసిన వానిబాధ్యతపైన తిరిగి ఈ భంగపాటు సర్దుకొని పోవలసియున్నది. ఈదుష్కర్మమునకు ఫలము కర్తకు బాధకలుగుటయె. ఈ బాధను ఉత్పత్తిచేసిన దుష్టశక్తి అందుకు కర్తయైన వానిని ఆధారముగ గొని అతనిద్వారా ప్రసరించి. తదూప్రేణా సమత్వమునకు కలిగిన అలజడి సర్దుకొనును. ప్రేమతో చేయుపని విషయములోకూడ ఈప్రకారమే జరుగును. దాని ఫలము పరిస్థితులను సమపాళముగ చేయుశక్తిగ రూపొంది సుఖము కలుగఁజేయును.

నియమబద్ధమైన ఈప్రపంచములో వివిధశక్తులు వాని వానికి సంబంధించిన వివిధలోకములలో పనిచేయును. ఒకఁడు జాలినొంది బిచ్చగానికి ముష్టి వేయవచ్చు. ఇంకొకఁడు వాని బాధనుండి తప్పించుకొనుటకు ఏమైనను ఈయవచ్చును. ఉభయులు చేసిన పని దయతోకూడినట్టిదైనందున వారలకు భౌతికలోకసుఖము కలుగును. ఇందులో మొదటివానికి జాలి, దయ కారణముగ భావోల్లాసముకూడ కలుగఁగలదు. రెండవ వానికి మాత్రమట్టిది యుండదు. ఇటులే బాధపడువానిని చూచి ఒకఁడు జాలిమాత్రమే చూపఁగలఁడు. తదీత్యా వానికి భావోల్లాసముమాత్రమే కలుగునుగాని భౌతికసుఖము కలగదు.

ఈ క్లిష్టసమయమును బోధపఱుచుటకొఱకు, ఒక్కొక్క మాదిరి శక్తిని, జనింపచేయు కర్మమునకు 36 వ పటములో ఒక్కొక్కమాదిరి గుర్తు ఏర్పాటు చేయఁబడినది. పటములో చూపిన చతురములు, త్రిభుజములు, వృత్తములు, పంచకోణ నక్షత్రములు ఈగుర్తులై యున్నవి. జీవాత్మ నివసించు ఉత్తమమానసిక (మహర్లోకము) లోకములో పాపమునకు తావు లేనేలేదు. అంతయు ధ్వనిరహితము. నిశ్శబ్దమే. ఆత్మ సదాశయముల పోత్రవు. తద్వ్యతిరేకమైన దుష్టత్వ మచ్చట నుండదు. కాఁబట్టి నల్లరంగు నక్షత్రపుగుర్తు చూపఁబడలేదు. మానవుఁ డెంతదుష్టుఁడైనను వాని ఆత్మకు మాత్రము దుష్టత్వము ముండదు. అట్టివాని ఆత్మవికాసము చెందలేదు. కావున తన ఇంద్రియములను భావోద్రేక

ములను నిగ్రహించుటకు తగిన శక్తి అతనికింకను కలుగ లేదు.

ప్రస్తుతజన్మకు పూర్వ మనేకజన్మ లెత్తియుంటిమి. ప్రాక్తనజన్మలలోని కర్మముల మంచిచెడ్డల ఫలములు ఈ జన్మలో మనతో తెచ్చుకొందుము. ఈ కర్మలన్నియు శక్తులను జనింపఁజేయు నని ఇదివఱకె చెప్పియున్నాను. 37 వ పటము ఈవిషయము బాగుగ గుర్తునకు తెచ్చుటకు ఊహించి వ్రాయఁబడినది. ప్రతిజీవి తాను సృష్టించిన మంచి చెడ్డలగు కర్మముల ఋణము తీర్చుకొనుటకు బాధ్యుఁడై యున్నాఁడు. స్థూలదృష్టితో 37 వ పటము నొకసారి పరికించినచో మానవునిజీవితములో 'బాధలు' 'దుఃఖములు' 'చికాకులు' మిక్కుటముగా కనపడును. ఇందులో మూఁడు నక్షత్రపుగుర్తులు అనఁగా సదాశయములను సూచించునవి కలవు. ఒక్కటి మాత్రము ముఖ్యముగ మనము జ్ఞాపకముంచుకోవలసియున్నది. అన్నిలోకములకు సంబంధించిన శక్తులు మానవుని విధి మార్చుటీసికొనివచ్చుటలో సమానమగు విలువఁగలవిమాత్రము కాదు. 'సుఖము', కలుగఁజేయు భౌతిక లోకశక్తి ఆదర్శమును నిర్మాణముచేయఁగల మహర్లోక శక్తిలో నూఱవవంతు కూడ ఉండదు. భౌతికశక్తి ఒక ప్రమాణము అనుకొన్నచో, కామలోకశక్తి అధమపక్షము 5 ప్రమాణములు, నీచమానసికలోకశక్తి 25 ప్రమాణములు, మహర్లోకశక్తి 125 ప్రమాణములు ఉండఁగలదని చెప్పవచ్చును. ఇందతిశయోక్తి ఏమియు లేదు. ఒకమానవునికి



(37 వ పటము)

కర్మరీత్యా అనేక 'బాధలు' 'దుఃఖములు' 'మనోవ్యాకులత'లు; కలగవచ్చును. కాని అతనికి కొలందిగామాత్రము 'ఆదర్శము'లున్నచో అతనిజీవితము సార్థకమైన దగును.

ఇంకొకనికి కర్మఫలముగా 'సుఖమునిచ్చు' సిరి, సంపద, భోగభాగ్యములు, కలిగినను పూర్వజన్మవాసనాఫలముగ సదాశయములు సంక్రమింపనినాఁడు అతనిది సుఖప్రదమైన నిరర్థకజీవితముగ పరిణమించును.

ఒకసారి మనచుట్టునున్న మానవులపై దృష్టి పోనిచ్చి చూచినచో అధికసంఖ్యాకులలో 'సత్కర్మము'కన్న 'దుష్కర్మము' హెచ్చుగా నున్నట్లు వారు పడుచున్న ఇక్కట్లు, ఇబ్బందులు, దుఃఖమును బట్టి తేలుచున్నది. వారిలో నిజమైన సౌఖ్యానందములు కనుపించుటలేదు. మానవపరిణామపు ప్రస్తుతస్థితిలో మన మందఱము కూడఁబెట్టిన సమిష్టి శక్తి సంతోషముకన్న దుఃఖమునే ఎక్కువగ నీయఁగలదు. పూర్వజన్మలలో మన మించుక వివేకముతో వ్యవహరింపనందున ఎవరి కెట్టి కష్టము కలుగఁజేయుచున్నా మను ఆలోచనయే లేక స్వార్థపూరితమైన జీవితములు గడుపుటవలన మన యాయవ్యయగణనమున మంచికన్న చెడ్డయె హెచ్చుగా నున్నది. కర్మనిశ్చ్యత యేర్పడవలెను. ఏలయన ఎవరు ఏవిత్తు నాటిన దానికి తగిన ఫలమునే వారు పొందెదరు.

కర్మఫలములు అనుభవించుటలో మొత్తముమీఁద ఒకజీవితము తుదిముట్టుసరికి మానవుని 'సంచితములో' స్వల్పాంశమైనను 'మంచి'యొక్కపాలు హెచ్చగునట్లుగా అతని కర్మశక్తులలో జాగ్రత్తగ సర్దుబాటుచేయఁబడును. మనలో సత్కర్మముపాలుకన్న దుష్కర్మముపాలు హెచ్చుగా నుండును గనుక మనము జన్మించుసరికి నిలవయున్న 'సంచిత

కర్మము 'నంతయు ఆజన్మలోనే తీర్చుకోవలెనని ఏర్పాటైనచో అది భరింపశక్యముకాని భారమై జీవితమంతయు దుఃఖమయమై, నిరాశ, నిస్పృహ తప్ప మరేమియు లేక వ్యర్థమై పోవును. కావున మన మేలాగునైనను బాధల భరించి, తప్పకొని జీవితము సార్థకము చేసికోవలెనని చివరకు స్వల్పముగనైనను సత్కర్మము హెచ్చుచేసికోవలెనని యుద్దేశించి ప్రతిమానవుని జన్మకాలమున కొన్ని సర్దుబాట్లు చేయఁబడును.

ఈ సర్దుబాటు 'కర్మదేవతలు' చేయుదురు. వీరు ఈశ్వర ప్రణాళికలో కర్మనిర్ణయాధికారులుగ పనిచేసెడు శోధన దేవతలు. వీ రెవ్వరిని శిక్షించుట, ప్రశంసించుట అనునది యుండదు. మానవుని స్వశక్తుల నడకలో అవసరమైన సర్దుబాట్లు చేసి ఒక్క జీవితము అంతమగుసరికి పరిణామ స్థాయిలో ఒక్క అడుగు, పైకివెళ్లునట్లు చేయుటయే వీరి ఆశయము. ఆ సర్దుబాటు వారెట్లు చేసెదరో ఈ క్రింది పటములలో ఉదాహరణరూపముగ తెలుపఁబడినది.

3౦వ పటములోని వృత్తము ఒకమానవుని 'సంచిత కర్మము'ను తెలియఁబఱుచు గుర్తు అనుకొన్నచో, అందలి నల్లరంగుభాగము 'దుష్కర్మము'ను, తెల్లరంగుభాగము 'సత్కర్మము'ను తెలియఁజేయుచున్నది. ఆ వ్యక్తి సంచిత కర్మ యావత్తు నూఱుపరిమాణము లనుకొన్నచో పటములో చూపఁబడినప్రకారము అందులో దుష్కర్మము మూఁడు పాళ్లు సత్కర్మము రెండుపాళ్లు అయివున్నది. ఆ వృత్తము లోని 'అ, క చ జ అ' అను ఖండభాగము 40 పరిమాణ

ముల సత్కర్మమును, 'అ తె చ క అ' అను ఖండభాగము 60 పరిమాణముల దుష్కర్మమును, తెలుపుచున్నవి. పూర్వ జన్మలలో కూడఁబెట్టిన (అనఁగా ఇంకను క్షయముకాని) యావత్తు కర్మసముదాయమును 'సంచిత' కర్మ మని సనాతన ధర్మములో అందురు.




(38 వ పటము)

జీవి తిరిగి భూలోకములో జన్మించునపుడు, కర్మదేవతలు ఈ 'సంచితము'నుండి కొంతభాగము ఎంచి, అది ఆజన్మములో జీవి అనుభవించి క్షయము చేసికొను ఏర్పాటు చేసెదరు. ఈ నూతనజీవితములో 'సంచితము'లో నాల్గవ

భాగము అనుభవించుటకు ఏర్పాటుచేసెద రని ఊహింతము, ఈ నాల్గవవంతు 38 వ పటములో 'జ, క, త, అ, జ' అను ఖండభాగముగ చూపఁబడినది. ఇందులో 'జ క అ' అను 10.7 ప్రమాణములు గల భాగము 'దుష్కర్మము'ను సూచించుచున్నది. ఇవి ఈజన్మములో జీవి అనుభవింపవలసిన దని వారు ఎంచి యుంచిరి. దీనిలో 'సంచిత'ములో నున్నట్లు సత్కర్మము 2 పాళ్లు 'దుష్కర్మము 3 పాళ్లు, కాక సత్కర్మము 3 పాళ్లు, దుష్కర్మము నాలుగుపాళ్లు, కలదు. దీనినిబట్టి నూతనజీవితములో సత్కర్మము కొంచె మెక్కువ మనము అనుభవించు ఏర్పాటు వారు చేసెదరని తెలియఁగలదు. నూతనజీవితప్రారంభదశలో జీవి అనుభవించుటకు 'కర్మ దేవతలు' ఏర్పాటుచేసిన 'కర్మము'నే 'ప్రారబ్ధ' మని సనాతనధర్మములో అందురు. దీనినే 'మెడకు' చుట్టఁబెట్టిన 'నసీబు' అని మహమ్మదీయులు అనెదరు.

39 వ పటములో 'ప్రారబ్ధకర్మ'ము ప్రత్యేకించి ఒక వృత్తముగా చూపఁబడినది. అందులోను తెలుపునలుపు భాగ



(39 వ పటము)

ములు 'సత్కర్మ' దుష్కర్మము'లను తెలియఁజేయుచున్నవి. సంచితములోనున్న సత్కర్మశాతముకన్న ఈజీవితములో అను భవించుటకు ఏర్పాటుచేయఁబడిన సత్కర్మశాతము ఎక్కువ అయియున్నది. 'ద, ప, న, ద' అను ఖండభాగము సంచితము లోని పాలును, 'ద, ప, బ, న, ద' అను ఖండభాగము 'ప్రార బ్ధములోని' పాలును సూచించుచున్నవి.

కర్మమనఁగా ఒకవిధమైన శక్తి. 'పని' అనఁగా ఆశ క్తిని వ్యయపెట్టుట. ఇట్టి 'పని'వలన కలుగు ఫలితములు 36 వ పటములో వివరింపఁబడినవి. 39 వ పటములోని 'ప్రార బ్ధకర్మ' ఆజన్మలోనే వ్యయమగును. అట్లు వ్యయపర్చుటలో చేయు కర్మముల ఫలముగ నూతనకర్మమును నిర్మాణము చేయుచున్నాము. ఈ నూతనకర్మస్వభావము ఆ మానవుని జ్ఞానముపై ఆధారపడియున్నది. తాను అనుభవించు బాధల ద్వారా సహానుభూతి త్యాగము మొదలగు సద్గుణములను నేర్చుకోఁగలిగినచో తా ననుభవించుదుఃఖము, మనోవ్యాకు లతద్వారా తా పిదివఱలో చేసినతప్పులు సర్దుబాటు చేసికోఁ గలిగినచో, తాను కర్మఋణమును మంచినేర్పుతోను ఓర్పు తోను తీర్పఁగలిగినచో, ఈనూతనకర్మమువలన మంచిఫలము లను పొందును. కాని కర్మఋణము తీర్చుటలో చికాకుపడి నను, కోపము తెచ్చుకొన్నను, ఓర్మి కనపర్చకపోయినను, కఠినత్వమువహించి ఇతరులకు బాధలు కలుగఁజేసినను, దుష్ఫలములను పొందును. సాధారణముగ చాలమంది కర్మ ఋణము తీర్చుటలో కొంతసత్కర్మము కొంతదుష్కర్మము



(40 వ పటము)

కూడ చేయుచుందురు. కాని కొంచెముబుద్ధిమంతులైన వారిలో సత్కర్మముపాలు ఎక్కువయుండును.

ఈ నూతనకర్మమునే సంస్కృతములో 'ఆగామి' లేక క్రియమాణము అని అందురు. ఆగామి యనఁగా 'భవిష్యత్కర్మ' అని యర్థము. దానినే 40 వ పటములోని వృత్తము సూచించుచున్నది. ప్రారబ్ధ మనుభవించుటలో వారేర్పాటు చేసిన 25 ప్రమాణముల కర్మక్షయ మగును. కాని తిరిగి మనము 36 ప్రమాణముల మేరకు సత్కర్మ దుష్కర్మములు రెండింటిని కలిపి ఉత్పత్తిచేసితి మనుకొందము. ఈ జన్మలో తీర్చుకొన్న 'ప్రారబ్ధ'కర్మమున సత్కర్మము మూఁడుపాళ్లు, దుష్కర్మము నాలుగుపాళ్లు అయియుండఁగా జీవితము తుది యగుసరికి మన ముత్పత్తిచేసిన 'ఆగామి' కర్మములో 16 ప్రమాణముల సత్కర్మము, 20 ప్రమాణముల దుష్కర్మము – అనఁగా 4 పాళ్లు సత్కర్మము, 5 పాళ్లు

దుష్కర్మము-లుండును. 40 వ పటములో వ్యాసార్ధములైన 'గ, ఢ', 'ర, ఢ' గుర్తుగలవి ప్రారబ్ధగాములలోని సత్కర్మమును సూచించు ఖండభాగముల పరిమితిని తెలియఁజేయును.



(41 వ పటము)

41 వ పటములో 39, 40 పటములలోని వృత్తముల నొకదానిపై నొకటి నుంచినచో ఏలాగున నుండునో చూపింపఁబడినది. దీనిని చూచుటతోడనే 'ప్రారబ్ధము'కన్న 'ఆగామి'లో ఎక్కువశక్తిని, ఎక్కువపాలు సత్కర్మమును, ఉత్పత్తిచేయఁగలిగినటుల మనకుతోఁచును. 38 వ పటములోని 'అ జ క త అ 'అను ఖండభాగము (అనఁగా ప్రారబ్ధము) పూర్తిగా నశించిపోయి దానిస్థానములో, 40 వ పటములోని 'ఆగామి' కర్మమును చేర్పవలసియున్నది. అట్లు చేర్పఁగా వచ్చిన స్వరూపము 42 వ పటములో చూపఁబడినది. 42 వ పటములో రెండువృత్తము లొకదానిలోపల నొకటి యున్నవి. అందులో పెద్దవృత్తము 111 పరిమాణములుగల



(42 వ పటము)

క్రొత్తసంచితమును, చిన్నవృత్తము 100 ప్రమాణములుగల పూర్వ 'సంచిత'మును, సూచించుచున్నవి. వ్యాసార్థములు 'ట ఢ', 'ట ధ' లనుబట్టి వెనుకటికన్న సంచితములో సత్కర్మముపాలు కొంత పెరిఁగినట్లు తెలియఁగలదు. సత్కర్మము 45.3, దుష్కర్మము 65.7, ప్రమాణములు ఈ క్రొత్తసంచితములో నున్నవి. అనఁగా నూరుపాళ్లలోను సత్కర్మము 41, దుష్కర్మము 59, ఉన్నది. జన్మప్రారంభమునకుఁగల సంచితము నూరుపాళ్లలో సత్కర్మము 40, దుష్కర్మము 60, ఉన్నదని ఇదివఱకే తెలియును. కావున

ఈజన్మ తుదియగుసరికి సత్కర్మములో 1 పాలుహెచ్చి దుష్కర్మములో 1 పాలుతగ్గినది. ఈమార్పు అతిస్వల్పమైనదే కాని మానవుని అభివృద్ధిని సూచించును. మానవుఁడు ఈశ్వరప్రణాళికను బాగుగ అవగాహనము చేసికొనువఱకు అతని జీవితసరళిలో ఎక్కువమార్పుండదు. అనేకజన్మలవఱకు, సుఖదుఃఖములు, వృద్ధిక్షయములు ఒక్కమాదిరిగానే అనుభవించుచుండును. చెప్పఁదగినంత మార్పు రాదు. ఈశ్వర సంకల్పసిద్ధికి పాటుపడుటయే జీవితాశయముగ పెట్టుకొని తనకొఱకుఁగాక తోడిమానవులకొఱకు జీవించినాఁడు. అతని కర్మగతిలో పెద్దమార్పులు వచ్చి అతఁడు త్వరితగతిని పరిణామము చెందును. అప్పటినుండియు ఒకజన్మ తరువాత మఱొక జన్మలో ఎక్కువ అభివృద్ధిగాంచుచుండును.

మానవుఁడు జన్మించుసమయములో అతఁడు ఆజన్మలో అనుభవించుటకు ఉద్దేశించి జన్మప్రారంభములో అతనిపై పెట్టు భారమును 'ప్రారబ్ధము' అనెదరని ఇదివఱకే చెప్పినాను. దీనినే 'విధి' అనికూడ అనెదరు. తల్లిదండ్రులు, వంశపారంపర్యము, శతృమిత్రులు, అవకాశబాధ్యతలు, మరణము మున్నగున వన్నియు 'విధి'కి సంబంధించినవేకాని ఈ శక్తులు క్రమేణా క్షయమగునప్పుడు అతని భవిష్యత్కర్మవిధానములో ఏవిధమగు నిర్బంధము కలుగఁజేయవు. (అనఁగా భవిష్యత్కర్మను తీర్చి దిద్దుకొనుట అతని చేతులలోనే యుండుననుట). అతనికున్నట్టి ఇచ్ఛాశక్తి స్వల్పమైనను అవి చాల స్వతంత్రమైనది. కాఁబట్టి ప్రారబ్ధము అనుభవించు

పద్ధతినిబట్టి దుష్కర్మముకంటె సత్కర్మమెక్కువగ నుత్పత్తి చేయనచ్చును. ఇట్టిప్రయత్నమున, అతని పూర్వజన్మవాసనలు, ప్రస్తుతపరిస్థితుల ఒత్తిడి, అతనికి ఆటంకము కలుగఁ జేయుచుండును. కాని అతఁడు దైవాంశసంభూతుఁడైనకారణమున, కొంచె మప్రమత్తతతో వీని నధిగమింపవచ్చును. దానికొఱకు 'ఈశ్వరేచ్ఛ'తో సహకరించి పనిచేయవలెను. కాని వ్యతిరేకింపఁదగదు. జీవిత మిట్లు సుగమగా చేసికొనుటకుఁగాను ప్రతివ్యక్తికి అతని విద్యావిధానములోను అతని జీవితపథములోను ఈశ్వరేచ్ఛతో సహకరించి పనిచేయుట అలవర్చుకొనుటకు తగినశిక్షణ ఏర్పాటుచేయు బాధ్యత, అతని ఉపాధ్యాయులపైన, పెద్దలపైన ప్రభుత్వముపైనకలదు. ఇది ఇప్పుడప్పుడే సాధ్య మగుపనికాదు. ఇది ఒక మహత్తరమైన యాదర్శము. దూరపుభవిష్యత్తునకు సంబంధించినదై యున్నది. ఆ దినము వచ్చునఱకు మానవుఁడు తన ప్రయత్నయున విఫలుఁడైనాఁడన్న అతని పరిస్థితులే ఎక్కువగ కారణభూతములని ఊహింపవలసియున్నది. ఈ పరిస్థితులు సరిగ లేకపోవుటకు మన మందఱము కారకులము గనుక ఆ దుష్ఫలములలో మనముకూడ భాగము పంచుకొనవలసియున్నది.

కర్మవిధానమును కర్మదేవతలు నడిపించెద రని ఇదివఱకు చెప్పియున్నాను. వారట్లు ఏసూత్రములప్రకారము నడిపించుచున్నారో మనము తెలిసికొనవలసియున్నది. 43 వ పటములోక్లుప్తముగ నా విషయము సూచించితిని. 'కర్మ

దేవతలు' ప్రతివ్యక్తి ఉత్పత్తిచేసినశక్తిసమాత్రమె వినియోగించి పనిచేసెదరు. ఆ శక్తినుండి మినహాయించుటగాని దానికి కలుపుటగాని చేయరు. వెనుకటి జన్మలలో సంఘము బంధువులు మొదలగు అనేకవిధములైన బంధములు ఏర్పాటైనవి. అందువలన జీవి ఎచ్చట పుట్టి జీవితము గడపినచో ఆబంధములకు సంబంధించిన కర్మఋణ మెక్కువగ తీరుటకు వీలగునో అచ్చటనే ఆ జీవి పుట్టునట్లేర్పాటుచేయుదురు. అతడు సంపూర్ణుడగుటకొరకు ఎత్తవలసిన అనేకజన్మలలో ప్రస్తుత

# కర్మ సిద్ధాంతము




మూలాంశములు




పటము 43

( 43 వ పటము )

జన్మ మొకటి. అతఁడు సంపూర్ణుఁడగుటకు తగిన ఆదర్శ ప్రతిమను తన మనస్సులో ఈశ్వరుఁడు ఇదివఱకే ఏర్పాటు చేసికొన్నాఁడు. ఆ 'ఆదర్శప్రతిమ' మాదిరిగ ప్రతిజీవి ఏనాఁటికైననుతయారుకావలసియున్నది. అందుకు తగినటులనే ప్రతివ్యక్తికర్మమును కర్మదేవతలు సర్దుబాటు చేయవలసియున్నది.

మానవుని కార్యకలాపములు చాలవఱకు అతని భౌతిక శరీరస్థితిపై ఆధారపడి యుండును. ఈ భౌతికశరీరమునకు కారకులు తల్లిదండ్రులు; గనుక ఆ వంశపరంపరాలక్షణములకు ప్రాముఖ్యము ఎక్కువగ నుండఁగలదు. ఈదినములలో ఈవంశానుగతమైన లక్షణములను గూర్చి 'మెండేలియను మూలాంశము'ల ధోరణినిబట్టి ఆలోచన చేయుచుండెదము (అనఁగా తలిదండ్రిల బీజకణములలోని భౌతికలక్షణములు). ఈ లక్షణములనుండియే కర్మదేవతలు తాము నిర్మించు శరీరమునకు. ఆజీవి కర్మకు సరిపడిన 'మూలాంశము'లను తీసికొందురు. ఇదివఱకు నేను 'దివ్యజ్ఞానము - ఆధునిక భావము' అను విషయమును గూర్చి వ్రాసిన వ్యాసమునుండి ఈ దిగువ అంశముల నిచ్చట పొందుపఱుచున్నాను. 43 వ పటముకూడ ఆసందర్భములో నేను వ్రాసినదే.

"దృశ్యాదృశ్యప్రపంచములు రెండింటిలో జరుగు సంఘటనలే నిజమైన సమస్య అని తిరిగి తేలుచున్నది. బాహ్యప్రపంచదృష్ట్యా మానవుఁడనిన శరీర మనియు, ఆశరీర మనేకమూలాంశములతో నిర్మింపఁబడినదనియు కనపడుచున్నది. ఈ 'మూలాంశము'లు కొందఱి కుపయుక్తముగను కొందఱి కాటంకముగను ఉండును. ఒకానొకఁడు అంగసౌష్టవము

గలవాఁడగును. వేఱొకఁడు రేచీఁకటితో బాధపడుచుండును ఒకానొకఁడు గాయకుఁ డగును. వేఱొకఁడు జాత్యంధుఁడు, బధిరుఁడు నగును. రంగు గ్రుడ్డిగలవారల కుటుంబములో సహజమైన సంపూర్ణదృష్టి గలవాఁడొకఁడు పుట్టవచ్చును. మిగిలినఅందఱకు ఇట్టి లోపమేల రావలె ? ఇతఁడొక్కనికి ఏల లేకపోవలెను ?

మానవుని 'విధి'తో సంబంధించిన ఈసమస్య అవగాహనము చేసికొవలెననినచో 'ఆత్మ'వైపు మనదృష్టి నొకసారి మరల్పవలసియున్నది. అప్పుడు మనకు మూఁడు విషయములు ద్యోతకము కాఁగలవు. అందులో మొదటిది మానవుఁడు శాశ్వతమైన అవినాశమైన జీవాత్మయను విషయము. అతఁడు ఎప్పుడో, ఏనాఁడో పుట్టి, అనేకజీవితములు గడిపి, అన్నిజన్మలలోను మంచిచెడ్డలలోకూడిన అనేకాలోచనలు భావనలు కార్యకలాపములు సలిపి తద్వారా తనకు ఇతరులకు క్షేమకరమైనట్టి హానికరమైనట్టి అనేకశక్తులు పనిచేయునట్లు చేయును. వాని మూలమున బంధములో చిక్కుకొనును. కాని యుగయుగాలుగ తన 'ఆదర్శస్వరూపము' (Archetype) కావలె ననెడి లక్ష్యసిద్ధికొఱకే అనేకజన్మలు ఎత్తుచు, జీవితముగడుపుచున్నాఁడు. తరుగుల్మలతాదులకు, తిర్యగ్జంతువులకు, ఆదర్శరూపము లెట్లుండునో అట్లు జీవాత్మలకు 'ఆదర్శస్వరూపము' లుండును. ఒకఁడు దయార్ద్రహృదయముగల సాధువు కావచ్చు; వేఱొకఁడు ధర్మమును ప్రబోధించు గురువు కావచ్చు; మఱొకఁడు పరిపాలకుఁడు కావచ్చు; కొందఱు కళాకారులు, శాస్త్రజ్ఞులు, కార్మికులు, కవులు కావచ్చు. ప్రతివ్యక్తి ఈశ్వరకల్పానుసారము తన తత్త్వమునుబట్టి వీలగుకీని 'ఆదర్శమూర్తి' అగుటకు నిత్యము కృషిసలుపుచునే యుండును. ప్రతివ్యక్తి తాను చేయవలసినపని ఏదో కనిపెట్టి తద్వారా 'ఆదర్శరూపము' పొందుచుండును. ఇందుకొఱకే మన మనేకజన్మ లెత్తుచుందుము. అనఁగా ప్రతివ్యక్తి తాను చేయవలసిన పని ఏదో కనుగొని దానికి వ్యతిరేకముగనున్న పరిస్థితులతో పోరాటము సల్పుచు, తనలో నిబిడీకృతమైయున్న శక్తులను మేల్కొల్పి వాని నుపయోగించి తనపని నిర్వహించుకొనఁగలుగును.

ఈ పనిచేయుటకు మనకు భౌతికశరీర మవసరము. ఈశరీరము, మనలక్ష్యసాధనకు సహాకారిగనుండునో లేక ఆటంకముగనుండునో అందలి నిర్మాణాంశములనుబట్టి యుండును. ఈ నిర్మాణాంశము లేవియు యాదృచ్ఛికములుగావు. నిర్మాణదేవతలు మానవునికి తన 'విధి' నిర్వహణమున ఎక్కువగ సహాయము చేయుదురు. ఈ అదృశ్యదేవతలే, మానవుఁడు 'పవిత్తుచల్లిన దాని కనుగుణమైన ఫలమును పొందును.' అనెడి బృహాన్న్యాయసూత్రమును సక్రమముగా పాలించు 'కర్మదేవతలు.' వీరు 'జీవితము' అనెడు విద్యాలయమున జీవి పాఠము నేర్చుకొనుటకు కర్మముప్రసాదించిన శరీరముతో తన విధ్యుక్తధర్మమును సక్రమముగా నిర్వహించుటకు తగిన కొన్ని మూలాంశయములను తలిదండ్రుల ప్రకృతి నుండి ఎంచి శరీరనిర్మాణముచేయుదురు.

కర్మదేవతలు మానవుని నిగ్రహించుటయనునదిగాని అనుగ్రహించుట యనునదిగాని యుండదు. జీవికి ఒకజన్మ సొంతమగునరికి మొత్తముమీఁద సంచితము కొంతవఱకైన క్షయమయి, ఒకఅడుగైనను ముందునకు వెళ్లుటకు తగిన సర్దుబాట్లు మాత్రము చేయుచుందురు. మానవునికి వారు సుఖదుఃఖముల నిచ్చినను, అవకాశవిపత్తులవిచ్చినను ఒక్క విషయము మాత్రము తప్పక మనస్సులో నుంచుకొని వ్యవహరింతురు. అదేమన - ప్రస్తుతస్థితిలో మానవుని చరమలక్ష్యము తాను ఎప్పటికైనను 'ఆదర్శ మూర్తి'గ రూపొందుటయే. 'ఆదర్శమూర్తి' అయిననాఁడు చెప్పలేని ఆనందము అనుభవింపఁగలఁడు; కాని అంతవఱకు అతనికి అనేకవిధము లైన అనుభూతులు కలుగుటకొఱకు అనువైన పరిస్థితుల నేర్పాటుచేయు చుందురు.

పిండోత్పత్తికి బీజాంకురమైనప్పుడే కర్మదేవతలు అవసరమైన మూలాంశములను ఎంచెదరు. ఆతని పరిణామస్థాయిరీత్యా పదో ఒక ప్రత్యేకత కలిగియుండవలెనన్న - అనఁగా మాటకు మంచిగాయకుఁడు కావలె ననినచో - దానికి తగిన మూలాంశములను ఎంచి ప్రథమబీజములో ప్రవేశపెట్టెదరు. గాయకునకు మంచి సున్నితమైన నాఁడీకేంద్రము, అభివృద్ధిచెందిన శ్రోత్రేంద్రియము కావలెను. గర్భపిండము రూపొందు చుండగా ఇట్టి ప్రత్యేకమూలాంశములను ఎంచి ఉంచెదరు. ఆజీవికి కొంత

అవరోధము లేక వైకల్యము ఏర్పాటుచేసినచో అతనిలోని అంతరంగికశక్తి రగుల్కొల్పఁబడునని లేదా కొన్ని కష్టములకు గుఱిచేసినచో అతని స్వభావము పరిశుద్ధ మగునని తోఁచినచో దానికి తగిన మూలాశయ మును కూడ దత్తముచేయుదురు. అనఁగా శరీర దౌర్బల్యమువంటి ఏర్పాట్లు చేయుదురు. అదియునుగాక ఒకజీవి, వెనుకటిజన్మలలో గణిత శాస్త్రమునందు ఎక్కువ అభిరుచి కనుపఱిచినవాఁడయి ఈజన్మలో ఆ శాస్త్రమున ప్రతిభావంతుఁడుకావలసియున్నచో అట్టి ప్రతిభకు పనికివచ్చు మేధాశక్తిని మొదటిబీజములోనే ప్రవేశపెట్టి దానిని క్రమక్రమముగా గర్భకోశములోని పిండముతోపాటే పటిష్ఠముచేసెదరు.

జీవి నిర్వహింపవలసిన కార్యమును పురస్కరించుకొని అందుకు తగిన మూలాంశములను కర్మదేవతలు ఏర్చి ఏర్పాటుచేసెదరు. నూతనభూభాగ ములు కనిపెట్టు అభిరుచిగలవానికి మంచివీర్యశక్తి, అదృశ్యశక్తులను పరిశీ లించి తెలిసికోఁగలబుద్ధి కలిగి తద్ద్వారా మానవసంఘటన కుపయోగపడు వారికి మంచిమానసికశక్తి, బాధలు కష్టములు అను వానివలన అభ్యుదయ ముచెందవలసినవారికి ఒకవిధమైనదౌర్బల్యము, మొదలైన అంశములను కర్మదేవతలు ఆ యా మానవులకు సంక్రమింపఁజేయుదురు. ఒకవ్యక్తి మహామేధావిఅగుటకు ఇంకొకవ్యక్తి ముసలాగ్రబుద్ధి అగుటకు తగిన శరీరములు వారే నిర్మాణముచేసిరి. ఇట్లుచేయుటలో న్యాయదృష్టి ఈష న్మాత్రముకూడ వీగిపోకుండ నుండునట్లు చూచుచు సంపూర్ణమైన కరుణా విచక్షణత గలిగియే సర్వకాలములలోను కర్మదేవతలు వ్యవహరింపఁగలరు. మానవునికి సుఖదుఃఖములు, మంచిచెడ్డలు కలుగఁజేయుట వారిపనికాదు. తన 'ఆదర్శమూర్తి'గా రూపొందుటవలన మానవుఁడు ఒక అడుగు ముందుకు పోవుటకొఱకు అతనికి అన్నివిధముల తోడ్పడుటయే వారు తమ విధ్యుక్తధర్మముగా ఎంచుకొనెదరు. లాభనష్టములు. సంతోషవిచార ములు, సదవకాశములు, లోపములు మొదలగున వన్నియు మానవుఁడే తాను తాత్కాలికముగ నిర్మించుకొను వసతికొఱకు సిద్ధముచేసికొన్న 'యిటుకల' వంటివి. వీనిని బలపఱుచుటగాని, తగ్గించుటగాని కర్మ దేవతల పనిగాదు. ఈ కర్మములవలన ఉత్పత్తియగు శక్తులను, కర్మ దేవతలు సర్దుబాటుచేయుచు, జీవి, జన్మపరంపరలలో 'ఆదర్శమూర్తి'గ త్వరితగతిని రూపొందుటకు తగిన దోహదము చేయుచుందురు.

ఒక వ్యక్తి అనుభవించుటకుగాను అతనిపుట్టుకతో నీయఁబడిన 'ప్రారబ్ధ'కర్మమును మార్చుటకు వీలులేదనికాని అది అతికర్కశమైనదనిగాని ఊహింపఁగూడదు. ఒకానొకప్పుడు మానవుఁడు కొన్ని అసాధారణపరిస్థితుల ప్రాబల్యమువలన తన 'ప్రారబ్ధ'కర్మమునందు కొంతమార్పుతీసికొనిరాఁగలుగును ఉదాహరణకు :— ఒక మానవుఁడు లోనైయున్న పరిస్థితులు బాహ్యముగాను ఆంతరంగికముగాను ఎంత విషమపరిస్థిలో నున్నట్లు మన కగపడినను అతని ప్రారబ్ధకర్మమునమాత్రము 'ఆత్మహత్య' అనునది నిర్ణయింపఁబడదు. ప్రతిమానవుఁడు తన 'బాధలు', 'దుఃఖము', 'చిరాకు' మొదలైనవానితో నిత్యము పోరాడుచు ఏలాగుననో వాని అధిగమింపవలెననియే, ఈశ్వరసంకల్పము ; కాని వానికి లొంగిపోయి జీవితముపట్ల నిరాశ చెందు మని ఈశ్వరోద్దేశము కాదు. ఒక్కొక్కప్పుడు ప్రారబ్ధకర్మముతో నిమిత్తములేకుండ తలవనితలంపుగ ఒక మహావకాశము కలగవచ్చును - అనఁగా - తనకు ఏమిసంబంధములేని ఒకానొక మతగురువుప్రబోధము తనకు నచ్చి తద్వారా తన యభ్యుదయానికి కదొక గొప్ప అవకాశముగా పరిణమింపవచ్చు. తన ప్రారబ్ధకర్మమున ఏర్పాటుచేయఁబడకపోయినను, ఇతరుల పనివలన తన కర్మగతిలో మార్పు కలుగవచ్చు. ఇట్టి సంఘటనలు జీవికి లాభదాయకమైనను కాకపోయినను ఆచరణమునలేని కర్మమెక్కువగా నిలవలోనున్నదనియు, ఈ నూతన సంఘటనల కర్మము దానికి చేరుటయో దానినుండి మినహా

యింపఁబడుటయో జరుగుచుండుననియు, అందువలన ఏవిధమైనపక్షపాతముగాని, అన్యాయముగాని జరగకుండ నివారింపఁబడుచుండునని తెలిసికోవలసియున్నది.

'కర్మ'పలువిధములు. వ్యక్తులకు, సాధారణముగ అన్నింటితోనుగాక కొన్నింటితోమాత్రమే సంబంధముండును. 'రాగద్వేషము'లే సాధారణ 'కర్మబంధములు'. ఇవిగాక జాతిమతకులవ్యవస్థలు కూడ 'కర్మబంధము'నకు చెందినవే. ఉదాహరణకు:- బ్రాహ్మణకులములో పుట్టిన

## కర్మ సిద్ధాంతము

### "కర్మ" = పనిచేయుట.

| పూర్వజన్మలలోని. | | ప్రస్తుత జన్మలో |
|---|---|---|
| సేవాకార్యములు | ఇచ్చునట్టిది | మంచి పరిస్థితి |
| హానికరమైనపనులు | " | దుష్టం పరిస్థితి |
| సదాశయములు కోరికలు | " | శక్తి సామర్థ్యములు |
| నిలిపిన సంకల్పములు | " | శీలము |
| విజయములు | " | ఉత్సాహము |
| అనుభవములు | " | జ్ఞానము |
| బాధకరమైన అనుభవములు | " | ఆర్జవము |
| సేవాదీక్ష | " | ఆధ్యాత్మికత |

మానవుడు ఎట్టి విత్తును నాటితే
అట్టి ఫలమునే పొందును
గెలి. VI. 7.

(38 వ పటము)

వ్యక్తి ఆకులస్థులందఱికి సంబంధించిన సమిష్టి మంచిచెడ్డల యందు కొంతవఱకు భాగస్వామి అగును. ఒకప్రత్యేక జాతిలో పుట్టినవ్యక్తి ఆ జాతి అనేకశతాబ్దాలుగా కూడఁ బెట్టిన సమిష్టికర్మసంబంధములగు లాభనష్టములను పొందును. ఇదిగాక 'ఒకప్రత్యేకమైన' పనికి సంబంధించిన కర్మముకూడ ఒకబంధముగ నేర్పడును. 'పెరికిల్సు' అనుచరులుగాని, 'సీజరు' నమ్మినబంట్లుగాని తమ నాయకుఁడు తిరిగి జన్మ మెత్తి మొదటినుండి తాను కలలుకనుచున్న జీవితలక్ష్యమును సాధింపఁబూనుకొన్నచో 'ఈప్రత్యేకకార్యము' కర్మ బంధమువలన ఆపనిలోకి ఆకర్షింపఁబడి అతనితో పాటు కలిసి పనిచేయుదురు. వీరి యుభయుల మధ్యమునను 'అనురాగము'నకు సంబంధించిన 'కర్మబంధ'ము లేక పోయినను 'ఈ ప్రత్యేకకార్యా'కర్షణమే 'బంధముగ'పరిణ మించి 'కలిసి' పనిచేయుటకు సహాకరించును.

జీవి కర్మమనిగాని తత్కార్యకరణమనిగాని చెప్పఁ బడెడి విషయము సువిస్తృతమైనది. ఇట్టిదానిని సంక్షిప్త పఱిచి వ్రాయునప్పుడు స్థూలముగమాత్రమే సూచించుట సాధ్యమగును. 'కర్మ' గతినిగూర్చి తదంతరార్థమును గూర్చి పూర్తిగా తెలిసికొనవలెనన్న 'జీవన్ముక్తుని' జ్ఞాన మవసరము. 'కర్మ'సూత్రములు అవగాహనము చేసికొనఁ గలిగిననాఁడు మనలనుగూర్చియు, జీవితలక్ష్యమునుగూర్చియు, మనకుఁగల భావములలో విప్లవాత్మకమైన మార్పులు రాఁగలవు. దివ్యజ్ఞానము నైతికాధ్యాత్మికదృక్పథముతో

పూర్తిగా సంబంధించినది ; కావున కర్మసిద్ధాంతమునుగూర్చి మనకు తెలిసినవిషయములను 44 వ పటములో తెలియఁ జేయఁబడినదానికన్న సంక్షిప్తముగాను ఉపయుక్తముగాను తెలియపఱుచుట సాధ్యముకాదు.

ఓ ప్రేమశక్తి! నీవు నేను కలసి ఈశ్వరునితో రహస్య ముగ మంతనములు జరిపి ఈ దుఃఖభాజనమైన ప్రణా ళికను అవగాహనముచేసికొని, దానిని ముక్కు ముక్కలుగా బ్రద్దలుకొట్టి, మనము హృదయపూర్వ కముగ కోరునట్టి రూపములో పునర్నిర్మాణము చేయుదమా.

ఈ ప్రణాళిక యావత్తు ప్రేమతోను సౌందర్యము తోను మిళితమై యుండవలె నని కోరి తయారుచేసిన మహానుభావుఁ డొకఁ డున్నాఁడు. కాని ఈనాఁటి మానవ పరిణామస్థాయిలో ఆ పథకము 'స్వర్గలోక'ములోనే యున్నది. కాని భూలోకములోనికి దిగలేదు. ఏనాఁడు స్వర్గలోకములోవలె భూలోకములో ఆతని 'ఇచ్ఛ' పూర్తిగ చలామణికాఁగలదా అని అతఁడు వేచియున్నాఁడు. ఈశ్వ రాంశసంభూతులైన కోటానకోట్ల జీవు లందఱు ఆయనతో సహకరించి ఆయన కోరికప్రకారము ఈ ప్రస్తుతప్రణాళిక లను తుత్తునియలుచేసి తిరిగి ఆయన సంకల్పముప్రకారము రూపొందించుటకు సిద్ధముగ నున్నప్పుడే 'అట్టి' సుదినము రాఁగలదు. ఆయన సృష్టికర్త మాత్రమే కాఁడు ; 'లయకర్త' కూడ అయియున్నాఁడు. ఇంతవఱకు సృష్టించినవి, 'లయము'

చేసి పునస్సృష్టి చేయఁగలఁడు. 'విశ్వము'నఁగా అది ఆయన 'కర్మ' కార్యకలాపముల విరాట్స్వరూపము. వారి ననుసరించి పనిచేయుట మనకర్తవ్యము. అందువలన ఈ 'లయ' క్రియలో వారికి మనము హృదయపూర్వకముగ సహకరింపవలె. ఆ విధానము ఎల్లప్పుడు రహస్యముగ మనకు ఆయన తెలియపఱుచుచునేయున్నాఁడు. ఆయన హృదయస్థితసంకల్పసత్యస్వరూపము మనకు సాక్షాత్కరించి, ఈనాఁడు ఆచరణలో నున్న పథకమును రద్దుచేసి, అంతకన్న మిన్నయగు నూతనప్రణాళికలను మానవాభ్యుదయముకొఱకు సృష్టింపవలయునని మనము కాంక్షించినచో అనాఁడు మనము చేయు ప్రతి 'కర్మ' మీశ్వరార్పణముగను ఈశ్వరునికర్మవలెను ఎట్లుండఁగలదో ఊహించి రూపొందించుకోఁగలము.



# 5 అధ్యాయము

## అదృశ్యలోకములు

మన అందఱి జీవితములపైన మనచుట్టునుండు ప్రపంచ ప్రభావ మెక్కువగ నుండును. మనజ్ఞానము చాలవఱకు ఈదృశ్యప్రపంచమునకు సంబంధించినదే. ఈ జ్ఞానమును పంచజ్ఞానేంద్రియములద్వారా సంపాదింపఁగలుగుచున్నాము. ఇందులో నేయింద్రియము లోపించినను ఆ మేరకుజ్ఞానమునఁ గూడ లోటు ఏర్పడును. ఈ జ్ఞానమును మనము నిత్యము గ్రహించుచున్నాము. కాని ఇట్లు జ్ఞానేంద్రియములతో జ్ఞానమును సేకరించుచున్నాము. ఇట్లీజ్ఞానము సేకరించుట యందు బహుక్లిష్టమైన విధానము ఇమిడియున్న దని మనము గ్రహింపలేకపోవుచున్నాము. అథమపక్షము మనము గ్రహించి తెలిసికొన్నవిషయములు, దృశ్యప్రపంచజ్ఞానము నకు సంబంధించిన వానిలోకూడ బహుస్వల్పభాగము మాత్రమే యని మనము గ్రహింపలేదు.

చక్షురింద్రియముద్వారా మనము సేకరించిన జ్ఞానమునుగూర్చి కొంచెమాలోచింతము. ఒకవస్తువును 'చూచుచున్నాము' అనఁగా అర్థమేమి? వస్తువు నెదుటిభాగమునుండి ప్రసరించు 'తేజఃస్పందము'లకు మనచక్షువుల 'ప్రతిస్పందన' (Response) అని దీని యర్థము. ఈ స్పందములను మనలోని

చైతన్యశక్తి 'రూపభావవర్ణములు'గ గ్రహించును. మనము వస్తువుఎదుటిభాగము మాత్రము చూడఁగలము. కాని వస్తువంతయు ఒక్కసారి చూడలేము. మన కన్నులు 'వెలుఁగుతరంగము'లకు ప్రతిస్పందించుటవలననే మనము చూడఁగలుగుచున్నాము. వెలుఁగన నేమి? ఈ ప్రశ్నకు వచ్చెడి సమాధానముబట్టియె సమస్తవిశ్వమునందు దృశ్య ప్రపంచము స్వల్పాంశముమాత్రమే అనియు, అదృశ్యమైన నదియే ఎక్కువభాగమనియు, మనకు తెలియఁగలదు.




(45 వ పటము)

45 వ పటములోని బొమ్మనుబట్టి వెలుఁగునుగూర్చిన ముఖ్యవిషయములను మనము తెలిసికొనఁగలము. వెలుఁగు అనెడిది ఒక'స్పందము'. వెలుఁగువలన ఉత్పత్తియగు రంగు దాని ప్రస్పందపౌనఃపున్యము (frequency of vibration) పైన ఆధారపడియున్నది. మనము వస్తువులను చూచుటకు కావలసిన వెలుఁగు సూర్యునినుండి వచ్చుచున్నది. సూర్యుని లోనుండి వివిధగతులతో కంపించెడి స్పందసముదాయము

లనేకములు నిత్యమును పైకి త్రోసివేయఁబడుచుండును. వానినే శ్వేత తేజఃకిరణసముదాయము లని మన మందుము. ఇట్టి కిరణము ప్రసరించు మార్గమున క్రికచాయుతము (అనగా త్రిభుజాకారపు గాజుస్ఫటికమువంటిది (prism) నొకదానినుంచినచో ఆ గాజు కణములు ఈ 'శ్వేత తేజ' స్సముదాయములను వానికి సంబంధించిన స్పందములను విడఁగొట్టును. అవి మన నేత్రాంతఃపటలము (retina) పై పడినప్పుడు మనలో ఆస్పందములు రంగుభావమును కలిగించును. మన కన్నులకు ఏడురంగులు మాత్రమే అందులో కనపడును. అది ఎఱుపు, నారింజ, పసుపు, ఆకుపచ్చ, ఊదా, నీలము, వయొలెట్ (లేఁత ఊదా.) అను రంగులు. ఈ సప్తవర్ణములు, వాని వివిధచ్ఛాయలు, వాని మిశ్రమములు, అన్నియు కలిసి ప్రపంచములో పలురంగులుగా రూపొందినవి.

మనము చూడఁగలిగిన వెకాక ఇంకను ఎన్నో రంగులు ప్రపంచములో నున్నవి. మన నేత్రములు గ్రహింపఁగల కొన్నిరంగులమాత్రమే మనము చూడఁగలము. ఏలయన మనదృష్టి పరిమితమైనది. సప్తరంజనములో (spectrum) ఎఱుపు మొదలు వయొలెట్‌వఱకు మనకగపడును. కొంతి మందిమాత్రమే ఊదా వయొలెట్ రంగుల మధ్యముననున్న నీలము (indigo) ను చూడఁగలరు. అంగుళమునకు 38000 స్పందములకు మించని ఎఱుపుతో, 62000 స్పందములకు తక్కువకాని వయొలెట్‌తో కూడిన 'సూర్యస్పందములకే'

మన కన్నులు ప్రతిస్పందించి వానిని అట్టి రంగులుగ గ్రహింపఁగలవు. 'ఎఱుపు' రంగునకు పూర్వము వయొలెట్ రంగునకు తరువాత కూడ రంగు ఉన్నదని ఒకచిన్నప్రయోగము వలన మనకు తెలియఁగలదు. మన మారంగు స్పందములకు ప్రతిస్పందింపలేనికారణమున వానిని చూడలేము. 'ఎఱుపు' రంగునకు పూర్వమున్న 'ఇంఫ్రా రెడ్' (infra - red) కిరణములదారిలో కాల్చిన గాజుపలక నొకదానినుంచి ఆకిరణములు ఏకకేంద్రాభిముఖము (converge) లగు చోట భాస్వరపు ముక్క నొకదానిని పెట్టినచో ఆ వేఁడివలన భాస్వరము అంటుకొనును. ఇందువలన సప్తరంజనములలో ఎఱుపురంగునకు పూర్వము 'ఉష్ణము'నుత్పత్తిచేయు స్పందము లున్నట్లు స్పష్టమగుచున్నది. ఈలాగుననే సప్తరంజని రెండవచివఱ నొక తెర వేసి వయొలెట్ కిరణములను మూసివేసి దాని తరువాతభాగములో 'ప్లాటినోసైనైడు' అను పదార్థము పూసిన పళ్లెము నొకదానినిగాని తెరనుగాని ఉంచినచో ఆపళ్లెము లేక తెర 'అల్ట్రావయొలెట్' (ultra - violet) కిరణముల ప్రభావమువలన తీవ్రముగ ప్రకాశించును. దీనినిబట్టి సూర్యకిరణములలో మన సాధారణచక్షువులకు కనపడని 'ఇన్ఫ్రా రెడ్' 'అల్ట్రావయొలెట్' రంగులు గలవని తెలియుచున్నది. మన మీరంగును చూడఁగలిగినచో చిత్రవిచిత్రములైన పలురంగులతోడను వాని సుందరచ్ఛాయతోడను విరాజిల్లుచున్న ప్రకృతిశోభను గాంచి ఆనందింపఁగలము.

ఈప్రకారమే మన శ్రవణేంద్రియముకూడ పరిమితమైనదై యున్నది. మనము వినలేనంత పెద్దధ్వనులు (శబ్దములు) మనకువినఁబడనంత చిన్నధ్వనులు కూడ ప్రకృతిలో నున్నవి. ధ్వని గాలిలోని తరంగములవలన ఉత్పత్తి యగుచున్నది. ఆర్గను (సంగీతవాద్యపు పెట్టె) మంద్రస్వరములో సెకండునకు 16½ ధ్వనితరంగములు కలవు. ఏకొద్దిమందికో ఈశబ్దము వినఁబడవచ్చు. సెకండునకు 40 ధ్వనితరంగములకు తక్కువగా ఉత్పన్నమగుశబ్దము మానవునికి సాధారణముగ వినఁబడదు. ఆలాగుననే ఇరువదివేల ధ్వనితరంగములకు మించిన శబ్దము వినలేము. ఐనను 40000 ధ్వనితరంగముల శబ్దమునుకూడ వినఁగలిగినవారు కొలఁదిమంది కలరు. మన శ్రవణేంద్రియమందున్న లోపమువలన కొన్నిధ్వనితరంగములకు లోపుగాఁగాని, మించిగాని యున్న శబ్దము మనకు వినఁబడనంతమాత్రమున అట్టి శబ్దము ఉండుట అసంభవమని అట్టివారిలో కొందఱు భావించెదరు. అట్టి శబ్దమున్నట్లు నున్నితమైన శ్రవణేంద్రియముకలవారు ప్రత్యక్షముగ గ్రహింపఁగలరు.

గాలిలోను, ఆకాశమునందుఁ గల స్పందములవలన ప్రకృతిలో కలుగుచున్న ఫలములనుగూర్చి స్థూలముగ తెలియుపఱుచు స్పందముల పట్టిక యొకటి 46 వ పటములో కలదు. ఒకలోలకము సెకండునకు రెండుసార్లు ఊఁగిన సెకండునకు రెండు స్పందములు. ఆలాగుననే 4 సార్లు, 8 సార్లు ఇట్లే సారెసారెకు వెనుకటిదానికన్న రెండురెట్లు ఎక్కువ ఊఁగిన

## స్పందముల జాబితా

లోలకముయొక్క ఊపు ప్రారంభం, సెకండుకు ఒక ఊపు ఊగే లోలకము

| మెట్లు | సెకండుకు స్పందములు | |
|---|---|---|
| 1 | 2 | సెకండుకు స్పందములు |
| 2 | 4 | |
| 3 | 8 | |
| 4 | 16 | |
| 5 | 32 | మానవుడు వినగలిగిన ధ్వని. |
| 6 | 64 | |
| 7 | 128 | |
| 8 | 256 | |
| 9 | 512 | |
| 10 | 1 024 | |
| 15 | 32 768 | మానవుడు ఇంతవరకే వినగలడు |
| 20 | 1 045 576 | |
| 25 | 33 554 432 | |
| 30 | 1 073 741 824 | |
| 35 | 34 359 738 368 | విద్యుచ్ఛక్తి కెరటము ఆఖరు |
| 40 | 1 099 511 627 776 | |
| 45 | 35 184 372 088 832 | వెలుగు కెరటాలు మానవునికి కనబడుట ప్రారంభమగును. |
| 50 | 1 125 899 906 842 624 | → మానవుడు ఇంతకన్న వెలుగు కెరటాలు చూడలేడు. |
| 55 | 36 028 797 018 963 968 | |
| 56 | 72 057 594 037 927 936 | |
| 57 | 144 115 188 075 855 872 | |
| 58 | 288 230 376 151 711 744 | ఎక్సరే కెరటాలు ప్రారంభం |
| 59 | 576 460 752 303 423 488 | |
| 60 | 1 152 921 504 606 846 976 | |
| 61 | 2 305 843 009 213 693 952 | |
| 62 | 4 611 686 018 427 387 904 | |
| 63 | 9 223 372 036 854 773 608 | |

(46 వ పటము)

నాఁడు సెకండునకు ఉత్పత్తిచేయు స్పందములుకూడ అల్లె క్కువగును. ఇట్లే గాలిలో ఉత్పత్తియగు తరంగములసంఖ్య 46 వ పటములోని 5 వ మెట్టువఱకు వచ్చినప్పుడుమాత్రమే ఆశబ్దములను మనము వినఁగలుగుదుము. అంతకుపూర్వము శబ్దము మనకు వినఁబడదు. ఇట్లు 13 మొదలు 25 వ మెట్టు వఱకు 46 వ పటములో తెలియఁజేయఁబడిన శబ్దమును వినఁ గలము. ఆపై మెట్లలోని ధ్వనితరంగములకు సంబంధించిన శబ్దమును మన శ్రవణేంద్రియము గ్రహింపలేదు. ఆపై మెట్టునకు సంబంధించినవి విద్యుత్తరంగములు. అవి ఆకాశ పదార్థము (æther) పై తమ ప్రభావమును కనపఱిచి

'వెలుఁగు'ను ఉత్పత్తిచేయఁగలిగినప్పుడే చూడఁగలము. ఒకతీఁగెలో ఎంతశక్తిమంతమైన విద్యుచ్ఛక్తి ప్రసారమగుచున్నను ఆశక్తి యున్నట్లు మనకు తెలియదు. కాని ఆ శక్తికి నిరోధమేర్పడి ఆకాశపదార్థములో తీవ్రమైన సంచలనము కలిగి 'వెలుఁగు'గా మాఱినప్పుడు ఆతీఁగెలో విద్యుచ్ఛక్తి ప్రసరించుచున్న దని మనకు తెలియఁగలదు. (ఇది 45 మొదలు 50 మెట్లవఱ్ఱ కలుగును). పటములో ఈ విషయములు బాగుగ తెలియఁజేయఁబడినవి. ఇంతవఱకు విజ్ఞాన శాస్త్రము అంగుళమునకు 400 తరంగములు మొదలు, అంగుళమునకు 2½ లక్ష లతిసూక్ష్మమైన తరంగములవఱకు కనిపెట్టినది. ఈ సూక్ష్మమైన తరంగములు విద్యుచ్ఛక్తి ప్రసారప్రభావమువలన ఉదజనినుండి ప్రసరించు స్పందములలోఁ గలవు. మనము మనకుఁగల అన్ని ఇంద్రియముల ద్వారా ప్రపంచములోని స్పందములలో తొమ్మిదవవంతు మాత్రమే (⅑ వ భాగము మాత్రమే) గ్రహింపఁగలము. అనఁగా ఇంతవఱకు విజ్ఞానశాస్త్రము కనిపెట్టి మనకు తెలియఁ బఱచినది మొత్తము విశ్వములో 8 వ వంతు మాత్రమే. మిగిలిన 7 పాళ్లు మన ఇంద్రియములకు అతీతమై సాధారణ బుద్ధితో గ్రహింప నలవికాకుండనున్నది.

మన నాడులు (నరములు) ఇప్పటివలె వెలుఁగుతరంగములకుఁగాక విద్యుత్తరంగములకు ప్రతిస్పందింపఁగలవని ఊహించినచో ఇప్పుడు మనకు కనపడు భౌతికప్రపంచము ఎంత భేదముగ నుండును! అప్పుడు సూర్యుఁ డున్నను సూర్య

కాంతి యుండదు. మన చుట్టునున్న వాతావరణము అస్పష్టముగ నుండును. ఎచ్చట ఏరూపములో విద్యుచ్ఛక్తి యున్నను మనము 'చూడ'(గలము. మనము విద్యుచ్ఛక్తిని తీ(గలలోనికి వదలినప్పుడు అచ్చటి స్థలము విద్యుచ్ఛక్తి దీపము (bulb) వలన(గాక తీ(గలలో ప్రసరించెడు విద్యుచ్ఛక్తివలనను, ఆస్థలమునందున్న వస్తువులు ప్రసారముచేయు స్తబ్ధ (static) విద్యుచ్ఛక్తివలన ఆస్థలమంతయు కాంతివంతమగును. మన ఇంద్రియములు విద్యుత్తరంగములను గ్రహింప(గలిగినచో ఈనాడు విద్యుచ్ఛక్తిని ప్రసారముచేయుచున్న తీ(గెల యవసరమే యుండదు 'ఎలెక్ట్రాన్లు' 'ప్రోటాన్లు' నుండి ప్రసారమగు వెలు(గువలననే మనము వస్తువులను 'చూడ'( గలము. అట్టిస్థితిలో 'పగలు' 'రాత్రి' అను భేదమే యుండదు. నిత్యము 'పగటివేళ' వలెనే యుండును.

రెండువిధములైన స్పందములతో ఒకవస్తువును పరిశీలించినచో ఆవస్తువు ఎంతమార్పుతో కనపడునో 47-48 బొమ్మలు చూచిన తెలియ(గలదు. ఈ రెండును సూర్యబింబపు ఛాయాపటములె. 47వ పటములోని సూర్యబింబము సాధారణచ్ఛాయాగ్రహణయంత్రము (photograph) యొక్క నెగటివ్ (negative) తో తీయ(బడినది. ఈ నెగటివ్ సూర్యబింబమునుండి వచ్చు తెల్లకిరణములను మాత్రము గ్రహించును. 48వ బొమ్మ స్పెక్ట్రోహీలియోగ్రాపుతో (spectroheliograph) తీయగా వచ్చినది. ఇందులో అమర్చ(బడిన ప్రత్యేకమైన సప్తరంజనము (spectrum)

వలన దీని నెగటివ్ సూర్యునిలోని కొన్ని ప్రత్యేకసందర్భము లను మాత్రము గ్రహించును. ఇట్టి ఛాయాపటము తీయు టకు సూర్యుని యుదజని ఆవిరినుండి వెలువడు వెలుఁగు స్పందములుమాత్రము ఛాయాగ్రహణయంత్రములోనికి ప్రవే శించు ఏర్పాటు చేయుదురు. కెమేరా (cemera) లు వేఱైన కారణమున సూర్యబింబపు ఛాయాపటములు భేదించినవి. ఈలాగుననే ఒకదుర్భిణీ (telescope) యంత్రమునకు సాధారణమగు కెమేరా ఇంకొకదానికి, స్పెక్ట్రోహీలియోగ్రాఫ్ అమర్చి పటములు కెమేరా తీసినచో ఒకేసూర్యుని పటములు రెండువిధములుగ నుండఁగలవు. ఆబింబపు గుండ్రదనము తప్ప తక్కినదిఅంతయు భిన్నముగా నుండును.

క్లేరువాయన్సులో నిమిడియున్న సూత్రమిదే. సాధార ణమానవుఁడు గ్రహింపలేని వివిధమైన స్పందములు మన చుట్టు నున్నవి. ఈ విశ్వములో కొంతభాగము మానవు లందఱు సాధారణముగ గ్రహింపనులేరు; చూడనులేరు; కాని ఆభాగమునుండి వెలువడు స్పందములకు ఏమానవుఁడు ప్రతిస్పందింపఁగలిగిన అతని కా భాగము వెల్లడియగును. అట్టి స్పందములను గ్రహింపఁగల శక్తినే క్లేర్వాయన్సు అందురు. అట్టి శక్తిఁగలమానవునికి మనకు కనఁబడని ఆ నూతనప్రపంచము గోచరించును. ఇట్టి సూక్ష్మదృష్టిగల వారి అందరియొక్క గ్రహణశక్తి సమానముగ నుండదు. ఇందులో కొంతమంది స్పష్టముగను కొంతమంది చూచాయ గను (అనఁగా ఒకమోస్తరుగ) గ్రహించెదరు. మన



47 వ పటము
సాధారణ కెమేరాతో ఫోటోతీసినప్పటి మచ్చలతో సహా
సూర్యుని ఛాయాచిత్రము




48 వ పటము
స్పెక్ట్రోహీలియోగ్రాఫుతో ఫోటోతీసినప్పటి
సూర్యుని ఛాయాచిత్రము

సాధారణదృష్టికి వర్తించుసూత్రములే ఈసూక్ష్మదృష్టికికూడ వర్తించును. ఇట్టి సూక్ష్మస్పందములను గ్రహించుటకు మానవుల మేధస్సు నాడులు ఎట్లుండవలెనో ఇంకను కనుఁగొనఁబడలేదు. విజ్ఞానశాస్త్రము, భావిలో యోగిపుంగవుల శరీరశాస్త్రవివరములను తెలుపఁగలిగినప్పుడు 'క్లైర్వాయన్సు'లో నిమిడియున్న సూత్రము లెక్కువ సుబోధకము లగును.

మన చుట్టునున్న ప్రపంచములో అదృశ్యముగనున్న అధికభాగమునుగూర్చిన వివరములు నేను స్వానుభవము వలననే చెప్పుచున్నాను. ఇది నా స్వయంకృషివలన ప్రత్యక్షముగ తెలిసికొన్న విషయము. నా మేధస్సులో ఏమైన వైపరీత్యముగాని ప్రత్యేకతగాని ఉన్నదేమో నాకు తెలియదు. నాకు సర్వకాలసర్వావస్థలయందు వర్ణింపనలవికాని ఒక అదృశ్యప్రపంచము నాలోను నా వెలుపలను ప్రతివస్తువునకు లోపల వెలపల అన్నిటిని చుట్టి యున్నట్లు నిత్యము గోచరించుచున్నది. అట్టి అనుభూతికొఱకు నేను ప్రత్యేక ప్రయత్న మేమియు చేయ నక్కఱలేదు. నా చర్మచక్షువులకు స్థూలప్రపంచ మెంత సులభముగ కాన్పించునో ఆ అదృశ్యప్రపంచముకూడ అట్లే గోచరించును. దీని కొఱకు ఏవిధమైన ఏకాగ్రత ప్రత్యేకముగ అవసరము లేదు. కాని అది కంటికి కనపడునది కాదు. బాహ్యదృష్టి ఆంతరంగికదృష్టి యనునవి రెండును వేఱు. రెండింటికి సంబంధము లేదు; కాని రెండు నొకేసారి పనిచేయఁగలవు. నేను

వ్రాయుకాగితములను నాకంటితో చూచుచున్నాను. అదే సమయమున నాలోని ఆ ఇంకొకటి–ఏమి పేరు పెట్టవలయునో తెలియుటలేదు – ఆకాగితములకు, బల్లకు, గది లోపల, వెలుపల ఆన వస్తువులద్వారా అదృశ్యప్రపంచమును 'చూచు' చున్నది. ఈ అదృశ్యప్రపంచము చర్మచక్షువులు తెఱచియున్నను, మూసియున్నను కూడ గ్రహింపవచ్చు. ఆ ప్రపంచము ఎప్పుడు మెఱయుచుండును. అందలి ప్రతిబిందువు (point) స్వయంజ్యోతివలె కనపడును. దీనికి, స్థూలప్రపంచములోని వెలుఁగునకు ఎంతో తేడాయున్నది. ఆప్రపంచము ఎప్పుడును కదలుచున్నట్లు కనుపించును. కాని ఆచలనము నాలుగవ పరిమాణము (Fourth dimension) ను సూచించుచు వర్ణింపనలవికాని పద్ధతిగ నుండును. నాదృష్టిలో, నన్ను నేను ఎఱిఁగియున్నంత స్పష్టముగ, అదృశ్యప్రపంచ మనునది ఈ స్థూలప్రపంచముకన్న మిన్నయైన సత్పదార్థ మని నిస్సందేహముగను, రూఢిగను చెప్పఁగలను. అదృశ్యప్రపంచము నొకసారి చూచి, ఆతరువాత చర్మచక్షువులతో ఈ భౌతిక ప్రపంచమును చూచినచో దానిలో భూమ్యాకాశములు, గృహములు మొదలైన వెన్నియున్నను ఈ భౌతికప్రపంచము శుద్ధమిథ్య లేక మాయ అని నాకు అనిపించును. ఇది 'సత్యము' అనుటకు తగిన గుణము లేవియు నాదృష్టికి గోచరించుటలేదు. ఈ అదృశ్యప్రపంచముయొక్క ఈ స్వల్పాంశముతో (అనఁగా నాదృష్టికి గోచరించుచున్నది అతిస్వల్పమైన భాగము) పోల్చిచూచునప్పటికి 'మనప్రపంచము'

'ఎండమావు' 'నీడ', 'కల' మాత్రముగకూడ నాకు గోచరించుటలేదు. నామెదడున ఉత్పత్తి అగు 'భావన' మాత్రముగ కూడ తోఁచుటలేదు. అయినను 'మన ప్రపంచము' కూడ కొంత 'సత్యమే'. ఇప్పుడే దానిపద్ధతిలో అదికూడ నిజమని నాకు తట్టినది. జావాపర్వతముల మధ్యమునఁగూర్చుండి ఈ గ్రంథము వ్రాయుచుండఁగా దోమలకాటువలని బాధ ఈ ప్రపంచముకూడ 'ఏదోవిధముగా' 'సత్యము' కాఁబోలు అని గుర్తునకు తెచ్చినది. నాలోని ఈ అతీంద్రియ శక్తిని అవకాశము లభించినప్పుడు అభివృద్ధిచేసికొనుటకు ప్రయత్నము చేయుదును. అప్పుడు దివ్యజ్ఞానసమాజము అదృశ్యప్రపంచములనుగూర్చి ఇంతవఱకు ప్రకటించినవిషయములకు ఇంకను మఱికొన్ని విషయములుజేర్చి అందీయఁగలుగునని ఆశించుచున్నాను.

దివ్యజ్ఞానసాంప్రదాయమునకు చెందిన శాస్త్రజ్ఞులు, భౌతికప్రపంచము యావత్తు విశ్వములోను అల్పమైన భాగమును మాత్రమే అనియు, దీనితో 'ఓతప్రోతము'గను దీనిని దాటి, దీనికావల అనేకదృశ్యప్రపంచము లున్నవని తమ అనుభవములో తేలినదని చెప్పియున్నారు. ఈ అదృశ్య ప్రపంచములుకూడ పదార్థముతోడనే నిర్మింపఁబడినవి గాని కేవలము కల్పనాచిత్రములు కావు. కాని ఈ పదార్థము మనము నిత్యమును చూచి అలవాటుపడ్డ భౌతికపదార్థముకంటె గుణములోను చిక్కఁదనములోను బహుసునిశితమైనది. ఘనపదార్థము ద్రవపదార్థము మనకంటి కగపడును. వాయు

పదార్థము గాలివలె తెలిసికొనుట అంతసులభముకాదు. మనకు ఆటంకముకలుగఁజేసి నప్పుడుగాని, లేదా ఊపిరి స్వేచ్ఛగా పీల్చుకొనుటలో నిరోధము కలిగినప్పుడుకాని, కొన్ని రకముల వాయుపదార్థములు ఉనికి మనకు తెలియఁగలదు. వాయుపదార్థముకన్న సున్నితమైన పదార్థమును భౌతిక శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు. దానిని 'క్రూక్సు' (crookes) అను విజ్ఞానశాస్త్రవేత్త 'తేజఃపరిసారము' కలిగిన పదార్థము (radiant matter) అని నామకరము చేసినకాఁడు. ఇదికాక 'గహనమై, మెఱయు ఆకాశ' పదార్థము (mysterious luminiferous æther) నొకదానిని కూడ కనిపెట్టినాడు. భౌతికపదార్థమునకు ఈపదార్థములకు గుణములలో ఎంతో భేదమున్నది. ఇట్టి బహుసునిశితమైన పదార్థములను గూర్చి పరిశోధన సల్పి దివ్యజ్ఞానము ఇదివఱకె తెలిపియున్నది. 49 వ బొమ్మలో అదృశ్యప్రపంచమునుగూర్చి కొన్నివివరముల నిచ్చియున్నాను.

మానవుఁడు ప్రత్యేకముగ ఏడులోకములతో సంబంధము కలిగియున్నాఁడు. తన సంపూర్ణజీవితములో కొంత భాగము ప్రతిలోకములోను గడుపును. క్రింది మూఁడు లోకములలోను ఆ యా లోకముల పదార్థములతో నిర్మింపఁబడ్డ మూఁడు వేర్వేఱు ఉపాధులద్వారా వానిలో పనిచేసి వానినిగూర్చిన జ్ఞానము సేకరించును. మన స్థూలశరీరము భౌతికపదార్థముయొక్క సప్తస్థితులకు సంబంధించిన పదార్థములతో నిర్మింపఁబడినది. ఆ శరీరముద్వారా భౌతికప్రపం

## సూర్యమండలమునకు చెందిన లోకములు

ఆదిలోకము
అనుపాదకలోకము
ఆత్మలోకము
బుద్ధిలోకము
మానసికలోకము
కామలోకము
స్థూలలోకము

(49 వ పటము)

చానుభూతిం బడయగలండు. ఇటులనే కామపదార్థముతో నిర్మింపంబడిన కామశరీరము మానసిక పదార్థముతో నిర్మింపంబడిన మానసికశరీరము, ఇంకను కారణశరీరము (ఉత్తమమానసిక పదార్థనిర్మితము), ప్రతిమానవునకు కలవు. (28 వ పటము చూడుండు.) భౌతికశరీరమువలెనే తదితరాదృశ్యశరీరములకు కూడ --- కన్న బహుక్లిష్టమైన శరీర

శాస్త్రము అంగనిర్మాణశాస్త్రము కలదు. మానసికలోక మునకు అతీతమైన లోకములలో మానవుని చైతన్యమింకను బహుశైశవదశలో నున్నందున ఆ యుక్తమోపాధు లింకను నిర్మింపఁబడవలసియున్నవి

49 వ పటములో చూపఁబడినట్లు ఈ లోకములన్నియు ఒకదానితోనొకటి సంబంధములేకుండగ నున్నవి. వేఁడి, వెలుఁగు, విద్యుచ్ఛక్తి మొదలైనవి కేవలము భౌతికప్రపంచ మునకు సంబంధించినవే అయినందున మానసికపదార్థముపై వానిప్రభావ మేమియు ఉండదు. భూలోకపదార్థమున కున్న ఘనద్రవవాయుస్థితులవలెనే ప్రతిలోకపదార్థమునకు కూడ నీపరిస్థితులు కలవు. ప్రతిలోకములో ఏడుపలోకములు కలవు. ఉపలోకములోని పదార్థములు స్థితులలో భేదించును. భౌతిక లోకపదార్థములో 'ఘన' 'ద్రవ' 'వాయు'వులను మూఁడు స్థితులేగాక ఇంకను నాల్గు స్థితులు గలవు. వానిని ఆకాశ (etheric) సూక్ష్మాకాశ (super-etheric) స్థూలాణు (sub-atomic) అణు (atomic) స్థితులని అనెదరు. 'ఈథరు' అనునది పదార్థపు సప్తస్థితులలో నొకటిగాని మనము సాధారణముగ అర్థముచేసికొను వెలుఁగుతరంగములను కొనివచ్చు 'శూన్యాకాశము' మాత్రము కాదు అన్నిటికంటె ఉన్నతమైన ఉపలోకమును 'ఆణవికోపలోక' మని నామకరణము చేసిరి. అందలి పదార్థములోని కణములు మాలిక్యూల్సు (molecules) కావు. అవి విభజింపవీలులేని సూక్ష్మాతిసూక్ష్మమైన అణు పరిమాణములు.

అదృశ్యప్రపంచములుకూడ ఇచ్చటనే మనలను చుట్టి యున్నవి. మనము చూచుప్రపంచముతో నిమిత్తములేకుండ వేఱుగ నింకొకచోట లేవు. భువర్లోకము :- అందు నివసించు వారలతో సహా, మన చుట్టునున్నది. కాని మనలో చాలమంది కావిషయము తెలియదు. అట్లే సువర్లోకముకూడ మన ప్రక్కనే యున్నది స్వర్గలోకపుచిత్రవిచిత్రములన్నియు. మనము వానిని చూచుటకు, వినుటకు శక్తియున్నచో మనమున్నచోటనే పనిచేయుచున్న వని తెలియును. మన నగరములలోను, ఇండ్లలోను, తోటలలోను వేయేల మనగదులలోను ఇతర ప్రపంచము లుండుట ఎట్లు సంభవము. ఒకేస్థలములో ఇన్ని లోకములుండుట సంభవమేనా ?

ఇది పూర్తిగా సంభవము. ఏలయన లోకములలో క్రిందిలోకముకంటె పైలోకములోని పదార్థము ఎక్కువ సూక్ష్మతను, నైశిత్యము గలిగియుండును. భూర్భువస్సువ ర్లోకములను, ఘనద్రవవాయుస్థితులకు పోల్చి చూచినచో ఈ మూఁడులోకములు ఒకేచోట నుండఁగలవని ఊహింప వచ్చు. ఉదాహరణకు ఒక సీసాను ఇసుకతో పూర్తిగా నింపవచ్చు కాని అది నిజముగ నిండలేదు. ఇసుకరేణువుల మధ్యమును సందులున్నవి. ఆసీసాలో నీరు పోయవచ్చును. ఆనీరు ఇసుకరేణువుల మధ్యమున నున్న గాలిసందులలో ప్రవే శించును. ఇంకను సీసా నిజముగ నిండలేదు. సీసాలోనికి ఇంకను గాలిని పంపవచ్చు. ఆగాలి జలాణువుల మధ్యమున నున్న సూక్ష్మరంధ్రములలో ప్రవేశించును. ఒకే సీసాలో

ఇసుక, నీరు, గాలి ఒక్కచోటనే ఒకే సమయములో నుండఁగలవు.

మనము ఇఁకనొక ఉదాహరణకూడ తీసికొనవచ్చును. ఒకపెద్దగదినిండ, పురాతనకాలమునాఁటి పెద్ద ఫిరంగిగుండ్లు చాలదగ్గఱగ పేర్పఁబడినవి అని అనుకొందము. అవి గుండ్రముగా నున్నందున వాని మధ్యమున చోటుండును. ఆచోటులో చిన్నచిన్న తుపాకీగుండ్లను సులభముగ పంపింపవచ్చును. ఇవియు గుండ్రనివి గనుక వీని మధ్యమున కూడ చిన్నిచిన్ని సందులుండును. ఈ సందులలోనికి క్రిములను పంపించినచో అవి సుఖముగ, నిరాటంకముగ అందులో తిరుగుచు నివసింపఁగలవు.

కొంతవఱకు ఈప్రకారముగనే మనచుట్టు, ఇచ్చటనే మూఁడులోకములు ఉన్నవి. ఘనద్రవవాయ్వాకాశపదార్థ నిర్మితమైన మనభౌతికప్రపంచము అంతయు సూక్ష్మరంధ్రమయముగ నుండును. దానిసూక్ష్మాణువుల మధ్యమున సందులు గలవు. ఈ సందులలో ఉత్తమలోకము లిమిడియున్నవి. వాతావరణములో అపురూపముగనుండు 'ఆర్గను' వాయువు జల్లెడక్రిఁగవలె నుండు త్రిఁగకంచెలోని సూక్ష్మరంధ్రములద్వారా ఏవిధమైన ఆటంకము లేకుండ లోపలకు వెలుపలకు తిరగఁగలదో, దేనితోను కలియని ఆర్గను అణువు, త్రిఁగెయుకంచె ఒకేచోట ఉండి మనకు తెలియకుండ నేలాగున నుండఁగలవో అలాగుననే, భూర్భువస్సువర్లోకవాసులు మన ప్రక్కనే మనసాన్నిధ్యములో, జీవితము గడుపుచున్నను

వారి ఉనికి మనకుఁగాని, మన ఉనికి వారికిఁగాని అసాధారణ పరిస్థితులలో తప్ప తెలియదు.

భువర్లోకసువర్లోకస్పందములను గ్రహించు సూక్ష్మ దృష్టికలిగి, సాధనాపరిశీలనలలో సుశిక్షితుఁడైన వ్యక్తి కలఁ డనుకొందము. అతనికి ఏమి కనపడును. బహువిధములైన సంఘటనలను విశేషముల నతఁడు చూడఁగలఁడు కాని అవి అవగాహన చేసికొనుట కనేకసంవత్సరములు పట్టును. అతనికి ప్రప్రథమముగ ఇదివఱకు చనిపోయిన, స్నేహితులు, ప్రియ బంధువులు, పరిచితులు, కాలమానసికశరీరములలో జీవ యాత్ర సాగించుచున్నట్లు కనుపించెదరు. వారు, ఎక్కడనో అతిదూరముగ నున్నవని మనము సాధారణముగ నూహించు స్వర్గ నరకములలో లేరు. వారు ఇచ్చటనే ఈ ప్రపంచా దృశ్య సూక్ష్మభాగములలో నివసించుచున్నారు. ఆ 'మృతజీవుల'లో కొందఱు మహానందముగను, కొందఱు స్వల్పసంతుష్టితోను, కొందఱు విసుగుఁదలగను, కొందఱు దుఃఖాక్రాంతులుగను కనపడెదరు. వీరందఱు వేఱువేఱు తరహాలకు చెందిన జీవులు. వీరు భువర్లోకసువర్లోకములలో వేఱువేఱు ఉపలోకములలో కాలముగడుపుచున్నారని అతనికి క్రమముగ తెలియఁగలదు. ఈ ఉపలోకములు భూమ్యుపరి భాగమును ముంచి ఎంతదూరమువఱకు వ్యాపించియున్నవో పరిశీలించి ఆ అదృశ్యలోకములను గూర్చిన శాస్త్ర మొకటి అతఁడు తయారు చేసికొనును.

భువర్లోకమునకు చెందిన అన్నిటికన్న క్రిందుగా నున్న ఉపలోకములో కఠోరమైన బాధ లనుభవించుచు కొందఱు స్త్రీపురుషులు కొంతకాలము గడపెదరు. ఆ ఉపలోకమును బహుశః 'నరకము' (hell) అని మతములు నిర్వచనము చేసియుండవచ్చు. దీనిపై అంతస్థులోని కొన్ని ఉపలోకములను 'అఘమర్షణలోకము' (purgatory) అనియు వానిపై దానిని 'వసంతలోకము' (Summerand) అనియు గణాచారులవలన ప్రేరేపింపఁబడిన గణములు వర్ణించుచుండును. దీనిపై లోకములో నివసించుచున్న 'మృతజీవులు' వర్ణింపనలవికాని సౌఖ్యమనుభవించెద రని ఎక్కువ అనుభముగల సాధకుఁడు తెలిసికొనును. ఇచ్చటివారు ఎవరిపుణ్యాశక్తికి తగిన సౌఖ్యమును వా రనుభవింతురు. ఇదే 'స్వర్గలోకము' అని ఆ సాధకునకు తెలియును. ఈ'స్వర్గము' గ్రంథములలో వర్ణింపఁబడినదానికంటె భిన్నముగను, విశ్వాసనీయముగను కనుపించును. ఈ అదృశ్యలోకజ్ఞానమునలన, జీవన్మరణరహస్యము ఆతనికి కొంతవఱకు సుబోధకము కాఁగలదు.

50 వ పటములో క్రింది మూఁడులోకములలో (భూర్భువస్సువర్లోకములలో) నివసించుచున్న వివిధవర్గములను సంక్షిప్తముగ తెలియఁబఱిచితిని. మూఁడు వేర్వేఱు పరిణామవర్గములకు చెందిన జీవు లీమూఁడులోకములలోను కలరు. (1) మానవవర్గము (ఇందు జంతువర్గముకూడ కలిసియున్నది); (2) ఖనిజ. భూతాత్మ (Elemental Essence) వర్గములు. (3) దేవతావర్గము. రెండవరకపువర్గమునకు

నిర్దిష్టమైన రూపము ఏర్పడని కారణమున వానిని అవగాహనము చేసికొనుట చాలకష్టము. భువర్లోకసువర్లోక పదార్థము మాత్రము, అనఁగా జీవాత్మగాక, ప్రత్యేకోపాధి యొక్క పదార్థమునకే ఒకవిధమైన చైతన్యము కలదు. ఆచైతన్యము

| త్రిలోక వాసులు | | | |
|---|---|---|---|
| ఉత్తమ స్వర్గము | జీవన్ముక్తులు దీక్షపొందువారు<br>పరిణామజీవులు<br>సాధారణజీవులు | సౌరాత్మ వర్గము | అరూప దేవతలు |
| అధమ స్వర్గము | దేవబాన్‌లోని మానవులు వ్యక్తీకరణ చెందిన జంతువులు<br>తాత్త్విక-కళాదృష్టి<br>మానవతత్వ<br>భక్త్యావేశ<br>ప్రేమపూరిత | చంద్రాత్మ వర్గము<br>సంకల్ప రూపములు | రూప దేవతలు |
| కామ లోకము | (నిద్రించుచున్న మరణించిన తరువాత కొద్దికాలము వరకు) మానవులు-జంతువులు<br>కామలోక శవములు "స్పూకు్స" | భూతాత్మ వర్గము<br>సంకల్ప రూపములు "భూతములు" | కామ దేవతలు<br>ప్రకృతి దేవతలు సిల్ఫులు |
| భౌతిక లోకము | అణు<br>ఉప అణు<br>సూక్ష్మాకాశ<br>ఆకాశ<br>వాయు<br>ద్రవ<br>ఘన<br>చర్చిదొడ్డి లోపవిదయ్యములు<br>మానవులు<br>జంతువులు<br>వృక్షములు | నీచ ఆకాశ-రూపములు "భూతములు"<br>ఖనిజ-జీవితము | ప్రకృతి దేవతలు<br>1. అప్దేవతలు<br>2. తేజో దేవతలు<br>3. నీటి సుందరులు<br>4. భూలోక సుందరులు<br>5. వృక్షసుందరులు |

(50 వ పటము)

నకు వ్యక్తిత్వము లేదు. కాని అది ప్రాణముతో తొణికిసలాడుచుండును. ఉదాహరణ :– ఒకగిన్నెలో నీరుపోసి దానిగూడా విద్యుచ్ఛక్తిప్రసారము చేసినచో జలకణములు ఎట్లు

చైతన్యవంతమగునో అదేప్రకారము భువర్లోక సువర్లోకము లలో పై చెప్పిన రెండవతరగతికి చెందిన ప్రథమ, ద్వితీయ, తృతీయ భూతాత్మవర్గముల (1st 2nd & 3rd elemental essence) వీర్యము, శక్తి కొంతవఱకు ఉండఁగలవని మనకు తెలియఁగలదు.

ఈ భూతాత్మవర్గము ఎల్లప్పుడును సందిగ్ధస్థితిలో (Critical state) నుండుచు మానవసంకల్పస్పంధములు తాకుటతోడనే, సంకల్పరూపములుగ మాఱుటకు సిద్ధముగ నుండును. కామమానసికపదార్థములనుండి 'భూతాత్మవర్గము' నిర్మించు సంకల్పరూపములు, ఆ సంకల్పపద్ధతిని, గుణబలము లనుబట్టి యుండును. ఈ సంకల్పరూపములలో కొన్ని బహు క్షణికములు కాని యవి కొన్ని మాసములకొలఁది సంవత్సర ములకొలఁది నిలిచియుండును. కాఁబట్టి అదృశ్యలోకప్రవా సుల పట్టికలో వీనినికూడ చేర్పవచ్చును. వీనినే 'భూతములు' (Elementals) అందురు.

భూలోకమునందలి 'ఆకాశ' పదార్థనిర్మితమైన ఉపా ధులుకూడ ఒకవిధముగ ఇట్టి పద్ధతికి చెందినవై యున్నవి కాని ఖనిజజీవితము కొంత భిన్నముగా నుండును. ఖనిజము నకు జీవోపాధుల ననుసరించి ద్వంద్వప్రతిపత్తిగలదు. ఉపాధి రూపములో అది అనేకరసాయనికభూతములుతో నిండియు న్నది. దాని 'జీవము' పరిణామము చెందుచున్నకొలఁది క్షేత్రగణితరూపములలో తన ఉపాధులను స్ఫటికములవలె నిర్మించుకొను సమర్థతను పొందుచుండును.

50 వ పటములోని రెండవభాగములో చూచిన యెడల భూలోకవాసులుగ, ఖనిజవృక్షజంతుమానవవర్గము లను చెందినవారు కలరు. మానవుల ఛాయాకాశరీరము లేక ప్రాణమయకోశము కొద్దివారములలోనో నెలలోనో జీర్ణించి పోవును. అయినను అట్లు నిలిచియున్న కొద్దిదినములు వానికి సంబంధించిన స్థూలశరీరముల సమాధులపై తేలి విహరించుచుండును. ఇవి ఆ స్థూలశరీరపుఆకారములోనే యుండును ; కాని ఇవి ఆకాశపదార్థము (either) తో నిర్మింపం బడియుండును. ఇవి రుద్రభూములలో. సునిశితమైన దృష్టికల వారికి కనపడి, మృతిచెందిన ట్లనిపించును.

మానవులయు జంతువులయు కామశరీరములు, వారు నిద్రించునప్పుడు తాత్కాలికముగ భువర్లోకములో తిరుగుచుండును. వారి వారి పరిణామస్థితినిబట్టి, ఆస్థితిలో కొందఱు సంపూర్ణముగను కొందఱు స్వల్పముగను ఎఱుకకలిగి యుందురు. మనకు మెలంకువ వచ్చుటతోడనే సూక్ష్మశరీరమునకు, స్థూలశరీరమునకు మధ్యమున నున్న ద్వారము మూంతపడిపోవును. అంతటితో ఆ భువర్లోకాను భవము తాత్కాలికముగ అంతమగును. మరణించిన తరు వాత, జీవులు కామశరీరముతో భువర్లోకములో కొంతకా లము నివసింతురు. ఆతరువాత జీవి స్వర్గలోకములో ప్రవే శించును. భువర్లోకజీవితము సాధారణముగ కొన్నిగంటలు మొదలు కొన్ని ద్వాదశాబ్దములవఱకు ఉండవచ్చును.

'త్యజించిన కామశరీరములు' (అనఁగా కామలోక మృతకళేబరములు) అన్న పదములోనే దానిఅర్థము ఇమిడి యున్నది. మరణకాలముతో, భౌతికశరీరము ఎట్లు విడిచి పెట్టెదమో ఆ ప్రకారమే భువర్లోకజీవితము అంతమగుసరికి కామశరీరమును త్యజించి స్వర్గలోకమునకు పోయెదము. స్థూలలోకమృతకళేబరమునకు, కామలోకమృతకళేబరమునకు భేద మున్నది. కామలోకమృతకళేబరములో ఆ జీవియు చైతన్యము స్వల్పముగా కామపదార్థములో చిక్కుకొని ఉండిపోవును. అందువలన ఆ జీవి అనుభవస్మృతులు స్వల్ప ముగ మృతకళేబరములో మిగిలియుండును. కాఁబట్టి ఆ కళే బరము కొంతవఱకు ఆ స్మృతులను యంత్రమువలె ప్రదర్శిం చుచు అసలు జీవివలెనే నటించును. వీనినే (Spooks) (కామలోకశవములు) అని అందురు. గణాచారుల ప్రేత ప్రేరేపణప్రదర్శనములలో, ఇవే ముఖ్యపాత్ర వహించుచుం డును. అప్పుడు ఆ మరణించిన జీవియే ఈప్రదర్శనములో పాల్గొనుచున్నాఁడని అపోహపడుచుందురు. ఇట్లు వానిని ప్రేరణముచేయనిచో అసలుజీవి భౌతికాధ్యాత్మికస్థాయిని బట్టి కొన్నిగంటలలోనో, కొన్ని నెలలోనో కొన్నిసంవత్సర ములలోనో ఈశరీరములు శిథిలమై పోవును. స్వర్గలోకము రెండుపెద్దభాగములుగ విభజింపఁబడినది. అందలి ఏడు ఉప లోకములలో పై మూఁడు కలసి 'ఉత్తమస్వర్గమనియు క్రింది నాల్గు కలసి అధమ లేక నీచస్వర్గమనియు అనెదరు. 'నీచ' స్వర్గమును 'దేవఖాన్' అని అందురు. ఇది దేవతానిల

యము. మరణించిన తరువాత ఇచ్చట ప్రవేశించిన జీవులు ఎంతో ఆనందముతో సుఖముగా కాలము గడుపుదురు. మరణాత్పూర్వము వ్యక్తీకరణముచెందిన జంతువులు కూడ ఇచ్చటనే యుండును. తమలో అన్నిటికన్న ప్రేమలక్షణము మిన్నగ నున్నట్టి స్త్రీపురుషబాలవ్యక్తులు క్రిందిదైన మొదటి ఉపలోకము తాము భూలోకములో నున్నప్పు డెక్కువగ ప్రేమించిన వ్యక్తుల సాన్నిధ్యములోనేయుండుచు, వారి సహవాసమున మిక్కుటమగు ఆనందము పొందుచు, సుఖముగా అనేకశతాబ్దములు కాలము గడపెదరు. రెండవ ఉపలోకములో ఇట్టివే ప్రేమతో భక్తికూడ మిళితముచేసిన వ్యక్తులు ఆనందముగా కాలము గడపెదరు; మూఁడవ ఉపలోకములో ప్రేమను దయను కలిగి, అనేకులు భూలోకములో సేవచేసిన వ్యక్తులుందురు. ఇట్టి గుణము లన్నియు కలిగి ఉండి 'కళాకారులు'గను తత్త్వవేత్తలుగను, శాస్త్రజ్ఞులుగను భూలోకములో పేరుపొందినవారు నాల్గవ ఉపలోకమున నుందురు.

వీనికి పై నున్న మూఁడు ఉపలోకములు :- అనఁగా ఉత్తమస్వర్గము జీవాత్మల నియమము. ఇచ్చట అంతవఱకు జన్మపరంపరలలో సేకరించిన యావదనుభవములద్వారా కలిగిన శక్తితో జీవాత్మస్థాయిలో నుందురు. ఇక్కడ జీవాత్మ తననుండి ఒకస్వల్పాంశమును, క్రింది మూఁడులోకములలోను (అనఁగా భూర్భువస్సువర్లోకములు) జీవయాత్ర గడుపుటకొఱకు ప్రయోగాత్మకముగ దేహాత్మకరూపములో

ప్రవేశపెట్టును. ఉత్తమస్వర్గములో మొదటి (అనగా అన్నిటికి పైనున్న) ఉపలోకము, మహాత్ములయు, జీవన్ముక్తులయు, వారి ఉత్తమవిథశిష్యవర్గములయు నివాసము; దాని తరువాతదైన 6 వ ఉపలోకములో ఉత్తమశీలము, ఉజ్జ్వలపాండిత్యము కల్గి స్వభావలబ్ధమైన బహుసునిశితగుణములు భూలోకములో నున్నప్పుడు వ్యక్తము చేసినవారి ఆత్మలు నివసించును. ఐదవ ఉపలోకము (అనగా ఉత్తమస్వర్గములోని ఉపలోకము) పై రెండుతరగతులవారగు 6000 కోట్ల మానవాత్మలలో మిగిలిన జీవాత్మలకు నిలయము.

ఈ దృశ్యాదృశ్యప్రపంచములోని జీవుల పరిణామము నకు 'దేవతా' పరిణామమునకు ఎంతో భేదము కలదు. ఉత్తమస్వర్గమునకు 'అరూప' దేవతలు (formlen) నివసించెదరు. వారి శరీరములు రూపరహితమై ఉత్తమస్వర్గలోక పదార్థముతో నిర్మింపఁబడును. 'అరూప' (formless) అను పద ముపయోగించుటకు కారణము ఆ లోకమునందలి సంకల్పములకు నిర్దిష్టమైన స్వరూపము లేకపోవుటయే. అది క్లిష్టములైన ప్రకాశవంతములైన స్పందములవలె వ్యక్తమగును. దేవభాన్ లోకములోని సంకల్పములకు రూపము గలదు. అచ్చటి సంకల్పములకు నిర్దుష్టమైన స్వరూప మున్నది. కావున ఈ లోకములో 'రూప' దేవత లుందురు.

భువర్లోకము స్వార్థముతో కూడిన భావోద్రేకములకు స్థానముగనుక, వీరికంటె క్రింది తరగతివారగు కామదేవతలిచ్చట నుందురు. ఈ లోకమునందు భూలోకమునకు చెందిన

పై నాల్గు ఉపలోకములందు పెక్కుతరగతులకు చెందిన దేవతాగణములు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, మోహినులు మొదలగువారుందురు. అన్నివిధముల దేవతాగణములు, దేవతలకు పెంపుడుజంతువులవంటివారు. వీరికి మంచి తెలివితేటలుండును. అయిన నీగణములు 'సమూహాత్మల'లోనివే; ఇంకను వ్యక్తీకరణము కాలేదు. ఈ గణములు తమ యజమానులైన దేవతలయందు కనపఱుచు భక్తివిశ్వాసములవలన భూలోకములోని కుక్కలు, పిల్లులు మొదలగు పెంపుడుజంతువులవలె వ్యక్తీకరణమునొంది దేవతాప్రత్యగాత్మలగును.

49 వ పటములో చూపఁబడిన అదృశ్యప్రపంచములు సూర్యమండలములకు చెందియున్నవి. ఇవి మానవపరిణామమున కనువగు అనుభవక్షేత్రములు. సూర్యమండలమున కతీతమైన లోకములు కూడఁ గలవు. వానిని బ్రహ్మాండములు లేక 'విశ్వమండలములు' (cosmic planes) అందురు. ఈవిశ్వమండలమునందు గల లోకముల నొక్కొక్కదానిలో ఏడు ఉపలోకములు కలవు. వీని యన్నిటి అధమోపలోకములు, సూర్యమండలములోని అన్నిలోకముల యున్నతోపలోకములతో సమానము. 49, 51 పటములు రెండు ఒకదాని ప్రక్క నొకటి పెట్టుకొని చూచినచో ఈ విషయము స్పష్టముగ బోధపడఁగలదు. విశ్వమండలమందలి మనోమయలోకములోనే మనలోకములలోని జీవోపాధుల పరిణామప్రణాళిక మహాసంకల్పరూపములో నిర్దిష్టముగ నున్నది.

పరిణామవిధానము ప్రారంభదశనుండి అంత్యదశవఱకు ఎట్లు నడువవలసియున్నదియు విశ్వమండలేశ్వరుని మహాసంకల్పమయియున్నది. దీనినే ఈశ్వర'ప్రణాళిక' అందురు. ఈశ్వరుని మనస్సులోనే ప్లాటోమహాశయుఁడు నిర్వచించిన 'ఆదర్శస్వరూపములు' (Archetyes) ఉన్నవి ఈ స్వరూపములు 'విశ్వమండలము'నందలి మనోమయలోకములో శాశ్వతముగ నేర్పడియున్నది. ప్రారంభమునుండి తుదివఱకు వాని స్వరూప మొకటే. అదే నిత్య, సత్యస్వరూపము.




(51 వ పటము)

విశ్వమండలములోని మనోమయలోకపు అధమోపలోకము మన మనోమయలోకమునందలి ఉత్తమోపలోకమై యున్నది. కావున మన చైతన్యమును మనోమయలోకములోని ఉత్తమస్థాయివఱకు ఉపసంహరింపఁగలిగినచో ఈ 'ఆదర్శస్వరూప'చ్ఛాయను కొద్దిగా గ్రహింపఁగలుగుదుము. అప్పుడు దానిప్రభావమునకు లోనై ఉత్సాహపూరితమైన దృష్టి మనకు అలవడఁగలదు. సూర్యాస్తమయమందు ఆకసము వివిధవర్ణములతో అలరారుచు కన్నులపండువుగ నుండును. ఆ దృశ్యము లోతైన బావియందలి నిర్మలోదకములోఁ ఆబావిలోనినీటికి ఆకసమునకు ఎట్టి సబంధము లేకపోయినను) ఎట్లు ప్రతిబింబించునో ఆప్రకారమె ఆత్మ తన పరిశుద్ధమైన మేధాశక్తితోను ఆధ్యాత్మికభావపరంపరలతోను 'శాశ్వతవర్తమానము'ను అందలి భవిష్యత్తుశోభను చూడఁగలదు; తెలిసికొనఁగలదు; గ్రహింపఁగలదును. గొప్పగొప్ప కళావేత్తలు తమలో మిగిలియున్న సహజమైన అంతర్దృష్టితో మానవులకొఱకు జ్ఞానసౌందర్యములతో సమ్మిళితమైనట్టి, క్రియాత్యాగములతో శోభిల్లుచున్నట్టి కళావస్తులను సృష్టింపఁగలరు.

మానవులుగ మనము జీవితము గడిపెడు భూలోకముతో సహా దృశ్యాదృశ్యలోకముల వివరములు సంక్షిప్తముగ తెలిపియున్నాను. కాని మృతిలేని జీవాత్మలు అంతులేని ఈ దృశ్యబ్రహ్మాండమునకు వారసులు. వీనిలోని అనేకరంగములలో మనము జ్ఞానమున అభివృద్ధిఁ గాంచినకొలఁది

ఉత్సాహముతో కూడిన సాహసకార్యములు పరంపరగా సలుపుచు, పరిపూర్ణులమగుటకు కృషిచేయుచుందుము. ఈ అదృశ్యలోకముల శోభను అతిస్వల్పముగనైన దర్శింపఁ గలిగినచో మన నైతికదృక్పథమును సరిదిద్ది జీవపరిణామముల పట్లను ఆకర్షణకలుగునట్లు చేయు నూతనదృక్పథములవడును. సూర్యోదయముతో మంచు కరిగిపోవునట్లు, ఇట్టి ప్రత్యక్షానుభూతివలన, మానవుని సందేహములన్నియు హరించిపోవును.

ఇట్టి ప్రత్యక్షానుభూతి, మనలో చాలమందికి అందుబాటులో లేకున్నను, మహోజ్జ్వలమైన కాంతినిచ్చి, చీఁకటితో నిండియున్న మానవప్రపంచములో వెలుఁగుబాట చూపి మనలను నడిపించు పరిశుద్ధమైన మేధాశక్తి దివ్యమైన అంతర్వాణిశక్తి అయినను, తగు ప్రయత్నముచేసినచో అలవఱ్చుకొనవచ్చును. దివ్యజ్ఞానమొక్కసారిగ ప్రతిమానవునకు దివ్యదృష్టి నీయలేకపోయినను, ఇతరతత్త్వసిద్ధాంతములకన్న ఎక్కువ తృప్తికరముగ, అదృశ్యవిషయముల యథార్థస్థితినిగూర్చిన వివరములు, జీవితముపట్ల సమధికోత్సాహము, సత్కార్యాచరణకు ప్రేరణముగలుగునట్లు, అందీయఁగలదు. అందఱకు ప్రత్యక్షానుభవము కలుగువఱకు, ఈనాఁడు ఏకొద్దిమందికిమాత్రమో అనుభవములో నున్న ఈ విషయములనుగూర్చి జిజ్ఞాసువులకు ఈప్రకారమీ అదృశ్యవిషయములను బహిర్గతము చేయుట ఈనాఁడు దివ్యజ్ఞానము చేయఁగలిగిన పని అని న్యాయముగ చెప్పఁగలను.

---

# 6 అధ్యాయము

## మానవుని మరణానంతర స్థితి

ఒక ప్రాణి అనేక కార్యముల నిర్వహింపఁగలశక్తి గలదై యున్నప్పుడు ఆప్రాణి అవయనిర్మాణము బహుక్లిష్టముగనుండు నని ఆధునికపరిణామసిద్ధాంతపు మూలసూత్రము. అందువలన క్రిందివర్గములందది జీవరాసుల అంగనిర్మాణములో కనపడని క్లిష్టత మానవుల అంగనిర్మాణములో కనపడుట, న్యాయము, సహజము. కాని శారీరశాస్త్రము, జంతుదేహధర్మశాస్త్రము అనువానిద్వారా మనకు తెలియపఱిచిన దానినిబట్టి చూచినచో మానవావయవనిర్మాణము అతిక్లిష్టమైన దని మనకు తెలియఁగలదు. కాని దివ్యజ్ఞానశాస్త్రరీత్యా బహిర్గతము చేయఁబడిన విషయమును బట్టి చూచినచో ఈ క్లిష్టత, సమగ్రమానవ నిర్మాణమునఁ గల క్లిష్టతలో బహుస్వల్పభాగము మాత్రమే ఆదివ్యజ్ఞానము మానవునిగూర్చి చెప్పిన ముఖ్యాంశములు 52 వ పటములో క్లుప్తముగ చూపినాను. 'మానవుఁడు' అని మనము నిర్వచనము చేసిన వ్యక్తి జన్మించునపుడు అతని నిర్మాణములో అనేక వస్తువులు ఉపయోగింపఁబడును. అవి ఏవనగా :-

1. జీవాత్మ :-నిజమైన మానవాత్మ : ఎప్పుడైనను దీనిలోని స్వల్పభాగము మాత్రమే స్థూలోపాధిలో వ్యక్తమగుచుండును. ఈజీవాత్మయే ప్రత్యగాత్మ.

2. ఒక్కొక్క జన్మలో ఒక్కొక్కసారి జీవాత్మలోని స్వల్పభాగము స్థూలోపాధులలో ప్రవేశించి ఒక ప్రత్యేక జాతిలో, ప్రత్యేక కాలములో, స్త్రీగానో, పురుషుడుగానో వ్యక్తమగుచుండును. ఇదియే దేహాత్మ.




(52 వ పటము)

ప్రత్యగాత్మకు దేహాత్మకుగల సంబంధమును అనేక విధములైన గుర్తులద్వారా నిరూపించిరి. పూర్వము గుప్త విద్యలో ప్రత్యగాత్మను సూత్రముగను, జన్మపరంపరలలోని దేహాత్మలను మణులుగను వర్ణించినారు ('సూత్రేమణిగణా

ఇవ, గీతావాక్యము చెప్పుచున్నది). 52 వ బొమ్మలో వేఱొక గుర్తు చూపఁబడినది, మూఁడు దిక్కులు, ఇరువది సమాననముఖములు కలిగిన (icosahedron) ఒక ఘనము ప్రత్యగాత్మకు చిహ్నముగా మనము తీసికొన్నచో ఇందులోని, రెండు దిక్కులుగలిగిన ఇరువది త్రిభుజములలోను ప్రతి త్రిభుజము దేహాత్మకు చిహ్నమగును.

ఈ ఇరువది త్రిభుజములు ఒకదాని ప్రక్క నొకటి చేర్చినను ఆ పెద్ద ఘనము కాదు. ఏల యన వీనిలో మూఁడవ దిక్కు లేదు. త్రిభుజమునకు దిక్కులు రెండు. పెద్ద ఘనము (icosahedron) నకు దిక్కులు మూఁడు. అందున పెద్ద ఘనములోని ఒక్కొక్క ముఖములోనే అనంతమైన (infinite) త్రిభుజము లుండును. ఇది గణితశాస్త్రము నిరూపించిన విషయము. అన్నిజన్మలలోని దేహాత్మలను కలిపి ఒక్కచోట చేర్చినచో జీవాత్మగ మాఱదు. జీవాత్మ తన నిజస్వభావమునకు భంగములేని పద్ధతిని తనశక్తిమేరకు ఎన్ని దేహాత్మలను నిర్మింపవీలగునో అన్నింటిని నిర్మించుచుండును. ఒక్కొక్క జన్మలో ఒక్కొక్క దేహాత్మను మాత్రమే జీవాత్మ నిర్మించుకొనును.

3. దేహాత్మ లేక భూతాత్మ (personality) (52 వ బొమ్మలోని 3 కలము చూడుఁడు). పునర్జన్మ పొందుసమయములో, మానసిక, కామమయ భౌతికోపాధులను ధరించును.

4. ఈ మూఁడు ఉపాధులకు స్వతంత్రమైన జీవితము చైతన్యము కూడ కలదు. ఈ చైతన్యమునకు దేహాత్మచైత

న్యమునకు సంబంధము లేదు. ఈ మూఁడు శరీరముల చైతన్యమును వరుసగ 'మానసికభూతము' (mental elemental) కామభూతము ("desire elemental" of the astral) స్థూలశరీరభూతము (physical elemental) అని యందురు. 52 వ పటము 2 వ కలములో ఆవిషయము వ్రాయఁబడ్డది. ఈ శరీర చైతన్యము, మానసిక కామభూతాత్మవర్గములయు స్థూలశరీరనిర్మాణమునకు తోడ్పడెడు ఖనిజవృక్షజంతుజీవప్రవాహములయు చైతన్య మయియున్నది.

5. తలిదండ్రులవలన ప్రసాదింపఁబడు స్థూలశరీరము వంశపారంపర్యముగా వచ్చెడి ప్రత్యేకలక్షణములు కలిగి యుండును. తల్లిగర్భములో ఈ నూతనజీవి యున్నప్పుడు ఐతని శరీరనిర్మాణమునకు తగినట్లుండి అతఁడు చేయవలసిన పని కుపయోగపడు లక్షణములను వంశపారంపర్యలక్షణముల నుండి ఎంచి ఉపయోగించును.

6. మానసికకామోపాధులకు కూడ ఒక విధమైన వంశపారంపర్యలక్షణములు కలవు. ఈఉపాధులను జీవాత్మయే నిర్మాణము చేసికొనును. ఒకజీవితములోని కామమానసిక శరీరములు వెనుకటి జన్మలో దేహాత్మ స్వర్గలోకములో ప్రవేశించుటకు ముందు త్యజించిన కామశరీరముయొక్కయు ఆతరువాత త్యజించిన మానసికశరీరముయొక్కయు 'నకళ్ళ' వలె నుండును

కావున దివ్యజ్ఞానదృష్ట్యా పరిశీలించినచో 'మానవుఁడు' బహుక్లిష్టమైన వ్యక్తి; ముల్లోకములందలి అనేకసమానాంతర

చతుర్భుజశక్తుల ఫలితముగ ఏర్పడిన కర్మములవంటివాఁడు. స్పష్టమైన పరిశీలనకు వీలుగ నుండుటకుఁ గాను ఈశక్తులను మూఁడు వర్గములగ ఏర్పాటుచేసినాను.

1. జీవాత్మ:-శాశ్వతమైన కారణశరీరమున జన్మముల మధ్యకాలములో నివసించుచు దేహాత్మలలో జీవితము గడపి నప్పుడు గడించిన అనుభవముల నన్నిటిని తన స్మృతిపథ ములో నిలబెట్టుకోఁగలఁడు.

2. దేహాత్మ లేక భూతాత్మ :- జీవాత్మలోని స్వల్ప భాగము.

3. ఉపాధిచైతన్యము :-మానసిక కామస్థూలోపాధుల భూతములకు (elementals) సంబంధించిన చైతన్యము.

మొట్టమొదట వివిధోపాధిచైతన్యములను గుఱించి పరిశీలింతము. స్థూలశరీరచైతన్య మెంతపరిమితమైన దైనను, ఆశరీరజీవితమునకు కార్యకలాపములకు సరిపోయి యుండును. అవసరమైనప్పుడు తనలో నున్న వ్యక్తిదృష్టి నాకర్షించు తెలివి ఈ ఉపాధిచైతన్యమునకు కలదు. శరీర మలసినప్పుడు విశ్రాంతితీసికొను మని ఇది ప్రేరేపించును. ఆఁకలి, దప్పిక గలిగినప్పుడు ఆహారము తీసికొనుమని జలము త్రాగుమని ప్రోత్సహించున విదియె. ఈ వాంఛలన్నియు స్థూలశరీర భూతమునకు సంబంధించినవి గాని, ఆత్మకు సంబంధించినవి కావు. వంశపరంపరగ సంక్రమించిన అలవాట్లవలన తనను సంరక్షించుకొను తెలివితేటలు ఈ చైతన్యమునకు కలవు. రోగక్రిములు శరీరమును పీడించునప్పుడు, ఇది కొన్ని విషయ

ములను సృష్టించి ఆ రోగక్రిములను చంపును. శరీరముపై పుండు పడినచో దానిని మాన్పుటకు ఆ శరీరములోని ఆరోగ్య కణముల ఆపనికి నియోగించును. స్థూలశరీరము నిద్రపోవు చున్నప్పుడు దానిని చలినుండి రక్షించుట కీచైతన్యము దుప్పటి లాగుకొని కప్పుకొనును. ఒకవైపు తిరిగి పండుకొన్న వ్యక్తి నిద్రిలో నింకొకవైపునకు తిరుగుట దీనివలననే కలుగును. ప్రాణాపాయమున కలిగెడి అలజడి యప్పుడు ఏలాగునైన రక్షించుకొనుటకై తన శక్తిమేరకు తంటాలు పడుచుండును. తుపాకీధ్వని వినినప్పుడు, హఠాత్తుగ పెద్ద ధ్వనితో తలుపుమూసినప్పుడు ఉన్నచోటినుండి ఉలికిపడి స్వరక్షణకోసము ప్రక్కకు ఉరుకునట్లు చేయున దీచైతన్యమే.

భౌతికశరీరలక్షణములలో చాలభాగము స్వాభావసిద్ధమైనవి. గాన ఎక్కువగ జోక్యముకలుగఁజేసికొను అవసర ముండదు. కాని ఒకొక్కొక్కప్పు డట్టి జోక్యము అవసర మగును. ఉదాహరణకు :- శరీరము అలసి పనిచేయుటకు ఇష్టముండదు. కాని కర్తవ్యనిర్వహణకొఱకు పనిచేయవలసి వచ్చును. అట్టి సమయములలోను లేదా ఏదైన అతిసాహస కార్యము చేయవలసి వచ్చినప్పుడు 'భూతము', శరీరమును భయపెట్టి, తన ప్రాణమును కాపాడుకొనుమని ప్రోత్సహించును. శరీరము వెనుకంజ వేయఁబోవును. అట్టి సమయములలో 'జీవాత్మ', 'దేహాత్మ'ను గట్టిగ నొక్కి పెట్టి తన ఇచ్ఛాశక్తిని విజృంభింపఁజేసి ఆ పని చేయింపవలసి యుండును. ఈ 'భూతము' చిన్నపిల్లలలో బాహాటముగ

పనిచేయును. చంటిపిల్లవాడు చేయుగోల, వాని ఏడుపు అంతయు ఈ భూతకృత్యమే జీవాత్మ కేమియు సంబంధము లేదు.

అనేకజన్మలలో తన పూర్వులు పొందిన సుఖదుఃఖానుభవముల సంపుటి ఈ స్థూలశరీరభూత జీవితచైతన్యములు. చాలకాలముక్రిందట ఒకానొకప్పుడిది ఆటవికుని 'కామభూత' జీవితము అయియుండెను. కావున దీని కనేక విధములగు పూర్వస్మృతులతోఁ గూడిన లక్షణములు కలవు. కావున దానిపై జీవాత్మ చైతన్యశక్తి పట్టు కొంచెము సడలినచో నది వెనుకటి స్థితికి జారిపోవుచుండును. ఆధునికయుగములో ఫ్రాయిడ్, జంగ్, ఏడ్లరు (Freud, Jung, Adlar) వంటి మనస్తత్వశాస్త్రవేత్తలు వారి పరిశోధనలలో కనుగొన్నది ఈ ఉపాధిచైతన్యమే. దీని అవకతవకలే మనకు తటచు వచ్చుఅర్థరహితస్వప్నాలలో వ్యక్తమగుచుండును.

కామమానసికశరీరముల భూతములు భూతాత్మవర్గ ప్రాణము. ఖనిజములో ప్రవేశించుటకు పూర్వము విష్ణుశక్తి ఈ వర్గములో నుండెడిది. ఇది ప్రవృత్తిమార్గములో నున్నందున క్రమేణా స్థూలపదార్థములోనికి దిగుచు వరుసగా ఖనిజములోను, తదుపరి వృక్షములోను, ఆ తరువాత తిర్యగ్జంతువులలోను ప్రవేశించినది. నిత్యము ఏదోవిధముగ అనేక నూతనమార్గములలో పని చేయుచు నిత్యము సజీవముగ నున్నట్లు భావించుటయే దానికి ముఖ్యావసరమైన విషయము. దానికి అనేకవిధములగు స్పందములు కావలెను. అవి భౌతిక

మైనవై యుండి ఎంతమోటుగా ఉన్న దాని కంత సంతో షము. ఇంకోలాగున చెప్పవలెనన్న "నా అవయవధర్మము" నా మానసికధర్మముతో నిత్యము సంఘర్షణపడుచుండును. దీనినే సెంటుపాల్ మహాశయుఁడు "నాలో తిష్ఠవేసికొని కూర్చున్న పాపగుణము" అని అన్నాఁడు.

కామశరీరము ఎప్పుడును ఉద్రేకముగాను, ఆవేశము గాను, ఉల్లాసముగాను ఉండవలె నని కామభూతము కోరిక. ప్రవృత్తిమార్గములో నున్నందున కామభూతమునకు వైవిధ్యము నానాత్వము, ఉద్రేకము, నిత్యనూతనత్వము మొదలగునవి కావలె నని యుండును. మానసికభూతమునకు మనస్సు ఏదోయొక విషయమునుగూర్చి ఏకాగ్రత కలిగియుండుట ఇష్టముండదు. మనస్సు ఎప్పుడు చంచలముగ నుండి తన యజమానునందు నానావిధములైన సంకల్పస్పందములను పురికొల్పుచుండుటయే దాని కోరిక. ఈ మనస్సు ఇంత చంచలమైనది గనుకనే ఏకాగ్రత దీనికి దుస్సాధ మగుచున్నది.

కామమానసికశరీరములకు అధినేతయైన జీవాత్మ నివృత్తిమార్గములో నున్నాఁడు, కోట్లాది సంవత్సరముల క్రింద తాను ఖనిజముగనుండి క్రమేణా వృక్షముగను తరువాత జంతువుగను జీవితము గడిపినాఁడు. కాని ఈనాఁడు ప్రవృత్తిమార్గములో నున్న కామమానసికభూతములు వాంఛించు అనుభవములు, నివృత్తిమార్గమునందున్న జీవాత్మ కార్యకలాపములకు ఏమాత్రము ఉపయోగపడవు. అందు

కనియే వీనిమధ్యమున నిత్యము సంఘర్షణ జరుగుచుండును. దీనినే సెంటుపాల్ మహాశయుఁడు "నాకు కావలసిన మంచి పనిని నేను చేయను; కాని నాకు అక్కఱలేని చెడ్డపని చేయుచుందును" అని చెప్పినాఁడు.

మానవుఁడు జీవించియున్నప్పుడు, మరణించినతరువాత కూడ తన ఉపాధులను వశపఱచుకొనుటకు కృషిసల్పుచుండు టయే మానవుని ముఖ్యకర్తవ్యమైయున్నది. కర్మదేవతలు తనను ఒప్పించి ఏపనిచేయుటకు నియోగించిరో ఆపని నిర్వహించుటకొఱకు ఉపాధులను వశపర్చుకొని వానిశక్తిని వినియోగించుకొనవలసియున్నది. జీవాత్మలో నిబిడీకృతమై యున్న ఇచ్ఛాశక్తిని బట్టి అట్టి శక్తిని సక్రమముగా వినియో గించుటకుఁ గల జ్ఞానమునుబట్టి మానవుని జయాపజయము లున్నవి. 53 వ పటములో నిత్యసంఘర్షణతోఁగూడిన ఈ జీవితమును, ఈ కఠినపరీక్షలో సంపాదించిన అనుభవములను, కనపఱుచుట యైనది.

'జీవాత్మ' అనఁగా 'ఉత్తమాత్మ', ప్లాటోమహా శయుఁడు దీనిని 'డెమను' అనినాడు. జీవాత్మకు మూఁడు ముఖ్యవిశేషణములు గలవు. వానినే ఆత్మ, బుద్ధి, ఉత్తమ మనస్సు అనెదరు. ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు ఈ జీవాత్మ త్రిమూర్త్యాత్మకత్వమును తెలియఁజేయును. రూపసంకల్ప పూరితమైన నీచమనస్సు కోరికలపుట్టయైన కామశరీరమును కార్యకలాపముల కాలవాలమైన స్థూలశరీరమును కలిసి 'దేహాత్మ' యగును. అనుభవముల నన్నిటిని ప్రజ్ఞగా లేక

సామర్థ్యముగా మాఱ్చుటకొఱకు జీవాత్మ తనలో 'స్వల్పాంశ' మును క్రిందికి దేహాత్మలోనికి పంపును.

జీవాత్మయందు ఇచ్ఛాశక్తి ఎంతకలదు, అది తన ఉపాధులను ఎంతవఱకు నిగ్రహింపఁగలుగును అన్న విషయములపై ప్రతిదియు ఆధారపడియుండును. మూఁడు ఉపాధిభూతముల సహజధోరణిని అదుపులో పెట్టి ఉంచగలశక్తి జీవాత్మకున్నచో జన్మ సార్థకమగును. కాని ఈభూతముల దే పై చేయి అయినచో జన్మనిరర్థకము. చాలమంది మానవుల

ఉత్తమాత్మ లేక జీవాత్మ { * ఆత్మ, * బుద్ధి, (*) మనస్సు

| | | |
|---|---|---|
| నిద్రలోనున్న ఇచ్ఛాశక్తి | | వశపఱ్చుకొబడ్డ ఇచ్ఛాశక్తి |
| స్వప్న చైతన్యము | సాధారణ చైతన్యము | సుషుప్తి చైతన్యము |
| | మానసిక | |
| దురభిమానము | అభిప్రాయములు | భావములు |
| | కామ | |
| ప్రేరణలు | కోరికలు | అనురాగము కనికరము |
| | భౌతిక | |
| వారసత్వపు అలవాట్లు | కార్యములు | ఇంద్రియ నిగ్రహము పవిత్రత |

(53 వ పటము)

జీవాత్మ పూర్తిగా అణఁగిపోయి యుండుటగాని పూర్తిగా అధికారము కలిగియుండుటగాని సంభవింపదు. కొంతవఱకు ఇంద్రియములను నిగ్రహింపఁగలిగి కొంతవఱకు వానికి లొంగిపోయి ఉందుము. దీనికి కారణములను పటములో చూడఁగలరు.

భౌతికశరీరము నిర్వహింపవలసిన పనులు మంచి పని గాని చెడ్డ పనిగాని చెప్పవీలులేదు. బ్రతుకుటకొఱకు తినుట, దగతీర్చుకొనుటకొఱకు నీరుత్రాగుట, అది నిర్వహింపవలసిన పనులు. మానవుఁడు ఎప్పుడు తాను నిర్వహింపవలసినకార్యము తనకోర్కెతో ఏకము చేసి దానికి లొంగిపోయి మితి మీఱి ప్రవర్తించునో అప్పుడే 'పాపము' ప్రారంభ మగును. కేవలము పశుప్రకృతి అయిన ఆహారపానీయములపట్ల కామ శరీరము, వానితో కలిసి కాంక్షను కలుగఁజేసినప్పుడు శరీరమునకు తిండిపోతుతనము త్రాగుఁబోతుతనము హెచ్చి వీనికొఱకు నిత్యము కాంక్షించుచుండును. ప్రారంభదశలో కామశరీరము కోరికలను ఎప్పుడు సంతృప్తిపఱుచుకోవలెనో మనకు తెలియఁజేయుచుండును. ఆలాగున కొన్నాళ్లు జరిగిన తరువాత స్థూలశరీరభూతము కామశరీరమును తన పనిముట్టుగ చేసికొనును. ఆటవికునకు తిండిపోతుతనము సహజముగ నుండును. కాని నాగరికమానవుఁడు తన కామశరీరమును స్థూలశరీరమునకు బానిసగఁ జేసి ఆటవికుని స్థాయికి జారిపోయినఁగాని తిండిపోతు కాలేడు. నాగరికమానవుఁడు పశుతుల్యుఁడైన ఆటవికునివలె ఎట్లగునో ఈక్రింది జపాను సామెతను బట్టి తెలియఁగలదు.

మొదట మానవుఁడు మద్యమును త్రాగును;
తరువాత మద్యమే మద్యమును త్రాగును;
ఆతుదకు మద్యమే మానవుని మ్రింగును.

కాని మానవునిలో ఇచ్ఛాశక్తి పటిష్ఠముగ నున్నచో శరీరముతో నిర్వహించు కార్యములనుండియే ఆత్మనిగ్రహము, పవిత్రత మొదలగు శాశ్వతమైన సుగుణముల నభివృద్ధి చేసికొనును. శరీరమును వశములో నుంచుకొనుట జీవాత్మకెక్కువ ఉపయోగము. దీనివలన, జీవాత్మకు తాను నిర్వహింపవలసిన పనిలో, ఈశరీరము సంపాదించిన అనుభవజ్ఞానములు తొందరగా వినియోగములోనికి వచ్చును. పరిశుద్ధమైన, మితమైన ఆహారము, మంచిఆరోగ్యము, క్రీడా వ్యాయామములద్వారా కండరములను, అవయవములను నిగ్రహములో నుంచుట మొదలగు శారీరకసాధనములు, ఆత్మనిగ్రహము, పవిత్రతను బడయుటకు ఎక్కువఁగ ఉపయోగింపఁగలవు.

కామశరీరము కోరికలతో నిండియుండుటకూడ సహజమే. స్వతస్సిద్ధముగ దుర్వాసనతో అపవిత్రితో కూడిన ధ్వనులు అన్నచో, కామశరీరమున కనిష్టము. మధురగీతములన్నను అందమైన పరిసరములన్నను దాని కెంతో ప్రీతి. కామశరీరప్రకృతి గ్రహించుటకు తగిన సున్నితమైన ఉపకరణమును సమకూర్చును. కామభూతము జీవాత్మపై అధికారము చలాయించి దాని ఆధీనము పోఁగొట్టిన సమయమందు 'పాపము' జనించును. అప్పుడు సహజమైన కోరిక మితివిూ

జీవ వాంఛగా పరిణమించి కామశరీరము అదుపునుండి తప్పి పోవును. మానవుఁడు చిత్తస్థైర్యము పోఁగొట్టుకొన్నప్పుడు ఆత్మకు సంబంధించిన ఉత్తమలక్షణములను ప్రదర్శింపఁజా లఁడు. పశులక్షణములు విజృంభించును. ఆ సమయములో తాత్కాలికముగ తాను అదుపులో పెట్టఁజాలని కామశరీర మువలన క్రిందిమెట్టునకు లాగఁబడును.

మనము కామశరీరభూతము నలవాట్లము కాదని తెలిసికొని, మన జీవాత్మ ఉద్దేశమునకు ఉపయోగపడు మంచిలక్షణములకొఱకు అన్వేషణసాగించు చుండవలెను. మనలో నున్న ఈ ద్వంద్వతత్త్వమును ఒకానొకప్పుడు బాధలు అనుభవించినప్పుడు కనిపెట్టఁగలము. పదుమూఁడు సంవత్సరములు ప్రాయము గలిగిన ఒక అమెరికను బాలిక అట్లు కనిపెట్టినది. ఒకనాఁడు తనతోడిపిల్లలు బాధించినందున ఏడ్చుచు తల్లియొద్దకు వచ్చినది. ఆడుకొనుపిల్ల లెవరైన హింసించినారా? అని తల్లి అడిగినప్పుడు ఆమె "లేదు; లేదు నన్నుకాదు నా భావములను హింసించినారు" (They made my feelings feel bad) అని చెప్పినది. మన మెప్పుడు కామశరీరములోని భావములము కాము అని తెలిసికొనెదమో, కెన్నిసుబంతి, మోటారుకారు వలె అవి మనస్వాధీనములో నుండి మన ఇష్టమువచ్చినప్పుడు ఉపయోగించుటకు వీలైన వని గ్రహించెదమో, అప్పుడు మన భావముల కెంత స్వేచ్ఛ నీయవలెనో మనకే తెలియఁగలదు.

కామశరీర భావములను మనవశములో నుంచుకోఁ గలిగిననాఁడు, అవి బహుచైతన్యముగను, సునిశితముగను తయారై సద్భావములైన ప్రేమ కరుణలను అద్భుతముగ వ్యక్తముచేయఁగలుగును. ఈ స్థితిలో కామశరీరము మన ఇష్టమువచ్చిన గీతమును వాయించుకొనుటకు తగిన చక్కని సునిశితమైన వీణవలె నగును. దానితో మన చుట్టునున్న అదృశ్యప్రపంచమును ఉత్సాహపూరితమైన పవిత్రభావ తరంగములతో నింపఁగలము.

కామశరీరభూతములనుగూర్చి చెప్పిన ఈ పైవిష యము లన్నియు మానసికభూతమునకు కూడ వర్తించును. ఆలోచనలను పురికొల్పుటయే మనస్స్వభావము. ఈ ఆలోచ నల ద్వారా జీవాత్మ బాహ్యప్రపంచమును తెలిసికొనును. రూపసంకల్పములతో విశ్వమును తూచవచ్చును, కొల్వవ చ్చును. మూఁడు శరీరముల అనుభూతుల నన్నిటిని శాశ్వత భావములుగ మార్చివేసి వానిని ఆత్మస్వభావములో చేర్చు టయే అరూపసంకల్పములపని.

మన సంకల్పములలో స్వల్పభాగమునకుమాత్రమే ఇట్టి స్వభావముకలదు. దీనికి రెండు కారణములున్నవి. మొదటిది :– మానసికభూతము తఱచు పూర్వసంకల్పములనే అంటిపెట్టుకొని యుండి మనమెంత నిరోధించినను వానిని గూర్చియే ఆలోచించుచుండును. రెండవది :– మన ఆలోచన లలో చాలభాగము ఇతరులయొద్ద ఎరువు తెచ్చుకొన్నవే గాని మన స్వంతమైనవి చాలస్వల్పము. మనలోని దురభిమాన

పూరితమైన భావములు మొదటితరగతికి సంబంధించినవి. ఇవి ఒకానొకప్పుడు మన జీవితరంగములో ఉపయోగపడ్డవే గాని ఈనాఁడు వాని అవసరము లేదు. అట్టి భావాలు లేకుండ పోవుటయె ప్రస్తుతము మనకు మంచిది. అయినను మానసిక భూతము, ఇదివఱకు అట్టి భావములకు మనముపోసినశక్తిని జాగ్రత్తగా పోషించి దానిపని నెఱవేఱుటకు ఆభావములే అత్యావసరములైన యథార్థములైన భావము లను మోహా ములో మనలను పడఁద్రోయుచుండును. మానవునిలో గోచ రించు జాతిమతకులములకు సంబంధించిన దురభిమానము లన్ని ఈ జాతికిచెందిన భావములే.

మానసికవాతావరణములోనికి నిత్యమును ప్రసార మగుచున్న ఇతరుల భావములు, సంకల్పములు అనునవి రెండవ తరగతికి చెందినది. ఇవి మన మనోమయకోశమును తాఁకుటతోనే తత్తుల్యమైన సంకల్పములు వానియంతటవి మనలో కలుగును. ఈ సందర్భములోనే కొంచె మప్రమ త్తత అవసరము. అట్టి సంకల్పములు మనలో ప్రవేశింపఁ జూచినపుడు మనము కొంచెము శ్రద్ధతీసికొని, అట్టిసంకల్పము లలో మన పురోభివృద్ధి కుపయుక్తమైన వానినిమాత్రము మనము స్వీకరించి మిగిలినవానిని ఖండితముగను మోమో టములేకుండఁగను తిరస్కరింపవలెను.

ఈ రెండు తరగతులకు సంబంధించిన కొన్ని ఆలోచ నలు ఒక్కొక్కప్పుడు మన మానసికశరీరమునకు హాని కలిగించు విషప్రాణముల వంటివి. మఱికొన్ని సంకల్పములు

మానసికశరీరములో ముఖ్యకేంద్రముల నేర్పాటుచేసికొని తమచుట్టును తత్తుల్యమైన సంకల్పములను జేర్చి వానిసారమును గ్రహించుచుండును. అప్పుడవి మానసికశరీరముపై విషవ్రణములుగ తయారగును. మెదడులో బయలుదేరిన 'విషపుకంతి' మెదడునందు కొంచెముకొంచెముగా నొప్పిపెట్టి రానురాను ముదిరి శరీరమునంతను నిర్వీర్యము చేసివేయునటులనే మానసికశరీరములో బయలుదేరిన విషవ్రణము మనస్సును నిర్వీర్యముగా చేయును. దీనిని ప్రారంభదశలో మనము కనిపెట్టలేము ; కాని అకారణమైన విసుగు, చికాకు కలుగుచుండును. అది ముదిరినకొలఁది నిత్యాభయాందోళనమునకు వివిధములైన ఉన్మాదములకు మానవుఁడు లోనగుచుండును.

సమ్యక్సంకల్పభావనా కార్యకలాపములద్వారా కలిగిన అనుభూతులు శాశ్వతమైన భావములుగ రూపొందుట, భూర్భువర్లోకములలో మనము జీవితము గడిపెడు కాలములో పాక్షికముగ మాత్రమే నెఱవేఱును. స్వర్గలోకములో మనము జీవితము గడుపుచున్న కాలములో కూడ ఈ పని జరుగుచునేయుండును. తాను ప్రగాఢముగా వాంఛించిన సౌఖ్యమునంతను సృష్టించుకొనుశక్తి కలిగి అచ్చటి ఆదర్శవంతమైన, తనకు నచ్చిన ప్రదేశములలో ఈశ్వరుని మహామనస్సు తన మనోమయకోశముపై నిత్యముగ క్రీడించుచు దాని అభ్యుదయానికి అద్భుతముగ సహకారమొసఁగుచుండగ మానవుఁడు స్వర్గలోకములో హాయిగ జీవితము

గడుపును. ఇచ్చట తన ఇచ్ఛాశక్తిని అభివృద్ధిచేయుచు తనలో దాగియున్న దైవీప్రకృతిని క్రమేణా ఎక్కువగ వ్యక్తము చేయుటకు గాను తన యావదనుభవములను శాశ్వత భావములుగను ప్రజ్ఞలుగను రూపొందించుచుండును.

స్వర్గలోకములో నున్నప్పుడు మానవుఁడు చేయువని, అతని ఆశయశుద్ధిపైన, అనుభవములను శాశ్వతభావములుగ మార్పఁగల ప్రజ్ఞపైన, ఆధారపడియుండును. దీనినిబట్టియే అతఁడు స్వర్గలోకములో ఎంతకాలము గడపవలసినది నిర్ణయమగును. 54 వ పటములో రకరకముల ఆత్మల సగటుజీవిత కాలము తెలుపఁబడినది. మరణానంతరము జీవి కొంత కాలము కామలోకములోను తరువాత దేవభాన్ (స్వర్గ) లోకములోను కాలము గడపవలసియున్నది. స్వర్గలోక జీవితము పూర్తి అయిన పిమ్మట దేహాత్మలో మిగిలిన భాగమైన మనోమయకోశమును త్యజించి జీవాత్మ తన స్వస్థానమైన ఉత్తమస్వర్గలోకము (మహర్లోకము)లో సంపూర్ణవికాసములో ఉండును. కొంతకాలము గడచిన పిమ్మట, తిరిగి ఇంకొక జన్మ ఎత్తుటకు సంకల్పము కలిగి మఱొకసారి జీవాత్మ తన అంశను క్రిందికి పంపి క్రొత్తయవతారమెత్తును, నూతన శరీరములను ధరించును.

54 వ పటములోని వివరములనుబట్టి అధమాధమస్థితి లోనున్న మానవుఁడు కామలోకములో 5 సంవత్సరములు మాత్రము గడిపి, స్వర్గలోకములో ప్రవేశించుటకు తగిన పుణ్యమేమియు సంపాదింపనందున తత్క్షణము భువర్లోకము

| జన్మల మధ్యకాలము | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| రకము | అధమాధమ మానవుడు | ఆటవికుడు | కర్మకారుడు | కృషీవలుడు | వర్తకుడు | వైద్యుడు | ఆదర్శవాది | శిష్యపథము లోని శిష్యుడు |
| మొత్తము | 5 | 40 | 200 | 300 | 500 | 1000 | 1200 | 2500 |
| ఉత్తమ స్వర్గము | లేదు | లేదు | లేదు | లేదు | లేదు | స్వల్పము | 50 | 150 |
| నీచ స్వర్గము | లేదు | లేదు | 160 | 260 | 475 | 975 | 1150 | 2150 |
| కామ లోకము (భువర్లోకము) | 5 | 40 | 40 | 40 | 25 | 25 | 5 | లేదు |

(54 వ పటము)

నుండియే వెనుకకు తిరిగి భూలోకములో జన్మమెత్తును. 54 వ పటములో 'శిల్పులు, కృషీవలులు, వర్తకులు' అన్న వారు సాధారణమానవులందఱకు ప్రాతినిధ్యము వహింతు రని గ్రహింపవలెను. 'వైద్యుడు' (డాక్టరు) అన్న పదము వృత్తిచేసికొనువారందఱను గుఱించి చిహ్నామాత్రముగనే వాడియుంటిని. ఒక్కొక్కప్పుడు 'కృషీవలులు, వర్తకులు'

అన్నవారు ఎక్కువ విజ్ఞానవేత్తలైనచో 'ఉత్తమ' మగు తరగతి ఆత్మలకు చెందియుండవచ్చు.

ఆదర్శవంతుఁడైన విజ్ఞానవేత్త, తన ఆదర్శసిద్ధికొఱకు త్యాగమయజీవితము గడుపును ? ఇట్టిజీవి వ్యక్తిగతముగ ఉత్తమస్వర్గములో తీరికలేని జీవితము గడుపును. తన జీవితమును సేవాకార్యములకొఱకు అర్పణచేసి పరమగురువుల అడుగుజాడలలో నడిచెడి మానవుని కామప్రకృతి ఎంతో పరిశుద్ధముగ నుండినందున అతఁడు భువర్లోకములో నుండ నవసరముండదు. కావున మరణించుటతోడనే తిన్నగా దేవభాన్ (స్వర్గ) లోకమునకు పోవును. భువర్లోకజీవితము అతనికి ఉండదు.

54 వ పటములోని వివరములనుబట్టి జన్మల మధ్యకాలము 5 సంవత్సరములు మొదలు 23 శతాబ్దములవఱకు నుండఁగలదు. బాల్యావస్థలోనే మరణము సంభవించినప్పుడు తిరిగి అతఁడు జన్మ ఎత్తుటకుముందు స్వల్పకాలము మాత్రమే భువర్లోకములలో జీవితముగడపవలసియుండును. మరణించిన తరువాత తిరిగి జన్మ ఎత్తుటకు కొన్ని నెలలు మొదలు అనేక సంవత్సరాలు పట్టవచ్చు. ఇది ఆ బాలుని వయస్సుమీఁద, కామమానసికస్వభావముమీఁద ఆధారపడియుండును.

55 వ పటములో మానవునిలో దాఁగియున్న శక్తుల స్వభావమును గూర్చి అతని సూక్ష్మశరీరములను గూర్చి వివరముల నిచ్చియున్నాను. మొదటి నిలువువరుసలో సూర్యమండలములో సప్తలోకములు పేర్కొనఁబడినవి. రెండవ

# మానవ నిర్మాణము

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆది | | | | * | తురీయాత్మ-తంతి |
| అనుపాదక | | | తురీయుడు తండ్రియొక్క ప్రియపుత్రుడు | * | |
| ఆత్మ | | ఆత్మ | | * * | |
| బుద్ధి | | అంతర్వాణి | జన్మలు ఎత్తు-జీవాత్మ ప్రత్యగాత్మ | * | జీవాత్మతంతి |
| ఉత్తమస్వర్గ | కారణశరీర | భావనలు | | * | |
| అధమస్వర్గ | మానశికశరీర | సంకల్పములు | | | |
| కామ | కామశరీర | వ్యక్తిగత ఉద్రేకములు ప్రేరణలు | దేవాత్మ తెర | | మనుష్యతంతి |
| భౌతిక | సూక్ష్మశరీర స్థూల శరీర | కాయికకర్మలు | | | |

(౨౮ వ పటము)

నిలువు వరుసలో మానవుని ఉపయోగములో నున్న నాల్గు ఉపాధులు చెప్పఁబడినవి. 3–4 నిలువువరుసలో చూపిన వివరములను బట్టి మానవుఁడు అత్యుత్తమస్థితిలో మానసిక లోకమునకు పై నున్న నాల్గులోకములలో తురీయాత్మ స్థితిలో నుండుననియు, ఇంతవఱకు ఆస్థితిలోనివిషయములను

గ్రహించుట కతనికి తగిన ఉపాధి లేదని మనకు తెలియఁ గలదు.

సాధారణముగ 'మానవాత్మ'నే కారణశరీరములోని జీవాత్మగ భావించెదరు. తిరిగి జన్మ ఎత్తుటకొఱకు జీవాత్మ ఒక దేహాత్మను సృష్టించుకొనును. ఈ దేహాత్మ స్థూల కామ మానసికశరీరముల సంపుటి. ప్రతిశరీరము దేహాత్మరూపములలో ఒక రూపమును వ్యక్తము చేయును. కారణశరీరములోని జీవాత్మ పునర్జన్మకు తగిన వికాసము, పొంతనము ఇచ్చును. కనుక జీవాత్మయు దాని మూఁడునీచోపాధులు కలిసి 'తాత్త్వికస్వరములతంతి' (chord of tempermental tones) అనఁగా 'మానవతంత్రి' (chord of Man) అగును. కారణశరీరములోని జీవాత్మ మానవగుణములను పాక్షికముగ మాత్రమే నిరూపించును. అతని 'ఉత్తమ' లేక 'అరూప' మనస్సునకు, వెనుక 'బుద్ధి' లేక 'అంతర్వాణి' కలదు. దానివెనుక నున్నది 'ఆత్మ'. అనఁగా మానవునిలో నిబిడీకృతమైయున్న భగవదంశము. ఆత్మ, బుద్ధి, మనస్సు అనునవి తురీయాత్మయొక్క ఉత్తమలక్షణముల ప్రతిబింబములు. ఈతురీయాత్మనే "తండ్రికుక్షిలోని కుమారుఁడు" అందురు ('The Son in the bosom of the Father'). ఈశ్వరశక్తికి మూలాధారమైన నాదమే తురీయాత్మకు ప్రబలమైన స్వరమును ప్రసాదించును. ఆది, అనుపాదక, ఉత్తమ నిర్వాణలోకములలోని తురీయుని మూఁడు లక్షములు 'తురీయాత్మతంత్రి' (chord of the Morad) ని నిర్మించును. ఆటుపిమ్మట తురీయాత్మ జీవాత్మను సృష్టించును. అప్పుడు

తురీయుని సర్వము ప్రతిబలముగా నుండును గనుక అదియును ఆత్మబుద్ధిమనస్సుల స్వరములు కలిపి 'జీవాత్మతంత్రి' (chord of the Augoeides) ను నిర్మాణముచేయును. తరువాత జీవాత్మ దేహాత్మను సృష్టించునప్పుడు 'మానవ తంత్రి' (chord of the Man) తయారగును.

మరణానంతరాపరజీవితములో, తా నెవరో ప్రపంచమెట్టిదో 'మనమందరము ఎవరిలో ఉండి చరింస్తూ జీవిస్తున్నామో, అట్టి ఈశ్వరుఁ డెవరో అన్వేషించి తెలిసికొనుటయే మానవుని కర్తవ్యమయియున్నది. ఇట్టి రహస్యమైన దివ్యజ్ఞానమును గ్రహించుటకు భగవత్సంకల్పమైన పరిణామమును అర్థముచేసికొనుటకు యుగాల తరబడి అనుభవము, కార్యాచరణము కావలసియున్నది."తనలోను, ఇతరులలోను, మట్టిపెళ్లలోను, జీవజంతువులలోను భగవంతుని తెలిసికొనుటయే మానవుఁడు నిర్వహింపవలసిన శాశ్వతమైన పని. జీవిత మొక కర్మాగారము. మానవుఁడందు శిక్షణఁబడయును. అతనికి సహాయముచేయు గురువు లనేకులున్నారు. మతములు, తత్త్వములు, శాస్త్రములు, కళలు, మనకు గురువులు. మనకెంత ఇష్టములేకపోయినను మన బాధలు కష్టములు కూడ మనగురువులే. అంతటిలోను మన కెక్కువ హితుడైన యుతఁడు గురువు 'దివ్యజ్ఞానమనురహస్యజ్ఞానము'. ఇది ఇంతవఱకు ఎవరును కనిపెట్టి ప్రకటింపనట్టియు, హృదయమునకు అమితోత్సాహము కలిగించునట్టియు, మనస్సును బాగుగా ఆకర్షించునట్టియు 'భగవత్సంకల్పము'ను లేక 'ఈశ్వరప్రణాళిక'ను మనకు వెల్లడిచేసినది.

# 7 అధ్యాయము

## జంతుపరిణామము

మానవవర్గముకన్న వృక్షజంతువర్గములలో చాల ఎక్కువ ప్రాణులు కలవని ప్రకృతిని శ్రద్ధగా పరిశీలించిన వెంటనే మనకు తెలియఁగలదు. వృక్షవర్గమునుండి జంతువర్గమునకు అందుండి మనుష్యవర్గమునకు జరుగు రూపపరిణామములో ఒకవర్గమునుండి మఱొకవర్గమునకు పరిణామము చెందుచు పోవుటకు తగిన 'వంతెన' వంటి దొకటుండును. అని ఆధునికవిజ్ఞానశాస్త్రము చెప్పుచున్నది. పరిణామములో మానవుఁడున్నతస్థితియం దున్నందున అతనికన్న క్రింది వర్గములకు చెందిన ప్రాణుల ఉపాధులన్నియు అతని మాదిరిగనే అనుసరించుచున్నవి. మానవాకారమునకు బహు సన్నిహితముగ పోలియుండు జంతు వీనాఁడు మృగ్యమై పోయినది. అట్టి జంతువును ప్రస్తుతములో చాలభాగము పోలియున్న 'కోతిమనిషి' (anthaopoid ape) రూపమే లెక్కలోనికి తీసికొన్నచో 'కోతిమనిషి' రూపమునుండి మానవస్వరూపము ఏర్పడవచ్చు నన్నది స్పష్టముగా కనపడవచ్చు. కాని జంతువులయందుండు తెలివితేటల దృష్ట్యా ఆలోచించిన విజ్ఞానశాస్త్రము నిర్వచించిన పరిణామసిద్ధాంతములో నొక గొప్పలోటు కానవచ్చుచున్నది. పెంపుడుజంతువు లైన కుక్కలు, గుఱ్ఱములు మొదలగువానిలో మానవలక్షణా లైన

తెలివితేటలు, సున్నితమైన భావాలు స్పష్టముగా కనఁబడు చున్నవి. 'కోతిమనిషి' కన్న చాలవఱకు కుక్కలు మానవుని ఆంతరంగికస్వభావానికి ఎక్కువసన్నిహితముగా ఉన్నవి. స్వరూపము దృష్ట్యా చూచిన కుక్కకు మానవునికి ఎక్కడను పోలిక కానరాదు. అందువలన శాస్త్రజ్ఞులు చెప్పినట్లు పరిణామము స్వరూపానికి మాత్రమే పరిమితమై యున్నచో, ఈ పెంపుడుజంతువులలో అభివృద్ధిచెందిన ఉత్తమమానవ లక్షణాలు కేవలమువృథాగా పోవలసినవేనా? (5వ పటముచూడుడు)

ప్రకృతినిర్వహించుచున్నపనిని ఇంకనుఎక్కువగ అర్థము చేసికోవలెనన్న జంతువర్గములోని రూపపరిణామముతో పాటు జీవపరిణామమునుగూడ ఆలోచనలోనికి తీసికోవలసి యుండును. ఈ పద్ధతిని ఆలోచించి నప్పుడే జంతువర్గము పరిణామవిధానములో నిర్వహించెడిపాత్ర పూర్తిగా అర్థము కాఁగలదు.

ఖనిజ వృక్ష జంతు మానవవర్గములలోని జీవచైతన్యము ప్రధానముగ ఈశ్వరుని శక్తిస్వభావములను వ్యక్తముచేయు ఏకైకచైతన్యమే. ఈ చైతన్యము కొన్నిహద్దుల మధ్యమున బంధింపఁబడియున్నందున ఎంతవఱకు ఆహద్దులను అతిక్రమించి బయటపడఁగలదో దానిని బట్టియే ఎక్కువగనో, తక్కువగనో తనలక్షణములను వ్యక్తము చేయఁగలుగును. ఖనిజవర్గములో నీ చైతన్యము గాఢముగ బంధింపఁబడి యుండును. రానురాను వృక్షజంతుమానవవర్గములలో ఈ బంధము ఒకవర్గముకన్న పైవర్గములో క్రమక్రమముగ

కొంతకొంత సడలుచుండును. లక్షణముల పరిణామవిధానములోకూడ ఇదే పద్ధతిని జరుగుచుండును. ఖనిజవర్గములో అనేకసంవత్సరములు ప్రవాసమనుభవించి తుదకు అనేక క్షేత్రగణితరూపములను స్ఫటికాకారములో వ్యక్తముచేయుట నేర్చుకొని తదుపరి ఈ చైతన్యము వృక్షవర్గములో ప్రవేశించును. ఇంతవఱకు సంపాదించిన గుణములను




(౫౬ వ పటము)

జాగ్రత్తచేసికొనుచు వృక్షవర్గములో నూతనశక్తులను సంపాదించుకొనుచు స్వీయపరిణామానికి తగిన నూతనవర్గములను అన్వేషించుచుండును. వృక్షవర్గములో పరిణామము పూర్తి అయిన పిదప ఖనిజవృక్షములలో నంతవఱకు నేర్చిన పాఠము

లను ఈ చైతన్యము జంతువర్గనిర్మాణములో ఉపయోగించును. ఈవర్గములో నున్నప్పుడుతనలో దాగియున్న మఱి కొన్ని లక్షణములను తన కనువైనట్టి క్లిష్టమైనట్టి ఈ జంతు రూపములో బహిర్గతముచేయుటకు ప్రయత్నము సల్పును. జంతువర్గములో తనపరిణామముతో సంబంధించిన కార్య క్రమము ముగిసినతరువాత మానవవర్గములో ప్రవేశించి తన ఆత్మవికాసానికి అవసరమైన పనిని కొనసాగించును.

ఈ ప్రకారము నాలుగు వర్గములలోను ఈ ఏకైక చైతన్యమే రూపములను నిర్మించుచు, లయముచేయుచు, పునర్నిర్మాణముచేయుచు అట్లు చేయునప్పుడు మెట్టుమెట్టు నకు **నూతన**మైన, ఉత్తమమైన స్వరూపములను సృష్టించుచు నిత్యము పనిచేయుచుండును. ఖనిజపదార్థములో పనిచేయు టకు చాలకాలముముందే ఈ ఏకైకచైతన్యము విశిష్టలక్షణ ములు కలిగిన 7 గొప్పప్రవాహములుగ చీలి పోవును. (56 వ పటము చూడుము). ఏకైకచైతన్యమును వృత్తము లోని త్రిభుజము నిరూపించును. ఈ సప్తప్రవాహములు తిరిగి ఒక్కొక్కటి సప్తోపప్రవాహములుగ విడిపోయినది. ఏడు పెద్దప్రవాహములకు 1 మొదలు 7 వఱకు అంకెలు గుర్తుగా పెట్టుకొన్నప్పుడు ఏడు ఉపప్రవాహముల గుర్తులు ఈ 56 (ఎ) పటములో కనపఱిచిన మాదిరిగ నుండఁగలవు. దీనినిబట్టి మొదటి జీవచైతన్యములో 7 ఉపజాతులు ఏలా ఇమిడియున్నవో తెలియఁగలదు. ఇందులో మొదటి ఉప జాతిలో తన ప్రత్యేకలక్షణములు ద్విగుణీకృతముగా కనప

షును. కాని మిగతా ఆఱు ఉపజాతులలో వానివాని లక్షణములతో 1 వ తరగతి లక్షణములు కూడ స్వల్పముగ మిళితమైయుండును. వీనికే (1·21·31·41·51·61·7) గాపటములో సూచితములైన సంఖ్యలు. ఈ సూత్రమే మిగిలిన 6 ప్రవాహాములకు వర్తించును. ఈ ఏడు తరగతులప్రవాహాములు లేక జీవచైతన్యమును 'కిరణములు' (Rays) అని అందురు. ఉపప్రవాహాములను 'ఉపకిరణములు' అందురు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1.1 | 2.1 | 3.1 | 4.1 | 5.1 | 6.1 | 7.1 |
| 1.2 | 2.2 | 3.2 | 4.2 | 5.2 | 6.2 | 7.2 |
| 1.3 | 2.3 | 3.3 | 4.3 | 5.3 | 6.3 | 7.3 |
| 1.4 | 2.4 | 3.4 | 4.4 | 5.4 | 6.4 | 7.4 |
| 1.5 | 2.5 | 3.5 | 4.5 | 5.5 | 6.5 | 7.5 |
| 1.6 | 2.6 | 3.6 | 4.6 | 5.6 | 6.6 | 7.6 |
| 1.7 | 2.7 | 3.7 | 4.7 | 5.7 | 6.7 | 7.7 |

(56 (ఎ) పటము)

ఏకైకచైతన్యముయొక్క ఈ 49 వేఱువేఱు స్వరూపములు వేనికవి ప్రత్యేకమైన లక్షణములను మొదటినుండియు వ్యక్తముచేయుచు జీవవర్గములద్వారా అభివృద్ధి సాధించుచుండును. జంతువర్గములో నొకజీవి $3_2$ ఉపకిరణమునకు సంబంధించియున్నచో మొదటినుండి అనఁగా ఖనిజవృక్షవర్గములలోఁగూడ అదే కిరణమునకు ($3_2$) చెందియుండి సమయమువచ్చినపుడు జంతువర్గములోని $3_2$ ఉపకిరణమునకు పోవును. ఇట్టిజీవి $3_2$ 'ఉపకిరణమునకు' చెందిన మానవుఁడుగ

'వ్యక్తీకరణ' మగును (individualisation). ఈ 49 'ఉపకిరణము'లలో ఏ ఉపకిరణమునకు సంబంధించి యాత్ర ప్రారంభించునో అదే ఉపకిరణములో జీవి చివరివఱకు ప్రయాణముచేయును. ఒకసారి ఏదో ఒక ఉపకిరణములో జీవితము ప్రారంభమైనప్పుడు మధ్యమున ఇంకొకకిరణములోకి గాని ఉపకిరణములోకిగాని మాఱుటకు వీలుండదు.

ఈ 49 జీవప్రవాహములు, జంతువర్గమునుండి మానవ వర్గములోనికి ప్రవేశించుటకు సిద్ధముగ నున్నప్పుడు, ఒక్కొక్క కిరణమునకు సంబంధించిన ఏడు ఉపకిరణములకు చెందిన జంతువులు ఆ జంతువర్గములోనే ఉత్తమవివరమునకు చెందిన ఏవో కొద్ది జంతుస్వరూపములుగ తయారగును. ఇవి పెంపుడుజంతువులయి, మానవసంపర్కము కలుగవలెనని ఈశ్వరప్రణాళికలో నిర్దేశించఁబడి యున్నది. అప్పుడు మానవుఁడు వానియందు చూపు దయాదాక్షిణ్యములవలన తీసికొనే జాగ్రత్తవలన ఆజంతువులలో నిబిడీకృతమైయున్న సల్లక్షణము లభివృద్ధిచెంది అవి మానవవర్గములో ప్రవేశించును.

ప్రస్తుతమున జంతువర్గమునుండి మానవవర్గమునకు వెళ్లుటకు కొద్దిపాటి జంతువులు ద్వారములుగ పనిచేయుచున్నవి. అవి పిల్లి, కుక్క, గుఱ్ఱము, ఏనుఁగు, మర్కటము. జంతువర్గమునుండి మానవవర్గములో ప్రవేశింపవలెననిన ఈజంతువులే ద్వారములు. (అనఁగా ఈ అయిదు జంతువర్గములలోను ఏదో ఒకదానిలో పుట్టినప్పుడే జంతువులు వ్యక్తీకరణము చెందఁగలవు). వీనికి మానవసాంగత్య మలవడి అట్టి

మానవుఁడు తీసికొను శ్రద్ధవలన, అతని ప్రభావముసోకినం దున మార్పసాధ్యమగును. పిల్లిజన్మ, కుక్కజన్మ ఎత్తి జంతువర్గములో ఉత్తమస్థానము పొందినప్పటికి ఆపిల్లి, ఆకుక్క, ఒక మానవుని దరి చేరి, ఆసంపర్కమువలన ఆజంతువునందలి తెలివి, ప్రేమ, విశ్వాసము మొదలయిన సద్గుణములు అభివృద్ధి చెందినప్పుడే మానవవర్గములోనికి ఆ జంతువు ప్రవేశము సాధ్యమగును.

మన పెంపుడుజంతువులు తమ పూర్వదశలో క్రూరమృగములజాతియందలివి. తోడేలు కుక్కకు, పులి పిల్లికి, పూర్వీకులు. ప్రస్తుతములో కుక్కజాతికి చెందిన జీవప్రవాహములన్నియు పెంపుడుకుక్కలో కేంద్రీకరించినప్పుడే మానవ వర్గములో అది ప్రవేశించుట జరుగును. పిల్లివిషయములో కూడ ఇదే సూత్రము వర్తించును. మానవవర్గమునకు తీసికొనివెళ్లు సప్తద్వారములను సూచించు తక్కిన పెంపుడు జంతువులు ముందుముందు వెల్లడి కాఁగలవు. జంతుపరిణామమును తెలిసికోవలెనని నచో జంతుసమూహాత్మకు (animal group-soul) సంబంధించిన జ్ఞానమవసరము. దివ్యజ్ఞానసిద్ధాంతరీత్యా మానవుఁడు భౌతికశరీరము కాదని, అట్టిశరీరము ధరించుచున్న ఒక అదృశ్యాత్మవస్తువని, ఏలాగున భావించెదమో అటులనే జంతువుకూడ పైకి కనపడుచున్న రూపము కాదనియు, మానవునికి ఆత్మకు సంబంధమెట్టిదో అటులనే జంతువునకు సంబంధించి దానిని ఉత్తేజపఱుచు అదృశ్యజీవకళ ఒకటి యున్నదనియు, అదియే ఆ జంతువనియు తెలిసికోవలెను. దానినే 'సమూహాత్మ' అందురు.

'సమూహాత్మ' అనునది ఈశ్వరశక్తితో నింపఁబడిన ఒక నిర్దిష్టపరిమాణముగలిగిన మానసికపదార్థము. ఈ మానసిక పదార్థములో జంతుపరిణామానికి సంబంధించిన జీవశక్తి ఇమిడియున్నది. జంతువు అనేకవిధములుగ అభివృద్ధి చెందుటకు తగిన మూలాధారశక్తి ఆ జీవశక్తిలో దాఁగియున్నది. 'జంతుసమూహాత్మ' పూర్వదశలో 'వృక్షసమూహాత్మ'. దానికి పూర్వము ఇదే ఖనిజసమూహాత్మగా నుండెను. పూర్వానుభవముల ఫలముగా జంతుసమూహాత్మ ప్రత్యేకాభివృద్ధి చెందియున్నది. సమస్తజంతువర్గమునకు ఏలాగున ఒకే ఒక స్వరూపము లేదో ఆలాగుననే వీనియన్నిటికి ఒకే ఒక 'సమూహాత్మ' లేదు. స్వరూపపరిణామములో ఎట్లు వర్గము, తరగతి, క్రమము, కుటుంబము, గణము, తెగ మొదలగు వివిధభాగములను ఉపవర్గములును కలవో అటులనే 'జంతుసమూహాత్మ'లో కూడ ఇన్ని విభాగములు కలవు.

ఈ సమూహాత్మ పనిచేయువిధానము 57 వ పటములో చూపఁబడినది. మానసికలోకములో, ఒక తెగకు చెందిన జంతువుల 'సమూహాత్మ' ఉన్నదని భావించినచో ఆ సమూహాత్మ అనేకపర్యాయములు జన్మ ఎత్తుచుండును. ఈ సమూహాత్మకు చెందిన రెండు జంతువుల భూలోకజీవితసరళి ఒకదానితో నొకటి పోలియుండదు. కాని మరణానంతరము వాని జీవకళ వచ్చి మిగిలిన అన్ని జీవులతో పాటు ఆ తెగకు చెందిన 'సమూహాత్మలో' చేరిపోవును. 57 వ పటములోని




(57 వ పటము)

'అ' 'ఇ' లు ఒకే సమూహాత్మనుండి వెలువడిన వేర్వేఱు జంతువు లనుకొందము. అందులో 'అ' అను జంతువునకు 'క' 'ఖ' 'గ' 'ఘ' 'ఙ' అను అయిదు 'ఇ' అనుదానికి 'చ' 'ఛ' అను రెండు కూనలు పుట్టినవి. ఈ నూతనసంతతికి చెందిన ఏడు కూనలలోని జీవకళ తిన్నగా మానసికలోకము లోని 'సమూహాత్మ'నుండి వచ్చును. 'అ' సంతతిలోని 'క' 'ఖ', 'ఙ' లు నీరసమువలన నేమి, వానిశత్రువుల వలన హింసింపఁబడుటవలన అయిన నేమి, చనిపోయిన

వనుకొందము. ఆలాగుననే 'ఖ' సంతతికి చెందిన 'ఛ' కూడ మరణించిన దనుకొందము. ఇవి చనిపోవుటతోడనే వీని జీవకళ 'సమూహాత్మ'లో చేరిపోయి దానిలో తమఅనుభవములను చేర్చి దానిని పటిష్ఠము చేయఁగలవు. పటమునందలి 'ఖ' అను దానికి 'జ' 'ఘ' 'ఞ'; 'గ' 'ణ' అను దానిక 'ట' 'ఠ'; 'చ' అను దానికి 'డ' 'ఢ' అను పిల్లలు పుట్టినవి. ఈ మూఁడవ సంతతికి కూడ జీవకళ తిన్నగ 'సమూహాత్మ'నుండియే సంక్రమించును. కాని ఇది పుట్టిన నాఁటికే 'క,' 'ఘ' 'జ్ఞ' 'ఛ' లు చనిపోయి వాని ప్రత్యేకలక్షణములు. అవి పుట్టిననాఁటికున్న 'సమూహాత్మ'లో కలిసిపోయి దానికి బలము ఎక్కువగ చేకూర్చినందున ఈ మూఁడవ సంతతికి ఆ అనుభవముల లాభముకూడ కలుగును. ఒక్కొక్క తెగకు చెందిన జంతువు చనిపోయినప్పుడు ఆ జంతువు జీవకళ తాను భౌతికశరీరములో సంపాదించిన నూతనానుభవములతో సహా సమూహాత్మలో కలియుచుండును. పూర్వజన్మలలో సంపాదించిన అనుభవముల స్మృతియే జంతువులలో 'సహజాత' (instinct) లక్షణముగ వ్యక్తమగును. ఈలాగున 'సమూహాత్మ'లో పరంపరగా కలియుచున్న జంతువుల నూతనానుభవముల కారణముగ నిత్యమును మార్పు జరుగుచునే యుండును.

నిత్యమును మార్పుచెందుచున్న ప్రకృతిపరిస్థితులను తట్టుకోఁగలిగిన కారణమున 'ఖ' 'గ' 'ఛ' లు జీవితము సాగింపఁగలిగినవి. అట్లు తట్టుకోలేకయే 'క' 'ఘ' 'జ్ఞ'

'చ' లు చనిపోయినవి. అర్హత, బలము రెండునున్న కార మున మొదటిగుంపు పోటీ, సంఘర్షణలతో నిండియున్న వాతావరణములో నిగ్గి బ్రతుకఁగలిగినవి. అట్టి అర్హత ఉండఁబట్టి సమూహాత్మనుండి ప్రసారమగు జీవపరిణామానికి ఈ జంతువులు మార్గములుగ పనిచేయుచు తాము సంపాదించి నట్టి అర్హత, బలముగల సంతతిని ఇవి ఉద్భవింపఁజేయఁగలవు.

చాలకాలము నిల్చియుండు యోగ్యతగల స్వరూపము లను ప్రకృతిఎంచుకొనియే కార్యక్రమములో, 'నిర్మాతలు' (57 వ పటములో సూచించిన) అను వారు అదృశ్యముగ ప్రముఖపాత్రవహించుచున్నారు. వీరు మానవవర్గమునకు భిన్నమైన 'దేవతా'వర్గమునకు చెందియున్నారు. ప్రకృతి లోని 'జీవితవిధానముల'ను తమ యాజమాన్యమున నడిపిం చుట వీరు నిర్వహించు శాఖలలో నొకశాఖకు సంబంధించిన కార్యము. 'మనుగడ కొఱకు సాగించెడి నిత్యసంఘర్షణ'ను వీరే నడిపించుచు ఆ జంతువులలో ఆదర్శరూపమునకు దారి తీయు లక్షణముల అభివృద్ధి కనిపెట్టచూచుచుందురు. ఉపా ధిలో అంతర్లీనమైయున్న లక్షణములను వ్యక్తము చేయుటలో సన్నిహితసంబంధముకలిగియున్న 'మెండేలియను' జాతులను వారు కలుపుకొనెదరు. జీవితోద్దేశములను కచ్చితముగ నెఱవేర్చుటకుఁగాను వానిస్వభావములో అభివృద్ధిపఱుపవల సిన కొన్ని ఆదర్శములగు నమూనాలు (Archetypes) ఈ నిర్మాతల దృష్టిలో నున్నవి. మంచి అర్హత, యోగ్యత గలిగి జంతువు లుద్భవించుటకుఁగాను అదృశ్యలోకములలోనే

వీరు 'ఆదర్శములగు నమోనా'ల సాహాయ్యముతో జీవులను కనిపెట్టి తీర్చిదిద్దెదరు; లేనియెడల సాధారణపరిణామముల దృష్ట్యా ఈవిషయములన్నింటిని నిరూపించుట సాధ్యముకాదు.

పరిణామానికి సంబంధించియున్న మూఁడు పెద్దసమస్యలను నేఁటి జీవశాస్త్రసిద్ధాంతాలు పరిష్కరింపఁజాలవు. ఆ మూఁడు సమస్యలు ఏవనఁగా (1) జాతుల మూలము, (2)సంవిధానమునకు(adoptation)మూలకారణము. (3)దూర పృథవిష్యత్తునకు సంబంధించిన పోకడలను పోషించుట. కేవలము 'పొరపాట్లను అనుభవముద్వారా సరిదిద్దుకొనుట అనెడు ఆలోచనారహితయాంత్రికవిధానముతో ఇట్టి పని బుద్ధిపూర్వకముగ 'అంధప్రకృతి' చేయఁగలుగు నని నమ్మట కష్టము. ఈ సంవిధానము యావత్తు దూరపృథవిష్యత్తులో ఒకనిర్దిష్టమైన లక్ష్యసిద్ధికొఱకే ఉద్దేశింపఁబడి యున్నది. కావున సమూహాత్మ అను భావము, 'దేవతల నిర్మాణ కార్యము' అను భావము కూడ ఒకవిధముగా ఈ సిద్ధాంత మునుగూర్చి సరియైనపద్ధతిలో విశదముచేయుచున్నవి. 'పొర పాట్లను ప్రయత్నముతో సరిదిద్దుకొనుట' అను విధానమును ఈ నిర్మాతలే యుగాలతరబడి దూరదృష్టికలిగి వారు చేయు చున్న పనిలో ఉపయోగించెదరు. కాని చివరకు ఏ ఆదర్శ స్వరూపము తేలవలెనో అది మొదటినుండి వారిదృష్టిలో కచ్చితముగనుండును.

ఏ జీవులు సంఘర్షణలను తట్టుకొని నిలబడి సంవిధాన ముద్వారా ఇంచుమించు ఆదర్శముల నమోనాల స్థాయి

అందుకొనఁగలవో పరీక్షించి తెలిసికొను నిమిత్తము 'మను గడ' కొఱకు సంఘర్షణ అను విధానమును దేవనిర్మాతలు అనుసరించెదరు. ఒకప్రాణి మరణించినప్పుడు దానియందలి జీవి నశింపదనియు, ఆజీవి, తాను, సంపాదించిన అనుభవములతో 'సమూహాత్మ'లో తిరిగి చేరిపోయి నూతనోపాధిలో ప్రవేశించుటకు ఆ సమూహాత్మనుండియే తిరిగి బయటకు వచ్చుననియు, జ్ఞాపకముంచుకోవలసియున్నది. కాబట్టి విత్తనములలో నూటికి తొంబదితొమ్మిది నిరుపయోగమై ఏ యొక్క విత్తనమో మొలచినప్పుడు ఆ తొంబదితొమ్మిదివిత్తనముల లోని జీవము పైకి నిరుపయోగమైనట్లు కనపడినను వాని యందలి శక్తి, సమూహాత్మను బలపఱుచును. తరువాత వచ్చు సంతతికి ఈ బలము సంక్రమింపఁగలదు.

'జీవికి నాశనము లేదు' అను సిద్ధాంతము నాధారముగ గ్రహించి 'దేవనిర్మాతలు' వృక్షజంతువర్గములలో "మను గడకొఱకు తీవ్రమైన పోటీ విధానమును ఏర్పాటు చేయుదురు. దృశ్యప్రపంచములో ఈ విధాన మెంతక్రూరమైనదిగ కనుపించినను, అదృశ్యప్రపంచాలలో ఈ పోటీదారులలో ఇరుపక్షములకు ప్రోత్సాహ మిచ్చి పనిచేయు 'దేవనిర్మాతలు' మాత్రము ఒండొరుల పట్ల ఎంతో సహకారముతోను సహృదయతతోను ఈ వ్యవహారము నడిపింతురు. వా రందరి లక్ష్యము ఒక్కటే భగవత్సంకల్పముగ నెఱవేర్చుటయే. ఆసంకల్పము ప్రకారము జరగవలసిన రూపపరిణామము ద్వారా 'ఆదర్శమగు నమోనా' ప్రకారము రూపమును

ఏనాఁటికైనను ఉత్పత్తిచేయవలసిన బాధ్యత వారి మీఁద నున్నది.

'వ్యక్తీకరణము' జరుగుటకు పూర్వము జంతుజీవి ఏప్రకారము భిన్నస్వరూపములు దాల్చునో ఇప్పుడు మనము తెలిసికొనవలసియున్నది.

58 వ పటములో చూపఁబడిన "శ్వానసమూహాత్మను" బట్టి (Canidæ) అది మానసికలోకములో నున్న దని మనకు తెలియఁగలదు. ప్రపంచములోని వివిధ దేశములలోను ఈ 'సమూహాత్మ' తనస్వరూపములను ప్రవేశ పెట్టినదనుకొందము.




(58 వ పటము)

శీతోష్ణస్థితులయు, నితరపరిస్థితులయు, తదితరవాతావరణను నయు, భేదముల మూలమున వివిధదేశములలో పెరుగు

చున్న ఈజంతువుల లక్షణములలో భేదములుండును. ఈ జంతువు చనిపోయినప్పుడు ఒక్కొక్కజంతువు తన ప్రత్యేకానుభవమును సమూహాత్మకు అందఁజేయును. ఈలాగున లక్షలాది అనుభవములు సమూహాత్మలో చేరఁగా కొంత కాలమునకు ఆ సమూహాత్మలో ఒకేరకమైన అనుభవములకు, పోకడలకు సంబంధించి ప్రత్యేకమైన చిన్నచిన్న కేంద్రములు ఏర్పడుట ప్రారంభమగును. ఒకేరకపు ప్రత్యేకానుభవముల స్పందముల సంఖ్య ఒకేరీతిగా నుండును. కాఁబట్టి వేలువేలు అనుభవములకు వేలువేలు స్పందముల సంఖ్య యుండును. ఒకే రాశిలోనే అనేకవిధములైన స్పందము లెప్పు డుద్భవించునో ఆ రాశి అప్పుడు చిన్నచిన్న భాగములుగ విడిపోవును. దీనికి తార్కాణముగ ఒక గాజుసీసాలో కుతకుత ఉడుకుచున్న నీళ్లు పోసినయెడల లోపలిఅణువులు బయటి అణువులకన్న అతివేగముగా స్పందించును. ఈ రెండురకముల స్పందముల తాకిడికి మధ్యముననున్న ఆ గాజుసీసా బ్రద్దలగును. ఆలాగునే అనేకములగు తరాలు గడచిన తరువాత 'శ్వానసమూహాత్మ'లో వేర్వేరులక్షణాలుబయలుదేరిన మూలముగా, తోడేలు, నక్క, కుక్క మొదలగు పలుతెఱఁగుల చిన్నచిన్న సమూహాత్మలుగా విడిపోవును. ఆలాగుననే 'మార్జాలసమూహాత్మ'కూడ సింహము, పులి, పిల్లి మొదలగు వేర్వేరు సమూహాత్మలుగ విడిపోవును. ఇంకను రానురాను ఈ చిన్న సమూహాత్మలకు చెందిన జంతువులు కొన్ని ప్రత్యేకలక్షణములు వ్యక్తముచేయఁగా ఇవి కూడ చిన్నచిన్న ప్రత్యేక

లక్షణములు గలిగిన జంతుసమూహాత్మలక్రింద విడిపోవు చుండును.

ఈ పద్ధతిగ సమూహాత్మలు విడిపోవుచు రాఁగా చివరకు కొలఁది జంతువులతో కూడిన ప్రత్యేకమైనలక్షణములు కలిగిన మఱియొక చిన్న 'సమూహాత్మ' ఏర్పడును. ఈప్రికారము జరిగినపిమ్మట ఈ చిన్న సమూహాత్మకు సంబంధించిన జంతువులకు మానవసంపర్కము కలుగఁగా అట్టి సంపర్కప్రభావమువలన జంతువులు 'వ్యక్తీకరణ' విధానముద్వారా మానవవర్గములో ప్రవేశించుటకు తగినసమయ మాసన్నమగును.

ఉదాహరణకు :- మనపటములోని మొదటి 'మార్జాల సమూహాత్మ' విషయము నాలోచించిన అది పరిణామము చెందుచురాఁగా ఒకానొకకాలమునకు అందునుండి విడివడి మంచి ప్రత్యేకలక్షణములతో కూడిన పెంపుడు పిల్లులకు సంబంధించిన 'సమూహాత్మ' ఏర్పడును. (58వ పటము). ఈ స్థాయికి వచ్చుసరికి వ్యక్తీకరణము సాధ్యమగును. 58 వ పటములో నెం 1 రు, నెం 2 రు పిల్లుల అనుభవములలో భేదమున్నదని అనుకొందము. నెం 1 రు పిల్లి చాలదయతోను ప్రేమతోను పెంచునట్టి యజమానుని ఇంటిలో పెరిఁగిన దనియు నెం 2 రు పిల్లి యజమానుఁడు దానిని వంటిల్లుదాటి మిగిలిన గదులలోనికి ఎన్నఁడు రానియ్యఁడనియు అనుకొందము. నెం 1 రు పిల్లి అనుకూలమైన వాతావరణములో పెరుగుచుండుటచేత తన యజమానుని ఆలోచనాభావనల

నుండి వెలువడు ఉత్తమవిధస్పందములు సోకి అట్టి లక్షణములను ఆ పిల్లి కొంచెముకొంచెముగా వ్యక్తము చేయఁగలుగును. అది చనిపోవులోపున ఈ ప్రత్యేకలక్షణములు దాని 'సమూహాత్మ'లో ప్రవేశించి, ఆ చిన్న భాగము వేఱగును. నెం 2 రు పిల్లి చనిపోవుటతోడనే దాని జీవి తిరిగి మిగిలిన జీవులతో సమూహాత్మలో ప్రవేశించును.

## వ్యక్తీకరణ విధానము

జంతువర్గము నుండి మానవ వర్గమునకు

| | ప్రథమ దశ | రెండవ దశ | మూడవ దశ |
|---|---|---|---|
| ఆది | * | * | * |
| అనుపాదక | తురీయాత్మ * | * | * |
| ఆత్మ | ఆత్మ * = * | * = * | ఆత్మ * = * |
| బుద్ధి | అంతర్వాణి | | బుద్ధి |
| మానశిక | రూప సంకల్పములు; జాకీ యొక్క ఆత్మ; సమూహాత్మ | సమూహాత్మ | మనస్సు; కారణ శరీరము |
| కామ | | | |
| భౌతిక | జాక్ (ఒక కుక్క) | జాక్ (ఒక కుక్క) | ఆటవిక మానవుడు |

(59 వ పటము)

నెం 1 రు పిల్లి పైన చెప్పినప్రకారము సమూహాత్మ నుండి వేఱుపడిన తదనంతరము జరుగు వ్యక్తీకరణవిధానము లోని మిగిలినయంశములు 59 వ పటమునుండి తెలిసికొన వచ్చును. 59 వ పటములో 'జాక్' అను పేరుగల కుక్కను గూర్చిన వివరములు తెలియఁజేయఁబడినవి. 'జాక్' మంచి సాంప్రదాయములకు చెందినకుక్క. తన యజమానుని యెడల ఎక్కువ భక్తివిశ్వాసములు కలిగియున్నది. గ్రంథ కర్తతో ఎక్కువ మైత్రి నెరపెడిది.

'జాక్' తన యజమానునియొద్దకు రాక పూర్వము అనఁగా 'సమూహాత్మ'లో నున్నప్పుడు పటములో చూపఁ బడిన సమకోణచతురస్రము దానిగుర్తు అనుకొన్నచో యజమానునియొద్దకు వచ్చి అతనిప్రేమ చూరగొన్న పిదప ఆ సమూహాత్మనుండి (అనఁగా ఆ చతురస్రమునుండి) జాక్ ఆత్మ పైకి లేచును. ఆ లేచినభాగమును పటములోని 2 వ కలములో త్రిభుజాకారముగ చూపఁబడినది. ఆలాగున కొన్నాళ్లు జరిగినతరువాత జాక్ ఆత్మగా పైకి లేచిన మానసిక పదార్థము మిగిలిన సమూహాత్మలోని మానసికపదార్థము నుండి 3 వ కలములో చూపినరీతిని విడిపోయి పైకి పోవును.

ఆ కుక్క యజమానుఁడు, వాని భార్య స్నేహితులు మున్నగు వారందఱినుండి ప్రసారమైన ఉత్తమస్పందముల ప్రభావము సోకుటచేతను, ఒక ప్రజ్ఞానాంశువు (Monad) తాను మానవశరీరములో ప్రవేశించుటకుఁగాను ఒకజీవాత్మను రూపొందించుకొను అన్వేషణమున నుండుటచేతను ఈ

ప్రత్యేకమగు జాక్ ఆత్మ కలుగుటకు కారణమైనది. చిర కాలము క్రిందటనే నీ ప్రజ్ఞానాంశువు ఒక్కొక్కలోకము లోని ఒకఅణువును తీసికొని ఆయా లోకములలో తన భవిష్య త్కార్యకలాపములు కొనసాగుటకొఱకు తనతో చేర్చి ఉంచుకొన్నది. తురీయాత్మ ఈ శాశ్వతాణువులను (permanent atoms) (వీనినే దేహబీజములు - భూతసూక్ష్మ ములు అని కూడ అనెదరు) భూతాత్మ, ఖనిజవృక్షజంతు సమూహాత్మలలోనికి వరుసగాపంపి అచ్చటి అనుభవములను వానిద్వారా సేకరించును. ఈ శాశ్వతాణువు లీ విధముగ పనిచేయుచు కొంతకాలమునకు జంతుసమూహాత్మలో బహూత్కృష్టమైన ప్రత్యేకత చెందిన భాగమును తాకును. అప్పుడు తురీయాత్మ ప్రజ్ఞానాంశువు తాను నివసించుచున్న ఉన్నతమైన లోకము (అనుపాదకలోకము) నుండి 'జాక్' ఆత్మను ఉద్ధరించుటకు గాను, దాని యజమానుఁడు మొదలగువారాచరించిన బాహ్యకర్మమునకు జవాబుగ, కొంత శక్తిని ప్రసారముచేయును. ఈ శక్తులను మనపటములో 'జాక్' ఆత్మపైని తురీయాత్మ ప్రసారముచేయుచున్నట్లు చూపఁబడినది. తలక్రిందుల పెద్ద త్రిభుజము తురీయాత్మ గను దానిలోని నక్షత్రచిహ్నములు తురీయాత్మ పనిచేయు వివిధలోకములలోని గుణములకు చిహ్నముగాను చూపఁబడి నది. (౭వ కలములో చూడనగును)

ఎప్పుడు తురీయాత్మనుండి ప్రచారమైన దివ్యస్పంద ముల ఫలముగా 'జాక్' ఆత్మ సమూహాత్మనుండి విడిపోయి

నదో 'జాక్' కుక్కరూపములో నున్నప్పటికి అది వాస్తవముగ కుక్కకు, మానవునికి మధ్యస్థితిలో నున్నది. ఈ స్థితి పటములోని 3 వ కలశములో చూపఁబడినది. చివరికలశము (4 వది)లో చూపినది దాని తరువాతస్థితి. ఈ స్థితిలో ఉన్నత లోకమునుండి తురీయాత్మ పంపుచున్నది. మహోపరిసారఫలముగా కారణశరీరము నిర్మాణమగును.

ఇప్పుడు జరిగిన దేదో ఒక ఉపమానము ద్వారానే వివరించుటకు వీలగును. 3 వ కలశములో చిన్న త్రిభుజముగ కనపర్చిన 'జాక్' ఆత్మ విస్పష్టాకారములేని నీటి ఆవిరివంటి దనియు అది నీటిబిందువుగ మాఱి దానిలోనికి గాలి పంపఁబడి బుడగవలె తయారైన దనియు అనుకొన్నచో, తురీయాత్మ క్రిందకు దిగి జాక్ ఆత్మను కారణశరీరముగ మార్చినప్పుడు కొంతవఱకు ఈ ప్రకారమే జరుగునని గ్రహింపవలెను. తురీయాత్మ శక్తి అనఁదగు దివ్యప్రేరణ 'జాక్' ఆత్మగా నున్న మానసికపదార్థములోనికి పోయఁబడును. అప్పు డామానసికపదార్థము కారణశరీరముగ రూపొందును. 'మానవాత్మ'గా రూపొందుటకు క్రిందికి దిగిన 'ఈశ్వరుని ప్రియపుత్రునకు' ఈ కారణశరీరము ఉపాధి అగును. (4 వ కలశములోనిది.)

వృక్షవర్గమునుండి జంతువుగ రూపొందు విధానమునకు, జంతువర్గమునుండి మానవవర్గములోనికి వచ్చు వ్యక్తీకరణవిధానమునకు చాల భేదమున్నది. ఇచ్చట జంతువు

మానవుఁడుగ మాఱడు. 'వ్యక్తీకరణము (individualization) జరిగినప్పుడు ఇదివఱకు చిరకాలము జంతువుగ నుండినది యంతయు ఒక 'ఈశ్వరాంశమునకు ఉపాధిగ మాత్రమే యగును. ఖనిజవృక్షజంతువర్గములలోని అన్ని అవస్థలలోని అనుభవములు పూర్తిగ నిర్వహింపఁబడినఁగాని తురీయాత్మ కారణశరీరముతో జీవాత్మను నిర్మాణము చేయలేదు. జంతువర్గములో సంపాదించిన అనుభవముల నన్నిటిని తాను వినియోగించుకొన్నను వ్యక్తీకరణము చెందుసరికి తాను క్రిందివర్గములతో సంబంధములేని మఱొక దివ్యచైతన్య ప్రవాహము అగును. అందువల్లనే 'వ్యక్తీకరణ' విధానముద్వారా ఉద్భవించిన ఈ మానవునికి కోతిమనిషి (anthropoid ape) కి మధ్యమున ఎంతో కొఱఁత కనుపించుచున్నది. ఈ ప్రథమమానవునిలో తురీయాత్మ చైతన్యమున్నది. కాని 'కోతిమనిషి'లో నున్నవి ఉత్తమజంతులక్షణములు మాత్రమే.

ఎప్పుడు జాక్ ఆత్మ సమూహాత్మనుండి వేఱైనదో, కుక్కరూపము ఉన్నప్పటికి నిజముగా అది శునకజీవి మాత్రము కాదు. కారణశరీరము ఏర్పడువఱకు ఇది పలు మార్పులకు లోనుగావలసి యున్నది. ఈ మార్పులు త్వర త్వరగా జరగవలె నన్న మానవుఁడు వ్యక్తీకరణవిధానమును బాగుగ అవగాహన చేసుకోవలసియున్నది. అప్పుడు మన జంతుమిత్రులు మొదటిమూర్తి దివ్యప్రసారమును అందుకొని మానవాత్మలుగ మాఱుదురు.

ఉత్తమశ్రేణి జంతువుల వ్యక్తీకరణము త్వరితముగ సిద్ధించుటకు జరుగుపనిలో ఈశ్వరప్రణాళికతో సహకరించి పని చేయఁగలుగుటయే మానవునికిఁగల హక్కులలో అతిప్రధానమైనహక్కు. ఈ విషయము తెలియదుగనుకనే చాలమంది ఈహక్కును చలాయింపలేరు. జంతువులు మానవులకు బానిసలుగ నుండు నిమిత్తమే సృష్టింపఁబడ్డవని చాలమంది అభిప్రాయము. వాని తెలివి, బలము మనకు దత్తముచేసి నాగరకతాభివృద్ధిలో మనకు జంతువు లుపయోగపడుచున్నను అవి మానవునికి ఉపయోగించుటకు మాత్రమే ఉద్దేశింపఁబడలేదు. ఈశ్వరప్రణాళికావిజయమునకు వాని పాత్రను అవి నిర్వహించుటయే ముఖ్యోద్దేశము. జంతువుల అనేకవిధములుగ మనకు తోడ్పడుచున్నప్పుడు అవి వేగముగ 'వ్యక్తీకరణము' చెందుటకు తగిన వాతావరణము ఏర్పాటు చేయుట మనకర్తవ్యమని మానవులు జ్ఞాపకముంచుకొనవలెను. అశ్వములు తమ తెలివితేటలను పందెపుపరుగులలో వ్యక్తముచేయుటలోను, కుక్కలు వేఁటలో జిత్తులమారితనము వ్యక్తముచేయుటలోను, పిల్లులు ఎలుకలను నిపుణత్వముతో పట్టుటలో నుపయోగించుటకు మాత్రమే తగిన శిక్షణము మనము వానివానికి ఇచ్చుచున్నాము. ఇది కేవలము పొరపాటు. మానవసంపర్కమువలన జంతువులలోని క్రూరస్వభావము అంతరించి ఉత్తమశ్రేణి మానవలక్షణములు వానిలో అభివృద్ధి చెందవలసియున్నది. జంతువులలోని జిత్తులమారితనమును అభివృద్ధిచేసిన మానవుఁడు తన

స్వలాభముకొఱకు వాని నుపయోగింపఁజూచుట పరిణామము
చెందు జంతువునకు అపకారము చేయుటయే అగును. మాన
వునికున్న ఉత్తమవిధమగు తెలివితేటలు, ప్రకృతిని లోబర్చు
కొనెడు శక్తి, జంతువర్గమును వశపఱుచుకొనుటకుకూడ
ఉపయోగపడినను, అట్లు వానిని వశపర్చుకున్నందువలన వాని
కే లాభము చేకూడునట్లు చూచు బాధ్యత మనమీఁద నున్న
దనియు ఆలాభము మనము పొందుటకు ఆశింపఁగూడ
దనియు మనము దృష్టిలో ఉంచుకొనవలెను.

—※※※—

# 8 అధ్యాయము

## త్రిమూర్తుల కార్యకలాపము

తత్త్వశాస్త్రమని నిర్వచించుటకు తగిన ప్రతిదర్శనము నందు పరిమితమైన మానవమేధస్సున కతీతమైన విషయము లెన్నో యున్నవి. మానవుఁడు చాలభాగము తన జ్ఞానేంద్రియములద్వారానే ప్రపంచమును తెలిసికొనును. ఆ విషయములే తన అనుభవములోనికి ఎక్కువగ వచ్చుచుండును. అతని ఉన్నతభావనాశక్తికూడ చాలభాగ మీ అనుభవములకు పరిమితమై యుండును. కావున తత్త్వశాస్త్రము ప్రపంచసృష్టిక్రమమును భూతభవిష్యద్విషయములను వివరముగ తెలియపఱిచినప్పుడు మానవుఁడు స్వానుభవముద్వారా వీని సత్యాసత్యములను తెలిసికోలేఁడు.

కొంతవఱకు ఆధునికవిజ్ఞానశాస్త్రవిషయములోకూడ నీసూత్రమే వర్తించును. మనకు కనపడు సూర్యుఁడు, గ్రహములు అన్నియు పూర్వమొకప్పుడు అనిర్దిష్టపు తేజోరాశులుమాత్రమే అని విజ్ఞానశాస్త్రము బోధించుచున్నది. కాని అది మనము ప్రత్యక్షముగ చూచి తెలిసికొనెడిది కాదు. ఇప్పుడు మనకు కనుపించుచున్న తేజోరాశులు, వాని చలనమునుబట్టి ఈ విషయము ఊహించి తెలిసికొనుచున్నాము. పరిణామవిధానమురీత్యా అణువులు జీవకణములుగను జీవకణములు మానవుఁడుగను దశాక్రమమున

నిర్మాణమగుచుండు నని శాస్త్రము నిర్వచించినప్పుడు అందలి సత్యము ప్రత్యక్షముగా నిర్ణయము చేయలేకపోయినప్పటికి మన మది అంగీకరించుచున్నాము. అట్లంగీకరించుటవలన మన వివేచనాశక్తి, వికాసవంతము ఫలప్రదము కాఁగల దని మనము నమ్ముటయే దీనికి కారణము. నిజముగ మానవుఁడు తన ప్రత్యక్షానుభవమే ప్రమాణముగ గ్రహించినచో అట్టి అనుభూతి కతీతమైన తత్త్వవిజ్ఞానశాస్త్రములలోని విషయ ముల నన్నింటిని తీసివేయవలసినదే. అట్టి పరిస్థితిలో మానవుఁడు ప్రస్తుతము తనకున్న దృఢమైన కల్పనాశక్తిని బుద్ధిచతురతను పోఁగొట్టుకొనును.

మానవుని ఆత్మవికాసానికి ఆటంకముకలుగఁజేయు అనిత్యమైన శరీరమును అతిశయింపనలె ననిన ఎల్లప్పుడు భావనాశక్తి నలవఱుచుకొనుటకు ప్రయత్నము చేయుటయే దీనికి మార్గము. మానవుని మేధశ్శక్తి పెరిగినకొలఁది అతని భావనాశక్తికూడ ఎక్కువ చురుకుగ పనిచేయును. ఇట్లీ రెండు శక్తులు వృద్ధి అగుటవలన మానవుని పరిసరపరిస్థితులుకూడ శక్తిమంతములు కాఁగలవు. మొత్తముమీఁద తత్త్వశాస్త్ర ప్రయోగము మన చుట్టునుండెడి వాతావరణమును మార్చు కొనుశక్తి మనకు కలుగఁజేయుటయేగనుక ఒకానొకప్పుడు వాని సత్యాసత్యములు తెల్చుకొనుట మనకు సాధ్యము కానప్పటికి తాత్త్వికవిషయపరిజ్ఞానము కూడ జీవితములో మనకెంతో అవసరము.

తన అనుభవముల కతీతమైన తాత్త్వికవిషయములను మానవుఁడెవరో కనవలసి వచ్చినప్పుడు మొత్తమంతయు నొక్కసారి సమీక్షచేసి చూచికొని తనభావమునకు వచ్చిన విషయములను మాత్రి మంగీకరింపవచ్చును. తత్త్వశాస్త్రము నిర్మింపఁగలిగిన మానసికభవనము పటిష్ఠమైనదిగను ఉత్సాహవంతముగను ఉన్నప్పుడు తన కిదివఱకు తెలిసిన విషయములకు వీనికి సామరస్యము కుదురు నని తోఁచినప్పుడు అట్టి తత్త్వసిద్ధాంతములను తా నంగీకరింపవచ్చును. ఈ అధ్యాయములోను, దీని తరవాతఅధ్యాయములోను నేను వ్రాసిన దివ్యజ్ఞానసిద్ధాంతముల విషయములోఁగూడ ఇదే విధాన మనుసరింపు మని నా కోరిక. అనేకజన్మలలో సంపాదించు అనుభవములద్వారా మాత్రిమే ప్రిత్యక్షముగ నీవిషయములు తెలియఁగలవు. అయినను అంతవఱకు జిజ్ఞాసగల ప్రితివ్యక్తి బుద్ధికి ఆకర్షణీయమైన భావనాశక్తిని పురికొల్పెడు జీవితదృక్పథమును అతనిమనస్సునకు తోఁపింపఁగలవు.

1. కోటానకోట్ల నక్షత్రిములతో విలసిల్లు నీ విశ్వమంతయు ఈశ్వరుఁడు అహురామజ్దా, అల్లా, లోగోస్, భగవంతుఁడు అను నామముల పిలువఁబడుచున్న "శుద్ధచైతన్య స్వరూపమే" (conscious life) అని దివ్యజ్ఞానసముచాటుచున్నది. ఆ ఏకైకచైతన్యము నే పురుషుఁడందురు. కాని ఈ పురుషుఁడు అపరిమితుఁడు, అతీతుఁడు. మనము సాధారణముగ 'పురుషుఁడు' అను భావముతో సంబంధించి ఆలోచించు విషయము లేమియు 'ఈయన'కు వర్తింపవు.

ఈ మహావిశ్వమునకు ఈశ్వరుఁడైన 'ఈయన' 'ఏకం' 'అద్వితీయం'. కాని బ్రహ్మాండమునకు ఆయన శక్తి త్రిమూర్తి రూపములోనే ప్రసారము చేయును. ఈ త్రిమూర్తిని హిందూమతసంప్రదాయములో సృష్టికర్త అయిన బ్రహ్మ, పోషణకర్త అయినవిష్ణువు, లయకర్త అయినశివుఁడు అని వర్ణింతురు. క్రైస్తవమతములో ఈ త్రిమూర్తిని తండ్రి, పుత్రుడు, పవిత్రాత్మ అయిన భగవంతుఁడు అందురు. మిగిలిన మతములలో కూడ త్రిమూర్తి భావమున్నది. వారికి వేలు వేలు పేర్లు కలవు.

2. విశ్వేశ్వరుఁడు (Cosmic Logos) బ్రహ్మాండములో చేయుపనిలో ఆయనతో సహకరించి పనిచేయుచున్న ఏడుగురు విశ్వగ్రహమండలేశ్వరులు కలరు. గొప్ప గొప్ప పరిణామవ్యూహములకు కేంద్రములైన బ్రహ్మాండములోని నక్షత్రములన్నియు ఈ సప్తగ్రహమండలములోను ఏదో ఒకదానికి చెందియుండును. ఈ సప్తగ్రహములు విశ్వేశ్వరుని ఏకైకచైతన్యము నెట్లు వ్యక్తపఱుపఁగలవో అట్లే ఈ నక్షత్రములుకూడ తమకు సంబంధించిన విశ్వగ్రహమండలేశ్వరుని చైతన్యమును వ్యక్తము చేయఁగలవు. 60 వ పటములో చిహ్నమాత్రముగ విశ్వేశ్వరుని, విశ్వగ్రహమండలేశ్వరులను చూపించితిమి. అనేకకోట్లనక్షత్రములు కలిగియున్న సప్తవిశ్వగ్రహమండలేశ్వరులను పెద్దవృత్తములోని ఏడు చిన్నవృత్తములుగను ఆచిన్నవృత్తములో చూపిన నక్షత్రములే విశ్వగ్రహమండలములలోని నక్షత్రకోటికి చిహ్నములుగ చూపఁబడినవి.




(60 వ పటము)

3. ఇట్టి మహావిశ్వచైతన్యమున మన పరిణామవ్యూహమునకు ఈశ్వరుఁడైన సూర్యభగవానుఁడు (సూర్యమండలేశ్వరుఁడు) ఏదో ఒక విశ్వగ్రహమండలములోని కోటానకోట్ల నక్షత్రములలో నొక నక్షత్రముగ తన పని నిర్వహించుచు ఆ ఏకైకచైతన్యుని, అద్వితీయుని తేజస్సును, కీర్తిని ప్రత్యక్షముగా ఇనుమడింపఁ జేయుచున్నాఁడు. తన తోడినక్షత్రములతో కలసి, విశ్వమంతటి అభివృద్ధికి సూర్యభగవానుఁ డెట్టి ప్రత్యేకపాత్రను నిర్వహించుచున్నాఁడో ఎవరు చెప్పఁగలరు? కాని ఒక్క విషయము మాత్రము

సిస్సందేహముగ చెప్పవచ్చు. మానవమాత్రులమైన మనకు 'ఆయనయే' భగవంతుఁడు. మన మనస్సంకల్పములకు, భావనలకు 'ఆయనయే' పరాకాష్ఠ. వేయేల, ఆయన మనము ఒకటే కావున ఆయననే మనము భగవంతునిగ భావించుకొనఁగలము.

నిజముగ మన వేళ్లు ఆ అద్వితీయునిలోనే నాటుకొని యున్నవి. కాని బీజకోశము లేక కర్ణిక (seed-pot) లోని బీజములవలె మనము ఆయన మహిమలో నిమిడియున్నాము. తల్లి తనగర్భమునందలి పిండము నెట్లు పోషించునో, అటులనే మానవుఁడు 'వ్యక్తీకరణము' చెందువఱకు తనలో పెట్టుకొని సూర్యభగవానుఁడు మనలను పోషించును. మన సంకల్పములు ప్రేమ భావములు వేయేల మనజీవితపథమంతయు ఆయనదే. మన ప్రత్యగాత్మ లన్నియు ఆయన అంశములే. ఆయన మహాగోళములోని చిన్నచిన్న గోళముల వంటివి ప్రత్యగాత్మలు. ఆయన కార్యరంగము మహావిశాలమైన బృహద్గోళము. దాని వ్యాసార్థము సూర్యునియొద్ద ప్రారంభమైనది. కాని దాని అంతము ఇంతవఱకు తేలలేదు. బహుశః భవిష్యత్తులో ఎప్పుడో కనిపెట్టఁబడెడి చివరిఉపగ్రహమువఱకు అది వ్యాపించియుండును. తన వ్యూహము (System) తన అద్భుతస్వభావము, క్రమక్రమముగా వ్యక్తముచేయుటకొఱకు తన గోళములో నిత్యము ఆయన పని చేయుచునే యుండును. ఇట్లు తన వ్యూహములోనుండి బయటకువచ్చిన ప్రాణికోటి సంపూర్ణవికాసమొంది తనలో లీనమైపోవువఱకు ఎంతో ఓర్పుతో కనిపెట్టియుండును.

4. "పైనఎట్లో క్రిందకూడ అట్లే". విశ్వేశ్వరుని మాదిరిగనే సూర్యమండలేశ్వరుఁడుకూడ తన వ్యూహమును శక్తిమంతముగ చేయుటకు త్రిమూర్త్యాత్మకముగనే పనిచేయును. అనఁగా, సృష్టిస్థితిలయకర్తగ పనిచేయును. దివ్యజ్ఞానసారస్వతములో త్రిమూర్తిని ప్రథమద్వితీయతృతీయేశ్వరులు (First, Second and Third Logos) అందురు. వీరినే వరుసగ మహేశ్వరుఁడు, విష్ణు, బ్రహ్మ అందురు. వీరు ముగ్గురు సూర్యమండలేశ్వరుని త్రిముఖము లనవచ్చు. మూఁడుమూర్తులుగ 'ఆయన' వ్యవహరించినను ఆయన అవిభాజ్యుఁడైన ఏకేశ్వరుఁడే.




(61 వ పటము)

5. సూర్యమండలేశ్వరునికి, సహాయులుగ సప్తగ్రహ మండలేశ్వరులు (The Seven Planetary Logoi) పని చేయుదురు. వీరినే సనాతనధర్మసారస్వతములో 'సప్తప్రజా పతు' లందురు. (62 వ పటము) వీ రేడుగురు సూర్యమండ లేశ్వరుని స్వభావమును ఏడు విధములుగ వ్యక్తముచేయు దురు. ఆయన అవ్యయమైన అనంతమైన చైతన్యానికి వీరు సప్తప్రవాహములు.




(62 వ పటము)

ఈ సప్త ప్రజాపతులను జొరాస్ట్రియనుమతములో (పారశీకుల మతము) సప్త 'అమేషాస్పెంటాన్' అందురు.

హేబ్రూమతములో 'భగవంతుని సింహాసనముముందుండెడి సప్తదేవతలు' అని అందురు.

సూర్యమండలేశ్వరుని వ్యూహములో జరిగెడి సమస్త కార్యక్రమమును సప్తప్రజాపతుల శక్తి నడిపించును. వీరిలో ఒక్కొక్కరు తన తన ప్రత్యేకలక్షణమును స్పందముల రూపముగా ప్రత్యణువురూపములోను ప్రవేశపెట్టెదరు. అందువలననే ఒక అణువునకు సూర్యరశ్మి తాకుటతోడనే ఆ అణువులోని బహుస్వల్పమైన సప్తతంతువులు ఒక్కసారిగ సప్తవర్ణములతో (ఇంద్రధనస్సులోని రంగులు) మెఱయును. వీరిలో ఒక్కొక్కరి చేతిక్రింద సృష్టిక్రియలో సహకరించి పని చేయు అనేకులు ఉద్యోగులు తరతమములుగాఁ గలరు. వీరు నిర్మాణము పోషణము మొదలగు కార్యములలో వారి యజమానుఁడైన 'ప్రజాపతి' ఆదేశము ప్రకారముపనిచేయుచుందురు. ఒక్కొక్కశాఖకు 'ప్రజాపతి' యే ప్రభువు, పాలకుఁడును. ప్రజాపతుల చేతిక్రింద పనిచేసెడి ఉద్యోగులను ప్రాగ్విజ్ఞానములో ఆదిత్యులు, వసువులు, ధ్యాని బుద్ధులు, ధ్యానిచోహాన్లు మొదలగు పేర్లతో పిలిచెదరు. ఇతరసాంప్రదాయములలో వీరికి వేఱుపేర్లు కలవు.

6. 63 వ పటములో సూర్యమండలములోని త్రిమూర్తుల కార్యకలాపములు సంక్షిప్తముగ చూపఁబడినవి. ఈశ్వరుఁడు మూఁడు విధములగు రూపములద్వారా పని చేయును. వానిప్రధానలక్షణము లీ క్రిందివిధముగ నుండును.

i ప్రథమేశ్వరుడు (First Logos) దైవత్వము మానవత్వము.

ii ద్వితీయేశ్వరుడు (Second Logos) విష్ణువు రూపము – జీవము.

iii తృతీయేశ్వరుడు (Third Logos) శక్తి – పదార్థము.




(63 వ పటము)

ఈ వ్యూహముతో సంబంధించిన పని ఈశ్వరుడు ప్రారంభించుటకు పూర్వము భగవత్సంకల్పమున ఉత్పత్తి స్థానమైన బ్రహ్మాండ మానసికలోకములో (cosmic mental plane) ఈ వ్యూహము మొదటినుండి చివరవఱకు ఎల్లుండ

వలెనో దాని నమోనా నొకదానిని సృష్టించినాఁడు. శక్తులు, ఉపాధులు, భావములు, సంకల్పములు, అంతర్వాణి మొదలగు వాని కాదర్శములగు నమోనాలను (Archetypes) సృష్టించి అవి ఏప్రకార మెట్టి నాగరికతా కాలములో ఎట్టి స్థితిలో తన పరిణామవ్యూహములో ప్రవేశపెట్టవలెనో ఒక ప్రణాళికారూపములో నిర్ణయించియుంచెను. ఆప్రకారము ఏస్థలములో నీ ప్రణాళికను ప్రారంభము చేయవలె నని నిశ్చయింపఁబడినదో సరిగ అచ్చటనే తృతీయమూర్తి అయిన బ్రహ్మశక్తి పదార్థము రూపములో తాను చేయవలసిన పని ప్రారంభించినాఁడు.

ఈనాఁడు సూర్యుఁడు సప్తగ్రహములు, నక్షత్రములు కనపడుచున్న మహాకాశములో, మన వ్యూహమున నున్న

IN THE BEGINNING ---- DARKNESS WAS UPON THE FACE OF THE DEEP

The Aether of Space
Mean Pressure 750,000 tons to the square inch.
(O. Reynolds)

Prakriti "Root-Matter."
Weight of a cubic metre .000,000,000,000.001 of a gramme
(Kelvin)

(64 వ పటము)

దృశ్యాదృశ్యపదార్థమువంటి దేదియును లేదు. ఆధునిక విజ్ఞానశాస్త్రజ్ఞులు నిర్వచించినట్లు మన ఊహకుఁగూడ అతీత మైనట్టి ఆకాశము లేక మూలప్రకృతి మాత్రముండెడిది. ఆకాశములోని రంధ్రములద్వారానే పదార్థము సృష్టింపఁ బడినదని విజ్ఞానశాస్త్రజ్ఞులు అందురు. దీనినే దివ్యజ్ఞాన సారస్వతమున 'కొయిలానీ' (అనఁగా శూన్యము) అందురు. 64 వ పటము చూడుఁడు.

ఈ శూన్యాకాశమును విశ్వేశ్వరుఁడు అనేకప్రదేశ ముల గట్టిగా నొక్కిపెట్టి దానిలోనికి తనశక్తిని ప్రసారము చేసినాఁడు. అప్పుడు శూన్యము మాయమై 'అనేకబుద్బుద ములు' లేక 'తేజఃబిందువు' లుద్భవించినవి. ఒకొక్కబుడగ



(65 వ పటము)

విశ్వబ్రహ్మ చైతన్యబిందువే. తిరిగి శూన్యము అలము కొనిపోకుండ విశ్వబ్రహ్మ అట్లు గట్టిగ అణఁచిపెట్టి ఉంచి నంతసేపు ఆ బుడగలు అట్లే నిలిచియుండును.

తదుపరి సూర్యమండలేశ్వరుని తృతీయమూర్తి అయిన బ్రహ్మ ఏడేసి బుడగలను కలిపి ఒకమరచుట్ట (spirai)



(66 వ పటము)

ఆకారమువంటివి తయారుచేసినాఁడు. వీనినన్నిటిని దగ్గరగ కలిపి పట్టుకొన్నది బ్రహ్మ ఇచ్ఛాశక్తియే. వీనినే మొదటి వర్గపు మరచుట్టలు (spiral of the first order) అన్నారు. వీని నేడింటిని కలిపి పెనవేయుఁగా 'రెండవ వర్గపుమరచుట్ట' లేర్పడినవి. ఏడేసి రెండవ వర్గపు మరచుటలు కలిపిచుట్టగా 'మూఁడవ వర్గపుమరచుట్టలు'ను, అట్టివి ఏడు కలిపి చుట్టగా 'నాలుగవ వర్గపు'మరచుట్టలును తయారైనవి. ఈలాగున 'ఆఱవ వర్గపు 'మరచుట్టలవఱకు తయారైనవి. వాని మాదిరి స్థూలముగా (66 వ పటములో మొదటి రెండవ మూఁడవ వర్గపు మరచుట్టలను చూడవచ్చు. అందులోని తెల్లనిగీత బ్రహ్మఇచ్ఛాశక్తి.

ఆఱవ వర్గపుమరచుట్టలు పదింటిని సాగదీసి ఒకదాని ప్రక్క నొకటిపెట్టి వానినన్నిటిని కలిపి పెనవేయఁగా (67 వ పటములోవలె) మన స్థూలపదార్థపు అణువు తయారగును. 'మొదటివర్గపు మరచుట్ట' మొదలు అణువు తయారగు వఱకు చేసినపని అంతయు బ్రహ్మదే. అతని చైతన్య శక్తి వానినట్లు పట్టి యుంచినంతసేపు మరచుట్టలు ఆలాగుననే నిలిచియుండును. కావున మన భౌతికాణువు అనునది నిజముగ పదారము కాదు. సూర్యమండలేశ్వరుఁడు స్థూల ప్రపంచమును నిర్మించునుద్దేశముతో గటిగా పట్టి యుంచిన కోటానకోట్ల 'విశ్వబ్రహ్మచైతన్యబిందువుల' సముదాయమే మన భౌతికాణువు.

భౌతికప్రపంచమును సృష్టించుటకు పూర్వమే భౌతికాతీత (అదృశ్య) ప్రపంచాలు సృష్టింపఁబడినవి. ఇది అర్థము చేసికొనవలె నన్నచో 63 వ పటము నొకసారి చూడఁగోరెదను. దానిలో తృతీయమూర్తిని తెలిపెడు గుర్తు అగు చిన్నవృత్తమునుండి రెండుగీతలు గీయఁబడినవి. ఇవి లోకము




(67 వ పటము)

లను, ఉపలోకములను నిర్మించు రెండుశక్తులకు చిహ్నములు. అందులో షాట్టిగీత 'కొయిలన్'లో (Koilon) బ్రహ్మచేయు పని అనఁగా బుడగలను లేక 'తేజోబిందువులను' అనేకవర్గములుగ కూర్చుట సూచించును. ఈ తేజఃబిందువులైన బుడగలనే పరిమాణములుగ (అనఁగా నిటుకలక్రింద) భావించి సూర్యమండలములోని ఏడులోకములు నిర్మింపఁబడినవి.

మొదటిలోకము, 'కొయిలన్ నుండి' ప్రప్రథమముగా వెలువడిన తేజోబిందువులతోడనే నిర్మింపఁబడినది. దానినే ఆదిలోక మందురు. ఒక్కొక్క తేజోబిందువు ఈ లోకపదార్థములోని అణువు. రెండవదైన అనుపాదకలోకము ఇట్టి బిందువులు 49 కలిపి తయారుచేసిన 'మొదటి వర్గపుమరచుట్టలు' ప్రమాణముగా తీసికొని నిర్మింపఁబడినది. ఈ లోకపు అణువులు ఇవే. ఆత్మలోకము రెండవ వర్గపుమరచుట్టలతో అనఁగా $49 \times 49 = 2401$ బిందువులు ఒక్క అణువుగ తీసికొని నిర్మింపఁబడినది. ఈలాగునే బుద్ధిలోకము మూఁడవ వర్గపు మరచుట్టలతోను (అనఁగా $49^3 = 49 \times 49 \times 49$ తేజోబిందువులు) మానసికలోకము నాల్గవ వర్గపుమరచుట్టలతోను ($49^4$ బిందువులు) కామలోకము అయిదవ వర్గపుమరచుట్టలతోను ($49^5$ బిందువులుకలిపి ఒకఅణువుగ) భౌతికలోకము ఆఱవ వర్గపుమరచుట్టతోను ($49^6$ బిందువులు కలిపి ఒక అణువుగ) నిర్మింపఁబడినవి. భౌతికాణువులలో $49^6 = 49 \times 49 \times 49 \times 49 \times 49 \times 49$ జంతువులు అనఁగా సుమారు 1400 కోట్లు గలవు. ప్రత్యేకపరిస్థితినిబట్టి ఇంకా బుడగలు హెచ్చుగానుండును.

ఒక్కొక్కలోకము నిర్మించుటకు తగిన అణువులు సృష్టించిన తరువాత బ్రహ్మ ఆ యా లోకములలో ఉపలోకములు తయారుచేయును. (63 వ పటములో తృతీయమూర్తినుండి వెలువడెడు రెండవపొడుగు గీత బ్రహ్మచేయు ఈ రెండవ పనిని సూచించును). ప్రతిలోకమునందలి అణువులను రెండు,

మూఁడు, నాల్గు ఇత్యాదిగా కలిపి ఒక అణువుగఁజేసి ఉప లోకములను సృష్టించును. అన్నిటికన్న పై ఉపలోకము (అనఁగా ప్రతిలోకమునందలి మొదటి ఉపలోకము) ఆ లోకపుఅణువులతోనే తయారుచేయఁబడును. రెండవది అట్టివి రెండణువులు, మూఁడవది అట్టివి మూఁడణువులు ఈలాగుననే ఏడు ఉపలోకములు తయారుచేయఁబడును. మన భౌతిక లోకపు మొదటి ఉపలోకము ఏకైకభౌతికాణువులతోడనే నిర్మింపఁబడును. అవి ధనము ఋణము అను రెండురకము లుగా నున్నవి. ఈ రెంటిని పలురకములుగ కలిపి మిగతా ఉపలోకములు సృష్టింపఁబడినవి. వానిని దివ్యజ్ఞానసారస్వత ములో అణు, ఉపాణు, సూక్ష్మాకాశ, వాయు, ద్రవ, ఘనోప లోకములు అని యందురు. ఈ ఉపలోకములనిర్మాణము జరుగునప్పుడే రసాయనికద్రవ్యములుకూడ సృష్టింపఁబడినవి.

కావున బ్రహ్మ సప్తలోకములను వాని ఉపలోకము లను నిర్మించును. ఆపని ఇప్పటికిని సాగుచునే యున్నది. ఇంకను పూర్తికాలేదు. ఈ పదార్థము లన్నిటియందున్న ప్రాణశక్తి తృతీయమూర్తియే. విద్యుచ్ఛక్తి అనునది భౌతిక లోకములో ఆయన శక్తిస్వరూపమే. అగోచరమగు కుండలిని అను మహాశక్తి కూడ ఆయన శక్తిస్వరూపమే. ఈ శక్తి ఉత్తమశ్రేణిమానవులలో పనిచేయును.

బ్రహ్మ సృష్టించిన ఏడులోకములలోను రెండవ మూర్తి అయిన 'మహావిష్ణువు' పనిచేయుట ప్రారంభించును. ఆయన శక్తి జీవము-రూపముగ వ్యక్తమగును. ఈశక్తిని

సప్తలోకములలోని పదార్థములలోను ప్రవేశపెట్టగా మన కగోచరమైన చైతన్యముతో తొణికిసలాడు రూపములను సృష్టించు శక్తి నిచ్చును. ఈ జీవము అన్నిలోకముల పదార్థములతోను వివిధమైన ఉపాధులను నిర్మించుచున్నది. ఎంత కాల మీా విష్ణుశక్తి ఆ ఉపాధిని అంటిపెట్టుకొనియుండునో అంతకాలము ఆ ఉపాధి సజీవముగ నుండఁగలదు.

పుట్టుట, పెరుగుట, క్షయమగుట, మరణించుట అను నవి ఈదశలోనే ప్రారంభమగును. ఏదో ఒక ఉపాధిద్వారానే విష్ణుశక్తి పరిణామకార్యము నిర్వహింపవలసియున్నందున ఉపాధి ఉద్భవించును. ఆ కార్యము అభ్యుదయ పరంపరలనందుచు గమ్యస్థానమునకు పురోగమించునపుడు ఆ ఉపాధి కూడ పరిణామము చెందును. ఆ ఉపాధికి సంబంధించినంతవఱకు తాను చేయవలసినపని పూర్తి అయిన తరువాత విష్ణుశక్తి ఆ ఉపాధినుండి జీవమును నెమ్మదిగ ఉపసంహరించుచుండును. అందువలన అది క్షయమగుచున్న చిహ్నములు కనపడును. అట్లు పూర్తిగ జీవమును వేఱు చేయుటతోనే అది మరణించును. ఇట్లు ఉపసంహరింపఁబడిన జీవము ఇంతకన్న ఉత్తమమైన నూతనోపాధిని నిర్మించుకొని తన అభివృద్ధికి ఆత్మవికాసమునకు అనుగుణమైన నూతనానుభవములు పొందుటకొఱకు దానిని ద్వితీయమూర్తి (విష్ణువు) తిరిగి క్రిందికి పంపును. ఆ విష్ణుశక్తి చైతన్యమే భౌతికప్రపంచములో 'ప్రాణముగ' వ్యక్తమగును.

సూర్యమండలములోని నాలుగు ఊర్థ్వలోకములలోను విష్ణుశక్తి పనిచేయునప్పుడు దానిని 'మొనాడిక్ ఎస్సెన్సు' (monadic essence) (తురీయాత్మ చైతన్యము) అందురు. ఈశ్వరప్రణాళికాప్రకారము ఏ దశలోనుండగ ఎంత అభివృద్ధిపొందవలె నని నిర్ణయింపఁబడినదో ఆప్రకారమభివృద్ధి చెందుచు ఒక్కొక్కమెట్టే మొనాడిక్ ఎస్సెన్సు లేక తురీయాత్మ చైతన్యము క్రిందికిదిగును. ఒక 'చక్రకల్పకాలము' (chain period) ఇది 'ఆదిలోక' పదార్థములో గడపును. ఆ కల్పము అంతమగుసరికి ఇది తిరిగి విష్ణువులో లీనమైపోయి తరవాత కల్పము ప్రారంభ మగుటతోనే ఆయననుండి వెలువడి అనుపాదకలోకపుపదార్థమున ప్రవేశించి దానిని ఉపాధిగ చేసికొనును. అదివఱలో మొదటి చక్రకల్పములో పొంది జీర్ణించుకొన్న అనుభవములన్నియు ఇప్పుడు శక్తులుగాను, గుణములుగాను వ్యక్తము కాఁగా వానిసాయముతో రెండవ చక్రకల్పమున అనుపాదకలోకములో తన పని ప్రారంభించును.

ఈ ప్రకారమే చక్రకల్పము తరవాత చక్రకల్పము అగుసరికి ఒక్కొక్కలోకము తరువాత, దిగువలోకములోనికి దిగుచు, 5 వ చక్రకల్పము ప్రారంభమగుసరికి ఇది ఉత్తమ మానసికపదార్థములో ప్రవేశించి దానిని ఉపాధిగ చేసికొనును. ఇంతవఱకు ఈ 'మొనాడిక్ ఎస్సెన్సు' (తురీయాత్మచైతన్యము) స్వానుభవమును పెరిగు చేసికొనుట కొఱకు ప్రత్యేకపరిణామవ్యూహమునకు మాత్రమే కట్టుబడియుం

డదు. కాన ఇంతటినుండి దాని అనుభవములు మన పరిణామ వ్యూహామునకు మాత్రము పరిమితమై యుండును. మానసిక పదార్థములో ప్రవేశించినప్పటినుండియు దీనిని 'భూతాత్మ వర్గము' (elemental essence) అందురు. ఉత్తమమానసికో పాధిలో ఈ చైతన్యము పనిచేయునప్పుడు దానినే ప్రథమ భూతాత్మకవర్గ మనియందురు (first elemental essence). ఒక చక్రకల్పకాలము పూర్తి అయినతరువాత ఈ శక్తి నీచ మానసికపదార్థములోనికి దిగును. ఇప్పుడు దీనిని ద్వితీయ భూతాత్మకవర్గము (second elemental essence) అం దురు. ఇంకొక చక్రకల్పకాలము పూర్తి అగుసరికి కామ లోకపదార్థములోనికి దిగి 'తృతీయభూతాత్మకవర్గమగును' (third elemental essence).

మానసికకామపదార్థమునకు జీవచైతన్యము కలిగించున దీవిష్ణుశక్తియే. అందువలన మానసికలోకములో నొక సంకల్పమువలనఁగాని కామలోకములో ఒకకోరికవలనఁగాని కలిగిన ఒకస్వల్పస్పందమువలన తొందరగ అనేకమానసిక పదార్థములలో అనేకరూపములు ఉత్పత్తి యగును. ఇవే సంకల్పరూపములుగ ఘనీభవింపఁగలవు.

కామపదార్థములోని విష్ణుశక్తి తిరిగి ఒక చక్రకల్ప కాలమునకు భౌతికపదార్థములో ప్రవేశించును. దీనిఫలిత ముగా ఒకదానితో నొకటి కలియఁగలశక్తి రసాయనికద్రవ్య ములకు కలుగును. తృతీయమూర్తి అయిన బ్రహ్మ ఉదజని ప్రాణవాయువులు సృష్టింపఁగా విష్ణుశక్తివీనిలో ప్రవేశించి

నప్పుడే రెండుదజని అణువులు ఒక ప్రాణవాయువుఅణువుతో కలిసి నీరగును. ఈనాఁడు మనకు తెలిసిన భౌతికపదార్థ మనునది ఈ విష్ణుశక్తి పనివలన ఏర్పడినదే. ఆయన మార్గ దర్శకత్వములోనే ఘనపదార్థమైన భూమిని నిర్మించుటకు సిద్ధముగా నున్న ఖనిజవర్గము వెల్లడిచేయఁబడినది. పదార్థ మిప్పుడు కచ్చితమైన అనేక క్షేత్రగణితాకారములలో అందము గాను బహుచిత్రముగాను కనపడు స్ఫటికరూపము దాల్చఁ గలదు. ఈశ్వరప్రణాళికాదేశానుసారముగ భౌతికవస్తుసంప దలో విష్ణుశక్తి పనిచేయుచుండును. మన కన్నులకు ఈ ఖనిజము జడపదార్థమువలె కనపడును. ఈ జడపదార్థముగా కనపడుద్రవ్యములోనే విష్ణుశక్తి నిత్యమును పనిచేయుచునే యున్నది. నిజానికి ఏవిధమైన చైతన్యముపైకి గోచరింపకుండ ఖనిజములో కట్టుబడి యుండుట యనుస్థితి ఈశ్వరుని శిలువపై పెట్టి చీలలు కొట్టి హత్యచేసి సమాధిచేసినట్టి స్థితివంటిదే అనుకొనవలెను.

విష్ణుశక్తి ఖనిజవర్గములో ప్రవేశించునప్పటికి పదార్థ ములో ఎంతవఱకు క్రిందికి దిగవలెనో అంతవఱకు దిగి అప్పుడు తిరిగి ఆరోహణ ప్రారంభించెను. ఆరోహణలో మొదటిమెట్టులోనే వృక్షవర్గముగ వ్యక్తమయ్యెను. ఈ స్థితికి వచ్చునరికి భౌతికపదార్థములు మనకు ప్రత్యక్షముగా గోచ రించుచు జీవచైతన్యమున కుపాధిగ పనికివచ్చు క్రొత్తశక్తిని సంపాదించును. రసాయనిక ద్రవ్యములు గుంపుగుంపు లగుచు చేరును. వాని మధ్యమున నొకగుప్తమైన జీవచైతన్యము

అంకురించి వానిని జీవకణములుగ నిర్మించును. ఈ జీవకణము లేక జీవాంకురము విష్ణుశక్తివలన నడిపింపఁబడి కాలానుగుణముగా వృక్షవర్గముగ మార్పుచెందును. (4 వ పటముచూడుము). తిరిగి ఈ ప్రకారముగ వృక్షవర్గములో ఒకచక్రకల్పకాలము అనేకవిధములైన అనుభవములను సంపాదించి క్రమక్రమముగ పరిణామముచెంది దాని తరవాత చక్రకల్పములో జంతువర్గములోనికి మారును. (5 వ పటముచూడుఁడు). జంతువర్గములో అనేకపర్యాయములు వివిధజంతుసంతతులలో జన్మించి చివరకు వ్యక్తీకరణము చెందుటకు తగిన పెంపుడు జంతువుగ తయారగును.

జంతుసమూహాత్మలోని ఒక జంతుజీవము వ్యక్తీకరణమునకు సిద్ధముగ నున్నప్పుడు ప్రథమమూర్తి (శివశక్తి) పని ప్రారంభమగును ఆయన తనలోని అంశమగు 'తురీయాత్మ'ను కారణశరీరములో నొక జీవాత్మను నిర్మించుటకొఱకు పంపును. అప్పుడు ఈశ్వరప్రతిమ మాదిరిగ జీవాత్మ నిర్మింపఁబడి అది పరిణామయాత్ర ప్రారంభించును. తన లోను, తోడిమానవునిలోను, తనచుట్టునున్న ప్రకృతిలోను ఈశ్వరుని కనుఁగొనుటయే ఈ పరిణామయాత్రకు లక్ష్యము. భౌతికప్రపంచములో ప్రథమమూర్తి అయిన మహేశ్వరుని శక్తి స్వరూపము మానవోపాధిలోని అమృతత్వము గలిగిన జీవాత్మయే.

ఈ ప్రకారము చాలకాలముకిందట ప్రారంభమైన త్రిమూర్తులశక్తిమంతమైన కార్యకలాపములను మనమిప్పుడు

వేగముగ సమీక్షించితిమి. కాని ఉపనిషత్తులలో చెప్పినట్లు ఇంకను ఈ కార్యక్రమమునకు ఆకారము తేలలేదు. ఇది ఇంకను గర్భస్థముగనే యున్నది. నిర్మించుట, లయముచేయుట, పునర్నిర్మించుట అనుపద్ధతిని సృష్టిస్థితిలయకర్తగా ఈశ్వరుడెల్లప్పుడు ఏదో పనిచేయుచునేయుండును. ఇట్లు ప్రణాళికాసిద్ధికొఱకు పనిచేయుచు ఒకమెట్టు తరువాత నొక మెట్టు ఎక్కుచు లక్ష్యముదెస పురోగమించుచుండును. ఆ ప్రణాళికానిదర్శనమే నిజమైన విశ్వరూపసాక్షాత్కారము, మోక్షానందము. ఆ ప్రణాళికాసిద్ధికొఱకు పనిచేయుటయే మానవత్వమునుండి దైవత్వముఁ బడయుటకు తగినసాధనము. జీవితములోని అమృతత్వము, కాలములోని అనంతత్వము, మానవునిలోని దైవత్వము అను ప్రణాళికలు సక్రమముగ అర్థముచేసికొని నిరంతరము దాని విజయముకొఱకు పని చేయువారివే అని తెలియవలెను.



# 9 అధ్యాయము

## జీ వ వ ర్గ ము లు

ఆధునికవిజ్ఞాన శాస్త్రము పరిణామసిద్ధాంతమును ఎంత మహత్తరముగా అభివృద్ధిచేసినను దివ్యజ్ఞానసిద్ధాంతము వ్యక్త పఱిచినంత ఘనత, విశాలత్వము అది ఇంకను పొందవలసి యున్నది. దివ్యజ్ఞానసారస్వతమున జీవము అను పదమునకు అతిగంభీరమైన మిగులలోతైన అర్థము కలదు. 'జీవము' అనునది ప్రత్యేకముగ వృక్షజంతుమానవవర్గానికి మాత్రమే పరిమితమై లేదు. పైకి జడపదార్థముగా కనపడు ఖనిజవర్గములోను ఇంకను మన కంటి కగోచర మగు క్రిందివర్గముల లోను మానవాతీతవర్గములలోను గూడ "జీవము" కలదు. 68 వ పటములో, పరిణామముచెందుచున్న జీవతరంగము చూపఁబడినది. 9 వ పటములోని వివరములతో పోల్చి చూచిన మానవవర్గముతో సంబంధములేని ఇతరజీవప్రవాహము లున్నవనియు, మానవునితో సమానమైన స్థాయి వఱకు అభివృద్ధిచెంది మానవజన్మ అనవసరములేకుండగనే మానవాతీతస్థితికి 'జీవము' పరిణమింపఁగల దని తెలియఁ గలదు. 68 పటములో మానవవర్గమునకు సంబంధించిన పరిణామమే చూపఁబడినది. ఈ పటములో ఈశ్వరచైతన్యము ఏప్రకారము ఒకస్థితినుండి పైస్థితికి పురోగమించుచున్నదియు సప్తజీవవర్గములు (మూఁడు భూతాత్మవర్గములు,

ఖనిజ, వృక్ష, జంతు, మానవవర్గములు)గా ఏలాగున వ్యక్త మయినది మనము చూడఁగలము. వెనుకటి అధ్యాయములో వర్గపరిణామమునుగూర్చి చెప్పియుంటిని. 59 వ పటములో పెంపుడుజంతువు మానవత్వము చెందు వ్యక్తీకరణవిధాన మును తెలిపియున్నాను.

పరిణామముచెందుచున్న జీవవర్గములు

మానవవర్గము
జంతువర్గము
వృక్షవర్గము
ఖనిజవర్గము
భూతాత్మవర్గము
చంద్రాత్మవర్గము
సూర్యాత్మవర్గము

(68 వ పటము)

'ప్రథమభూతాత్మవర్గము' మొదట మానవవర్గము వఱకు జీవపరిణామములో ఏడుదశలు గలవు. వీనినే 'జీవతరంగము' లనెదరు. ఇతరపరిణామప్రవాహములఁ గూడ 'జీవతరంగము' ఉన్నది. కాని ప్రత్యేకముగ ఈ పదమును మానవపరిణామమునకు సంబంధించిన జీవప్రవాహవిషయములోనే వాడుచుందుదు (68 వ పటము). ఈ మార్పులన్నియు సంభవించుట కనేకయుగముల కాలము పట్టును. అయినను పని యావత్తు అదివఱకే నిర్ణయింపఁబడిన ప్రణాళికప్రకారము ఏగడియకు జరుగవలసిన పని ఆగడియకు

'తు' 'చ' తప్పకుండ జరిగి తీరును. ఏకాలమునకు ఏవిధమైన జీవి ఎట్టి ఉపాధియందు ఏరంగములో పైకి రావలసియు న్నదో సరిగ ఆకాలమునకే, అది అగపడును. ఇదంతయు ఈశ్వరప్రణాళికను అన్నిరంగములలోను కనిపెట్టి చూచుచు మిక్కిలి మెలఁకువతో నడిపించు కార్యకర్తల నిరంతర పర్యవేక్షణమున జరుగుచుండును.

మన మీనాఁడు కాలానికి ప్రమాణముగా పెట్టుకొన్న 'సంవత్సరములు' అను వానిని దృష్టిలో పెట్టుకొని ఈ ప్రణాళిక పూర్తి చేయుటకు కాలనియమము నిర్ణయింపఁబడలేదు. ఈ ప్రణాళికను అంచెలవారీగా పూర్తి చేయవలెననియు ఏదశకు ఆదశ కాఁదగిన పని ప్రణాళికప్రకారము పూర్తి అయిన పిదప తరువాత దశ ప్రారంభము కావలెనను ఏర్పాటునుబట్టి అంచెలవారీగా మాత్రము నిర్ణయము జరిగినది. (in terms of quotas of evolutionary work & not in terms of actual years)

మానవజాతి యాద్యంతములకాలములో 7 మూల జాతులు ఉద్భవించుననియు, ఒక్కొక్కమూలజాతిలో 7 ఉప జాతులుండుననియు, 2 వ అధ్యాయమున తెలియపఱిచినాను. ఏడేసి ఉపజాతులు గల ఏడుమూలజాతుల ద్వారా జరగవల సిన పని పూర్తిఅగుటకు పట్టుకాలమును 'ప్రపంచకాలము' (world period) అని అందురు. ఈ ప్రపంచకాలములో మన 'జీవతరంగము'యొక్క 7 జీవవర్గములకు సంబంధించిన పరిణామవ్యూహము పూర్తిగా పనిచేయును. ఈ జీవతరం

గము, మొదటి మూలజాతిలోని మొదటిఉపజాతితో ప్రారంభమయి, 7 వ మూలజాతియందలి 7 వ ఉపజాతి చేయవలసిన పని పూర్తిఅయిన తరువాత అంతమగును.

ఒక ప్రపంచకాలములో పూర్తిచేయుటకు నిర్ణయింపఁబడిన పని ముగిసిన వెంటనే ఈ 'జీవతరంగము' మన భూమిని విడిచి మన సూర్యమండలములోని ఇంకొక గోళములో పని ప్రారంభించుటకు అచ్చటికి పోవును. తిరిగి




(69 వ పటము)

అచ్చట కూడ 'జీవతరంగము' సప్తజీవవర్గములద్వారా పరిణామముచెందుచు మానవవర్గములో 7 మూలజాతుల లోను వివిధనాగరికతాసంస్కృతీసాంప్రదాయములద్వారా అభ్యుదయము చెంది ఆ గోళముపైన పనిని పూర్తిచేసికొనును. అక్కడ పని పూర్తిఅయిన తరువాత 'జీవతరంగము' మఱొక గోళము చేరును. ఈప్రకారమే ఈశ్వరప్రణాళికా నిర్దేశము ననుసరించి, ఒకగోళముతరవాత నొకగోళములో నూతనపక్కిని పని చేయుచునేయుండును.

69 వ పటము జాగ్రత్తగా పరిశీలించినచో ఈ భూమి పైన 'జీవతరంగము' ఎట్లు పనిచేయునో అర్థముకాఁగలదు. మన 'జీవతరంగ' మభివృద్ధిచెందుటకు సూర్య మండలములోని ఏడుగోళములు లేక గ్రహములు కావలసి యున్నవి. ఇందులో భూమి, కుజుఁడు, బుధుఁడు భౌతికపదార్థ గ్రహములు. మిగిలిననాల్గును అదృశ్యపదార్థనిర్మితములు. ఇవికూడ సూర్యునిచుట్టును భౌతికగ్రహములవలెనే తిరుగుచుండును. కాని వానిది భౌతికాతీతపదార్థము. ఈనాలుగింటిలోను, 'ఇ' 'గ' లు కామపదార్థముతోడను 'అ' 'చ' లు మానసికపదార్థముతోడను చేయఁబడినవి. ఈ గోళములన్నియు ఒకదానితో ఒకటి సంబంధములేకుండ విడిగా నున్నవి. ఇవి వేనికవి మనకు తెలిసిన భూమి, కుజుఁడు, బుధుఁడువలె పూర్ణగోళములు.

69 వ పటములోని 'పృథ్వీగోళము' నొకసారి చూచినచో అందలి భౌతికకామమానసికపదార్థము లొకదానిచుట్టు

మఱొకటి ఆవరించియున్నట్లగపడును. వీనిలో అన్నిటికన్న సూక్ష్మమైన పదార్థము దానికంటె స్థూలముగానున్న పదార్థముతో ఓతప్రోతముగ కలిసియున్నది అని వేఱ చెప్ప నవసరములేదు. కామపదార్థము భూమిచుట్టు అనేకమైళ్లి వఱకు పై భాగములో వ్యాపించియుండుటయేగాక భూమిని చొచ్చుకొని బాగుగ లోతుగా కూడ వ్యాపించియున్నది. అలాగుననే నీచమానసికపదార్థము, స్థూలకామపదార్థములు రెండింటికి లోపల వెలుపల కూడ ఆవరించియున్నది. మన భూమికి లోపల, వెలుపల, చుట్టు, నుండునదే భువర్లోకము (కామలోకము). నీచమానసికపదార్థనిర్మితమైనదే 'స్వర్గము'. ఉత్తమమానసికపదార్థనిర్మితమైనదే 'ఉత్తమ స్వర్గము'. ఈలాగుననే వీనియన్నిటితో మిళితమయి బుద్ధి లోకము, ఆత్మలోకము మున్నగునవి యున్నవి. ఈ పటములో వానిని చూపలేదు.

ఇదేప్రకారము కుజగ్రహములో కూడ భౌతికగోళము కామమానసికపదార్థగోళములు ఉన్నవి. అవన్నియు ఒకదాని చుట్టు నొకటియుండి లోపలకుకూడ చొచ్చుకొని 'ఓతప్రోతము'గా ఉన్నవి. కుజగ్రహపుకామలోకమునకు, భూగ్రహపుకామలోకమునకు ఏమియు పోలిక లేదు. మన కామలోకమునుండి కుజగ్రహకామలోకమునకు వెళ్లుటకు మార్గమేమియు లేదు. సువర్లోక మహర్లోకములవంటివి కుజగ్రహములోకూడ నున్నవి. అవి కుజగ్రహములోని నీచోత్తమ మానసికపదార్థముతో నిర్మింపఁబడ్డవి. ఇట్టి

వ్యూహము బుధగ్రహమునకుఁగూడ వర్తించును. 'ఇ', 'గ' గ్రహములలో భౌతికపదార్థనిర్మితగోళము లేనేలేదు. వానిలో అన్నిటికన్న క్రిందిగోళము కామపదార్థముతో నిర్మింపఁబడినది. ఆపైని నీచోత్తమస్వర్గములై యున్నవి. 'అ', 'చ' గ్రహములలో నీచమానసికపదార్థగోళమే అన్నిటికన్న తక్కువది. తక్కినగోళములు అంతకంటె సూక్ష్మసూక్ష్మాతిసూక్ష్మమైన, ఉత్తమమానసిక, బుద్ధి ఆత్మలోకపదార్థముతో నిర్మింపఁబడినవి. ఇప్పుడు 69 వ పటములో చూపిన సప్తగ్రహములును వేనికవి సంపూర్ణమైన వనియు, సూర్యుని చుట్టునుతిరుగుచుండు ననియు, తెలిసికొనవలెను. కాని అందులో మూఁడుగోళములు మాత్రమే మనకంటికగపడును.

ఇప్పుడు మనము 'జీవతరంగ' కార్యవిధానము కొంచెము స్థూలముగా గ్రహించుటకు వీలగును. భూగోళముతో సంబంధించినంతవఱకు, ప్రస్తుతము 'జీవతరంగము' మానవసమాజవిషయములో 3, 4, 5 మూలజాతులను అభివృద్ధిపఱుచుటలోను, 5 వ మూలజాతియందలి 6 వ ఉపజాతిని ప్రారంభించుటకుఁదగిన పరికరములు సంపాదించుటలోను, పనిచేయుచున్నది. 6 వ ఉపజాతిబీజములు, అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు దేశములలో, అక్కడక్కడ కనుపించుచున్నవి. మానవాభ్యుదయముతోఁబాటు, జంతువృక్షఖనిజత్రివిధభూతాత్మవర్గముల పరిణామముకూడ జరుగుచునేయున్నది.

ఇంకను, భూగోళముపై 5 వ మూలజాతిలో ఏడవ ఉపజాతిసంబంధములగు 6, 7 మూలజాతులపని పూర్తికావలసియున్నది. ఇది పూర్తి అగుటకు ఇంకను ఎన్ని లక్షల సంవత్సరములు పట్టునో, ఎవరు చెప్పఁగలరు ? ఇట్లు జరుగవలసిన పని జయప్రదముగా ముగియునఅకు భూగోళములోని అన్నిలోకములందును జీవతరంగము నిర్వహింపవలసిన పని పూర్తి కాలేదని ఎంచవలెను.

ఏడవ మూలజాతిలోని సప్తమోపజాతి పని పూర్తి చేసి పరిణామానికి స్వస్తి చెప్పినప్పుడు భూగోళముపై పని ముగియును. తదుపరి 'జీవతరంగము' భూగోళమును విడిచి వేఱొక గ్రహగోళములో ప్రవేశించి తన కార్యక్రమము కొనసాగించును. దీనితరవాతది 'బుధగోళము. ఈ గోళములో కూడ భూగోళములోవలెనే 'జీవతరంగము' 'ప్రథమ భూతాత్మవర్గము'తో ప్రారంభించి మానవవర్గమువఅకు వివిధ దశలలో పరిణామకార్యము కొనసాగించును. మానవవర్గములో తిరిగి ఏడుమూలజాతులు ఒక్కొక్క మూలజాతిలో సప్తోపజాతు లుద్భవించును. ప్రతిమూలజాతి అనేకమైన దృశ్యాదృశ్యోపాధులద్వారా నూతనస్వరూపమును, వికాసమును, చైతన్యమును, క్రియావిధానమును అభివృద్ధిపఱుపఁగలుగును. అందుకనియే ఇన్నివిధములైన మూలజాతుల ఉపజాతుల అవసరమున్నది.

'బుధగ్రహము'పై పని పూర్తిఅయినపిదప 'జీవితరంగము' 69 వ పటములోని 'గ' గ్రహగోళములో

ప్రవేశించును. ఈ గ్రహములో భౌతికపదార్థగోళము లేనే లేదు. కావున భౌతికోపాధుల పరిణామము దీనిపై జరుగదు. ఇచ్చట కామమానసికోపాధులతోడనే 'జీవతరంగము' పని జరిగించును. ఇచ్చటి పని పూర్తి కాఁగానే 'జీవతరంగము' 'చ' అను గ్రహములో ప్రవేశించును. ఈ గ్రహములో ముతక (మోటు) పదార్థము 'సూచమానసికపదారము', కావున ఉపాధులు 'సూచమానసిక'పదార్థములు. అంతకంటె సున్నితమైన పదార్థముతోనే నిర్మాణము చేయఁబడును. ఇక్కడకూడ పని పూర్తిచేసికొని 'అ' అను గ్రహముపై 'జీవతరంగము' పని ప్రారంభించును. ఆతరువాత 'ఇ' గ్రహములోను తదుపరి కుజగ్రహములోను పని పూర్తి అయిన పిదప భూగ్రహములో ప్రవేశించును. రెండవసారి భూగ్రహములో ప్రవేశించి క్రొత్తమోస్తరు ఖనిజవృక్షజంతుమానవోపాధులవర్గములలో పరిణామక్రియ ప్రారంభించి యథాప్రకారము ఏడవ ఉపజాతి సంపూర్ణవికాసము పొందువఱకు పనిచేయును. ఈప్రకారము ఏడుగ్రహములపైన ఒకసారి పని పూర్తి అగుటకు పట్టుకాలమునకు చక్రము (Round) అనెదరు.

'జీవతరంగ' కార్యకలాపమునుగూర్చి వ్రాయునపుడు 'భూగ్రహము' పనిచేయుచున్నప్పుడు 'జీవతరంగము' ఏప్రకారము గోళము తరువాత గోళమునకు పోవునో చెప్పితిని. కాని నిజముగ జీవతరంగము మొదట 'అ' గ్రహముపైని పని ప్రారంభించి ఇ, కుజ, పృథ్వి, బుధ, గ, చ గ్రహములపైన

ఏడుసక్రమములో పనిచేయును. ఈనాఁడు భూగోళముమీఁద పనిచేయుచున్న జీవతరంగము లక్షలాది సంవత్సరముల క్రితమే 'అ' అను గ్రహముపై పని ప్రారంభించి ఈ సప్త గ్రహములను మూఁడుసార్లు చుట్టివచ్చినది. అనఁగా ఈ చక్రకల్పములో మూఁడవచక్రము ఇప్పటికి పూర్తిఅయి నాలుగవ చక్రములో అ, ఇ, కుజ, గోళములుకూడ తిరిగివచ్చి వర్తమానములో భూగోళముపైన నాల్గవసారి పని చేయుచున్నది.

పరిణామవ్యూహములో మన మిప్పుడు 4 వ చక్రములోని 4 వ గోళములో ఉన్నాము. అనఁగా పరిణామానికి సంబంధించిన విశాలవ్యూహములో మన మిప్పుడు సరిగా మధ్యమున నున్నాము. జీవతరంగము 4 వ చక్రము (round) పూర్తి చేయవలసియున్నది. అనఁగా బుధగోళముతో కూడ ఇంకను మూఁడు గోళములపై పని పూర్తిచేయవలయును. అప్పటి కింకను 5, 6, 7 చక్రముల పని పూర్తిచేసినచో వర్తమాన 'చక్రకల్పము' (chain) పూర్తియగును.

| | | |
|---|---|---|
| ఏడుఉపజాతులు | = | ఒకమూలజాతి |
| ఏడుమూలజాతులు | = | ఒకప్రపంచకాలము |
| ఏడుప్రపంచకాలములు | = | ఒకచక్రము |
| ఏడుచక్రకాలములు | = | ఒకచక్రకల్పము |
| ఏడుచక్రకల్పములు | = | ఒకపరిణామవ్యూహము |
| ఏడు (అంతకుమించిన) పరిణామవ్యూహములు | = | సూర్యమండలము |

(70 వ పటము)

70 వ పటములో సూక్ష్మముగా ఈ విషయములను తెలియపఱిచినాను.

ఏడు ఉపజాతులుకలిగిన ఒక మూలజాతి అగును; ఏడు మూలజాతులకాలము పూర్తి అగుసరికి ఒక ప్రపంచ కాలము (world period) అగును. జీవతరంగము ఒక గోళముతరువాత నింకొక గోళముపై ఏడుసార్లు తిరిగి పని చేయుకాలము ఒకచక్రము (round) ఇట్లేడు చక్రముల కాలము ఏడు గ్రహములపైన వరుసగా పనిచేయుటకు పట్టిన కాలమును 'చక్రకల్పము' (chain) అందురు.

సూర్యమండలములో జీవోపాధుల పరిణామము ఒక 'చక్రకాలము' (chain period) లో పూర్తి కాదు. ఒక 'చక్రకల్పము'లో ఒక జీవవర్గము (kingdom of life) తన పై వర్గమునకు పోవుటకు తగిన అభివృద్ధిమాత్రమే జరుగును. అనఁగా మన వర్తమాన చక్రకల్పములో 'అ' గ్రహముపై జంతువుగ జీవితము ప్రారంభించిన జీవి దీని 7 వ చక్రములో 'చ' గ్రహముపై పని సాంతమగునప్పటికి అనఁగా చక్రకల్పము (chain) పూర్తి అగుసరికి మానవవర్గమునకుమారును. అటులనే మన చక్రకల్పములో వృక్షజాతిలో జీవితము ప్రారంభించిన జీవి చక్రకల్పాంతమునకు జంతుస్థితికి పరిణామము చెందును. జీవవర్గములలోని వివిధమైన సోపానములను 68 వ పటములో చూపించియున్నాము. ఒక్కొక్క మెట్టు నెక్కుటకు ఒకచక్రకల్పకాలము పట్టును. మొదటిచక్రము లోని 'అ' అను గ్రహముపైన మన చక్రకల్పము ప్రారంభ

మగునఁటికి జీవవర్గము లేడింటిలోను పని ప్రారంభింపఁబడినది. కాని ప్రారంభములోనే మానవవర్గమునకు మానవలక్షణములు, జంతువర్గమునకు జంతులక్షణములు, ఎక్కడనుండి వచ్చినవి? 71 వ పటము నొకసారి చూచినచో దీనికి సమాధానము చెప్పవచ్చును. అందులోని నాల్గవ వృత్తము 'పృథ్వీచక్రకల్పము, (Earth chain). ఇది 69 వ పటము నమోనా. దానిలోని భౌతికపదార్థగ్రహములైన కుజుఁడు,




(71 వ పటము)

భూమి, బుధుఁడు తక్కిన నాల్గు అదృశ్యగ్రహములు 69 వ పటములోవలెనే ఉన్నవి. 'పృథ్వీచక్రకల్పమునకు' ముందు గతించిపోయినది 'చాంద్రచక్రకల్పము' (Moon-chain) అని పటమునుబట్టి తెలియఁగలదు. దానిలోను సప్తగోళము లున్నవి. కాని అందులో ఒక్కటిమాత్రము దృశ్యగోళము. మిగిలిన ఆఱు గోళములు అదృశ్యములు. ఆ ఆఱింటిలోను రెండు కామపదార్థముతోడను, రెండు నీచమానసికపదార్థముతోడను రెండు ఉత్తమమానసికపదార్థముతోడను నిర్మితమైనవి. ఇప్పుడు పృథ్వీచక్రకల్పముపై పనిచేయుచున్న 'జీవతరంగము' (life wave) ఈ చక్రకల్పములో ప్రవేశింపకపూర్వము కోట్లాది సంవత్సరములు 'చాంద్రచక్రకల్పములో' పనిచేసినది. కాని చాంద్రచక్రకల్పములోని 'జీవతరంగము' పృథ్వీచక్రములోని 'జీవతరంగము' కన్న ఒకదశ వెనుకపడియుండెను. అనఁగా ఈనాఁడు మానవవర్గము నందలి జీవులు 'చాంద్రచక్రకల్పము' లో జంతువర్గము లోనివి. అట్లే ఈనాఁటి జంతువులు వెనుకటి 'చక్రములో' వృక్షములు, అదేరీతిని మిగిలినవర్గములన్ని ఒకమెట్టు వెనుక పడియున్నవి.

ఈప్రకారమే చాంద్రచక్రకల్పము జీవవర్గములు దానికి పూర్వముననున్న నెం 2 రు చక్రకల్పమునుండి వచ్చినవి. నెం 2 రు చక్రకల్పములో భౌతికపదార్థనిర్మితగ్రహము లేనే లేదు. అందులో నొక గోళము కామలోకపదార్థము తోడను, రెండవది నీచమానసికపదార్థముతోడను, రెం

డు_త్తమమానసిక, రెండు బుద్ధిపదార్థములతోడను. నిర్మింపఁబడి నవి. దీనిపైనున్న జీవవర్గములన్నియు చాంద్రిచక్రికల్పములోని జీవవర్గముల కొక మెట్టు వెనుకనున్నవి. చాంద్రిచక్రికల్పము లోని మానవజంతువృక్షఖనిజవర్గము లీ నెం 2 రు చక్రికల్ప ములో జంతువృక్షఖనిజముల మూఁడవ భూతాత్మవర్గము లుగా నుండెడివి. నెం 2 రు చక్రికల్పములోనికి నెం 1 రు చక్రికల్పమునుండియే జీవతరంగము వచ్చినది. నెం 1 రు చక్రికల్పములో ఒక గోళము నీచమానసికపదార్థముతోను రెండు_త్తమమానసిక, రెండు బుద్ధి, రెండాత్మపదార్థములతో నిర్మింపఁబడినవి. దీనిపై జీవవర్గములు నెం 2 రు చక్రికల్పము కన్న ఒక మెట్టు క్రిందనున్నవి. ఇంకను విపులముగా చెప్ప వలెనన్న నెం 1 రు చక్రికల్పములోని ఖనిజవర్గము నెం 2 రు చక్రికల్పములో వృక్షవర్గమై చాంద్రిచక్రికల్పములో జంతు వర్గముగ ఇప్పుడు జరుగుచున్న పృథ్వీచక్రికల్పములో మానవ వర్గమునకు చెందియున్నది.

పృథ్వీచక్రికల్పముమీఁద పని పూర్తిఅగుసరికి అనఁగా జీవతరంగము ఏడవ 'చక్రిము' (round) పని పూర్తి చేయు నప్పటికి ఈచక్రికల్పములోని జీవవర్గములన్నియు ఒక మెట్టు పైకి వెళ్లును. ఈనాఁటి జంతువులన్నియు ఈ చక్రికల్పాంత మునకు మానవవర్గస్థాయి అందుకొనును. ఆలాగుననే వృక్ష ములు జంతుస్థాయికి, ఖనిజములువృక్షస్థాయికి, అభివృద్ధి చెందును. మానవుఁడు మానవాతీతుఁడగును. గోళముల లోని పదార్థముల స్వభావములో నెం 3 రు, నెం 5 రు

చక్రికల్పములు ఒకేరీతినుండును; అనఁగా వానిలోని గోళములు ఒకదానిలోవలెనే రెండవదానిలోకూడ అయాపదార్థములతోనే నిర్మింపఁబడును. అటులనే 2, 6 చక్రికల్పములు, 1, 7 చక్రికల్పములు అవి నిర్మింపఁబడిన పదార్థముల స్వభావము విషయములో ఒకేరీతినుండును.

ఈనాఁటికి 1, 2, 3 చక్రికల్పములపై పని పూర్తి అయినది. చాంద్రిచక్రికల్పములోని భౌతికపదార్థగ్రిహము లన్నియు పూర్తిగ నశించినవి. ఈ మిగిలిన గోళము కూడ చాలవఱకు కృశించిపోయి 'చంద్రుని' రూపములో మన భూమిచుట్టును తిరుగుచున్నది. దానిపై 'జీవతరంగము' చాలకాలమునాఁడే విడిచి వెళ్లిపోయినది. అది 'జీవచ్ఛవము' మాదిరిగనుండి క్రిమేణా నశించిపోవుచున్నది. ఏడు చక్రికల్పములలో పూర్తికావలసిన పరిణామ మిప్పుడు సరిగా మధ్యస్థితిలోనున్నది. మన మిప్పుడు నాలుగవ చక్రికల్పములోని నాలుగవచక్రిములో నాలుగవ గ్రిహముపై నున్నాము.

పృథ్వీచక్రికల్పము (Earth chain) లో పని పూర్తి అయినపిమ్మట పరిణామము చెందుచున్న జీవవర్గముల పని తరవాత చక్రికల్పములో ప్రారంభమగును. దానిలో భౌతిక గోళము ఒక్కటిమాత్రిమే యున్నది. కుజగ్రిహమునకు బృహస్పతిగ్రిహమునకు మధ్యమున చక్రాకారములో నున్న చిన్న చిన్న ఉపగ్రిహము లన్నియు కలిసి 5 వ చక్రికల్పము లోని భౌతికగోళముగా రూపొందును. ఈప్రికారము భౌతిక గోళనిర్మాణము పూర్తి అగుసరికి పృథ్వీచక్రికల్పముపైన పని

పూర్తి అగును. అప్పటికి మన భూమి నిర్జీవమగును. ఆనాటికి దానిపైనుండు ద్రవములు, వాయువులు హరించిపోయి, భూమి కృశించి ముడుచుకొనిపోవును. 5 వ చక్రికల్పములోని భౌతికగోళమువలన నిర్జీవమైపోయిన మన భూమి ఆకర్షింపఁబడి, మనభూమిచుట్టును చంద్రుఁడు తిరుగుచున్నట్లు, 5 వ చక్రికల్పములోని భౌతికగోళముచుట్టును మన భూమి తిరుగును.

ఈనాఁటి జంతువర్గము మనుష్యవర్గముగాను, వృక్ష వర్గము జంతువర్గముగాను, 5 వ చక్రికల్పములో పరిణామ యాత్ర ప్రారంభింపఁగలవు. ఈప్రకారమే 6, 7 చక్రికల్పములపైకూడ పని జరుగును ఒక చక్రికల్పము పూర్తిఅయి ఇంకొక చక్రికల్పము ప్రారంభమగుసరికి జీవి ఒకవర్గమునుండి పైవర్గమునకు పరిణామము చెందును.

ఈలాగున సప్తచక్రికల్పములమీఁద, పని పూర్తిఅగుసరికి ఒకపరిణామవ్యూహము పూర్తిఅగును (scheme of evolution) ఇటువంటి 'వ్యూహములు' ఏడు గలవు. ఒక్కొక్కవ్యూహమున కొక్కొక్క గ్రహమండలేశ్వరుఁడు అధిష్ఠానదేవతగ పనిచేయుచుండును. ఒక్కొక్కవ్యూహము వారి మహోత్కృష్టజీవితమును వ్యక్తమొనర్చు స్వరూపము. వారి వ్యూహములోని ఏడు చక్రికల్పములు ఆజీవితక్రమ జన్మములు అయియున్నవి. వారి ఆధ్వర్యవములోనున్న పరిణామవ్యూహమునకు మార్గదర్శకులుగనుండి, నడిపించుటయే గ్రహమండలేశ్వరుల ప్రత్యేకకర్తవ్యము. ఒక్కొక్క

వ్యూహములో ఏడు చక్రకల్పము లున్నవి. ఒక్కొక్క చక్రకల్పములో పని పూర్తి అగుటకుగాను ఏడు గోళములు అవసరము.

సూర్యమండలములో ఏడు పరిణామవ్యూహము లున్నవి. వారు పనిచేయుకాలములో ఏదో ఒక సమయమందు ఒక భౌతికగోళము అట్టిపనికొఱకు అవసరముండును. ఈసప్త వ్యూహములు ఏస్థితిలోనున్నవి 72 వ పటములో చూపఁబడినది. ఇందులో మూఁడువ్యూహములలో భౌతికగోళము అవసరము లేదని చెప్పెదరు. అందువలన వానిని గూర్చిన




(72 వ పటము)

వార్త మన కేమి తెలియదు. వల్కాను, బృహస్పతి, శని, యురేనియసులవ్యూహములు, పృథ్వీవ్యూహముకన్న ఒక చక్రికల్పకాలము వెనుకనున్నవి. నెప్ట్యూను వ్యూహము (ఈవ్యూహములో ప్లూటో గ్రహ మొకటి, కనిపెట్టఁబడని ఇంకొక గ్రహముకలిసియున్నవి). పృథ్వీవ్యూహముతో సమాన స్థాయిలోనున్నది అనఁగా నెప్ట్యూను వ్యూహములో కూడ నాల్గవ చక్రికల్పకాలము జరుగుచున్నది. శుక్రవ్యూహము పృథ్వీవ్యూహముకంటె ఒకచక్రికల్పకాలము ముందునకు సాగిపోయినది.

ఒక భౌతికగ్రహముపై నుండు, ఉష్ణత పీడనవలనఁ గాని, సరియైనవాతావరణము లేక గాని, మన భూమిమీఁద నుండు ప్రాణులవంటివి అక్కడ జీవించుటకు వీలులేకపోయినను, కొన్ని విధములఁ భౌతికజీవుల పరిణామము వాని కామలోకములో ఎక్కువ పటిష్ఠతతో జరుగుచుండును అని తెలియవలెను.

శుక్రవ్యూహము మనవ్యూహముకన్న ఒకచక్రికల్పము, ముందున్నకారణమున అందలి మానవవర్గము జీవన్ముక్త దశకు చేరువలో నున్నది. పృథ్వీవ్యూహాప్రథమదశలో, శుక్రవ్యూహములో జీవన్ముక్తులైన వారు మనవ్యూహములో ప్రవేశించి, జగద్గురువులు, మనువులు, బోధిసత్త్వులు, చోహాన్లు మొదలుగాఁగల ఉద్యోగములను నిర్వహించి మానవజాతికి సాయమొనర్చినారు. పురాణేతిహాసములలో దేవతలనియు, దేవతాపరిపాలకులనియు వర్ణింపఁబడినవారు

వీరే. ఈ ప్రకారమే వృథ్వీచక్రకల్పాంతమునకు జీవన్ముక్తులైనవారు వారికి తోఁచినచో మనవ్యూహమున కొకమెట్టు వెనుకనున్న వల్కనే, శని, బృహస్పతి, యురేనియను వ్యూహములలో పరిణామకార్యమునకు చేయూఁత నొసంగ వచ్చును.

ఒకవ్యక్తి పరిణామము పూర్తి అగుసరికి ఆయన సంపూర్ణముగా జ్ఞానమును సేకరించి జీవన్ముక్తుఁడగును. ఆయనను జ్ఞానగురువు వని కూడ అందురు. సాధారణపద్ధతిలో పరిణామము మిక్కిలి మందముగా సాగుచుండును. ఈచక్రకల్పమందలి 7 వ చక్రము తుదముట్టుసరికి మానవుఁడు జీవన్ముక్తుఁడు కాఁగలఁడు. కాని మానవుఁడు తీవ్రమైన కృషి సలిపినచో అంతకు చాలాకాలము ముందరనే, త్వరగా జీవన్ముక్తుఁడు కాఁగలఁడు. ఉత్తమతరగతికి చెందిన మానవులు ఇప్పటికే జీవన్ముక్తులు కాఁగలిగిరి. ఈచక్రకల్పములో పొందఁ

1. మానవసంఘముతో — మహీపీఠములో ఉద్యోగిగనో,
2, మానవసంఘముతో — నిర్మాణకాయుఁడుగనో,
3, దేవతావర్గముతో — కలిసిపనిచేయుచునో,
4. ఈశ్వరునిసిబ్బందిలోఁ — జేరిపనిచేయుటయో,
5. భవిష్యచ్చక్రకల్పములో — కావలసినపాత్రవహించుటయో,
6. నిర్వాణములో — ప్రవేశించుటయో,
7. నిర్వాణములో — ప్రవేశించుటయో,

ఏదో యొకమార్గములో ప్రవేశించును.

(73 వ పటము)

దగిన అనుభవములన్నియు పూర్తిగా సంపాదించి జీవన్ముక్తుఁడైన వ్యక్తి మానవాతీతుఁడగును. అట్టిస్థితిలో ఇంకను పరిణామము చెందుటకు ఏడుమార్గములు గలవు. వానిని 73 వ పటములో తెలియఁబఱిచినాను. జీవన్ముక్తుఁడైన వ్యక్తి వీనిలో ఏదో ఒకమార్గ మనుసరించును.

73 వ పటములో సూచించిన సప్తవిధములైన మార్గములు, సమానార్హత, విలువ కలిగియున్నవి. ఒకదానికన్న రెండవదానికి వచ్చిన ప్రత్యేకఘనత ఏమియులేదు. ఈశ్వర ప్రణాళికావసరమునుబట్టి తనస్వభావమునుబట్టి జీవన్ముక్తుఁడేదో మార్గము నెంచుకొనును. కొద్దిమందిమాత్రమే మహీపీఠములో ఉద్యోగములు నిర్వహించుటకు తగిన అర్హత సంపాదించి పరిణామమును నడిపించుటకు తగిన శిక్షణపొందుటకు నిశ్చయించుకొనెదరు. ఇట్లు నిశ్చయము చేసికొన్నవారు జన్మరాహిత్యము పొందినప్పటికి నిరంతరము స్థూలశరీరములో జన్మలు ఎత్తవలసియుండును. ఉద్యోగాపేక్ష స్వభావతః లేని మఱికొందఱు మానవసంఘముతోడనే ఉండిపోయెదరు కాని అదృశ్యలోకములలో 'నిర్మాణకాయులు 'గనుండి పని నిర్వహింతురు. మహీపీఠమువారి ఉపయోగార్థము మహోత్కృష్టమైన ఆధ్యాత్మికశక్తు లుత్పత్తిచేసి, మానవజాతిని ఉత్తేజపఱుచుటకొఱకు మహీపీఠము వారికి ప్రసారము చేయుదురు.

మూఁడవతరగతివారు, దేవతాగణములో చేరి, మానవాభ్యుదయానికైనను పాటుపడెదరు లేదా ఇతరగ్రహము

లకు వెళ్లి అచ్చటి పరిణామమునకు సాయపడెదరు. ఇంకను కొంతమంది 'ఈశ్వరునిసిబ్బంది'లో చేరి సూర్యమండలములో ఎచ్చటికైనను వెళ్లెదరు లేదా ప్రాణికావసరములనుబట్టి ఎచ్చటికి పంపఁబడినను అచ్చటి పనిచేయుటకు తగినశిక్షణ పొందెదరు. కొందఱు 5 వ చక్రకల్పములో పని ప్రారంభము చేయుటకు అవసరమైన పనిలో నిమగ్నులయ్యెదరు. తక్కిన రెండురకములకు, అనఁగా 6, 7 తరగతులకు చెందిన వారు, మన అవగాహన కతీతమైన ఆధ్యాత్మికపరిణామపథమున నుండెదరు. దీని నే'నిర్వాణములో ప్రవేశించుట' అనెదరు. దీనితో వారు నిర్మూలము (annihilate) అయిపోరు. ఈ మహత్తరప్రాణికకు వారు అఖండమైన సాహాయ్యము చేయుచునే ఉందురు. కాని వారు చేయుపని మన ఊహాకతీతమైనది.

సంపూర్ణవికాసమునకు కోట్లాది సంవత్సరములకాలము పట్టు ఈ పరిణామవిధానము మన మూహింపఁగలిగినదాని కన్న ఎన్నోరెట్లు విస్తృతమైనట్టిది. అడుగడుగునకు, మెట్టు మెట్టునకు, నూతనశక్తి జ్ఞానము సౌందర్యము ఈ విశ్వములో వ్యక్తమగుచున్నవి. ఒకచక్రములో జీవవర్గపరిణామస్థాయి కంటె రెండవచక్రములోని అదే వర్గస్థితి ఎక్కువ వికాసముగ నుండును. అటులనే ఒకచక్రకల్పముకంటె తరవాతచక్రకల్పములోని జీవవర్గముల వికాసము హెచ్చుచుండును. ఈనాఁటి మన కిసలయపుష్పఫలభరితములై హృదయంగమతఁగూర్చు తరులతాగుల్మాదులు, చిత్రవిచిత్రవర్ణములతోడను మంజుల

కిలకిలారావములతోడను ఆనందముగా జీవితమునుగడపు నానావిధశకుంతసంతతులును ఎట్లు ప్రాచీనాటవికయుగము నాఁటి వృక్షజంతువర్గముకన్న ఎన్నిరెట్లు మిన్నగనున్నవో, అటులనే రాఁబోవుచక్రముల చక్రకల్పములకాలమునాఁటి వృక్షజంతువర్గముల శోభముందు ఈనాఁటివి తీసికట్టుగా నుండును. మనకంటె కగపడని అణువుకూడ చక్రము తరువాతచక్రములో వికాసము చెందుచుండును. యుగాలు చక్రములు గడచినకొలఁది ప్రాణికోటియెల్ల ఆత్మవికాసము లోను నవచైతన్యములోను అభివృద్ధి చెందుచుండును.

'చక్రము' తరువాత 'చక్రము'లో మానవుని జీవితములో కూడ పలుతెఱఁగులమార్పులు కలుగుచుండును. రాఁబోవు 'చక్రము' నాఁటికి మన మానసికచైతన్యము చెప్ప లేనంతశక్తిమంతముగ నుండును. ఈ నాల్గవచక్రములోని మానవమేధస్సు (మానవుఁడు ఆలోచించుటకీయఁబడిన పనిముట్టు) లోని అణువుకంటె 5 వ చక్రకల్పములోని మానవ మేధస్సులోని అణువు లెక్కువగ వికాసము చెందియుండును. పదార్థమే శక్తి, రూపమే జీవము, మానవత్వమె మౌలిక ముగ దైవత్వము గనుక ఎచ్చటెచ్చట పరిణామము జరుగుచున్నదో అచ్చటనే ఈశ్వరుఁడు తనపనిలో నిమగ్నుఁడై యున్నాఁడు. ఆయన ఎక్కడనున్నాఁడో అక్కడనే ఆనందముగా ప్రణాళికాసంపూర్తికి క్రమశః పనిజరుగుచునే యున్నది.



# 10 అధ్యాయము

## పదార్థశక్తుల పరిణామము

పదార్థమునకు మనస్సునకు భేదము చాలకలదని చెప్పు కొనుట మానవులకు అలవాటు. మనస్సనునది ఒకవిధమైన ఆధ్యాత్మికశక్తి అనియు, పదార్థము కేవలము తద్వ్యతిరేక మైన నిర్జీవజడపదార్థమనియు వారి అభిప్రాయము. మన "మెవరియందుండి చరించుచు జీవించుచున్నామో" అట్టి అద్భుతవ్యక్తి అయిన ఈశ్వరుని నిరూపించు బాహ్యాస్వరూ పము లీమనస్సు, పదార్థము అని తెలిసికొందుమేని అప్పుడు మనలో నొక నూతనదృక్పథముదయించును. ఆనాఁడు పదా ర్థముకూడ మనస్సువలె దివ్యమైన దనియు, మహాప్రతిభాశాలి మనస్సునందే గాక, స్వల్పమైన స్ఫటికాంశములోకూడ, మహా ఘనత, సౌందర్యము ఇమిడియున్నవని మనము గ్రహింపఁ గలుగుదుము. పదార్థమునకు, మనస్సునకు వెనుక నొక మహావిశ్వకర్మ పనిచేయుచు తన సంకల్పానుసారము పని చేయుచు, దన సంకల్పానుసారము పరిణామమును అంచల వారీగా వివిధదశలలో నడిపించుచున్నాఁడు. ఆయన మనస్సే గాక, ఆయన పదార్థముకూడ ఏవిధముగా నిర్మింపఁబడినదో తెలియుటకొనర్చు యత్నమున నిత్యాకర్షణీయమగు ఆయన స్వభావమును మనము స్వల్పముగా గ్రహింపఁ గలుగుదుము. పదార్థ మనునది దివ్యమైన ఆయన జ్ఞానమునకు సౌందర్యము నకు బలమునకు ఒక దర్పణమువంటిది.

దివ్యజ్ఞానము ప్రకటించినట్లు పదార్థము, ఈశ్వరచైతన్యస్వరూప మని అవగాహన చేసికొనుటకు పూర్వము ఆధునికవిజ్ఞానశాస్త్రము పదార్థమును గురించి కనిపెట్టిన విషయములను మనము బాగుగ అర్థముచేసికోవలసియున్నది. ఆధునికవిజ్ఞానశాస్త్రవిషయములు కూడ ఈశ్వరప్రసాదిత సత్యములే. ఇవి బాగుగ అవగాహన చేసికొనఁగలిగినచో, దివ్యజ్ఞానము ప్రకటించిన దివ్యవిషయములనుగూర్చిన మహాజ్ఞానము మనకర్థ మగుటకు తగిన పునాది మనము నిర్మించుకోఁగలిగెదము. పదార్థము అనఁగా 'ఆకాశములోని రంధ్రములతో కూడియున్నదనియు, ఆరంధ్రములే ఎలెక్ట్రాను, ప్రోటాను, న్యూట్రానులుగా సమీకరింపఁబడిన వను సంగతి వదలిపెట్టిన ప్రపంచములో మనచుట్టునుండు 'పదార్థము' మనకు బాగుగా పరిచయముకల్గిన అనేకవస్తువులసముదాయమువలె కనపడును. మనము నడిచెడిభూమి ఘనపదార్థము, త్రాగునీరు ద్రవపదార్థము, పీల్చుగాలి వాయుపదార్థము, మన ఇండ్లు, వాకిండ్లు, పాత్రలు తదితరసామాన్లు అనేకవిధములైన కఱ్ఱ మట్టి లోహము మొదలగు పదార్థములతో చేయఁబడినట్టివి. మన అందఱి శరీరములలోను జీవజంతువులలోను, వృక్షములలోను. సమస్తమైన ప్రాణికోటిలోను ఉండు పదార్థము స్వభావము వేఱు.

ఈపదార్థమనునది కఱ్ఱ, ఇనుము వంటి ఘనపదార్థమో లేక నీటివంటి ద్రవపదార్థమో లేక గాలివంటి వాయుపదార్థమో అయియుండును. ఇది పలువిధములగు రూపము

లలో నుండియున్నవి. అనేకవిధములుగ ఇది కనపడినను ఇవన్నియు కొద్దిమూలపదార్థములతో మాత్రమే చేయఁబడి యున్నవి. ఈ మూలపదార్థములనే రసాయనికమూలపదార్థములనెదరు. ఇంతవఱకు 'ఆధునిక విజ్ఞానశాస్త్రము 92 రసాయనికమూలపదార్థములను'* కనిపెట్టినది. ప్రతిరసాయనిక మూలపదార్థము 'అణు' స్థితిలో నున్నది. 'గంధకము'

---

* 1937 వ సంవత్సరపు అంతర్జాతీయముగా అణువుల తూనికల జాబితాలో ఇయ్యఁబడ్డ రసాయనికమూలపదార్థముల జాబితాప్రకారము :—

అల్యూమినియము, ఏంటిమొనీ, ఆర్గను, ఆర్సెనిక్కు (పాషాణము) బేరియము, బిస్మతు, బోరన్, బ్రోమన్, కేడ్మియం, కార్బను (బొగ్గు), కేల్షియం, సెరియం, క్లోరియం, కోబాల్టు, కొలంబియం, కాపరు (రాగి). డిస్ప్రోషియం, ఎర్బియం, యురోపియం, ఫ్లోరిన్, గెడోలినియం, గేలియం, జర్మేనియం, గోల్డు (బంగారము), హేఫ్నియం, హీలియం, హోల్మియం, హైడ్రోజన్ (ఉదజని), ఇరిడియం, ఐరన్ (ఇనుము), క్రిప్టను. లెంథానం, లెడ్ (సీసము), లిథియం. లుటేషియం, మెగ్నేషియం, మేంగనీస్, మెర్క్యురీ (పాదరసము), మలిబ్డినం, నియోడియం, నియాన్, నికెల్. నైట్రొజన్ (నత్రజని), ఆస్మియం. ఆక్సిజన్ (ప్రాణవాయువు), పల్లాడియం, ఫాస్ఫరస్(భాస్వరము), ప్లాటినం. పొటాషియం, ప్రసోడిమియం, ప్రొటాక్టినియం. రేడియం, రేడాన్, రీనియం, రోడియం, రుబిడియం, రుథేనియం, సెమారియం, స్కేండియం, సెలినియం, సిలికాన్, సిల్వర్ (వెండి), సోడియం, స్ట్రాంటియం, సల్ఫర్, (గంధకము). టాంటలం, టెల్యూరియం, టెర్బియం, థేలియం, థోరియం, థూలియం, టిన్ (సీనారేకు), టైటేనియం, టంగ్స్టన్, యురేనియం, వెనేడియం. గ్జెనాన్, యటర్బియం, యట్రియం, జింక్ (తుత్తునాగము), జిర్కోనియం.

ఇచ్చట 'అణువు' 'అణుపదార్థము' అను మాటలు పదార్థవిజ్ఞానానికి సంబంధించినవి కాని దివ్యజ్ఞానసారస్వతానికసంబంధించినవి కావు.

పలుకు అనఁగా అనేకగంధకపుఅణువుల సముదాయము. స్వభావతః ఈ అణువులు విభజింపవీలులేనివి. వీనిని విభజింపఁగలిగిననాఁడు వీని అసలుస్వభావమే నశించును. ధనవిద్యుచ్ఛక్తిగలిగిన ప్రోటాన్లతోను, ఋణవిద్యుచ్ఛక్తిగలిగిన ఎలెక్ట్రాన్లతోను. ఈ రెండుశక్తులకు సంబంధములేని న్యూటాన్లతోను అణువు నిర్మింపఁబడినది.

ఇంతవఱకు కనిపెట్టిన రసాయనికమూలపదార్థములను 'లోహములు' 'లోహేతరములు' అని రెండు భాగములుగా విడఁదీయవచ్చును. అల్యూమినియము, మేంగనీసు మొదలైనవి లోహములు. బొగ్గు, ప్రాణవాయువు, బొరాన్ మొదలైనవి 'లోహేతరములు' లేక 'అలోహములు' (non-metals). విద్యుద్వియోగముల (electrolysis) లో లోహములు ఋణధ్రువము (cathode or negative pole) వద్దకు 'అలోహములు' ధనధ్రువమువద్దకు (positive pole or anode) చేరును. వేడిని విద్యుచ్ఛక్తిని ప్రసారముచేయఁగలిగినవి లోహములు, అట్లు చేయలేనివి 'అలోహములు' లేక 'లోహేతరములు'. ఇవిగాక రెండింటికి చెందని మూఁడవభాగ మింకొకటి కలదు. దీనిని 'లోహమిశ్రమము'లు (metalloids) అని అందురు. ఇది ఒకవిధమైన సంకరజాతి. లోహాలోహేతరముల రెండింటిలక్షణములలో కొన్ని వీనిలో కనపడును.

74వ పటములో మొదటిభాగములో పన్నెండు మూలపదార్థములను మాత్రము వాని సాంకేతికాక్షరముల గుర్తుతో

చూపియున్నాను. ఉ=ఉదజని, బొ = బొగ్గు, న = నత్రిజని ప్రా=ప్రాణవాయువు, సో = సోడియం, గం = గంధకము. అల్యూ=అల్యూమినియం, ఇ=ఇనుము, భా= భాస్వరము, కా=కాల్షియం, క్లో = క్లోరినం, మె = మెగ్నీషియం. ప్రతి మూలపదార్థానికి ఒక ప్రత్యేకమైన బరువు, కొన్ని ప్రత్యేక లక్షణములు కలవు.

ఈక్రిందిసంఖ్యలు అణువులసంఖ్యను తెలియపర్చును

నీరు =ఉ$_{2}$ ప్రా (2ఉదజనిఅణువులు ఒకప్రాణవాయువుఅణువుతో కలిసిన నీరుఅగును. ఈప్రకారమే యీక్రింది గుర్తులు అర్థముచేసికోవలెను.

| | | |
|---|---|---|
| నీరు =ఉ$_{2}$ ప్రా | ఆసవ =బొ$_{2}$ ఉ$_{6}$ ప్రా | పటికి=పొ$_{2}$ గంపా$_{4}$ |
| ఉప్పు=సోక్లో | పంచదార=బొ$_{12}$ ఉ$_{22}$ ప్రా$_{11}$ | అల్యూ$_{2}$(గంపా$_{4}$)$_{3}$ |
| | గ్లూకోజ్ =బొ$_{6}$ ఉ$_{12}$ ప్రా$_{6}$ | 24ఉ ప్రా |

కోడిగ్రుడ్డులోని తెలుపు=బొ$_{204}$ ఉ$_{322}$ న$_{25}$ ప్రా$_{66}$ గం$_{2}$

రక్తకణము (హెమోగ్లోబిన్) } =బొ$_{712}$ ఉ$_{1130}$ న$_{214}$ ఇగం$_{2}$ ప్రా$_{425}$

జీవకణములు (ప్రోటోప్లాజం) } =ఉ బొ న ప్రా గం భా క్లో సో పొ కా మె ఇ.

(74 వ పటము)

74 బొమ్మలోని రెండు, మూడు విభాగములలో ఈ మూలపదార్థము లొకదానితో నొకటి కలిసి వేఱొక పదార్థముగా రూపొందిన విషయమును నిరూపించినాను. ఉదాహరణకు:— 2 ఉదజని అణువులు ఒకప్రాణవాయువు

అణువుతో కలియగా నీటిబిందువయినది. ఒక క్లోరీన్ రేణువు ఒకసోడియం రేణువుతో కలిసి ఉప్పుఅయినది. అనేకవిధములుగ నీమూలపదార్థము లొకదానితో నొకటి కలియుటవలన ప్రపంచములో ఈనాడుకనపడెడి అసంఖ్యాకమైన చేతనాచేతనవస్తుజాలము సర్వము తయారైనది. ఒక 'ఆసవ' రేణువులో 6 అణువుల ఉదజని (ఉ$_6$) 2 అణువులబొగ్గు (బొ$_2$) ఒకఅణువు ప్రాణవాయువు (ప్రా$_1$) ఉన్నవి (ఉ$_6$బొ$_2$ప్రా$_1$). కాని రక్తమునకు ఎరుపురంగు ఇచ్చు 'హెమోగ్లోబిన్' అను పదార్థములో బొగ్గు అణువులు 712,

## సంయోగము

### ఉదజనియౌగికములు (Compounds)

| 1 | 2 | 3 | 4 | |
|---|---|---|---|---|
| ఉఫ్లో | ఉ$_2$ప్రా | ఉ$_3$న | ఉ$_4$బొ | ఫ్లో = ఫ్లోరినం |
| ఉక్లో | ఉ$_2$గం | ఉ$_3$ఫా | ఉ$_4$సిలి | బ్రో = బ్రోమినం |
| ఉబ్రో | ఉ$_2$సేలి | ఉ$_3$పా | | అయో = అయోడినం |
| ఉఅయో | ఉ$_2$టెల్లూ | | | సెలి = సెలినియం |
| | | | | పా = పాషాణం |
| | | | | సిలి = సిలికన్ |

అమ్మోనియం క్లోరైడ్
నఉ$_4$క్లో
4 ఉదజని అణువులు
1 క్లోరీన్ అణువుతో
నత్రజని కలియును

ఫాస్వరం పేంటాక్లోరైడ్
ఫాక్లో$_5$
ఒకఫాస్వరం అణువుతో
5 క్లోరినం అణువు కలియును

( 75వ పటము )

ఉదజని 1130, నత్రజని 214, ఇనుము 1, గంధకం 2, ప్రాణవాయువు 425, కలిసివున్నవి (బొ$_{712}$ఉ$_{1130}$న$_{214}$ఇ$_{1}$గం$_{2}$ప్రా$_{425}$). ఒక జీవకణములో (protoplasm) ఉదజని, బొగ్గు, నత్రజని, ప్రాణవాయువు, గంధకము భాస్వరము, క్లోరీన్, సోడియం, పొటాసియం, కాల్షియం, మెగ్నీషియం, ఇనుము, అణువులు ఉన్నవి. అవి ఎట్టితరతమభాగమున నున్నవి ఇంతవఱకు విజ్ఞానశాస్త్రము కనిపెట్టియుండలేదు.

గృహనిర్మాణమున ఇటుకలకున్న కీలకస్థానము ప్రపంచనిర్మాణమున రసాయినికమూలకములకు గలదు. ఇవి ఒకదానితోనొకటి మిళితమగుచుండును కాని ప్రతిమూలపదార్థము తన ప్రత్యేకలక్షణమైన కొన్ని పద్ధతులప్రకారము మాత్రమే కలియుచుండును. ఈ పద్ధతిగా కలియుటనే సంయోగశక్తి (valency) అందురు. 75 వ పటములో మొదటిభాగము ముందుగా చూడుడు. క్లోరీన్, ఫ్లోరీన్, బ్రోమీన్, అయోడీన్ల తాలూకు ఒక్కొక్క అణువు ఒక్కొక్క ఉదజని అణువుతో మాత్రమే కలియును. రెండింటితో కలియవు, ప్రాణవాయువు, గంధకము, సెలినియమ్, టెల్లూరియమ్, అనువాని ఒక్కొక్క అణువు రెండుఉదజని అణువులతో మాత్రమె కలియును. నత్రజని, భాస్వరం, పాషాణముల ఒక్కొక్కఅణువు మూడుఉదజనిఅణువులతో మాత్రమే కలియును. (75 వ పటములో నాల్గవభాగములో) బొగ్గు, సిలికన్ యొక్క ఒక్కొక్కఅణువు నాల్గు ఉదజనిఅణువులతో మాత్రమే కలియును. ఈ పద్ధతిగా కలియుటను బట్టి

శాస్త్రము, మూలపదార్థముల పట్టిక నొకదానిని తయారు చేసి, ఈప్రవర్తనకు 'సంయోగశక్తి' అను పేరు పెట్టినది. కాని దీనినిగూర్చిన ఇతరవివరములు, కారణములు కనుఁగొనలేక పోయినది.

75 వ పటములో క్రిందిభాగము చూడుఁడు. ఒకేరక మైన అణువు ఇతరమైన అయిదు అణువులతో కలియుట కాన్పించును. అమ్మోనియంక్లోరైడులో 1 నత్రజని, 4 ఉదజని ఒకక్లోరీన్ అణువులున్నవి. నత్రజనిసంయోగశక్తి 5 అయి వున్నది. (అనఁగా 5 ఉదజనిఅణువులతో కలియుశక్తి అని అర్థము.)అందువలన అదితనసంయోగకాంక్షను తృప్తిపఱుచు టకు అయిదువైపులకు పంపును. అప్పుడు 4 ఉదజనిఅణువుల




( 76వ పటము )

లోను ఒక క్లోరీన్ అణువుతోను కలియుటతో సంయోగకాంక్ష తీరును. ఈప్రకారమే భాస్వరపంచక్లోరినం (Phosphorus Pentachloride) విషయములోను జరుగును. ఒకభాస్వరాణువు అయిదుక్లోరీన్ అణువులతో కలియుచున్నది.

రసాయనశాస్త్రములోని ఇంకోముఖ్యవిషయ మేమన, రసాయనికమూలకములు కలియుఁగా, క్షేత్రగణితరూపములు పొందును. ఈవిషయమే 76 వ బొమ్మలో ఉదహరింపఁబడినది. చెమ్మనేలనుండి వెలువడేగాలి (marsh gas) లో 1 కర్బనిత, 4 ఉదజని, అణువులున్నవి. కెకూల్యాలు (Kekule) అను నిపుణుఁడు, ఈ అయిదుఅణువులలో కర్బనితఅణువు మధ్యముననుండి, ఉదజనిఅణువులు నాలుగును నాలుగుమూలనుండి 76 వ బొమ్మ మొదటి భాగమువలె ఒకచతుర్భుజఘనము (Tetrahedron) ఆకారముగా ఈ గాలియణువు ఉండునని చెప్పియున్నాఁడు. ఈథేన్ (Ethane) అనెడి ఇంకో వాయువులో 2 కర్బనిత, 6 ఉదజని,అణువులున్నవి. ఈ 8 అణువులు 76 వ బొమ్మలోని 2 వ భాగమున చూపినప్రకారము ఆకారములో ఆయాచోట్ల సర్దుకొనును. రెండుచతుర్భుజఘనములు ఒకదానిలో నొకటి చొచ్చుకొని పోయినట్లుగ నున్నవి. 2 కర్బనితఅణువులు దాని అగ్రకోణములయొద్ద నుండి తక్కిన 6 కోణాలయొద్ద ఆఉదజని అణువులు సర్దుకొన్నవి.

అమ్మోనియా, కోబాల్టుల కలయిక పద్ధతి ఇంకొక ఉదాహరణగ ఇయ్యఁబడినది. ఈకలయికవలన రెండుపదా

ర్థము లుద్భవించును. అవి వయోలియోకోబాల్టమైన్, ప్రసియోకోబాల్టమైన్, మొదటిది ఊదాగాను రెండవది ఆకుపచ్చగా నుండును. ఈరెండుపదార్థముల రెండేసి క్లోరినం అణువులు నాలుగేసి అమ్మోనియా అణువులు గలవు. అమ్మోనియా సమ్మిళితము (compound) గాని, మూలకము (Element) కాదు. అమ్మోనియాలో 1 నత్రజని, 3 ఉదజని, అణువులు ఉన్నవి. ఈ రెండింటిలోను ఒకేరకమైన మూలక ములు ఒకే తరతమపద్ధతి నున్నవి. వర్ణభేదమునకు కారణ మేమి? వానిలోని అణువుల స్థానభేదమే వర్ణభేదమునకు కారణము. రెండింటి అణువుల స్వరూపము అష్టభుజఘనము (octohedron) మాదిరి అయియున్నది. ఊదా రంగు గల వస్తువుల అణువులో క్లోరినం అణువులు ఎదురుకోణా లయిన ఉత్తర దక్షిణ ధృవాలలో నున్నవి. పచ్చరంగు వస్తువు అణువులో క్లోరినం అణువులు ప్రక్క కోణములలో నున్నవి. (స్థానభేదము వలన వర్ణభేదము కలిగినది.)

ఈ రసాయినికమూలకములకు కొన్ని ప్రత్యేకలక్షణ ములు కలవు. వానిని సంక్షిప్తముగా నిచ్చట తెల్పు చున్నాను.

(1) ప్రతిమూలపదార్థమునకు ఒక నిర్దిష్టమైన బరువు కలదు. ఏరెండు మూలపదార్థములను పరీక్షించినను బరువు సమానముగ నుండదు.

(2) కొన్ని మూలకములు సమాంతరాయస్కాంత ములు (paramagnetic) కొన్ని లంబాంతరాయస్కాం

( Diamagnetic ) అయియున్నవి. అనఁగా అయస్కాంతశక్తి ప్రభావములోకి మూలకములు వచ్చినప్పుడు, అందులో కొన్ని ఆశక్తికి సమాంతరముగాను కొన్ని లంబాంతరముగాను సంచరించును. ఆశక్తి ఉత్తరదక్షిణాలకు సంచరించునేని ఇది తూర్పుపడమరలుగా సంచరించును.

(౩) మూలపదార్థములలో కొన్ని ధనవిద్యుచ్ఛక్తి గలవి కొన్ని ఋణవిద్యుచ్ఛక్తి గలవి అయియున్నవి. (electro positive & electro negative ).

(4) మూలపదార్థములకు సంయోగశక్తి కలదు (valency). అందులోను ఉదజనితో కలియుటలో ప్రత్యేక లక్షణములు కనపర్చును. ఆ లక్షణములనుబట్టి ఒక్కొక్క మూలపదార్థము, ఒకటో, రెండో, మూఁడో, నాలుగో, ఉదజని అణువులతో కలియుచుండును.

ఈ మూలపదార్థములకు వానిఅణుభారములను బట్టి ఒకపట్టికను సిద్ధముచేయఁగా, వాని సంయోగశక్తి (valeney) అయస్కాంతశక్తి (paramagnatic or diamagnatic)విద్యుచ్ఛక్తి లక్షణాలనుబట్టి ఒక క్రమ పద్ధతితో కూడిన వర్గవైఖరి సహజముగా నున్నట్లు కనపడును. ఇట్లు వర్గములుగ మూల పదార్థము లుండుట యనుదానినే 'ఆవర్తితసూత్రము' Periodic Law) అనెదరు. ఈసూత్రమును అనేకవిధములుగ వివిధశాస్త్రజ్ఞులు నిర్వచించియున్నారు. నేను 77 వ పటములో కనపఱచిన సూత్రము 'సర్ విలియంకూక్సు' అనే శాస్త్రజ్ఞుఁడు తయారుచేసినది. ఇదే ఎక్కువ స్పష్టముగా నున్నట్లు నాకు కనపడినది.

గడియారములోని 'లోలకాందోలన' లోలకవిధానము ననుసరించి మూలపదార్థములు వానిని అణుభారమును బట్టి, వరుసక్రమములో ఈపట్టిలో ఏర్పాటుచేయఁబడినవి. (77 వ పటము). అన్నిమూలకములలోను తేలికైన ఉదజనియొద్ద నుండి ఈలోలకముయొక్క దోలనము ప్రారంభమై, అన్నిటి కన్న బరువైన (ఇప్పటికి కనిపెట్టఁబడినవానిలో) యురేనియం కడ ఆగిపోయినది. పటములో మధ్యమున నొక నిలువుగీత దాని కిరుప్రక్కలను నాలుగేసి నిలువుగీతలు ఉన్నవి. నడిమి నిలువుగీతపై చూపిన మూలకముల సంయోగశక్తి 'సున్న' అనియు, లోలకసంపూర్ణదోలనములో సరిగా మధ్యసమయము (interperiodicity) కూడ అదే అనియు, ఇటునటు నున్న నాల్గు నిలువుగీతలు, మధ్యమునుండి వరుసగా సంయోగశక్తి$_1$, సం$_1$శ$_2$సం$_1$శ$_4$ సూచించునని అనుకొన్ననాఁడు ఈ మూలపదార్థాలను బరువులవరసలో లోలకము ననుసరించి, నిలువుగీత యొద్దకు ఊపువచ్చి, దానిని తాకినచోట ఒక్కొక్క మూల పదార్థమునుంచగా, యీాదిగువ పేర్కొనఁబడ్డ విషయాలు (కొన్నిమినహాయింపులతో) గణనకువచ్చును.

(1) నడిమిగీతమీఁద నున్న మూలపదార్థము లన్నియు 'జడవాయువులు' (inert gases). ఇవి ఏఇతరపదార్థముల తోడను కలియవు. కావున వీని సంయోగశక్తి 'సున్న'. లోలకము ఒక్కసారి పూర్తిగా ఊగుసరికి తిరిగి నడిమిగీత యొద్దకే వచ్చును. (మధ్యమున ప్రారంభమై ఎడమవైపు చివరకువచ్చి తిరిగి మధ్యమునుండి కుడివైపువఱకు వెళ్లి తిరిగి

మధ్యమునకు వచ్చుసరికి లోలకమునకు ఒకపూర్తి దోలన మగును). ఒకదోలనము పూర్తిఅయిన పిమ్మట నిలువుగీత నద్దకు వచ్చినప్పుడెల్ల నడిమినిలువుగీతపై 'జడవాయు' పదార్థముండును.

(2) మధ్యరేఖమీందనున్న 'నియాన్' (Neon) వాయువు వద్ద ఊపుప్రారంభమయి ఒకడోలనము, పూర్తి అగుసరికి మధ్యసమయము (Interperiodics) అగుచుండును.

(3) మధ్యరేఖకు కుడివైపుననున్న రేఖలమీంద పదార్థములన్నియు లంబాంతర అయస్కాంతములు (dia-magnetic) ఎడమవైపునవున్న రేఖలమీందివన్నియు సమానాంతరాయస్కాంతములు (paramagnetic).

(4) ఈ మూలపదార్థాలు సంయోగశక్తివిషయమున కూడ ఒకవరుసలో నుండును. మధ్యరేఖపై 'సున్న' సంయోగ శక్తిగల పదార్థముతో ఊపుప్రారంభమై ఎడమవైపునకు పోవుదారిలో ప్రతినిలువురేఖ కలియుచోట వరుసగా 1,2,3,4 సంయోగశక్తిగల పదార్థాలుండును. తిరిగి ఊపుమధ్యము నకు వచ్చునప్పుడు వరుసగా 3, 2, 1, 0 సంయోగశక్తి గలవి ఉండును. 'సున్న' సంయోగశక్తిగల పదార్థము వచ్చుసరికి మధ్యరేఖ తగులును).

(5) లోలకము మధ్యరేఖవద్ద ఊపుప్రారంభముచేసి ఎడమవైపునకు పోవునప్పుడు దారిలోని మూలపదార్థము లన్నియు ధనవిద్యుత్తులు, తిరిగి లోలకము మధ్యరేఖకు పోవు చుండు ఆదారిలోనివి అన్ని ఋణవిద్యుత్తులు అయియున్నవి.

క్రూక్సు అను శాస్త్రజ్ఞుఁడు, 1887 నాఁటికే ఈ మూల పదార్థములు, ప్రపంచములో నొకదానితరువాత నొకటి బయలుపడుననియు, వానిపై ఒత్తిడి తెచ్చు కొన్నిశక్తుల ప్రభావమువలన వానిలక్షణాలలో మార్పుకలుగు నని సూచించినాఁడు. ప్రొటైలు అను ఒక 'ఆదిమబీజపదార్థము' (primordial) నుండి ఈ మూలపదార్థాలు ఉత్పత్తిఅయినవని ఆయన అభిప్రాయపడినాఁడు. క్రూక్సు వ్రాసినప్రకారమే ఎక్కువమార్పులు లేకుండా 77 వ పటము వ్రాయఁబడినది. నేను చేసిన స్వల్పమైన మార్పు ఏమనఁగా మూలపదార్థాల యొక్క రసాయనశాస్త్రము నిర్వచించిన 'అణుభారము' (atomic weight) గాక దాని సంఖ్యాభారము (number weight). అనఁగా ఆపదార్థములో బహుసూక్ష్మాతిసూక్ష్మమైన భౌతికాణువులు ఎన్నిగలవో ఆసంఖ్య చూపినాను. ఇదిగాక, 1887 తరువాత కనిపెట్టఁబడిన 'మూల పదార్థములను' కూడ ఈపటములో చేర్చినాను.

'మూలకముల' ఉత్పత్తి (genesis) అనుభావము 'ఊహ'మాత్రమే కాదు. అది నిజముగ మంచి ఉత్సాహము కలిగించు సత్యము. 18 న ఫిబ్రవరి 1887 న జరిగిన లండన్ నగరములోని రాయలు ఇన్స్టిట్యూషనులో భౌతికదృక్పథముతో కూడిన విజ్ఞానశాస్త్రజ్ఞులసభలో ఈవిషయమును ఏప్రకారము క్రూక్సు మహాశయుఁడు ప్రకటించినాఁడో ఒక సారి మనము తెలిసికొన్నచో, యోగశాస్త్రము ఈ విషయమును గూర్చి దీని కతీతమైన ఎట్టిమహత్తరమైన భావ

మును నిర్వచించినదో అవగాహన చేసికొనుటకు తగిన ఊహా శక్తి సంపాదింపఁ గలుగుదుము.

"లోలకము ఊగునప్పుడు ఏర్పడే వక్రగీతలో రెండువిధములైన శక్తులను గుర్తింపవచ్చును. అందులో ఒకటి నిలువుగాను రెండవది లోలక డోలనమును అనుసరించియు ఉండును. క్రమక్రమేణా ఏదో కొన్ని డిగ్రీల ఉష్ణము తగ్గుచు వచ్చెడి విధానమునకు ఈ నిలువుగీత విధానము పోలి యుండును.

అయినను లోలకము ఇరుప్రక్కలకు ఊగుచున్నప్పుడు ఏర్పడే గీత వలన సూచింపఁబడు శక్తి ఎట్టిది? మధ్యముననున్న తటస్థరేఖనుండి లోలకము రెండువైపులకు సమదూరముగా ఊగుచుండును. తటస్థరేఖ నుండి ఒక వైపునకు లోలకము పోవుదారిలో ఒక్కొక్క నిలువుగీతవఱకు పోవుసరికి దాని అణుశక్తి (atomicity) ఒక్కొక్కడిగ్రీ హెచ్చు చుండును. ఈ తటస్థరేఖనుండి ఊపు ఒకవైపునకు పోవుమార్గములోని మూలపదార్థాలు ధనవిద్యుత్తులనియు, తటస్థరేఖవైపునకు ఊపువచ్చెడి దారిలోని పదార్థములు ఋణవిద్యుత్తు లని మనము తెలుసుకోవచ్చును. శక్తికంతకు మూలమైన అతితేలికైన సారమైన విద్యుచ్ఛక్తికి ఇట్లు ఊగెడి శక్తికి సంబంధముండవలె నని మనకు అనుమానము కలుగకమానదు.

మన లోలకము ధనవిద్యుత్తువైపునుండి ఊగుట ప్రారంభించును, మొట్టమొదట ఉదజనివద్ద ప్రారంభమగును; తరువాత లిథియం (lithium) రూపొందును. ఆ తరువా వరుసగా గ్లూసినమ్, బోరన్ కార్బనితము కనపడును; ఇవి ఉద్భవించునప్పుడే అవసరమైన, తగిన విద్యుచ్ఛక్తిని తీసికొనెదరు. దీనినిబట్టియే దాని అణుభారము నిర్ణయమగును. అప్పుడు ఏకాణు, ద్వ్యణు, త్ర్యణు, చతురణువు లను తరగతులుగా మూలపధార్థములు విభజింపఁబడును.

77 వ పటములో సరి సంఖ్య సంబంధించిన మూలపదార్థము లన్నియు సమానాంతరాయస్కాంతములనియు, బేసి సంఖ్యకు సంబంధించి నవి లంబాంతరాయస్కాంతములనియు డాక్టరు 'కార్నెవి' అను శాస్త్రజ్ఞుఁడు చెప్పినాఁడు. పటములో ఎడమవైపున నున్న సరిసంఖ్యల యొద్ద వన్నియు సమానాంతరాయస్కాంతము లనియు కొద్దిమినహాయింపులతో

కుడివైపునకున్నవన్నియు లంథాంతరాయసాంతములనియు తెలుచు న్నది.

ఇప్పుడు తటస్థరేఖ వైపు నిర్గమించెడి మార్గమును పరిశీలింతము. మొదట 'నత్రజని యున్నది' దీని స్థానమునుబట్టి మూలపదార్థము యొక్క సగటు ప్రబలాణుశక్తి (mean dominant atomicity) బోధపడఁ గలదని తెలియఁగలదు; 'నత్రజని' 'బోరన్'కు సరిగా క్రిందనున్నది. ఈ 'బోరన్' 'త్ర్యణు' పదార్థము. కావున 'నత్రజని'కూడ త్ర్యణు పదార్థము అని తేలుచున్నది. 'నత్రజని' 'కర్బనితము' తరువాత నున్నది. కర్బనితము 'చతురణు' పదార్థము, ఇదిగాక మొదటిమూల పదార్థమునుండి లెక్కపెట్టిన 'నత్రజని' ఆయిదవది. అందున 'పంచాణు' పదార్థమనికూడా చెప్పవచ్చును. ఈ రెండుగుణములు అనఁగా 'త్ర్యణు' 'పంచాణు' శక్తులు రెండు నత్రజని వ్యక్తముచేయుటవల్ల సామరస్యమేర్పడి వ్యతిరేకత అంతరించినది అల్లే దానితరువాతనున్న ప్రాణవాయువు ద్వ్యణు,షడణు, ఫ్లోరిన్ ఏకాణు, సప్తాణుశక్తులను వ్యక్తపఱుచుచున్నం దున వీనియన్నిటికి ఒకేసూత్రము వర్తించుచున్న దని తెలియుచున్నది. ఇక్కడికి లోలకసంపూర్ణాందోళనములో సగము పూర్తి అయి తటస్థరేఖ యొద్దకు వచ్చినది. ఇఁక కుడివైపున కాందోళనము ప్రారంభమగును. ఆ మార్గములో ధనవిద్యుద్గణము కలిగిన సోడియము (ఏకాణు) మెగ్నీషి యం (ద్వ్యణు) అల్యూమినియము (త్ర్యణు) సిలికాన్ (చతురణు) అను మూలపదార్థములున్నవి. తిరిగి ఊపు తటస్థరేఖపై మరలును. ఆ దారిలోకి ఋణవిద్యుద్గుణ మూలపదార్థము లున్నవి. అవి భాస్వరము (3) గంధకము (2) క్లోరినము (1) అయియున్నవి. ఇవికూడ ఇదివఱలో తటస్థరేఖ వైపునకు వచ్చిన ఊపుదారిలోనున్న 'నత్రజని' మొదలగు పదార్థములవలె రెండురకముల అణుశక్తిని కలిగియున్నవి. ఇప్పటికి ఒక ఆందోళనము పూర్తి అయినది.

రెండవ ఆందోళనము ప్రారంభమై తటస్థరేఖకు ఎడమవైపు వెళ్లు సరికి మొదట 'పొటాసియం' తగులును. మొదటి ఆందోళనలో ఇదేస్థానము ఆక్రమించిన 'లిథియను' వారసు 'పొటాసియం'. అందువలన చాలవఱకే అగుణములనే వ్యక్తముచేయును. దీని అణుభావము మాత్రము దానికన్న

హెచ్చుగా నుండును. కాని కణముల చాంచల్యము కొంత తక్కువగనుండును.

ఇట్లు తుదవఱకు ఆందోళనాఫలమైన వక్రగీత ననుసరించి పరిశీలించినచో ఇదే సూత్రములు వర్తించు నని మనకు తెలియును. మొదటి ఆందోళనమునకు తుద 'క్లోరినం' కలదు. రెండవ ఆందోళనము చివరన అదే రేఖపై 'క్లోరినం'తో సమాన గుణములుగలిగిన 'బ్రోమినం' కలదు మూఁడవఊపు తుద 'అయోడినం'అను పదార్థము అదేస్థానములోనున్నది. ఈ మూఁడును ఒకేవర్గమునకు చెందినవి. ఎక్కువగ, నిదర్శనములు చూపనవసరములేదు. వీనినన్నిటినిబట్టి ఈ ప్రపంచమునడక చక్రగతిగా నున్నదనియు, ప్రాచీన కాలమునాటి సంఘటనలు కొద్దిమార్పులతో తిరిగిసంభవించుననియు, మనకు బోధపడఁగలదు"

మూలపదార్థముల వ్యుత్పత్తినిగూర్చి ఆధునికవిజ్ఞానశాస్త్రము ఏ ప్రకారము భావించుచున్నదో కొంతవఱకు మనమిప్పుడు తెలిసికొన్నాముగనుక దివ్యజ్ఞానము ప్రకటించిన శక్తి పదార్థములనుగూర్చిన రహస్య విషయములను బాగుగ అర్థము చేసికొనఁగలిగెదము. అణువులకూర్పు లేక సమూహము అనునది అప్రయత్నముగను, అచింతితముగను సంభవించునది కాదని మొదటినుండి మనము జ్ఞాపకముంచుకొనవలెను. విశ్వకర్త సంకల్పించిన ప్రకారమే విశ్వనిర్మాణము జరుగుచున్నది. ఆ నిర్మాణములోని ప్రతి సోపానము ఆయనవలననే నడుపఁబడుచున్నది, అణువుల కలయిక, విడిపోక కూడ ఆయన ఇచ్ఛవల్లనే జరుగుచున్నవి.

64, 65, 66 పటములలో, ఈశ్వరుని వలన జరిగిన పదార్థనిర్మాణములోని ప్రారంభదశలు వర్ణింపఁబడినవి. గుప్తసిద్ధాంతము (Secrect Doctrine) అను గ్రంథములో జడ

ఈ బొమ్మలలోని తెల్లగీతలు చుట్టలలోని ప్రాథమికాణు బిందువులను సూచించును. ఇవే శక్తి ప్రసార రేఖలు. బొమ్మలో వెనుక చూపిన నల్లనిప్రదేశము శూన్యాకాశము నకు చిహ్నము. కాబట్టి 'ఫాయంకేరు' మహాశయుఁడు చెప్పినట్లు అణువులనునది 'ఆకాశములోని రంధ్రమే' అయినను, ఈరంధ్రము ఈశ్వరశక్తితో నింపఁబడియున్నది. ఇది ఆకాశములోని రంధ్రమైనను 'శూన్యాకాశము'కంటె సత్యమైనదయి యున్నది. ఆరంధ్రములో విశ్వబ్రహ్మ ఇమిడియున్నందున అది ఒక పదార్థమనియు, సత్యమైనదనియు మనలో ఒక విశ్వాసము కలుగును. విశ్వబ్రహ్మ, సూర్యమండలేశ్వరులు, ఏప్రకారము యోజనచేసెదరో మన స్థాయిలో మనము కూడ అదే పద్ధతిని వారితోపాటు ఆలోచనచేయఁగలము.

ఎప్పుడీరెండువిధములైన భౌతికాణువులు (ధన, ఋణ) నిర్మాణము చేయఁబడినవో అప్పుడు రసాయనికమూల పదార్థముల నిర్మాణము ప్రారంభము చేయఁబడినది. 77 వ పటములో చూపఁబడిన ఆవర్తనసూత్రము (Periodic Law) పద్ధతిలో అవి నిర్మింపఁబడినవి. విజ్ఞానశాస్త్రజ్ఞులు ఊహింపఁగలిగినదానికంటె ఆవర్తితసూత్రములో ఎక్కువ ప్రజ్ఞ, అందము ఇమిడియున్నది. ఈ ఆవర్తితసూత్రములోని వైభవము, ఘనత మనమెక్కువగా మెచ్చుకొనుటకు ముందు 81 వ బొమ్మలో చూపిన ప్లేటానిక్ ఘనముల (Platonic Solids) వైపు మనదృష్టి మరల్చి వానిని శ్రద్ధగా పరిశీలింపవలసియున్నది.

వానియందున్న రేఖలు, కోణములు, ఉపరిభాగములు పరిమాణముగనుండు త్రిపరిమాణ (Three-dimensional) ఘనములు కేవలము అయిదు మాత్రమే యున్నవి. అవి (1) చతుర్భుజఘనము (Tetrahedron) (2) షడ్భుజఘనము (Cube) (3) అష్టభుజఘనము (Octahedron) (4) ద్వాదశ భుజఘనము (Dodecahedron) (5) వింశద్భుజఘనము (Icosahedron) అనునవి. 81 వ పటము మొదటివరుసలో వానినే చూపినాను. ఒకబల్లపైనుంచినప్పుడు అవి ఏమాదిరిగ కనుపడునో ఆమాదిరిగానే 81 వ పటములో పైభాగములో చూడవచ్చు. కాని ఈపద్ధతిలో వానియందలి సౌష్ఠవము లేక సమమితి (symmetry) అంతస్పష్టముగ గోచరింపదు. అదే పటములోని క్రిందిరెండువరుసలలోను వాని సౌష్ఠవము బాగుగ గోచరించునట్లు ఉదహరించి చూపఁబడినది. గ్రీసు దేశములోను, అలెగ్జాండ్రియాలోను గల ప్లెటానిక్కుసిద్ధాంతానికి సంబంధించిన శాస్త్రజ్ఞులీ అయిదు ఘనములకు ప్రత్యేకవిశిష్టత నిచ్చిరి. ఇవి అయిదు విధములుగ నున్నను వాని రేఖలు కాన్పించును. కోణముల, ఉపరిభాగముల సంఖ్యలలో తేడా యున్నప్పటికి ఇవన్నియు చతుర్భుజఘనము నుండి, రూపొందుటకు వీలున్నది. రెండవవరుసలోని రెండవ చిత్రముచూడుఁడు. 2 చతుర్భుజఘనములు ఒకటిగా కనపడు నట్లు వాని ఉపరిభాగములు కలిపిన యెడల షడ్భుజఘనము ఏర్పడును. ఈరెండుచతుర్భుజఘనముల 8 కోణములు షడ్భుజఘనము 8 కోణములుగ ఏర్పడి షడ్భుజఘన మగును. ఆలాగుననే వాని రెండింటిప్రక్కలు కలియుచోట ఏర్పడెడు

6 బిందువులు అష్టభుజఘనముయొక్క 6 మూలలుగా మాఱి అష్టభుజఘన మేర్పడును. క్షేత్రగణితాని కీవిషయము సుపరిచితమే. కాని మిగిలిన రెండుఘనములు చతుర్భుజఘనము నుండి రూపొందవచ్చునన్న విషయము, మాడిస్త్రపట్టణవాస్తవ్యుఁడు 'శ్రీనారు ఆర్టుకో సొరాయిమాతా' అను దివ్యజ్ఞాని కనిపెట్టినాఁడు. 5 చతుర్భుజఘనముల నొకదానితో నొకటి కలిపినప్పుడు మూఁడవవరుసలోని మొదటిచిత్రములో చూపిన బహుక్లిష్టమైన రూపమేర్పడును. దానియందలి 20 మూలలు ద్వాదశభుజఘనము 20 మూలలుగను, పండ్రెండు సంఘబిందువులు (intersecting points) ఖండించుకొను వింశద్భుజఘనము యొక్క 12 మూలలుగాను రూపొందఁగలవు. ద్వాదశఘనములోని పండ్రెండుప్రక్కలు, షడ్భుజఘనములోని 6 ప్రక్కలలోను 3 ప్రక్కలను తాకును. అందువలన షడ్భుజఘనమును, సంపూర్ణఘనము లేక 'ఘనసంఖ్య' (perfect solid) అనెదరు. కారణ మేమన దీనిలో మిగిలిన నాల్గు స్వరూపములు ఇమిడియున్నవి.

ఈ అయిదుఘనములలోను ప్రతివానిలో అనేక తలములు (surfaces) మూలలు కలవు. రసాయనికమూల పదార్థముల నిర్మాణమునకు తగిన సూచనలు వీనిలో ఇమిడియున్నవి. (మొదటి మూఁడు ఘనములలో)

| ఘనము | తలను | మూలలు |
|---|---|---|
| చతుర్భుజ | 4 | 4 |
| షడ్భుజ | 6 | 8 |
| అష్టభుజ | 8 | 6 |










Fig.1 Tetrahedron.
Fig.2 Cube.
Fig.3 Octahedron.
Fig. 4 Dodecahedron.
Fig.5 Icosahedron.
Tetrahedron.
2 Tetrahedra interlaced.
Cube.
Octahedron.
THE FIVE PLATONIC SOLIDS
In each solid, lines, angles and surfaces are equal.
5 Tetrahedra interlaced.
Dodecahedron.
Icosahedron.
Fig. 1 _ 4 Surfaces
Fig. 2 _ 6 Surfaces
Fig. 3 _ 8 Surfaces
Fig. 4 _ 12 Surfaces
Fig. 5 _ 20 Surfaces

81 వ పటము



82 వ పటము



83 వ పటము

ఈ మూఁడుఘనములు తన్మాత్రలవంటివి ( దానికొలఁతలు)అనఁగా ఆవర్తిత సూత్రములోని ద్వి,త్రి,చతుస్సంయోగ మూలద్రవ్యములలో ఉపయోగించునిర్మాణము ఇరుసువంటివి. ప్రాణవాయువుతప్ప మిగిలిన వన్నియు ద్విసంయోగమూల ద్రవ్యములు (అనఁగా ధన, ఋణ, సమాంతరాయస్కాంత, లంబాంతరాయస్కాంతములు). 82 వ బొమ్మలో ఉదహరింపఁబడిన బెరిలియం ( గ్లూషినము ) మాదిరి వయియున్నవి. ధన, ఋణ, అణువులన్నియు గుంపులుగుంపులుగా గుమికూడును. అందులోను అది ముఖ్యమైన నాలుగు గుంపులుగాను లేక గరాటాల (funnels) మాదిరిగనుచేరి చతుర్భుజ ఘనకేంద్రమునుండి నాల్గుతలములకు ప్రసరించును. ఇదే తేలికరసాయనికమూలకముల సరళమైన ద్విసంయోగనిర్మాణము బరువైనరసానికములో ఈ 'గరాటా' ఆకారములకు అదనముగా శలాక లేక బల్లెము మాదిరిగ నుండెడి నాల్గు క్రొత్తగుంపులు ఏర్పడును. అవి కేంద్రమునుండి కోణములకు ప్రసరించుచుండును. ( ప్రతి మూలపదార్థప్రమాణము గోళాకారము గల గోడల మధ్యమున నిమిడియుండును. ఈ గోడలు భౌతికలోకమును చుట్టియున్న అణూపలోకపదార్థముతో నిర్మాణముచేయఁబడినవి. కాని క్లిష్టముకాకుండ చేయు నుద్దేశముతో ఈవిషయమును పటములో నుదహరింపలేదు).

నత్రజని తప్ప మిగిలిన త్రిసంయోగ (trivalent) మూలపదార్థములన్నియు 83 వ బొమ్మలో చూపిన మాదిరిగ

నుండును. ఇందులో తేలికయగువానికి 6 గరాటాలు ఉండును. ఇవి షడ్భుజఘన కేంద్రమునుండి దాని 6 తలము లకు ప్రసరించును. బరువు పదార్థాలలో 6 గరాటాలకు అదనముగ 8 శలాకలు లేక బల్లెములు షడ్భుజఘనను 8 మూలలకు వ్యాపించును.

టిటానియం, జిర్కోనియం తప్ప మిగత చతుస్సం యోగ (tetravalent) మూలపదార్థము లన్నియు 84 వ పటములో చూపినమాదిరిగ నుండును. ఇందులో తేలిక వానిలో ఎనిమిది 'గరాటాలు' ఉండును. ఇవి ఆ ఘన కేంద్రమునుండి 8 తలములకు వ్యాపించును. బరువైన పదార్థములలో అదనముగా 6 శలాకలుమాదిరివి 6 మూలలకు ప్రసరించును.

ద్వాదశభుజఘనము, ఏఒక్కమాదిరి మూలపదార్థము నకు తన్మాత్రకాదు. కాని కొన్నిమూలపదార్థముల ధాతు వునకు మాత్రమే తన్మాత్ర అయిఉన్నది. ధాతువు ద్వాదశ భుజఘనము 20 మూలలను ఉంచబడ్డ అనేకాణుసమూహా ములను కలిగియుండును. అయిదు చతుర్భుజఘనాలను దగ్గ రగా కూర్చగా ఇవి కలియుచోట ఏర్పడిన 12 బిందువులు, వింశద్భుజఘనములో ఇమిడి యుండుట తప్ప, దాని పండ్రెండు మూలలలోనుండి మూలపదార్థాల నిర్మాణములో నుపయో గించు అణుసమూహము లేమియు ఇంతవఱకు కనుగొనబడ లేదు.

85, 86 పటములలో చూపఁబడిన మాదిరిగ ఏక సంయోగ (monovalent) మూలపదార్థాలు నిర్మింపఁబడి నవి. సమాంతరాయస్కాంతైకసంయోగ ( paramagnetic monovalents) పదార్థములు 85 వ బొమ్మలో చూపి నట్లుండు లిథియం (Lithium) తో ప్రారంభమైనవి. లిథి యంలో 127 తుది భౌతికాణువులు ( ultimated physical atoms) గలవు. 77 వ పటములో (ఆవర్తితసూత్రము) లిథియంక్రింద వరుసగా అదే నిలువురేఖపైనున్న పదార్థము లలో (ఫ్లోరీన్ మినహా) లిథియంలోవలెనే 'పొగచుట్ట' మాది రిది కేంద్రమునుండియు దానికి అదనముగ ఒక కేంద్రము నుండి ప్రసరించుచు ఒక నిర్దిష్టమైన వర్గసంఖ్యతో గుణింపఁ బడి, క్రొత్తధాతువులు కలియుటవలన వాని బరువు ఎక్కు వగా నుండును. ఈ ప్రసరించెడు ధాతువుల స్థాన మింకను నిర్ణయింపఁబడలేదు. కాని అనేకఘనముల కలయికతో ఏర్ప డిన నిర్దిష్టమైన స్థానములను ఈధాతువు లనుసరింపఁగలవు. లంబాంతరాయస్కాంతైకసంయోగమూలపదార్థాలు 86 వ బొమ్మలోని 'సోడియం' మాదిరిగనుండును. పైన పండ్రెండు క్రింద పండ్రెండు ప్రసరించు గరాటాల సమూహములను కలుపుచు వాని నడుమ కడ్డీమాదిరిది ఒకటి వీనికేంద్రములో నుండును.

మూలపదార్థముల పట్టికలో మన మింక వ్యాఖ్యానింప వలసినవి రెండు సమూహములు మాత్ర మున్నవి. అవి (1) అంతరావర్తితలోహములు (Interperiodic metals)



౮౫ వ పటము




౮౬ వ పటము




87 వ పటము

అంతరావర్తితము : ఇనుము, కోబాల్టు, నికెలు.




88 వ పటము

జడవాయువులు : నియాన్, ఆర్గన్, క్రిప్టాన్.

(2) జడవాయువులు (inert gases). ఈ రెండుసమూహాములు మధ్యరేఖపైన మాత్రమే కనుపించును. అవి ఇనుము, కోబాల్టు. నికెలు, పల్లాడియం, రుథీనియం, రోడియం మొదలైనవి. వీనిని 87వ బొమ్మలో చూపినాను. వీనిలో ఒక్కొక్కదానిలో కేంద్రమునుండి 14 కడ్డీలు మాదిరివి ప్రసరించును. నాలుగుసమూహాములుగా నున్న ఈ లోహములలో మొదటి మూండింటిలో మూండేసి, నాల్గవదానిలో నాలుగు లోహములు కలవు. ఆ సమూహాములోని ఒక్కొక్కలోహము దాని పూర్వపు లోహముకన్న 28 అణువులబరువు ఎక్కువగా నుండును. ప్రత్యంతరావర్తితలోహములోను 14 కడ్డీలు ఉండును. అవన్నియు ఒకేమాదిరిగ నుండును గనుక ప్రతి సమూహాములోను 'ఆవర్తనము' (periodicity) నియమిత కాలమునకుసంభవించుచుండును.

సమూహాము 1. ఇనుము, కోబాల్టు, నికెలు.

| లోహము | ఒక కడ్డీలోని అణుసంఖ్య | 14 కడ్డీలలోని అణుసంఖ్య | ఉ=1 అయినప్పుడు మొత్తము బరువు |
|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 |
| ఇనుము | 72 | 1008 | 56 |
| కోబాల్టు | 74 | 1056 | 57.55 |
| నికెలు | 76 | 1064 | 59.11 |

(3 వ కలమును బట్టి ఇనుముకన్న కోబాల్టు 28 అణువులు, కోబాల్టుకన్న నికెలు 28 అణువులు, ఎక్కువ వున్నది).

సమూహము 2. రుథీనియం, రోడియం, పల్లాడియం

| | | | |
|---|---|---|---|
| రుథీనియం | 132 | 1848 | 102 66 |
| రోడియం | 134 | 1876 | 104.22 |
| పల్లాడియం | 136 | 1904 | 105.77 |

సమూహము 3. క, ఖ, చ

| | | | |
|---|---|---|---|
| క | 189 | 2646 | 147 |
| ఖ | 191 | 2674 | 148.55 |
| చ | 193 | 2702 | 150.11 |

సమూహము 4. ఆస్మియం, ఇరిడియం, ప్లాటినం, ప్లాటినం.బి,

| | | | |
|---|---|---|---|
| ఆస్మియం | 245 | 3430 | 190.55 |
| ఇరిడియం | 247 | 3458 | 192.11 |
| ప్లాటినమ్ | 249 | 3456 | 193.66 |
| ప్లాటినమ్. బి. | 251 | 3514 | 195.22 |

ఆవర్తనలక్షణము ఇదే ప్రకారము 'జడవాయువు' లలో కూడ నుండును. వాని సాధారణస్వరూపము 88 వ పటములో చూపబడినది. ఇవి రెండేసి చొప్పున కలిసి యుండును. రెండవలోహములో మొదటిదానికన్న 42 అణువులు ఎక్కువగానుండును. 81 వ. బొమ్మలో నున్న రీతిని 5 చతుర్భుజఘనాలు ఒకసంకీర్ణమైన పద్ధతిలో దగ్గరగా గుది గ్రుచ్చబడినట్లు 88వ పటములో కేంద్రములో కనుపించును. ఒకేస్థాయిలోనుండి ఒకే అణుసంఖ్యకలిగిన ఆఱు 'బాహువులు

(arms) మొదలగునవి దీనినుండి ప్రసరించుచున్నవి. ప్రతి జడవాయువులోను రెండవ 'ఐసొటోపు' (isotope) లోని ప్రతిబాహువులో ఏడేసి అణువులు ఎక్కువగా నుండుటంబట్టి 'ఆవర్తనము' కనుపించును. (అన్ని జడవాయువులలోను మధ్యగోళములో 120 అణువులు మాత్రమే యున్నవి).

సమూహము 1. నియాన్, మెటా-నియాన్.

| వాయువు | బాహువులోని అణుసంఖ్య | మొత్తముబరువు ఉద=1 |
|---|---|---|
| నియాన్ | 40 | 20 |
| మెటా-నియాన్ | 47 | 22.33 |
| సమూహము 2. ఆర్గాన్, మెటా-ఆర్గాన్ | | |
| ఆర్గాన్ | 99 | 39.66 |
| మెటా-ఆర్గాన్ | 106 | 42 |
| సమూహము 3 క్రిప్టాన్, మెటా-క్రిప్టాన్. | | |
| క్రిప్టాన్ | 224 | 81.33 |
| మెటా-క్రిప్టాన్ | 231 | 83.66 |
| సమూహము 4. గ్జినాన్, మెటా-గ్జినాన్. | | |
| గ్జినాన్ | 363 | 127.66 |
| మెటా-గ్జినాన్ | 370 | 130 |
| సమూహము 5. కెలాన్, మెటా-కెలాన్. | | |
| కెలాన్ | 489 | 169.66 |
| మెటా-కెలాన్ | 496 | 172 |

సమూహము 6, రెడాన్, మెటా—రెడాన్.

| | | |
|---|---|---|
| రెడాన్ | 645 | 221.6 |
| మెటా-రెడాన్ | 652 | 224 |

పై చెప్పిన మూలపదార్థాలలో నత్రజని ప్రాణ వాయువు, క్లోరీన్ మొదలైనవానిని తీసివేయవలసియున్నది.

ఉదజని ఏరకము

( 89వ పటము)

ఇవి ఈ ప్రకృతిసూత్రములకే గాని, దివ్యసూత్రముల (divine laws) మినహాయింపు అని చెప్పుటకు వీలులేదు. కాని ఏ దివ్యసూత్రము వీనికి వర్తించునో ఇంకను కనుఁగొనలేదు. ఈ మినహాయింపఁబడిన వాయువులు 'సాధారణపద్ధతికి' ఎందుకు తేడాగా నున్నవో మన కింకను తెలియదు. ఇంతవఱకు మూలపదార్థములవిషయమై మనకు తెలిసిన సంగతు




(90 వ పటము)

లనుబట్టి, పరిశోధనసాగింపగా మినహాయింపఁబడిన పదార్థాల నిర్మాణములో ప్రత్యేకతకు తగినకారణములు తెలియఁగలవు.

మినహాయింపులలో ముఖ్యమైనవి ఉదజని, నత్రజని, ప్రాణవాయువు. ఇవి 89, 90, 91 బొమ్మలలో ఉదహరింపఁబడినవి. ఉదజనికి సంబంధించిన 89 వ పటములో దాని నిర్మాణములోని దశలన్నియు చూపఁబడినవి. ఉదజనిప్రమాణములో 18 అణువు లున్నవి. ఉదజనిలో రెండురకము లున్నవి. ఒకదానిలో 10 ధన, 8 ఋణాణువులు, రెండవదానిలో ధన, ఋణాణువులు తొమ్మిదేసి గలవు. 89 వ బొమ్మలో మొదటి రకము ఉదజని నిర్మాణము చూపినాను. మొదటిదశలో భౌతికప్రపంచాణూపలోకములో పదిధన ఎనిమిదిఋణాణువులు కలిసియుండును. తరువాత ఉపాణూపలోకములో (sub-atomic sub-plane) ఈ 18 అణువులు, మూఁడేసిచొప్పున 6 సమూహాములుగ ఏర్పడును. ఇవి మహాకాశోపలోకములోనికి వచ్చుసరి కింకొక పద్ధతిగను, ఆకాశోపలోకములో వేఱుపద్ధతిగను మార్పుచెందును. చివరకు వాయూపలోకమునకు వచ్చుసరికి మూఁడేసిచొప్పున 6 సమూహాములుగ ఏర్పడును. 3 సమూహాములు కలిసి ఉదజని ధనాణువులు మిగిలిన మూఁడుసమూహాములు కలిసి ఋణాణువులగను ఏర్పడును.

ఈ గ్రంథములో గుప్తరసాయనశాస్త్ర (Occult Chemistry) విషయముల నుదహరించు టనవసరము. గుప్తరసాయశాస్త్రములో దివ్యదృష్టిగలవారికి మూలపదార్థము ఎట్లు గోచరించినదో పొందుపఱుపఁబడినది. ఈశాస్త్రము




(91 వ పటము)

దివ్యజ్ఞానసమాజములోని ప్రాథమికసభ్యునికి కూడ బహు రంజకముగనే యుండును, కారణ మేమనగ, ఈమూలపదార్థముల నిర్మాణమునుగూర్చిన సిద్ధాంతాలు చాలభాగము ఊహింపఁబడ్డవి మాత్రమే. గుప్తరసాయనశాస్త్రసాహాయ్యముతో ఆపదార్థాలు ఎట్లు నిర్మాణము చేయఁబడినవో, వానిలో గర్భీభూతమైయున్న ఎలెక్ట్రాను, ప్రోటాను, న్యూట్రాన్లలో

ఈశ్వరుఁడెట్లు పనిచేయుచున్నాఁడో ప్రత్యక్షముగాఁ తెలిసికొనవచ్చును.

పదార్థముల యథార్థరూపము దర్శింపఁగలిగినప్పుడు ఒక అద్భుతమైన నిర్మాణకౌశలము, ఉత్తేజము కలిగించు జ్ఞానము ప్రకటితమగును. రసాయనికమూలపదార్థమునకు మాత్రము సంబంధించిన ఈశ్వరప్రణాళికాదర్శనము క్షణ మాత్రము కలిగినను, ఈశ్వరుఁడుండని స్థలము పదార్థము లేదని స్పష్టముగా అట్టివానికి తెలియఁగలదు.

ఆయన పనిచేయు విధానస్వరూపము మూలపదార్థాల క్షేత్రగణితాఽకారములోను, వాని 'ఆవర్తిత' స్వభావము లోను, వాని 'సంయోగశక్తి'లోను మనకు ద్యోతకముకాఁ గలదు. 92 వ బొమ్మలో వేఱొకదృశ్యము చూడఁగలము. ఇందులో 6 ఏకసంయోగపదార్థముల – సోడియం, క్లోరీన్, రాగి, బ్రోమిూన్, వెండి, అయొడీన్–నిర్మాణము స్థూలముగ చూపఁబడినది. 77 వ పటములోని 'ఆవర్తిత' పట్టికలోని ఒక రేఖపై ఇవియున్నవి. ఇవన్నియు 86 వ పటములోని 'సోడియంవంటివి'. సోడియం ఆపటములో ఒక 'డంబెల్సు' (కర్లాజోడీ) ఆకారంలోనున్నది. క్రింద, మీాద నున్న రెండు గరాటాలు సమూహములను కలిపే కడ్డీయొకటి కేంద్ర మందున్నది. ఒక్కొక్కసమూహములో 12 గరాటాలు న్నవి. 12 గరాటాల సమూహములు, ఒక్కొక్కటి మధ్య గోళమునుండి రెండువైపులకు ప్రసరించును. ఒకే రేఖపై నున్న లంబాంతరాయుస్కాంతైకసంయోగమూల పదార్థా




(92 వ పటము)

లన్నిటికి ఇట్టి 'డంబెల్సు' స్వరూపముండును. కాఁబట్టి ఈ మూలద్రవ్యములోని కడ్డీ, ఒకగరాటా ఆ గరాటాలు ప్రసాదించు ఒకగోళము మనకు తెలిసియుండుట వూర్తిమూలపదార్థమును నిర్మాణము చేయవచ్చు. అంతిమభౌతికాణువు లన్నిటిని లెక్కపెట్టి దానిని 18 పెట్టి భాగించినచో దానిఅణువు బరువు తెలియఁగలదు. (ఉదజనిలో 18 అణువు లున్నవి. దానిని ప్రమాణముగ తీసికొని దానిప్రమాణము 1 అని

శాస్త్రము నిర్ణయించినది). ఈశ్వరుఁడు కూర్కిప్సు సూచించిన పరిశారము 'పారంపర్యపద్ధతిని' నిర్మాణము చేయువిధానమును 92 వ పటములో ఉదహరించినందున అది ఎంతో స్పష్టముగ అర్థమగుచున్నది. ఒక క్లోరీన్ గరాటా నిర్మింపవలెనన్న సోడియం గరాటా ఒకటి తీసికొని దానికి కలిపినట్లయినచో దానికర్ణి 5 అణువుల బరువు పెరుగును. అప్పుడు రాగి బ్రోమిన్ గరాటాలు చేయుటకు క్లోరీన్ గరాటాను తీసికొని కొన్ని అణుసమూహములను కలిపెదరు. అలాగే వెండి, అయొడీన్ నిర్మించుటకు బ్రోమిన్ తీసికొందురు. 58 అణువులున్న బ్రోమిన్ గరాటాను ఉపయోగించి దాని కింకనుకలిపెదరు ఈ గరాటాలను కలిపెడిగోళములలో కలుగు మార్పులను పటములో చూపినాను. క్లోరీన్ మొదలు అయోడీన్ వఱకు కడ్డిలో మార్పు ఏమియు లేదు. అంతిమ ధాతికాణువులను సూచించు చుక్కలను లెక్కపెట్టి ఒక్కొక్క మూలపదార్థములో ఒకకడ్డి, 2 గోళములు, 24 గరాటాలు (గళ్లాలు) ఉండునని జ్ఞాపకముంచుకొన్నయెడల (86 వ పటములో సోడియంచూడుఁడు) ఈ దిగువపట్టిలోని వివరములు తేలఁగలవు,

| మూలపదార్థము | అణువులసంఖ్య | బరువు, ఉద=1 |
|---|---|---|
| సోడియం | 418 | 23.22 |
| క్లోరీన్ | 639 | 35.50 |
| రాగి | 1139 | 63.27 |
| బ్రోమిన్ | 1439 | 79.94 |
| వెండి | 1945 | 108.05 |
| అయొడీన్ | 2287 | 127.05 |

రసాయనికమూలపదార్థాల నిర్మాణమునకు సంబంధించిన చక్కని విషయమునుగూర్చి వ్రాయుట ఇంక విరమింతును. ఈ విషయమును గూర్చిన తక్కిన వివరాలు తెలిసికోవలె నని కోరినచో మొదటిలో డాక్టరు బిసెంటు, లెడ్‌బీటరు కలిసి వ్రాయఁగా తరువాత ఇంకాకొన్ని విషయములు కూడ కలిపి నేను ప్రచురించిన 'గుప్తరసాయనశాస్త్రము' (Occult Chemistry) అనెడి గ్రంథమును చదివి తెలిసికోఁగోరెదను.

ఈ ప్రపంచములో మనకు కనపడెడివస్తువులన్నియు మూలపదార్థములతో కూర్పఁబడినవే. కాని వానికి, మనకు ఉన్న సంబంధమునుబట్టియే వానికి మనము విలువ ఇచ్చుచున్నాము. కేవలము పరిమితమైన మానవదృక్పథముతో వానిని చూచుటవలన కొన్ని ఉపయోగమైన వస్తువులనియు కొన్ని నిరుపయోగమైనవనియు మన మనుకొనుచుందుము. వజ్రానికి ఎంతో విలువ ఇత్తుముకాని మట్టిపెళ్లను కంకరరాతిని నిరసనగా చూతుము. ఈ వస్తువులన్నిటికి ఈశ్వర ప్రణాళికలో ఒకపాత్ర ఉన్నదనియు ఆపాత్ర, అవి మనకు వానికి, ఉన్నసంబంధముతో నిమిత్తములేకుండగనే నిర్వహించెద మనియు మనకింతవఱకు సరిగా తోఁచనేలేదు.

ఈ ప్రపంచములో 'జడవస్తువులు' గా ఎంచఁబడినట్టివి కూడ పరిణామముచెందుచున్న వని మనము గ్రహించిననాఁడు ప్రకృతి మనకు ఎంత తేడాఁగా కనుపింపఁగలదు? మనమందరము ఏలాగున ఒక ఆదర్శమువలన ఆకర్షింపఁబడి

దాన్నిపైపున కెట్లు పురోగమించుటకు ప్రియత్నించుచు న్నామో, అటులనే అన్ని పదార్థాలు వానిమిశ్రిమములు కూడ,వానిలోఅంతర్యాభత్మైయున్న పరమాత్మను గోచరింపఁ జేయు పరిశుద్ధదర్శనము లగుటకు నెమ్మదినెమ్మదిగా పురోగ మించుచునే యున్నవి, జీవాత్మలో పరమాత్మ ఇమిడి యున్నట్లే అన్నివస్తువులలోఁగూడ ఆయన అంతర్లీనమై యున్నాఁడు. క్రీస్తుమహాశయుఁడు “రాతిని పైకి ఎత్తుము అక్కడ నన్నుకనుగొనెదవు, కట్టెను కోయుము, అందులోను నేనున్నాను” అని చెప్పలేదా. వినుటకు తగిన చెవులున్నచో సముద్రిఘోషములోను, వనరహోధ్వనులలోనేగాక, అత్య ల్పమైన కణమునందుఁగూడ ఈశ్వరపిణాళికాబద్ధమై తన పాత్రినుతాను నిర్వహించుచున్నప్పుడు కూడ ప్రికృతిమధుర నిస్వనమును మనము వినఁగలుగుదుము. భూర్భువస్సువ ర్లోకములనుండి – వేయేల – దృశ్యాదృశ్యప్రపంచముల అన్ని మూలలనుండి ప్రికృతి ఏకైకజయజయధ్వానము నిత్యమును పైకి లేచుచునేయుండును.

కాలము అనెడి గర్జించు మగ్గముపై పనిచేయుచు ఈశ్వరసాక్షాత్కారముకొఱకు, తగిన వస్త్రమును నేయు చున్నాను.



# 11 అధ్యాయము

## జీవపరిణామము

దివ్యజ్ఞానము నిత్యము ప్రకటించుచున్న అనేకమహా త్రైసత్యము లన్నింటిలోను పదార్థము, జీవము, చైతన్యము అనునవి అవిభాజ్యములైన ఏకేశ్వరుని త్రివిధస్వరూపాలు అనెడి విషయము ఎంతో ఉత్సాహమునీయఁగలదు. జీవము లేక ప్రాణము లేని పదార్థమునుగాని, చైతన్యము లేని జీవిని గాని ఊహించుట అసంభవము. ఎలెక్ట్రాను మొదలు ధ్యాన చోహానువఱకు నుండు వివిధచైతన్యస్వరూపములు" ఇరుకునఁబడి, మాయఁబడి, బంధింపఁబడి యున్న " ఈశ్వరునిస్వరూపములే యని మానవుఁడు గ్రహించిననాఁడు, అనంత తేజస్సుతో నిండిన ప్రపంచములో జీవితముగడుపుచున్నట్లు అతనికి అనిపించును. దృశ్యాదృశ్యప్రపంచములో ప్రకృతి నిర్వహించుచున్నపని అతనికి అవాఙ్మానసగోచరుని మహిమవలె కనుపించును. ఈ విషయము, మానసికముగ మాత్రమే గ్రహించినను భూర్భువస్సువర్లోకవిషయము లన్నిటియందు నూతనదృక్పథ మేర్పడును. కాని ఈ విషయములను జీవితములో అనుభూతికి తెచ్చుకోఁగలిగిననాఁడు ఇదివఱకెన్నఁడు పొందని ఆనందోత్సాహములు కలుగు నని తెలిసికోఁగలఁడు.

రసాయనికమూలద్రవ్యముల నిర్మాణమునఁగల పద్ధతు లన్నిటిలోను ఈశ్వరచైతన్యము ప్రసారమగుచుండునని పదవ

అధ్యాయములో తెలిసికొన్నాము. జీవము పరిణామము చెందెడి విధానములు పరిశీలించిచూచినచో పదార్థపరిణామములో ఉపయోగపడిన సూత్రాలే వర్తించునని స్పష్టము కాగలదు. క్రిమి మొదలు దేవతామూర్తివఱకుఁగల జీవరాసు లన్నింటిలోను క్రిందనుండి పైవఱకు ప్రతిస్థాయిలోను ఈశ్వరుఁడు తన ప్రణాళికను 'తు' 'చ' తప్పకుండ తన ప్రతినిధుల సాహాయ్యముతో నడిపించుచున్నాఁడు. అకారణముగ పుట్టుటగాని గిట్టుటగాని యుండదు. జనన మరణములు ఈశ్వరుని మగ్గములోని పడుగుపేకలవంటివి. ప్రతిప్రాణి జీవితము – బీజముగనున్నప్పుడుగాని, వృక్షమైనప్పుడుగాని, జీవితము గడుపుచున్నప్పుడుగాని, మరణించినప్పుడుగాని, దాని పరిణామ విధానము పరిశీలించి చూడఁగోరువానికి – దివ్యజ్ఞానములో అధ్యయనమునకు పనికివచ్చెడి అధ్యాయముగ పరిగణింపవచ్చును.

జీవపరిణామమును నడిపించెడి సూత్రము లేమిటి? అవి అనేకములు గలవు. జీవము పైనుండి వచ్చు బాహ్య ప్రేరేపణములవలన అభివృద్ధి చెందును, అను నది మొదటి సూత్రము. నిద్రించుచున్న జీవిని మేల్కొలుపుటకు బాహ్య ప్రపంచమునుండి ప్రేరేపణ మవసరము. ఈప్రేరేపణ మన్ని వర్గములకు (ఖనిజ, వృక్ష, జంతుమానవవర్గములకు) అవసరము. ఒక ఖనిజము అభివృద్ధిచెందవలె నన్న ఉష్ణము, పీడన, శ్రమ మొదలైన బాహ్యములైన తాకుడులకు లోనుగావలసియున్నది. తేజోమండలములోని అగిడిమంటలు మానవ

వుని కర్థము కాఁజాలవు. వానికి మానవుఁ డేమాత్రము దగ్గరగ వెళ్లినను అవి అతనిని కాల్చివేయును. కాని ఆజ్వాల, రసాయనమూలద్రవ్యమునకు ప్రాణమువచ్చు ఉచ్ఛ్వాస నిశ్వాసములవంటిది. మన భూమి అగిడిమంటతో నిండి యున్నప్పుడు అందుపై మానవుఁడుండి ఉండఁడు. అన్ని వస్తువులను మాడ్చివేయుస్థితిలో నున్న భూమి ఖనిజమునకు ఎంతో ఆహ్లాదమును ఇచ్చుచు ఒక ఉద్యానవనమువలె కనపడెడిది. జీవిలోని ఆంతరంగికస్ఫురణ, బాహ్యాప్రేరేపణ కూడ జీవపరిణామానికత్యవసరము. అట్టి తాకిడి లేనియెడల జీవి నిద్రలో మునిఁగియుండును. ప్రేరేపణసూత్రమునుండి, ఆంతరంగికస్ఫురణ లేనియెడల ఉపాధి నిర్వీర్యమగును.

నిర్మాణలయములద్వారా జీవి పరిణామము చెందును అనునది రెండవసూత్రము. తగిన ఉపాధిని నిర్మించుకొనుట కొరకు అవకాశమైనను కలుగుటకుఁగాను అనేకపర్యాయములు ఉపాధిలయమైనను, జీవి లెక్కచేయదు. ఆదర్శోపాధిని నిర్మించుటకు గాను జీవి అనేకపర్యాయములు నిర్మాణలయములు చేయుచు నిత్యాన్వేషణ సాగించును. ఈవిధానమున అనేకస్వరూపాలు వ్యయపఱుపఁబడుచున్నట్లు కనిపించినను, నిజముగా అందులో వ్యయము గాని దూబరాగాని ఏమీ లేదు. ఏల యనఁగా ఉపాధులు లయమైనను ఆఉపాధులలోని పదార్థము హరించిపోదు. అది మిగిలియేయుండును. జీవి మరణించి ఉపాధులనుండి పైకి వచ్చి తిరిగి అదేస్థితిలో వరుసగా నూతనోపాధులలో ప్రవేశించును. జీవమునకు

నాశనము లేదు. కావున ఒకదాని తరువాత నొక ఉపాధిని నిర్మించుకొనుచు అట్టి ప్రయోగపరంపరవలన తనపరిణామమును తనకుతానే అభివృద్ధిచేసికొనుచుండును. (57 వ బొమ్మ చూడుము.)

మనముముఖ్యముగ అవగాహనము చేసికొవలసినవిషయమేమనఁగ, జీవి పరిణామము చెందుచున్నకొలఁది చైతన్యము కూడ హెచ్చుగ బహిరంతమగుచుండును. జీవిలో బంధింపఁబడియున్న చైతన్యము ఎంతబాగుగా వ్యక్తమయిన అంత బాగుగా ఉపాధి పరిణామము చెందిన దని తెలియఁగలదు. ఏదో ఒక మోస్తరుగ జీవితము గడిపివేయుట యనునది జీవికి నచ్చదు. కాని ఈషణ్మాత్రమైనను ఆలోచన చేయుచు, భావనచేయుచు, లక్ష్యముకొఱకు పాటుపడుచు జీవితము గడపవలెనని ప్రకృతి ప్రయత్నము చేయుచుండును. దివ్యశక్తిప్రసారానికి సరణిగ ఉపయోగించు అత్యల్పమైన అణుభాగము (electron) కూడ ఆ దివ్యశక్తిని ఎక్కువగ వ్యక్తము చేయుమనెడి లక్ష్యమునుకలిగి ఉండును. తనలో నిబిడీకృతమైయున్న దివ్యచైతన్యమును హెచ్చుగ ప్రతిబింబించెడి 'బృహద్దర్శని' అగుటకు వృక్షములు, జంతువులు సమస్తము దృశ్యాదృశ్యమైన ఆలోచనలతోను భావములతోను, నిత్యము ప్రయత్నించుచు ఆశించుచు ఉండును. జీవి స్వీయచైతన్యవంత మగుటకు నిత్యకృషి చేయుచు ఈశ్వరప్రణాళికను తెలిసికొని తాను దానిలో తన పాత్రను సంతోషముతో నిర్వర్తించుటకు ప్రయత్నించుచుండును.

వ్యక్తిజంతుపరిణామానికి లక్షణ మని పేర్కొనఁబడు, 'మనుగడకొఱకు సలిపెడు సంఘర్షణ'లో జీవపరిణామమునకు సంబంధించిన కొన్ని సూత్రములు ఆచరణలో చూడవచ్చు. ఆవేశరహితమైన చల్లఁబడిపోయిన శాస్త్రీయభౌతికదృక్పథముతో చూచినప్పుడు ఈ 'సంఘర్షణ' అనేడిది హింసాకాంక్షతో కూడిన రక్తసిక్తమైన విధానముగ కనపడవచ్చు.

వ్యక్తిజంతువర్గములలో మనుగడకొఱకు సంఘర్షణ మనేడిది ఈశ్వర ప్రణాళికలోని ఒక విచిత్రమైనభాగము. చైతన్యమును క్రమక్రమముగా ఎక్కువ వికాసవంతముగ చేయుటయే లక్ష్యముగా పెట్టుకొని జీవి తన అంతరంగిక ప్రేరణ వలన మార్పుచెందుచున్న బాహ్యపరిస్థితులకు అనుగుణముగా నుండెడి ఉపాధులను ఎంచుకొనుచుండును. మొదట ఈఉపాధులను బహుళముగ సృష్టించుచు అందులో 'మనుగడకొఱకు జరిగెడి సంఘర్షణ'ను తట్టుకొని నిలబడగలిగెడి శక్తిగలిగిన వానిని ఎంచి వేఱుచేయును. ఇట్లు కోట్లాదిగా పరిణామము చెందుచున్న జీవులకు, వివిధవర్గాలకు సంబంధించిన దేవతలు సంరక్షకులుగానుందురు. ఒక దేవత తన వశములో నున్న జీవులను ఇంక నొక దేవత వశముననున్న జీవునిమీఁదికి యుద్ధమునకు పంపుచుండును. అందులో కొన్ని జీవులు హత్యచేయునవి, కొన్ని హత్యచేయఁబడునవి. హత్యచేయునవి బలము ఎక్కువగ సంపాదించుచుండును. ప్రతి దేవత తన వశములోనుండు జీవోపాధులే, ఈశ్వర ప్రణాళికా ప్రకారము నిలిచియుండవలసినవి అనెడి దృష్టితో తమ

యావచ్ఛక్తి వినియోగించి వానిని యుద్ధానికి తయారుచేయుచుండును. ఉపాధి లయమగుటవలన జీవికేమియు నష్టము లేదు. పైఁగా జీవి తుదకు విజయమొంద నుపయోగపడు జ్ఞానము, అనుభవము, శక్తి, కూడఁగలుగును. కాఁబట్టి ప్రకృతిలో నిత్యము సంభవించెడి ఇట్టి ఘోరసంఘర్షణలు కేవలము అనుకరణయుద్ధాలేగాని నిజమైనయుద్ధములుగావని తెలిసికోవలెను. ఈ అదృశ్యనిర్మాణ దేవత లందరు ప్రాణాళి కావసరమునకే తమ సర్వస్వము అర్పణచేసి పనిచేయుచుందురుగాన, అది దృష్టిలోపెట్టుకొని వారీ సంఘర్షణలను ఏర్పాటు చేయుచుందురు.

ప్రకృతియందలి చైతన్యశక్తులు గుడ్డిగాఁగాని అనాలోచితముగఁగాని అకస్మాత్తుగాఁగాని పనిచేయుట లేదనియు, నిర్మాణ దేవతల ఆదేశములకు లోబడియే పనిచేయుచున్నవనెడి ఈ సిద్ధాంతము కొందఱికి వింతగా తోఁచుటయేగాక చాల మందిని ఆశ్చర్యచకితులఁగూడఁజేయును. కాని ఈసిద్ధాంతము బహుసనాతనమైనది. అదృశ్యముగ పనిచేయు అధిష్ఠాన దేవతలు కలరని వారే నక్షత్రములను, గ్రహములను నడిపింతురని దేశములసౌభాగ్యము తీర్చిదిద్దుదురని మానవజాతి చిరకాలమునుండి నమ్ముచునేయున్నది. ఈనాఁటికి అట్టి నమ్మకము హిందువులలోను బౌద్ధులలోను కలదు. పారశీక, ఇస్లాంమత బోధలలోఁగూడ ఈ సిద్ధాంతము కలదు. క్రైస్తవ మతములోకూడ నున్నదికాని చాలతక్కువమందికి మాత్రమే ఇటి నమ్మకముకలదు. దేవతలేగాక వారికిందివర్గములకు

చెందిన దేవతాగణములయందుఁగూడ ఎక్కువ నమ్మకము కలవా రనేకులున్నారు. పృథివ్యప్తేజోవాయ్వాకాశములను, భూతములను, దేవతాగణములనుగూర్చి ప్రాచ్యసంప్రదాయము ప్రకారము అందఱకు తెలిసినవిషయాలే. ఆధునిక విజ్ఞానశాస్త్రము తలయెత్తినతరువాతనే యూరపుదేశములో వీనియందు విశ్వాసము క్షీణించినది. ఇట్టి విశ్వాసము మూఢత్వమువలన జనించినదికాదని హాక్స్లీమహాశయుఁడు (Huxlay) (ఈ విజ్ఞానశాస్త్రవేత్త భగవంతుని యస్తిత్వమును శంకించినాఁడు) పిండోత్పత్తివిధానమునుగూర్చి వర్ణించుచు వ్రాసిన దానిని బట్టి తేలఁగలదు. ఆ విషయమిచ్చట పొందుపఱిచినాను.

(హాక్స్లీ) "ప్రకృతిసంబంధకార్యకలాపాల"తో ఎక్కువ పరిచయము కలిగినకొలఁది శాస్త్రజ్ఞునిలో తబ్బిబ్బు (అబ్బురపాటు) తగ్గి ఆశ్చర్య మెక్కువ వగుచుండును. తానుచేయు విచారణలో ప్రకృతి కనపర్చు అద్భుతపరంపరలలో కెల్ల మొలకనుండి వృక్షము, గర్భపిండమునుండి జంతువు, అభివృద్ధి చెందు విధానము ఎక్కువ మెచ్చుకోఁ దగినదై యున్నది. బల్లిగుడ్లనుగాని నలికండ్లపాముగుడ్లనుగాని పరిశీలించినచో అవి చిన్నచిన్నగోళాకారము కలిగియుండును. ఒకమంచి సూక్ష్మదర్శినిలో వానినిచూచినచో వానిలో కొన్ని నలకలతో కూడిన, చిక్కనిద్రవముతో నిండిన, ఒక ఆకారములేని సంచి మాదిరిది తప్ప ఇంకేమియు కనుపింపదు. కాని అందులో అనేకాసాధారణములైన అద్భుతావకాశములు ప్రచ్ఛన్న

ముగా నున్నవి. ఆ గోళమునకు కొంచెము ఉష్ణత తాకినచో దానిలో నున్న మెత్తటిపదార్థము తొందరగను నిదానము గను పలుమార్పులు చెందును. ఆ మార్పులు ఏదో ఒక క్రమపద్ధతిలో జరుగుచున్న వని అనిపించును. అదంతయు చూచుచున్నప్పుడు ఒకమంచినిపుణుడైన కుమ్మరి మట్టిముద్దకు రూపము దిద్దుచున్న విధానము ద్యోతకమగును. ఆ మెత్తటి ముద్దవంటి పదార్థమును అందలినలుసులను నిర్మాణానికి వీల యినట్లు ఒక సమూహముగా చేరువఅకు, వానిని ఒక అదృశ్య మైన తాపీతో విడదీయుచున్న ట్లనిపించును. అటుతరువాత మిక్కిలి సున్నితమైన వేళ్లు, వెన్నెముక ఉండవలసిన స్థానము వెంబడి ఒకగీతగీసి దానినిచూపుచు, శరీరాకృతిని తీర్చిదిద్దుచు, ఒకవైపున తలను, ఇంకోవైపున తోకను పొందుపర్చు చున్నట్లు, బల్లి ఆకారమునకు సరిపడునట్లు ప్రక్కలు, అవ యవములు బహునిపుణతతో రూపొందించుచున్నట్లు అనిపిం చును. అదే పనిగా ఇంకను గంటలకొలది పరీక్షించిన సూక్ష్మ దర్శినికన్న సూక్ష్మాతిసూక్ష్మమైన దర్శిని ఏదైన నున్న ఆ లోపల ఎవరో అదృశ్యకళావేత్త దీనినంతను, ఒక పథకము ప్రకారము, నిపుణతతో నేర్పరితనముతో అది సంపూర్తి అగు వఱకు తీర్చి దిద్దుచున్నాడా అని తలవనితలంపుగా మనకని పించును.

•

జరుగునది సరిగా ఇదే. కోట్లాది నిర్మాతలు పిన్నలు, పెద్దలుకలిపి నిత్యమును ఈ పనిలో నిమగ్నులై యున్నారు. వీరే జీవకణములను నిర్మింతురు. జీవులకు స్వరూపాలుదిద్దు

దురు. పువ్వులకు రంగులు వేసి ఆకారాలు తయారుచేయు దురు. ఈలక్షణాలన్నియు తమ యెదుట తమ యజమానుఁడై పనిచేయుచున్న 'దేవత' ఎట్టి నమోనాను ఉంచినాఁడో దానికి సరిపోయిన వానిని వంశపారంపర్యముగా వచ్చిన లక్షణములనుండి ఎంచి ఉపయోగింతురు. ప్రకృతి ఒక పెద్ద కర్మాగారమువంటిది. కాని దాని విస్తృతిని దాని భిన్నభిన్న సృష్టిని చూచి మానవుఁడు తన ఊహాశక్తినిగూడ కోల్పోయి వివశుఁడై పోవును.

ఈ పద్ధతిని జీవి క్రమక్రమముగా పరిణామము చెందును. మనము వృక్షశాస్త్రానికిఁగాని జంతుశాస్త్రానికిఁగాని సంబంధించిన ఏ పాఠ్యపుస్తకము చదివినను, వృక్షజంతువర్గములకు సంబంధించిన ఈశ్వరప్రణాళికను అవగాహన చేసికోఁగలము. ఆ ప్రణాళికయే ఈశ్వరుఁడని, మనముచూచుచున్న ప్రకృతి శోభ యావత్తు ఆయనమూర్తియే యని, మన మెల్లప్పుడు జ్ఞాపకముంచుకోవలెను. ప్రాచీనాటవికజాతుల, మోొటైన మతాభిప్రాయములు, ఈనాఁటి సంశయాత్ములగు విజ్ఞాన శాస్త్రవేత్తల సిద్ధాంతాలకన్న కొంతవఱకు సత్యానికి సన్నిహితముగా ఉన్నవి. జీవానికి సంబంధించినసత్యములు ఆటవికులు, ఉపాధికిసంబంధించినసత్యములు విజ్ఞానశాస్త్రజ్ఞులు కనిపెట్టిరి. హిందూమతములోని దశావతారసిద్ధాంతములో ఈరెండుభావాల సంయమము సాంకేతికరూపములో వ్యక్తము చేయఁబడినది. 'అవతారము' అనఁగా అవతరించినది= క్రిందికిదిగినది అని యర్థము. ఇట్లవతరించినవాఁడు రెండవ

మూర్తి అయిన 'విష్ణువు'. ఈ అవతారపరంపరావర్ణననే 'దశావతారఘట్టము' అని అందురు.

**పరిణామము**
**హిందూ పురాణముల రీత్యా**

| విష్ణుయొక్క అవతారములు | | | |
|---|---|---|---|
| 1 | మత్స్య | జలచరము | జంతు |
| 2 | కూర్మ | జలభూచరము | జంతు |
| 3 | వరాహ | భూచరము | జంతు |
| 4 | "నారసింహ" | మృగ -మానవ | మార్పు |
| 5 | వామన | "లుప్తమైనకాలిక" | మానవ |
| 6 | పరశురామ | ఆటవిక | మానవ |
| 7 | రామ | ఆదర్శమానవులు | మానవ |
| 8 | కృష్ణ | దివ్యమానవులు | దైవ |
| 9 | కల్కి | దివ్య | దైవ |

(93 వ పటము)

అన్ని మతములలోను త్రిమూర్తులలోని రెండవ మూర్తి జీవోపాధులకార్యకలాపములతో ఏకీభావము చెంది యుండును. అందుచేతనే 'దశావతారములు' విష్ణుమూర్తి అంశములేగాని బ్రహ్మ, మహేశ్వరుల అంశలుమాత్రము కావు.

హిందూమతగాథల ప్రకారము ఈశ్వరుఁడు ప్రథమముగా జలచరమైనమత్స్యరూపమున వ్యక్తమైనట్లున్నది. దీని గూఢార్థము మనకు తెలియనంతవఱకు భగవంతుఁడు మత్స్యరూపము ధరించినాఁడను భావము కొంచెము హేయముగనే యుండఁగలదు. ఆ భావానికి హైందవుఁడు ఊహాచిత్రము నెట్లు నిర్మించుకొన్నాఁడో రవివర్మ చిత్రించినాఁడు. అదే 94వ పటములో చూపినాను. ప్రజాబాహుళ్యము మత్స్యావతారమును ఇదే పద్ధతిని ఊహించుకొందురు. ప్రళయసమయ



(94 ఎ పటము)

ములో మానవజాతిని రక్షించుటకొఱకు విష్ణు వీప్రకారము అవతరించినాఁడు. పటములో ఈశ్వరుని చేత రక్షింపఁబడినట్లు చూపిన నలుగురు పిల్లలు మానవజాతికెల్లకు ప్రాతినిధ్యము వహించుచున్నారు. సాధారణముగా ప్రపంచములోని మానవ జాతిలో ఇటచూపఁబడిన, తెలుపు, మేడిపండు, నలుపు, పసుపు రంగులవారు మాత్రమే గలరు. రక్షింపఁబడినవారి నుండి తిరిగి మానవజాతి అభివృద్ధిచేయఁబడినది.

జలచరముగానున్న జీవి పరిణామముచెంది భూచర మగుటయే తరువాతవచ్చిన కూర్మావతారములోని భావము.

కూర్మము జలచరమును, భూచరమునుగూడ అయియున్నది. పూర్తిగ భూమిపైన చరించుజంతువైన 'వరహావ'తారము తరువాతిది. జంతుస్వరూపములోనున్న జీవి క్రిమేణా మానవస్వరూపమును పూర్తిగధరించులోఁగా 'నారసింహ' స్వరూపములో వ్యక్తమైనది. ఇందలి సింహము మృగరాజు. కాన జంతుపరిణామములో ఉన్నతస్థాయి అందుకొన్నట్లు సూచింపఁబడినది. పూర్తిఅయిన మానవస్వరూపము మొదటి నారిగా వ్యక్తమయినప్పుడు ఆదిమానవుని సూచించు హ్రిస్వాంగుఁడైన 'వామనావతారము' వచ్చినది. మానవుఁడు అనేక సంవత్సరములపాటు అభివృద్ధిచెందఁగా, మంచి బలమైనశరీరము, మహాకాయము గలిగి, స్వార్థపరత్వము హింసాతత్త్వము, దౌర్బల్యము వినాశకరములగు లక్షణములు కలిగియుండును. భగవాన్ పరశురాముని అవతారము దీనినే సూచించును. (గండ్రిగొడ్డలి ఆయుధము గాఁగల అవతారమూర్తి). ఈయన తన యావచ్ఛక్తి వినాశమునకే ఉపయోగించెను.

దీనితరువాతదైన శ్రీరామచంద్రుని అవతారములో సంపూర్ణమానవుని చూడఁగలము. వేలాది సంవత్సరములకు పూర్వము భరతదేశము ఆదర్శవంతముగ పరిపాలించి నేఁటికి 'రామరాజ్యం' అను పేరు చిరస్థాయిగ నొనర్చిన అవతారమూర్తి శ్రీరామచంద్రుఁడు. ధర్మసంస్థాపనార్థము పితృవాక్యపరిపాలనకొఱకు, ఆయన చేసినత్యాగము వీరోచిత కార్యములు నిరూపించునట్టి గాథలు ఈనాఁటికి కూడ ప్రతి

భారతీయుని హృదయమున పాదుకొని ఆతనిపునీతుని చేయు చున్నవి. మానవశరీరము దాల్చి పృథ్విపై సంచరించిన ఈశ్వరుఁడు అష్టమావతారమైన శ్రీకృష్ణభగవానుఁడు. తాను మానవశరీరములో ఉన్నను తానే భగవంతుఁడనని తెలియును గనుక మానవులకు జ్ఞానబోధచేసి వారిని పరిపా లించి చేయూఁతనిచ్చి నడిపించినాఁడు. ఇంకొకఅవతారము రాఁగలదని గ్రంథాలలో చెప్పఁబడినది. అది ఎట్టిదయియుం డునో ఈనాఁడు చెప్పుటకు మన కలవికాని విషయము. శ్వేతాశ్వము నధిరోహించి ధర్మసంస్థాపనార్థము 'కలికావ తార'ముగ భగవంతుఁడు అవతరింపఁ గలఁడని చెప్పఁబడినది.

జీవిలోని చైతన్యము క్రమక్రమముగ వికసించుచు పరిణామము చెందును. నెమ్మది నెమ్మదిగా భగవంతుని లక్ష ణాలైన జ్ఞానము, సౌందర్యము, బలము ఎక్కువగ వ్యక్తము చేయుచుండును. ఎవఁడు ఖనిజముతోఁబాటు కలఁగనఁగలఁడో, పుష్పముతో భావైక్యము పొందఁగలఁడో, పక్షులతో కలిసి ఆనందింపఁగలఁడో, జంతువుల వాంఛాసుఖములతో సాను భూతి కలిగి యుండఁగలఁడో, అతనే వీనిలో ఇమిడియుండు ఈశ్వరోద్దేశమును ఊహింపఁగల కవి, పండితుఁడు, సూక్ష్మ జ్ఞాని అయియున్నాఁడు. దృష్టికి గోచరమైన ప్రకృతిని అవలో కించుటమాత్రమే గాక, గడ్డిమొలక మొదలు, వృక్షరాజము వఱకు తమ హృదయాలను తెఱచి సూర్యకిరణాలకు ఏలాగున స్వాగతము చెప్పుచున్నవో, ప్రకృతిగానములో మేళవించి దానికి శోభ చేకూర్చునట్లు ఇవి ఏలాగున తమ సహజనాద

మును ఆలాపించుచున్నవో వానితో కలిసిపోయి ఆనందానుభూతిని పొందుటలోనే, మానవుఁడు మానవాతీతుఁడై దేవతాలక్షణములను వ్యక్తపఱిచి చివఱకు భగవత్సమానుఁడు కాఁగలఁడు. కాలిగ్రిజ్జి మహాకవి తాను వ్రాసిన ఈక్రింది వాక్యాలలో ఒక చక్కనిభ్రమను మాత్రమే రాకుండా మహాశోభాయమానమైన సత్యమును చూడఁగలిగినాఁడు.

" సజీవప్రకృతిలోని సర్వస్వము వివిధస్వరూపాలుగా కూర్పఁబడిన సాంగవీణలై, సంకల్పములలో, వణఁకుచు ప్రవేసించిననేమి! వానిపై విస్తారమైన మెత్తని జ్ఞానవాయువు ప్రసరించును. ఇదే ప్రతివీణకు ఆత్మవంటిది. ఇన్నిటికి పరమాత్మ వంటిదికూడను."



# 12 అధ్యాయము

## ప్రకృతిసౌందర్యసందేశము

దృశ్యాదృశ్యరూపములతో నిండిన విశ్వమునకు సంబంధించిన జ్ఞానమే 'సత్యము' అని మనము సాధారణముగా అనుకొందుము. ఈ రూపములు మన చైతన్యములో ప్రతిబింబించినప్పుడు ధర్మభావమునకు దారితీయును.

విశ్వానికిసంబంధించిన ప్రతిధర్మము దానితో పెనవేయంబడినది. ఈ విశ్వ మిటువంటిది కనుకనే మన మనస్సులు నిర్ణయించు ధర్మసూత్రములు వానిని కనిపెట్టుటకు మన మున్నను లేకపోయినను, అవిమాత్ర మున్నవి. 'సత్య' మనునది అన్వేషణాఫలముగా మనకు సంక్రమింపలేదు. 'సత్యము' కూడ విశ్వమువలె నిత్యమైనది, శాశ్వతమైనది.

ఈ సత్యము మనమే. ఈ సంపూర్ణత్వమున మానవుడు స్వల్పాంశమాత్రమే అయినను మనకు గోచరముకాని ఒక మర్మవిధానమురీత్యా తానే ఆ సంపూర్ణుడై యున్నాడు. ఒకవిధముగా ఈవిషయము నమ్మతగినట్లు లేకపోయినను 'అఖండము' లేక పూర్ణమునకు సంబంధించిన ప్రతిసత్యము, దానిఅంశములోను ఎక్కడో ఒకచోట కనపడితీరును.

ఈశ్వరునికి, ప్రకృతికి, మానవుని మోక్షప్రాప్తికి సంబంధించిన సత్యము లన్నియు మానవునిలో అంతర్భూతమై యున్నవి. సంపూర్ణ బ్రహ్మసంబంధజ్ఞానప్రేమ సౌందర్య

నిధులన్నియు మానవునియాత్మాంతరంగములో మిక్కిలి లోతైన మూలలో దాగియున్నవి. మానవుడు తగిన అన్వేషణ జరిపినచో సత్యమునంతను తెలిసికోగలడు.

సత్యమును తెలిసికొనగలందులకు వీలైన రెండు మార్గా లున్నట్లు తోచును. మనస్సు నుపయోగించి తెలిసికొనెడిది ఒకటి; బుద్ధి లేక అంతర్వాణి ద్వారా తెలిసి కొనెడిది ఒకటి. మనస్సు సహాయము లేకుండా కేవలము బుద్ధిద్వారానే సత్యమును తెలియువిధానము బహుస్వల్ప సంఖ్యాకులకే సాధ్యము కావున సత్యమును తెలిసికొనుటకు ఉపయోగించెడు సాధన సామగ్రినుండి ప్రస్తుతమునకు 'బుద్ధి'ని వదలి వేయుదము. ఈనాటి మానవసంఘములో ఉత్తమస్థాయికి చెందిన వారిలో 'మనస్సు' ఎక్కువ అభివృద్ధి చెందినందున సత్యమును తెలిసికొనుటలో బాగుగానే ఉప యోగించినది. గణితశాస్త్రము, విజ్ఞానశాస్త్రము తత్త్వ శాస్త్రము సత్యము తెలిసికొనుటకు దొరికినవిధానములు.

ఇంతవఱకు మనస్సుద్వారా తెలిసిన జ్ఞానము సంపూ ర్ణమైనదికాదు. ఏలయన ఇంతవఱకు మనస్సు, ప్రకృతికి సంబం ధించిన భాగములలో నొక ముఖ్యవిషయమునుగూర్చి ఆలో చింపనే లేదు. అది ప్రకృతిసౌందర్యానికి సంబంధించిన విషయము. ప్రకృతి ధర్మమును మాత్రమేగాక సౌందర్య మునుకూడ ప్రకటించిన దని మనము అర్థముచేసికోలేని నాడు సత్యమును పూర్తిగా దర్శింపలేము.

పదవ అధ్యాయములో ఈశ్వరుని దివ్యమనస్సు కొన్ని మూలసిద్ధాంతముల ననుసరించి ఏప్రకారముగ నిర్మాణము చేయునో తెలిసికొన్నాము. రసాయనికమూలపదార్థాలను పరిశీలన చేసినప్పుడు, అవి మనలను లొంగదీయు దానిబుద్ధిచాతుర్యానికే కాకుండ, దాని సౌష్టవమునకు, సప్రమాణ శిల్పానికి మనము ముగ్ధుల మయ్యెదము. 'ఆవర్తిత సూత్రి ములో' (Periodic Law) తెలియఁబఱ్పఁబడిన అన్ని మూల ద్రవ్యముల నిర్మాణానికి సంబంధించిన పటములను చూడ టాజ్ మహాల్ వంటి సుందరభవనమును చూచినప్పుడు ఎట్లు ఆశ్చర్యచకితుల మయ్యెదమో అంతకుమించిన ఆశ్చర్య ముతో నిండిపోదుము. ప్రకృతిఅంతయు ఈశ్వరునిచేతి కళ వంటిది. ఆయన ఏపని చేసినను శిల్పనైపుణ్యము సౌంద ర్యము ఉట్టిపడు చుండును.



( 95వ పటము)

**95, 96, 97** పటములలోని ఆకుల నొకసారి చూడుడు. ప్రకృతి వాని కిట్టి సౌష్ఠవము సొబగు ఒనగూడునట్లుగాను యుగయుగాలుగ పనిచేసినది. ఆ పత్రములను నిర్మాణము



( 96వ పటము )



( 97వ పటము )

చేయునప్పుడు, గాలిలోని కర్బనితమును వానిలో మిళితము చేయుటలోను, సూర్యకిరణములను వాటి క్లోరోఫిల్ నిర్మాణము చేయుటకు ఉపయోగించుటలోను, భూమిలోని ఖనిజములను మార్పుచేయుటలోను, భూమ్యాకర్షణశక్తికి వ్యతిరేకముగ వానిని అడుగునుండి పైకి ఎత్తుటలోను, అనేకసూత్రాలు ఇమిడియున్నవి. ఇట్టి చక్కని ఆకులను 'యంత్రము'వలె సృష్టించినదా అని అనిపించునట్లు నిర్మాణముచేసిన ప్రకృతిలోని గూఢముగనున్న రహస్యశక్తి ఏమిటి ?

98వ బొమ్మలో ప్రకృతియొక్క కళాసృష్టికిసంబంధించిన ఒకసూత్రము మనకు కనుపించును. ఈ సూత్రము




( 98వ పటము)

భౌతిక, రసాయనశాస్త్రములకు సంబంధించినదికాదు. ఇది కళాఖండమునకు సంబంధించినది. దీనినే 'కిరణప్రసార' (law of radiation) సూత్రమనెదరు. ప్రకృతి ఒక ఆకును, ఒకపూవును, ఒకమంచుస్ఫటికమును, ఒకనత్తగుల్లను నిర్మించి నప్పుడు, అందము మఱొకసారి వ్యక్తమగును. చాలమంది అంత ఎక్కువగ ఆనందింపలేక పోయినను 99 వ బొమ్మలో ఉదహరించిన "స్కోలోపెండ్రియమ్ అఫిషినేరియము" (Scolopendrium officinarium) అనే దానిలోని జీవాంకురము జీవకణముల ఉపరిభాగమువఱకు సన్నని ఈనెలాగున ఒకక్రమబద్ధ నిర్మాణముచేసిన విధానములో కళానైపుణ్యము ద్యోతకమగుచున్నది.



(99 వ పటము)

ఒక్క విషయముమాత్రము స్పష్టముగా కనపడును. ప్రకృతిప్రధానలక్షణము సౌందర్యమే అయినను ఆసౌందర్యము క్షేత్రగణితాకృతి కలిగియున్నది. ప్రకృతిరహస్యములను విజ్ఞానశాస్త్రజ్ఞుఁడు అన్వేషించునప్పుడు ప్రాచీన వేదాంతులు నుడివినట్లు 'భగవంతుఁడు' నిత్యము క్షేత్రగణితాకారములో సృష్టిచేయు నను వాక్యము పూర్తిగా నిజమని తేలును. 100 వ పటములోవలె మొదట ఒక మెలికయుండి, మధ్యమున కలిసి నాల్గుపైపులకు వ్యాపించు ఆకుల ఆకారములో మన కెక్కువ పరిచయము కలిగిన క్షేత్రగణితస్వరూపము వ్యక్తమగుచున్నది. 101 వ పటమును తిలకించినచో వృక్షవర్గములోని జీవశక్తి క్షేత్రగణితస్వరూపములలో నిర్మాణముచేయవలెనను ఆసక్తి వెల్లడించుచున్నట్లు స్పష్టమగుచున్నది. న్యూజిలాండు దేశములో నేను కొన్నిసంవత్సరాల క్రిందట తీసిన, ఒకరకము కుక్కగొడుగు ఛాయాచిత్రమే



(100 వ పటము)

101 వ పటము. వీనియన్నిటికన్న 102 వ పటములో చూపిన సముద్రతీరపు నత్తగుల్ల ఈవిషయమును ఎక్కువగా బలపఱుచుచున్నది. ఇది గుండ్రముగా మెలికలుచుట్టుకొని ఒక మరచుట్ట ఆకారముననున్నది. దీనినే లోగర్థిమిక్ వంపు (logarithmic curve) అని అందురు. వీనినిచూడఁగా కళాప్రపంచములో ఉంటిమా అనిపించును. 103 వ బొమ్మలో చూబెట్టిన గ్రీకుదేశపు శిల్పనైపుణ్యమునకు నిదర్శనమైన అయోనిక్ స్థంభము పై భాగము ఈగుల్లను బట్టి రూపొందించినదే అయియున్నది. 104 వ బొమ్మలో, ఇదే ఆకారమును పెన్సిలుతో రేఖారూపములో చూపినాను. "లిఖ్నాస్పిస్ గిల్టోచై" (Lichnaspis Giltochii) అను సముద్రజలచరాకారము వీని నన్నిటికన్న ఎక్కువ ఆశ్చర్యమును కలిగించును.



(103 వ పటము)

దాని శరీరముపైనుండు పొడుగైన ముళ్లు సమూహాములుగ నాల్గువైపులకు ప్రసరించురీతినిబట్టి, ముల్లరు మహాశయుఁడు ఆ సమూహాములకు, ఉత్తర దక్షిణ ధ్రువములని, ఉత్తర దక్షిణోష్ణమండలములని, భూమధ్యరేఖ అనియు నామకరణ మిడెను.

ఖనిజము లన్నింటిని ప్రకృతి క్షేత్రగణితస్వరూపాలలో నిర్మాణముచేయును. మంచుగడ్డ స్ఫటికాకారమున నుండునని మనకు తెలియును. కాని 106 వ పటములో చూపఁబడిన అద్భుతాకారములో మంచుగడ్డ ఉండునని ఎవరు కలఁగనఁగలరు? ఇట్టి ప్రశస్తమైన నమూనాను ఒక గొప్పకళావేత్తయే పోతపోసి తయారుచేసియుండనోపు. దీనిని చూడ ఇంటి సరంబి కొఱకు పోతపోసిన శిల్పములాగున కనపడును. కాని ఇది నిజముగా ఒకమంచుగడ్డఛాయాచిత్రము. 107 వ బొమ్మలో కనపఱిచినది 'అడియాంతం పెడాటమ్'




(104 వ పటము)

(Adiantum pedatum) అను అమెరికాదేశపు మొక్క. అట్టిసొగసైన వంపులు ప్రకృతి ఎట్లు తయారుచేయునో కదా! అట్టి మహాసౌందర్యమును వీక్షించుచు కళాకారుఁడు ముగుఁ డైనాఁడన ఆశ్చర్యమేమున్నది.

ప్రకృతి సౌందర్యపిపాసి ; ఎక్కడచూచిన ఆమె నిర్మాణములో అందముట్టిపడుచుండును. ఆస్ట్రేలియాదేశములోని లైరు (Lyre) పక్షిసొగసు, (108 వ పటము) నిదానముగా చూచుచు కూర్చున్న పిల్లి వీపు వంపులోనితీరు (109 వ పటము) ఎక్కడనుండివచ్చినవి? దాని కట్టి చక్కనితీరు వచ్చునట్లు పిల్లి ఎముకలు కండరములు ప్రకృతి కేవలము



(105 వ పటము)

'యాంత్రిక' విధానములో ఎట్లు నిర్మాణము చేయఁగలదు? ఎగురుచున్న పక్షిని దేనినైన చూడుఁడు (110 వ పటము) దానిలో ప్రకృతి కళానైపుణ్యముతో కూడిన హాస్తమేగా కుండ ఆపక్షి ఎగురుతీగులో ఒక కావ్యము కూడ ప్రకటిత మగుచున్నది.



(110 వ పటము)



108 వ పటము



109 వ పటము

వింతగొలుపు చక్కని రంగురంగుపక్షులను చేపలను చూడఁజూడ ప్రకృతికళాసృష్టికి అమందానందకందళిత హృదయారవిందుఁడు కాని వాఁడెవఁడు ? ఈ రంగులపద్ధతిని బట్టి చూడ యాంత్రికవిధానములో జాతిని ఎంచుకొనుట జరుగును అను సిద్ధాంతరూపేణాగాని, క్షేత్రగణిత నిర్మాణము ప్రకృతిలో సహజముగా అంతర్లీనమై యున్నది అనుసిద్ధాంత రూపేణాగాని, ఈరంగులకు కారకుఁడైన మహత్తరకళానిష్ణాతునిభావనైపుణ్యము నర్థముచేసికొలేము. అనేకసంవత్సరాలు తనచేతితోను కంటితోను సాధనచేసి వర్ణనాతీతమైన ప్రకృతి శృంగారమును అతిసునిశితముగా గ్రహించునంతటి నైపుణ్యము సంపాదించిన కళోపాసకుఁడు మాత్రమే ప్రకృతి యాంత్రికవిధానరీత్యా గాని, క్షేత్రగణితవిధానరీత్యా గాని, నిర్మాణము చేయదని గ్రహింపఁగలఁడు. ప్రకృతిలో వెదకిన క్షేత్రగణితచ్ఛాయలు కనపడవచ్చును కాని ప్రకృతి చైతన్యము ఎల్లప్పుడును కళతో తొణికిసలాడుచుండును.

'హానలులు' మత్స్యప్రదర్శనశాలలో భద్రపఱచిన, 'హవాయి' ద్వీపముచుట్టునున్న సముద్రాలలోని వేలాది రంగురంగుల చేపలలో ఒకటిరెండు చేపలను చూచినప్పటికి ఏమాత్రపు కళాబీజ మావ్యక్తిలోనున్నను, ఒక కళాప్రవీణుఁడుసృష్టించిన వస్తువులను తిలకించుచున్నా మని అనిపింపక మానదు. వానిలో 'ట్యూథిస్ ఎఛిలిస్'(Teuthis achilles) అను కేవలము నల్లరంగుగలచేపను చూచినాను. చేపలకు నల్లరంగు అంతతగినరంగుకాదు. కాని ఈచేపలకు మూతి చుట్టు, చెవిచుట్టు, కంటిచుట్టు ఊదారంగు ఎరుపురంగు

అందముగ దిద్దఁబడినది. పైఁగా ఈరంగులే దాని అధో, పరి, పక్షములవద్ద కూడ అందముగ పూయఁబడినది ; తోఁకకు, తోఁకవద్దనున్న రెక్కలకు ఎఱ్ఱరంగు కూర్పఁబడినది. ఈ చేపను నేను చూచుసరికి ముగ్ధుఁడనై, ముకుళితహస్తాలతో ఆ అదృశ్యకళావేత్తకు ఆనందపరవశుఁడనై జేజేలు సమర్పించితిని (ఏమాత్రము కళాదృష్టి గల వాఁడైన ఇట్లు చేసితీరును). మాటలతో వర్ణించుటకు అలవికాని వింత ఆకారము కలిగిన చేపను చూచినాను. దీనిపేరు జాంక్లస్ కేనిసెన్స్ (Zanclus-canescens). దీని రంగు కూడ అతినైపుణ్యముతో వేయఁబడినది. దీనిరంగుకన్న, ఆకారమే బహువిచిత్రముగా నున్నది. ఈ చేపను నిర్మాణముచేయునప్పుడు కళావేత్త విరామము తీసికొనుసమయములోనుండి క్రీడాధోరణిలో చమత్కార దృష్టితో భావనచేసినట్లు తోఁచును. ఇది ఎంతవిచిత్రముగా నున్నదో అంత అందముగా కూడ ఉండి సృష్టికర్త కళాప్రవీణతను నిరూపించుచున్నది.

పక్షులఅందమును వర్ణింపవలెనన్న దానికి ఒకేఒకపద్ధతి కలదు. ఇది మాటలతో జరుగునదికాదు. అందువలన పక్షులన్నిటిని ఒకచోట ప్రోగుచేసి సత్యాన్వేషకునిపిలిచి “ వీనిని గుఱించి నేను చెప్పఁగలిగినదింతే, వీనినన్నిటిని బాగుగా చూడు, అక్కడికి గ్రహింపలేకపోయిన తిరిగి ఇంకోసారి చూడు ” అని అనుటయే నేనుచేయఁగలిగినపని.

111 వ పటములోని ‘సాలెగూడు’ 112 వ పటములోని రసాయనికమూలద్రవ్యముల ‘ ఆవర్తితనూత్రము ’




(111 వ పటము)

మనకు విశదముకాని ఒకరహస్యపద్ధతిలో అణువును మహత్తుతో ముడిపెట్టుచున్నవి. 'సాలెగూడు'నకు కేంద్రమందు లోగర్ధమిక్ (logarithmic) వంపుఉన్నది. క్షేత్రగణితరూపములో నిర్మాణము చేయుట సాలిపురుగున కెట్లు తెలిసినది? 'సాలెగూడు' మోస్తరుగను 'ఆవర్తితసూత్ర' చక్రమునకు, సరిపోవునట్లు లయబద్ధముగా చిన్నచిన్నవర్గములుగా కూర్చి అణుభారముల ప్రకారము క్రమపద్ధతిని పట్టికగా తయారుచేయుటకు అనువుగ, విశ్వము తనతో పాటు 92 రసాయనిక మూలద్రవ్యముల నెట్లు సృష్టించినది?

సత్యమును అవగాహనచేసికొనవలెననినచో ప్రకృతి పని చేయువిధానములోని అందమును గ్రహించెడి సూక్ష్మబుద్ధి మనకు ముఖ్యముగా కావలెను. విషయములనుగూర్చి సూత్రములను కనుగొను మనస్సు మనలను కొంతవఱకే తీసికొని వెళ్లఁగలదు. మనస్సు భావనచేయఁగలిగిన దానికి మించిన

'ఆవర్తిత సూత్రము.'




(112 వ పటము)

రహస్యములు జీవితములో కలవు. 113 వ పటములోని 'హిమెనోకాలిస్, లిటొరాలిస్' (Hymenocallis litoralis)

# 13 అధ్యాయము

## చైతన్య పరిణామము

'చైతన్యము' అనఁగ నేమిటో నిజముగా తెలియఁ గలిగిననాఁడు పరిణామానికి సంబంధించిన అన్నిసమస్యలకు తగిన కిటుకు దొరకును. శక్తి - పదార్థము, జీవము - రూపము, అయిన ఏకైకబ్రహ్మ ఉత్కృష్ట స్వరూపమే చైతన్యము.

"ఓం అమితాయ! కొలవశక్యముకాని అనంతుని మాటలతో కొలవఁబోకు. అగాధములోనికి నీ ఆలోచనారజ్జువులు దింపకుము. అడుగుట జవాబు చెప్పుట కూడ పొరపాటే. మాట్లాడకపోవుటయే ఉత్తమము."

కాని మనప్రకృతినిర్మాణమునుబట్టి మనలో ప్రశ్నలు ఎప్పుడు ఉత్పన్నమవుచునే యుండును. వానికి తగిన జవాబు దొరకినప్పుడే మనకు జీవితములో తృప్తి అనునది యుండును. నిన్న మనకు తృప్తి కలిగించిన జవాబు నేఁడు సరిపడక పోవచ్చును. నేఁడు మనస్సునకు తృప్తి కలిగించిన విషయమును రేపు మనము తిరస్కరింపవచ్చును. కాని నేఁటి సమస్యకు పరిష్కారమార్గము దొరకినఁగాని మానవునికి సంతృప్తియుండదు. చైతన్యము పరిణామము చెందురీతిని మనము మానసికముగా అవగాహన చేసికోఁగలిగిన 'చైత

న్యము ' అన ఏమిటో కొంతవఱకు తెలియును. చైతన్యము పరిణామము చెందు విధానమునుగూర్చిన జ్ఞానమే విజ్ఞానము లలోకెల్ల విజ్ఞానము.

చైతన్యమునుగూర్చిన మొట్టమొదటి ఆశ్చర్యకరమైన విషయమేమనఁగా, ప్రత్యంశములోను ఆయన సంపూర్ణముగానున్నాఁడు. మొత్తము యావత్తు ప్రత్యణువులోను ఇమిడియున్నవి; అన్నదే 'ఎలెక్ట్రాను' (electron) లోని చైతన్యము చిన్నసూది మొన ప్రమాణముగానున్నను, అది బ్రహ్మాండమైన ఈశ్వరచైతన్యముతో లంకెవేయఁబడి ఉన్నది. ఆయన అందులో సంపూర్ణముగా ఉన్నను మనము అసంపూర్ణులముగనుక, మనకు ఆయనలో ఎలెక్ట్రానంత మాత్రమే గోచరించును. వేలాది సూర్యకిరణాలు భూతాదర్శముమీఁద పడి ఒకబిందువుగా కేంద్రమునకుఁ జేర్చఁబడి ఆ కిరణములన్నింటి శక్తి ఆ బిందువులో ఎట్లు ఇమిడియుండునో ఆప్రకారమే ఉపాధిలో నిమిడియున్న చైతన్యములో ఈశ్వరునిశక్తి పూర్తిగ అంతర్యామియై యున్నది. అణువు మొదలు మహాత్తువఱకున్న ఉపాధులన్నింటిలోను వివిధ స్వరూపాల చైతన్యము ఇమిడియున్నది. 'మెండేలియను' అను జీవశాస్త్రవేత్త "సూదితలకన్న చిన్నదైన జీవకణమున పూర్వమొకప్పుడు షేక్స్పియరు మహాకవి అంతర్యామియై యున్నాఁడు" అని చెప్పినప్పుడు ఆయన కేవలము యోగ సూత్రము ప్రవచించినాఁడు. మైళ్లకొలఁది విస్తరించియున్న ఒక ప్రకృతిదృశ్యమును ఛాయాగ్రహణయంత్రసాహాయ్య

ముతో నొక బిందువులో కేంద్రీకరింపవచ్చు. అట్టి స్థితిలో తెరమీఁద దాని ఆకారము మన కన్నులకు గోచరింపదు. కాని బిందువుగ కేంద్రీకరింపఁబడ్డ స్థలమునుండి ఆ యంత్రములను దూరముగా జరిపినకొలఁది తెరమీఁద బొమ్మ క్రమముగా పెద్దది అయి మనకు బాగుగా కనపడును. తెరకు (అనఁగా కేంద్రబిందుస్థానమునకు) యంత్రమునకు మధ్యమున నున్న దూరమునుబట్టి తెరమీఁద బొమ్మ వివిధపరిమాణము లలో (సైజు) కనపడును. దూరమునుబట్టి బొమ్మ ఆకార ముండును. ఆ ఆకారనుబట్టి ఆ బొమ్మ స్పష్టత ఆధారపడి యుండును. ఆ బిందువులోనే ఈ దృశ్యము యావత్తు ఉన్నది. కాని ఆబిందువునకు దూరదూరముగా మనము వెళ్లుచున్నకొలఁది ఒకశూన్యమునుండి ఆ బొమ్మ మనవైపు నకు వచ్చునా అనిపించును. చైతన్యపరిణామవిధానాని కిది ఒక సాదృశ్యముగా తీసికొనవచ్చును.

ఒకదీపముపై కప్పఁబడిన తెరను ప్రక్కకు తొలఁగిం చుట వంటి దీ చైతన్యపరిణామవిధానము. తెరను తొలఁగిం చుటవలన దీపానికేమీ ఆధిక్యము రాదు; కాని అది చీఁకటిని మాత్రము తొలఁగించును. అట్లు ఈ దీపము చీఁకటిని ఎందుకు తొలగించునో ఆదీపముతో మనము తాదాత్మ్యము పొందఁగలుగువఱకు గ్రహింపలేము. అది చేయుపనిలో త్యాగము, ఆనందము కూడ ఉన్నవి. పరిమితమైన ఉపాధిలో కట్టుఁబడియుండుటయే త్యాగము. వెలుగునియ్యఁగలుగుటయే ఆనందము. ఈత్యాగములోను ఆనందములోను పాల్గొ నుటయే మోక్షసిద్ధి.

మానవునిలో చైతన్యపరిణామము వితరణవలన కలుగును. జంతువృక్షవర్గములలో అభివృద్ధి పోటీస్పర్ధలద్వారాను, స్వార్థపరత్వముద్వారాను కలుగును. మానవాభ్యుదయమునకు మూలసూత్రములు సహకారము, వైరాగ్యము స్వార్థత్యాగము అయియున్నవి. జీవోపాధులను శిలువపైన ఈశ్వరుఁడు నిత్యము తననుతాను త్యాగము చేయుచున్నాఁడు. ఈశ్వరుని మానవుఁ డీవిషయము అనుకరింపఁగలిన నాఁడే 'ఈశ్వరునివలె' అగుటకు వీలున్నది. ఈ బృహత్సూత్రాన్ని త్రమును ఎప్పుడును జ్ఞాపకముంచుకోవలెను. మానవ చైతన్యము తనలో దాగియున్న సదవకాశములను అంచెలవారీగా వికసింపచేయును. స్వార్థత్యాగము లేనిదే మానవుఁడు ఒకస్థాయినుండి పైస్థాయికి వెళ్ళలేఁడు. వేలాది జన్మలు పట్టినప్పటికి మానవుఁడు తనలోని పశుత్వమును పూర్తిగా రూపుమాపవలెను. చాలాజన్మలు గడచుసరికి 'స్వార్థత్యాగము' అతనిలో సహజమైన లక్షణమగును. అప్పుడే త్యాగములోనే ఆనందమున్నదని తెలియఁగలఁడు.

చైతన్యము మొట్టమొదట ఆవేష్టనము (involution) చెంది తరువాత పరిణామము (evolution) చెందును. 115 వ పటములో నీ 'ఆవేష్టన' విధానమునే ఉదహరించి సూర్యమండలములోని సప్తలోకములను 7 భాగములుగ చూపఁబడినవి. వాని పైభాగములో సృష్టికి పూర్వస్థితిలో నున్న అవ్యక్తబ్రహ్మను సాంకేతికముగ నిరూపించినాను. అవ్యక్తమును సూచించెడి వృత్తములో త్రిభుజ మున్నది.

త్రిభుజమే త్రిమూర్తులను సూచించుచున్నది. ఆత్రిభుజములో తురీయాత్మ చిహ్నమైన నక్షత్రముగలదు.

ఈశ్వరుఁడు అవ్యక్తమునుండి ఆదిలోకములోనికి దిగును (ఆవేష్టనావిధానములో మొదటిమెట్టు). ఆదిలోకములో ఈశ్వరుఁడు సంపూర్ణమైన త్రిమూర్త్యాత్మకముగా

| | | |
|---|---|---|
| | | |
| ఆది | మహేశ్వరుడు విష్ణు బ్రహ్మ 1 2 3 | |
| అనుపాదక | విష్ణు బ్రహ్మ 2 3 | |
| నిర్వాణ | బ్రహ్మ 3 | 1 2 3 ఆత్మ |
| బుద్ధి | | 2 3 బుద్ధి అంతర్వాణి |
| మానసిక | | కారణశరీర మనస్సు - అరూపసంకల్ప |
| | | మానసికశరీర నీచమనస్సు-రూపసంకల్ప |
| కామ | | కామశరీర కామ వ్యక్తిభావ ఉద్రేక |
| భౌతిక | | భౌతికశరీర కాయిక కర్మలు |

(115 వ పటము)

వ్యవహరించును. త్రిమూర్తులనే, బ్రహ్మవిష్ణుమహేశ్వరులని, పిత, పుత్రుఁడు, పవిత్రాత్మ (Father Son and Holy Ghost) అని అందురు. రెండవ మెట్టుగా అనుపాదకలోకములోనికి ఈశ్వరుఁడుదిగును. అనుపాదకలోకములో బ్రహ్మశక్తి, విష్ణుశక్తి సంపూర్ణముగా చలాయింపఁగలవు. కాని మహేశ్వరశక్తి లుప్తమగును. అనఁగా స్వేచ్ఛతగ్గి కొద్దిగా బంధమేర్పడిన దన్నమాట. అందుకనే పటములో త్రిభుజములో ఒకభుజము అంతర్ధానమైనట్లు చూపఁబడినది. నిర్వాణలోకములోనికి దిగుసరికి బంధము హెచ్చగును. ఇక్కడ బ్రహ్మశక్తి మాత్రము పూర్తిగా వ్యక్తమగును. విష్ణుమహేశ్వరుల శక్తులు వ్యక్తమగుట అసాధ్యమగును. అందువలన త్రిభుజములో ఒకభుజము మాత్రమే చూపించినాను.

సర్వశక్తిమంతుఁడైన ఈశ్వరుఁడు ఒకలోకమునుండి క్రిందిలోకమునకు దిగినంతమాత్రాన అతనిశక్తి ఎందుకు తగ్గవలెనో కొందఱికి అర్థము కాకపోవచ్చును. ఈవిషయము నిరూపించుట కొఱకు దృష్టాంతము చెప్పెదను. ఆఱుసమభుజములు గల ఘనము (cube) ను అందరు ఎరుగుదురు. దానికి పొడుగు, వెడల్పు, ఎత్తు అను మూఁడు పరిణామములున్నవి. అన్ని వైపుల ఈ వస్తువును చూచినప్పుడు ఇది 6 చతురపు ముఖములు గలిగి 12 సరిహద్దుల రేఖలతో నున్న ఒకఘనమని తెలియును. మనము ఒక క్రిమి (రెండు పరిమాణములకు పరిమితమైన జ్ఞానము మాత్రము కలదు) చైతన్యముతో తాదాత్మ్యము చెంది నామనుకొందము. ఆక్రిమిని ఒకకాగిత

ముపై నుంచినచో దాని చైతన్యము ఆకాగితము నాల్గువైపు లకు మాత్రమే పరిమితమై యుండును. ఆ కాగితముపై ఆఱు సమభుజములఘనమును ఉంచినచో, ఈక్రమి యాఘనము చుట్టును కాగితముపై మాత్రము తిరుగును. దానికి అప్పుడు ఆఘనములోని ఒక 'చతుష్కం' మాత్రమే తెలియఁగలదు. దానికి 'ఎత్తు' అను 3వ పరిమాణము అర్థముకాదు. అనఁగా 6 సమభుజములఘనము అని దానికి అర్థమగుట సాధ్యము కాదు. ఆఘనములోని 6 ముఖములు 6 సార్లు వరుసను అది తిరుగవచ్చు కాని ప్రతి పర్యాయము ఇది ఒక సమచతురము అని మాత్రమే అది భావించుచుండును.

రెండుపరిమాణములు మాత్రమే గ్రహింపఁగలిగిన చైతన్యశక్తిగలప్రాణి ముందర 3 పరిమాణములు గలిగిన వస్తువు నుంచినచో ఆ ప్రాణిదృష్టిలో ఆవస్తు వపరిమితమై పోవును. అట్లు పరిమితము చేయు గుణ మా వస్తుస్వభావములో లేదు కాని అది ఆవస్తువుస్వభావమును అర్థముచేసికోలేని చైతన్యశక్తి దోషము. అదే ప్రకారము ఈశ్వరుఁడు ఒక్కొక్క మెట్టు దిగినకొలఁది చైతన్యశక్తి తగ్గి బంధితుఁ డౌచున్నాఁడు గాని అతని పరిపూర్ణత్వములో మాత్రము లోటు ఏమీ లేదు. ఆయనస్వభావములో కూడ మార్పు లేదు. కాని ఆయన సృష్టించిన లోకాలలో ఒక దానితరువాత నొకదానిలోకి దిగి పనిచేయుటలో ఆలోకముల స్థౌల్యము అభివృద్ధిచెందుచురాఁగా ఆయనవికాసము క్రమేణా తగ్గి బంధము హెచ్చయి సంకుచితుఁడగును.

ఈశ్వరుఁడు మొదటి మూఁడులోకములోనికి వరుసగా దిగెడికాలములో మానవతురీయాత్మ ఆయనలోనే ఉండును. ఈవిషయము పటమునందలి త్రిభుజములో నక్షత్రమే స్పష్టముగా సూచించును. మనము ఈశ్వరునిలో తురీయాత్మగా ఉండి, చరించుచు జీవింపని క్షణ మొక్కటిలేదు. ఆయనఁ గూర్చి మొదట మన కేమి తెలియకపోయినను, అట్లు తెలియకపోవుటయేగాక పైఁగా ఆయన సంకల్పానికి వ్యతిరేకముగఁగూడ సంచరించినను, ఖనిజవర్గమునుండి మానవవర్గము వఱకు పరిణామము చెందుచు అన్నిదశలలోను ఆయననుండి మనము విడిపోవుట ఎప్పుడు సంభవింపలేదు. 'గుప్తసిద్ధాంతములో' (secret doctrine) ఈప్రకారము చెప్పఁబడినది.

"ఫోహాత్ (Fohat) సూక్ష్మాతిసూక్ష్మమైన రజ్జువు సాహాయ్యముతో విస్ఫులింగము, జ్వాలనుండి వ్రేలాడును. మాయతోకూడిన సప్తలోకాలగుండా ఇది ప్రయాణము చేయును. మొదటిలోకములో ఇది ఖనిజస్వరూపముదాల్చును. రెండవలోకములో-ఆశ్చర్యము-ఇది వృక్షమైనది. ఈ వృక్షము ఏడుసార్లు తొందరగా మార్పుచెంది జంతురూపముఁదాల్చినది. వీని యన్నిటి మిశ్రమలక్షణాలనుండి మనస్సుతోకూడిన మానవుఁ డుద్భవించినాఁడు"

ఎల్లప్పుడును విస్ఫులింగము జ్వాలను ఆశ్రయించుకొనియేయుండును. నిర్వాణలోకములో విస్ఫులింగము, జ్వాలనుండి విడివడి, ఆత్మబుద్ధి మనస్సుఁడుగా త్రిమూర్తిస్వరూపములో వ్యక్తమయినప్పుడు తురీయాత్మలో ప్రత్యేకవ్యక్తిత్వము

ప్రారంభమగును ; కాని జ్వాలాలక్షణాలైన వెలుగు, వేడి ఈవిస్ఫులింగము పొందుచునేయుండును. నిర్వాణలోకములో త్రిమూర్తిగా వ్యక్తమయిన తురీయాత్మ ఈశ్వరుని సూక్ష్మ రూపము ; అన్నివిధములను ఆయనను పోలిన ప్రతిమవంటి వాఁడు ; 115 వ పటములో ఈయనను నిర్వాణలోకములో చిన్న త్రిభుజముగా సూచించినాను.

ఈశ్వరునివలెనే తురీయాత్మకూడ ఆవేష్టనముచెందును. (involution) తురీయుని స్వస్థానమైన నిర్వాణలోకములో ఆయన త్రిమూర్తిగా వ్యవహరించును. ఆయన బుద్ధిలోకమునకు దిగుసరికి కొంతవఱకు పరిమితుఁడై ఆయనలోని 'ఆత్మ' భాగము లోపించును. అందువలన త్రిభుజములో ఒకభుజము బుద్ధిలోకములో లోపించినట్లు పటములో చూపఁబడినది. అట్లే మానసికలోకమునకు దిగుసరికి ఇంకను బంధితుఁడగును. ఒక్క మనస్సుమాత్రమే వ్యక్తమై ఆత్మబుద్ధిభాగములు లుప్తమగును. ఆయన తాను నియమించుకొన్న కారణశరీరమున మనస్స్వరూపములోనే కనపడును. ఇప్పుడు పటములో త్రిభుజములో ఒక్క భుజమే కనపఱిచినాను.

ఈ కారణశరీరములో నివసించు జీవాత్మ ఆవేష్టనము (involution) ఇప్పుడు ప్రారంభమగును. జీవాత్మ జన్మలు ఎత్తుటకు ఒకదాని తర్వాత నొకలోకమునకు దిగి, మానసిక, కామ, భౌతికశరీరము లొక్కొక్కటే ధరించునప్పుడు క్రమేపి ఎక్కువగా అతనిశక్తి పరిమితమగును.

జీవాత్మయొక్క తురీయాత్మయొక్క వేయేల ఈశ్వరుని యొక్క గూఢమైన శక్తులను అన్నిలోకములకు సంబంధించిన ఉపాధులద్వారా విడుదలచేయువిధానమే చైతన్యపరిణామము. జీవాత్మ తన ఉపాధులకు శిక్షణగఅప్పు విధానము ద్వారా చైతన్యమును విడుదలచేయు పద్ధతినిగూర్చి 6 వ అధ్యాయములో చెప్పియుంటిని. 53 వ పటము సాహాయ్యముతో ఈ విధానమును వివరించియున్నాను. జీవాత్మ ఉపాధులను తగినంతవఱకువశపఱుచుకొన్నతరువాతతాను మహాశ్వేత సోదరబృందమున ప్రవేశించినప్పుడు చైతన్యవిస్తరణలో తరువాత దశ ప్రారంభమగును. అప్పుడు ప్రథమతారకదీక్ష నొసంగు సమయములో బుద్ధిలోకముక్రింది ఉపలోకములో సంపూర్ణమైన చైతన్యముతో ఎట్లు వ్యవహరింపవలెనో నేర్పుదురు. అప్పుడే మొట్టమొదటిసారి స్వానుభవమువలన (కేవలము నమ్మకమువలనగాక) ప్రపంచములోని సకలజీవరాసులు, 'తాను' ఒకటే అనియు(ఆత్మవత్సర్వభూతాని)తనవిధి సర్వమానవకోటి విధితోదృఢముగాముడిపెట్టఁబడి యున్నదనియు, తెలియఁగలఁడు. ఇంతేకాకుండ, మానవకోటి యావత్తు తనలో భాగమనియు, బుద్ధిలోకమునకు దిగువనున్నలోకములలో 'నేను' 'నీవు'–'నాది' 'నీది' అనెడి భేదాలన్నియు కేవలము భ్రమ అనియు అతనికిప్పుడు ద్యోతకమగును. ఈ ఉన్నతమైన బుద్ధిలోకములో త్రిభుజములోని రెండుభుజములను స్వానుభవమువలన వ్యక్తముచేయఁగలఁడు.

ద్వితీయతృతీయచతుర్థతారకదీక్షలు పొందుసరికి అతని చైతన్యము ఎక్కువగా విస్తరించి బుద్ధిలోకమంతయు అతనికి వశముకాఁగలదు. 5 వ తారకదీక్ష అనఁగా 'అశైఖ దీక్ష' పొందుసరికి నిర్వాణలోకమున స్వేచ్ఛగా అతనిచైత న్యము పనిచేయఁగలదు. ఇప్పుడు తురీయాత్మ సంపూర్ణుఁ డగును. త్రిభుజము పూర్తిగా ఏర్పడును. యాత్రముగించు కొని కావలసిన పదార్థాల నన్నిటి వెంటఁబెట్టుకొని 'శాశ్వత యాత్రికుఁడు, సంతోషముతో స్వగృహానికి చేరఁగలిగినాఁడు.

"దిగువస్థానముల ఉన్న దేవతలు అతనిని చూచి ఓర్వలేరు. ఛిద్రమైన త్రిలోకాలు అతనిని కదపలేవు, అన్నిరకముల జీవితములు గడిపి అన్నిమరణములు మరణించి నాఁడు. కర్మము నూతనోపాధుల నతనికి నిర్మింపదు. అన్వేషణ మక్కఱలేకయే అన్నియు లభ్యమగును. స్వార్థమును త్యజించు విశ్వములో ఆత్మాభ్యుదయము జయమగును. నిర్వాణ మనఁగా సర్వనాశన మని ఎవరైనను అన్న శుద్ధఅబద్ధమని చెప్పు నిర్వాణ మన 'జీవించుట' అని ఎవరైన చెప్పిన అది పొరపాటని చెప్పుము. ఇది తెలిసికొనలేము. ఈ నిస్పృహామూలాన జీపితాల వెనుక వెలుగుచున్న జ్యోతినిగాని జీవమునకు కాలమునకు అతీతమైన ఆనంద మునుగాని, తెలియలేము" (ఆసియా జ్యోతి ఎనిమిదవ అధ్యాయము. ( The light of Asia Book VIII ).

ఈ జీవన్ముక్తస్థితిలో (Asekha-Adept) ప్రత్యక్షానుభవమువలన విస్ఫులింగమైన తాను అద్భుతములనెల్ల సద్భుత విషయమైన సంపూర్ణజ్యోతి లేక జ్వాలనని తురీయుఁడు తెలిసికొనును. ఇంతటినుండి అతను 'అభిషిక్తుఁడైన క్రీస్తాను' అగును. ఈశ్వరకిరీటమును ధరించి ఈశ్వరుని పుత్రునివలె లాభముకొఱకు యుద్ధరంగములోనికి దూకును.

ఈ నాఁటినుండి ఈశ్వరత్రిభుజముయొక్కయు, తురీయుని త్రిభుజముయొక్కయు ఆధారములు రెండు కలిసిపోవును. అనఁగా ఈశ్వరునిలోని మూఁడవమూర్తి అయిన బ్రహ్మతో స్పర్శకలుగును. అందువలనే క్రైస్తవసాంప్రదాయమున ఉదకముతో నొకసారి అగ్నితో నొకసారి దీక్షాస్నానములుచేయవలెను. 'జాన్' అను బాప్టిస్టు ఉదకముతో మాత్రమే దీక్షనీయఁగలఁడు; కాని 'క్రీస్తాను' ఒక్కరే అగ్నితోడను, పవిత్రాత్మతోడను దీక్షనీయఁగలరు. "నీకు పశ్చాత్తాపము కలుగుటకుగాను ఉదకదీక్ష నిచ్చి, పునీతుని చేయుచున్నాను. దీక్షనిచ్చుటకు నా తరవాత వచ్చువారి చెప్పులు మోయుటకుగూడ నా కర్హతలేదు. ఆయన నిన్ను అగ్నితోడను, పవిత్రాత్మతోడను దీక్షనిచ్చి పవిత్రుని చేయును". అని జాన్ మహాశయుఁడనెను.

తురీయాత్మ ఇట్లు అగ్నిదీక్ష పవిత్రాత్మదీక్ష పొందిన పిమ్మట విజయోత్సాహముతోడను, ఆత్మార్పణముతోడను "నా తండ్రి నన్ను తెలిసికొన్నరీతిని నేను నా తండ్రిని తెలియఁగలను. నేనే పునరుత్థానమును జీవమును

అయియున్నాను. మరణించినను నన్ను నమ్మినవారు సజీవులే. సజీవులై యుండి నన్ను నమ్మినవారికి మరణములేదు. ...... నా తండ్రి నేను ఒక్కటే" అని చెప్పఁగలఁడు.

ఇప్పుడు మనమూహింపఁజాలని మహోన్నతస్థితికే యాత్రికుఁడు వెళ్లును. అదే అనుపాదకలోకము. అచ్చట తన బుద్ధీంద్రియమును మహాత్రిభుజములోని బుద్ధితో ఐక్యమొనర్చును. ఆతర్వాత ఆదిలోకములో ప్రవేశించి భూతభవిష్యద్వర్తమానముల కతీతుఁడై మనకు పరమాత్మస్వరూపుఁడైన సూర్యమండలేశ్వరునితో తానైక్యమగును.

జీవాత్మ పరమాత్మలో చేరి దివ్యత్వము వడయుటను గూర్చి వివిధదృక్పథములనుండి తెలియవచ్చును. 116వ పటములో ఇంకొకవిధానమునుసూచించినాను. దీనిలోని మూలసూత్ర




(116 వ పటము)

మేమనఁగా మన చైతన్యముపై బాహ్యావిషయముల తాకిడి ఎట్లుండునోదానినిబట్టియే మనకు ప్రపంచమునుగుఱించిన జ్ఞాన వైఖరికూడ ఉండఁగలదు. భూర్భువస్సువర్లోకముల తాకిడివల్ల కలుగు ప్రతిస్పందములవలననే ప్రపంచమును మనము తెలిసి కొనఁగలుగుచున్నాము. ఆ ప్రతిస్పందనము లేక జవాబు అను దాని పద్ధతిమీఁదనే నొకవ్యక్తి చైతన్యవిస్తరణ ఆధార పడియున్నది. ముఖ్యముగా శీతోష్ణపీడనల తాకిడికి మాత్రమే జాతిలో సంచలనము కలుగును. కనుక దానికి భౌతికప్రపం చము మాత్రమే తెలియును. వృక్షవర్గములోనికి మాఱు సరికి కామలోకస్పందములైన ఇష్టానిష్టములకు నది చలిం చును; కావున పరిస్థితులకు అనుగుణముగా సర్దుకొనెడు సహజలక్షణము దానికున్నది. భువర్లోకజ్ఞానము కూడ దానికిఁగలదు. దానికున్న భువర్లోక జ్ఞానము మాత్ర మతిస్వల్పము. జంతుస్థితిలో సువర్లోకస్పందముల నది గ్రహింపఁగలదు; కావుననే దానికి ఆలోచనా భావనలు కలవు. దానికి భూర్భువస్సువర్లోకముల మూఁడింటి అనుభూతి కలదు. కాని దానికి సువర్లోకజ్ఞాన మతిస్వల్పము. మానవుఁడు మహర్లోకానుభూతికూడ పొందఁగలఁడు. కావున విశ్వముపట్ల ఉన్నతమైన ఉత్తమ మానసిక (మహర్లోకపు) లోకపు దృక్పథ మతనికిఁగలదు.

నీచకామలోకమున మానవుఁడు పశులక్షణాలైన కామక్రోధలోభమోహామదమాత్సర్యాల ద్వారా ఉద్రేక పూరితము చేయఁగలఁడు. మానవుని కామశరీరము

సున్నితమగుచున్న కొలఁది అతనికి దయ, ప్రేమ, భక్తి, సానుభూతి మొదలగు లక్షణములు అలవడి, అతని వ్యక్తిగత అవసరాలకు ఎక్కువగా నుపయోగపడినను ఉత్తమకామ లోకానుభవము నియ్యఁగలవు. ఆప్రకారమే మొత్తము మీఁద వస్తువులను గూర్చి మనకున్న అసంబద్ధభావనలు, ప్రత్యేకసంకల్పములకు స్థానమైన నీచమానసిక లోకమునకు సంబంధించినవై యున్నవి. ఎప్పుడు మన అభిప్రాయములను ఆలోచనలుగను, భావములుగను, విడదీసి వేర్వేఱు వర్గముల క్రింద ఏర్పాటుచేసి వానినుండి కొన్ని సూత్రములను కనిపెట్టఁ గలమో అప్పుడే మనము ఉత్తమమానసికలోకానుభవమును పొందుదుము. కారణశరీరముతో ఆలోచన చేయఁగలిగి నప్పుడు ప్రత్యేకసంకుచిత భావాల కతీతుఁడై తాత్త్వికుని లక్షణమైన విశాలవిశ్వదృక్పథముతో కూడిన మతతాత్త్విక శాస్త్ర కళాభావములు అతనికి స్ఫురించును.

శుద్ధమనస్సు ఉత్తమ లక్షణమునకు కూడ అతీతమైన ఒకగొప్పశక్తి లేక ప్రజ్ఞాన సాధనము కలదు. దానినే దివ్య జ్ఞానులు 'బుద్ధి' యనెదరు. ఈమాటను హిందూమత సార స్వతమునుండి తీసుకొనిరి. ఒకవస్తువును లేక విషయమును బాహ్యామునుండి పరిశీలించి గాక దానితో తాదాత్మ్య మునొంది దానిని 'జ్ఞాత' తెలుసుకొనుటయే 'బుద్ధియొక్క' ముఖ్యలక్షణము 'బుద్ధి' అను నదొకవిధమగు చైతన్యము. ఇది ప్రత్యేకము సంకల్పముగాని భావముగాని కాదు. ఈరెండింటి యొక్క మిశ్రమము కాదు ; ఇది ఈరెండింటికి అతీ

మైన ఒకవిధమైన వర్ణింప నలవికాని సచ్చిదానందము 'బుద్ధి' యొక్క పరిభావమునకు ఉత్తమమానసికలోకము లోపై నప్పుడు మనస్సు 'వస్తుధైక' లేక విశ్వభావములను గ్రహింపఁ గలదు. 'బుద్ధి' శక్తి పరిశుద్ధకామలోకస్వభావముపై ప్రతిబింబించినప్పుడు దాని ఫలముగా మానవునియందు కని కరముదయించును. 'బుద్ధి' ఒక దివ్యవాణి. విజానశాస్త్రము కన్న దీనివలన గలిగెడి జ్ఞాన మతినిర్దిష్టమైనది. భూత వర్త మాన విషయములనుబట్టియే గాక భవిష్యద్విషయములను కూడ గణనకు తీసికొని ఆలోచన చేయఁగలదు. ఈపరిస్థితిలో జ్ఞాతజ్ఞే, యములతో ఐక్యము కాఁగలదు. కావున ఇతని గ్రహింపు శక్తి ఉత్తమభావోద్రేకముకన్న ఎక్కువ కచ్చితముగ నుండఁగలదు. దీనినే హిందూవేదాంతులు 'ఆర్షబుద్ధి' అందురు. మునులకు ఋషులకు నుండు బుద్ధివికాస మిటిదే.

'బుద్ధి' అననేమో వర్ణించుటకు భాష ఉపయోగపడ నప్పుడు నిర్వాణలోకములో వ్యక్తమగు తురీయుని ప్రజ్ఞ నేలాగున వర్ణించుట ? ఏలాగున, శుద్ధసంకల్పము, శుద్ధభా వముకంటె బుద్ధివేలుగను అత్యద్భుతముగను నున్నదో అట్లే ఆత్మతత్త్వము బుద్ధికంటె మఱి అద్భుతమైనదని మాత్రము చెప్పిన సరిపోవును.

నిర్వాణలోకపుస్థాయికి మానవకోటి యావత్తు చేరిన ప్పుడే మానవజాతి సంస్కృతిపరిణామము సంపూర్ణమగును. కొద్దిమంది ప్రతిభాశాలుర కృషిద్వారాను, కళద్వారాను, బుద్ధిలోకానుభవమును (చూచాయఁగా) దృశ్యాదృశ్యముగా

సంపాదింపఁగలుగుటయే ఇంతవఱకు మానవజాతి సాధింపఁగలిగిన ఉత్కృష్టస్థితి. కళ అనఁగా కేవలము చిత్రలేఖనము, శిల్పము,సంగీతము మాత్రమే కాదు. ఎప్పుడు భక్తి, ప్రేమ, తత్త్వవిచారణ మొదలగునవి, బుద్ధిలోకమును స్పృశింపఁగలవో అప్పుడే సద్గుణములద్వారా కళ వ్యక్తమగును. కాని కళను మానవజాతి నిన్ననే కనిపెట్టినదా అనిపించును. శాశ్వతానందముకొలుపునట్టియు ఏదోఒకరోజుకు మాత్రమేగాక సర్వకాలములకు పనికివచ్చునట్లు సృష్టింపఁబడినట్టియు, అందమైనవస్తువులను రూపొందించు ఒకప్రత్యేకస్థానము మానవునిలోఁగలదు.

మతములోఁగాని, కళలోఁగాని, వేదాంతములోఁగాని, శాస్త్రములోఁగాని ప్రతిభాశాలి అయినవాని మనస్సు బుద్ధిలోకములో ప్రవేశించినప్పుడు అతను సృష్టించినదంతయు కళామయమై యుండును. ఇట్టి ప్రతిభావంతుఁడు విజ్ఞానశాస్త్రజ్ఞుఁడైనచో ప్రకృతివిషయములను తన అంతర్వాణిశక్తితో ఊహించి బహుస్పష్టముగను చమత్కారముగను నివేదింపఁగలఁడు ; అతఁడే తత్త్వవేత్త అయినచో తానొక సిద్ధాంతమును సృష్టించి ఆసిద్ధాంతములోని అల్పానల్పవిషయముల నన్నిటిని ఎంతో సానుభూతితో సున్నితముగ ఆలోచన చేసి వానినన్నిటికి ఒకవిధమైన అందమును ఏకత్వమునుకూర్చిపెట్టఁగలఁడు మహాగురువుల నీతిబోధలు, పరిశుద్ధమైన కళను వ్యక్తముచేయును. ఈబోధలలో ఇమిడియున్నధర్మనిరతియావత్తుమానవసమస్యలు పరిష్కరించుటకు పనికివచ్చును. ఇవి

అన్ని కాలములలోను, ఒక వినూత్నశోభతో కనపడుచు ఉండును

ప్రతికళాఖండములోను, అన్నిఖండాలలోని లక్షణాలు ఇమిడియున్నవి. ఒకచిత్రములో నీతిబోధ ఇమిడియున్నది. ఒకస్వరమేళనంలో తత్త్వము ఇమిడియున్నది. బుద్ధీంద్రియ దృష్ట్యా చూడ మత మొక విజ్ఞానశాస్త్రమువలె, కళ తత్త్వశాస్త్రమువలె కనపడుటయే గాక ఇవన్ని ప్రేమస్వరూపాలు అని తెలియుదుము. నీచమానసికలోకములోనే ఏకత్వము భిన్నత్వమగును. అప్పుడు ఒక ప్రత్యేకస్వరూపములో ఏకత్వమును దర్శింపలేనందున మానవుఁడు, ఈభిన్నరూపాలలోని అన్నిరూపాలు ఒకదాని నొకటి వ్యతిరేకించుచున్నట్లు కనపడును ; కాని బుద్ధీంద్రియము వికసించినప్పుడు ఆలోచనాపరుఁడు, ప్రేమమయుఁడు, కర్మవీరుఁడు అయిన మానవుఁడు తనలోనేతాను ఏకత్వమును బడయఁగలఁడు. ఈఏకత్వమును మానవుఁడు బుద్ధిలోకములో తప్ప క్రిందిలోకములలో వ్యక్తము చేయఁజాలడు.

కాలమును దేశమును ఊతగా తీసికొని మానవుఁడు ఈరెండింటికి అతీతమైన 'తత్' స్థితి పొందుటకొఱకు పాఠాలు నేర్చుకొనుచున్నాఁడు. ఇంతవఱకు మనకున్న ప్రజ్ఞానసాధనము, స్వజనాత్మకమైన కళ, కళయొక్క వివిధ ఛాయలు ఏ ప్రకారము ఒకదానితో నొకటి సంబంధించి యున్నవి అనునది తాత్త్విక సమస్యలలో నొకటి. అట్టి వివిధసంబంధముల లోను ఒకరకమునకు చెందినదానిని 117 వ పటములో




(117 వ పటము)

చూపినాను. ఉత్తమ సారస్వతములో ఉత్తేజకరమైన 'వాక్చిత్రములు', అనేక సంఘటనలను అభిప్రాయములను కళ్ళకుకట్టినట్లు నాటక పద్ధతిలో వర్ణించుట, మనకు కనపడును. కాలముయొక్క, స్థలముయొక్క విలువలను సారస్వతము వినియోగించు పద్ధతిని బట్టి కళ అభివృద్ధి చెందును. కాలమును వినియోగించుట ద్వారా నాటకమునకు దారితీయును. నాటకము పద్యరచనకు, పద్యరచన, దానిలో సహజముగా ఇమిడియున్న సంగీతలక్షణమును బట్టి సంగీతమునకు దారి తీయును.

దేశాన్ని వినియోగించుటద్వారా చిత్రకళ ఉద్భవించినది. సారస్వతములోని వాక్చిత్రము ఈచిత్రకళతో కొంత

వరకు ముడిపెట్టబడివున్నది. రెండు పరిమాణములనుమాత్రమే వినియోగించు చిత్రలేఖనము మూఁడు పరిమాణముల నుప యోగించు శిల్పముగ అభివృద్ధిచెందినది ; శిల్పవిద్య, కల్పనా వైచిత్ర్యము, సామరస్యముతో కూడిన వస్తునిర్మాణ శాస్త్రము అద్భుత కౌశలమునకు దారితీసినది. ఏదో ఒక కాలము లోనో లేక కాలములలోనో సంభవించిన సంఘటనలను అంశ ములను ఆధారముగా తీసికొని నాటకము రచియింపఁబడును. కాలమునకు సంబంధించిన నాటకమునకు, దేశానికి సంబం ధించిన చిత్రకళకు ఉండే సంబంధము తెలిసికొనుట ఎక్కువ కష్టమైన పనికాదు. శిల్పవిద్య మూగకావ్యము వంటిది. కావ్యమన్ననో, ఊహనుండి చిత్రముతరువాత చిత్రమును కౌశలముతో నిర్మించిన శిల్పము వంటిది. గొథే, లెస్సిం గులు (యూరపు దేశపు కవులు) 'నిర్మాణశిల్పము గడకట్టిన సంగీతము, (architecture is frozen music) అని చిత్రించి నారు. సంగీతమునకు నిర్మాణశిల్పమునకు గల సంబంధమును తెలియచేయు కిటుకు ఈ వర్ణనలో కలదు.

బుద్ధిలోకములో తురీయునికి తెలిసిన జీవితపువిలువలను పరిశుద్ధ కళాస్వరూపముల సాహాయ్యముతోనే మానవ చైత న్యము గ్రహించుటకు వీలగును. మానవులలో కళాస్వాదనా శక్తి ఈనాటికి కూడ శైశవదశలో ఉన్నది; కాని సోదరభా వము పెంపొందిన కొలఁది జీవితములో కళను ఆస్వాదించు శక్తి హెచ్చగును. ఇంకొకవిధముగా ఆలోచించిన కళాచాతు ర్యము హెచ్చగుచున్నకొలఁది సోదరభావమును సాధించు శక్తి ఎక్కువగుచుండును.

కళాసృష్టి అంతిమదశకు మనము వచ్చి ఉత్తమకళ కూడ వ్యక్తముచేయలేని మహత్తరమైన శక్త్యానుభూతులు మనకు కలుగుట ప్రారంభమైనప్పుడు, ఆత్మలోకములో తురీయుని లక్షణములను నిరూపించు సృష్టికలాపములను మనము తెలిసికొనఁగలుగుదుము. ఒకే ఒక కర్మప్రపంచము ఏర్పడునటుల భూలోకముతో నిర్వాణలోకవైభవమును ఎట్లు కలపుటసాధ్యము అనునది భవిష్యద్రహస్యానికి సంబంధించిన విషయము.

చైతన్యపరిణామమును పూర్తిగా అవగాహన చేసికొన్న భగవంతునిగూర్చిన రహస్యము అర్థము కాఁగలదు; కాని ఆయనయే జీవితసర్వస్వముగనుకను మనముకూడ భగవదంశసంభూతులముగనుకను చైత్యపథములో అభ్యుదయము చెందుచు తత్ఫలముగా, ఆయనను తెలిసికొనుట, ఆయన రూపమును క్రమక్రమముగా పొందుట కూడ జరుగును. కాని భగవంతుని తెలిసికొనుటలో మనలను మనము తెలిసికొనుచున్నాము. ప్రత్యంశములోను ఆయన సంపూర్ణముగా ఉన్నాఁడు అనునదే చైతన్యమునుగు ఱించిన రహస్యము దీనిని తెలియుట ఒకఎత్తు. 'ఇదే' అగుట ఇంకొకఎత్తు. మనము ఆయనవలె పనిచేయఁగలిగినప్పుడే ఆయన సంపూర్ణత్వము బడయుట సాధ్యము అనఁగా ఈశ్వరుఁడు అనంతమైన తన పరిధిలోఁగల యావన్మందిని ఎట్లు చూడఁగలఁడో అట్లే మనకు సంబంధించి మనచిన్నపరిధిలోనున్న యెల్లవారిని పూర్తిగాను స్వేచ్ఛగాను మనము చూడఁగలుగుటయే దీనికి

మార్గము. ఈశ్వరుని ఎప్పటికైనను పూర్తిగా అనుకరింపఁ గలుగుట మనకు సాధ్యముకాదు. అదే మనగమ్యస్థానము కాఁబట్టి మనము స్వతంత్రమైన జీవితములు గడుపుటకుగాను ఆయననుండి మనలను వేఱుచేసెను. ఆయన సంపూర్ణత్యాగ మయజీవితములో ఆయనతో కలిసి పనిచేయుటయే నిజముగ జీవితమునకు విలువచేకూర్చునని ఆయననుండి బయటకువచ్చి తిరిగి ఆయనలో ఐచ్ఛికముగ లీనమగుచున్న వారి దృఢాభిప్రాయము.



# 14 అధ్యాయము

## ప్రపంచాంతరంగిక పరిపాలకవర్గము

దివ్యజ్ఞాన' జిజ్ఞాస ' కలవారిని చకితునిచేయు సిద్ధాంతములలో ముఖ్యమైనది ప్రపంచమును పరిపాలించుచున్న ' ఆంతరంగికపరిపాలకవర్గము ' నుగూర్చిన విషయము. అన్ని యుగాలలోనుకూడ ప్రపంచాంతర్జాతీయజీవితము అనేకసందర్భాలలో లక్ష్యరహితముగా కనఁబడును. ఇదిగాక చారిత్రికులొకరు వ్రాసినట్లు చరిత్ర ( దేశములకుసంబంధించినది) అనునది మానవజాతిలో నుండెడి లోపాలయు, నేరాలయు, దురదృష్టాలయు జాబితాయే అని అనిపించును. సందేహాపూరిత మనస్కుఁడైన నేఁటి మానవునికి ప్రపంచములో జరుగు ప్రతిసంఘటన ఈశ్వరసంకల్పసిద్ధికి వినియోగపడు నట్లుఉద్దేశించి జరుపఁబడుచున్న దని నమ్మట చాలకష్టము. ఏదో దూరపు భవిష్యత్తులో ఒక లక్ష్యమును సాధించు ఉద్దేశముతోనే సృష్టి యావత్తు ముందునకు వెళ్ళుచున్న దను విషయమును స్థూలముగా మతదృష్టిగలవారు నమ్ముదురు. కాని ' ఆయన ఆజ్ఞలేనిదే ఒక పిచ్చుకకూడ రాలిపోదు ' అను విషయమును అక్షరాల నమ్మవలెనన్న అది హృదయానికి నచ్చవలసినదేగాని మనస్సునకు నచ్చుట కష్టము.

క్రీస్తుప్రభువు ప్రకటించిన ఇట్టి సిద్ధాంతముకంటె ప్రపంచములో ఇంకో అద్భుతవిషయ మేమియు నుండదు.

'ఆయన ఆజ్ఞ లేనిదే పిచ్చుక మరణింపదు' అను విషయము అక్షరాలా నిజము. ఏలయనఁగా పిచ్చుక చనిపోవును అనెడి విషయము ఆయనకు గుర్తునకు రాకుండ అది మరణించునప్పుడు దానిని తన ప్రేమపాశముతో బంధించి హాయిగా మృత్యుద్వారమున ఆనందసీమకుఁ గొనిపోకుండ ఒకపిచ్చుక కూడ మరణింపదు. సూర్యునిచుట్టును నిత్యమును తిరుగు మన గోళములోని ప్రతిసంఘటనను మహాత్ములు నడిపింతురు. ఈశ్వరప్రణాళిక ననుసరించి ఎప్పటి కేభాగము పూర్తికావలసియున్నదో అది నిర్వహించుటకుఁగాను మానవుల మంచి చెడ్డలు అన్నింటిని, అనఁగా వారి లోపాలను తప్పులను కష్టములనేకాక వీరత్వమును త్యాగమును స్వప్నమును కూడ, ఉపయోగింతురు.

ఆంతరంగిక పరిపాలకవర్గమునుగూర్చిన విశేషములన్నియు సనాతనగుప్తవిద్యలో (ancient mysteries) ఎంతో విలువఁగల రహస్యజ్ఞానముగా దాచి ఉంచబడినవి; కాని మానవజాతి త్వరితగతిని పురోగమించుటకు ఈనాఁడున్న అవకాశమును పురస్కరించుకొని ఈగుప్తవిద్యను వెల్లడి చేసినారు. ఇట్లు బహిర్గతము చేయఁబడిన విషయములను చాలమంది లెక్క చేయనేచేయరు; పెఁగాకొందఱుపహాస్యముకూడ చేయుదురు. కాని ఈజ్ఞానమువలన కొద్దిమంది జీవితములో నొక నూతనదృక్పథ ముదయించి "ఈశ్వరసంకల్పము పరిణామము"అనెడిసిద్ధాంతము నెఱ వేఱుటకు హృదయపూర్వకముగాను, నిజాయితీతోను పనిచేయుటకు దీక్షవహింతురు.

ఈ చివరివర్గానికి చెంది ఇదివఱలో హృదయానికి మాత్రమే నచ్చిన విషయాలు ఈనాఁడు శాస్త్రదృక్పథానికి కూడ సరిపోవునట్లు మనస్సునకు నచ్చచెప్పుటకు ప్రయత్నముచేయు వారికొఱకు దివ్యజ్ఞానసమాజముద్వారా గుప్తవిద్య చాల భాగము వెల్లడి చేయఁబడినది.

ఈగ్రంథములో ఎక్కువ ప్రాముఖ్యమిచ్చుచు వ్రాసిన విషయ మేమనఁగా, ప్రకృతిలోను, జీవితములోను, మానవ హృదయములోను సంభవించునదంతయు ఈశ్వరచైతన్యనిరూపణ మేయని, ఆయన చైతన్యము అంచలవారీగా బహిర్గత మగుచుండు నని, జీవచైతన్యముల ఉపాధులన్నియు పరిణామపు నిచ్చెనలోని మెట్లవలె ఒకదానితో నొకటి సంబంధము కలిగియున్నవని, ఇదివఱలోనే వ్రాసియున్నాను. ఆయన చైతన్యము అణువులలోను క్రిములలోను కూడ ఇమిడియున్నది; కాని 'ధ్యానచోహాన్'లోను, గ్రహమండలేశ్వరునిలోను ఆ చైతన్యము ఎక్కువగా వికాసముచెందినది. ఈ లోకములోని మానవులందఱిలోను ఆయన చైతన్యము ఇమిడి యున్నది; మన చిన్న సోదరులైన జంతువర్గముకంటె, మన మాయన చైతన్యము నెక్కువగ వ్యక్తము చేయుచున్నాము. మానవాతీతవర్గమునకు సంబంధించినవారు ఇదే ప్రకారము మానవునికంటె ఈశ్వరచైతన్యము నెక్కువగ వ్యక్తముచేయుచున్నారు. వీరే ప్రపంచముకొఱకు అంతరంగికపరిపాలకవర్గమును నిర్మాణముచేయుదురు.

సూర్యమండలములోని ప్రతిగోళములోను ఆగోళము నకు సంబంధించిన ఈశ్వరప్రణాళికను నడిపించుటకు ఈశ్వరుని మంత్రివర్గ మొకటి పనిచేయును. ఈ మంత్రివర్గమునే మహీపీఠ మందురు. పృథ్వీగోళమున కట్టి మహీపీఠ మొకటి యున్నది. దీనికి సంప్రదాయసిద్ధమైన పేర్ల నేకము లున్నవి. అందులో ఇప్పుడెక్కువ వాడుకలో నున్న పేరు 'మహాశ్వేత సోదరబృందము.' ఇది కేవలము మానవాతీతులసంఘము మాత్రమే కాదు ; ఈశ్వరుని చైతన్యముతో నిండియున్న సజీవప్రాణివంటిది. ఇది ఒక "మహాఘనతచెందిన ఉన్నతసంఘము"; అట్టి ఉన్నతసంఘాల కొక నమూనా వంటిది. ఇందలి ఉద్యోగస్థులు అహోరాత్రులు నిర్విరామముగా కృషి సాగించుచునే యుందురు. ఈ శ్వేతసోదరబృందము నకు చెందిన జీవన్ముక్తు లందరు వారి వారి అర్హతలనుబట్టి తమ ప్రత్యేక శాఖకు చెందిన పనిని నిర్వహింతురు.

ఈ 'మహాశ్వేతసోదరబృందము, ఈశ్వరుని చైతన్యముతో నిండియుండునని ఇప్పుడే చెప్పియున్నాను. అవ్యక్తముగనున్న ఈశ్వరుఁడు వ్యక్తమగు నప్పుడు ఏప్రకారము త్రిమూర్త్యాత్మకముగ పనిచేయునో ఆప్రకారము ఈశ్వర చైతన్యము ఆయన త్రివిధస్వభావముయొక్క, భూలోకము లోని ప్రతినిధులైన ముగ్గురు మంత్రులద్వారా ప్రవహించును. ఈ మంత్రులు ఆయన త్రివిధశక్తులు ప్రవహించుటకు కాలువలువలె పనిచేయుదురు. ప్రథమద్వితీయతృతీయ మూర్తులు, అనఁగా తండ్రి కొడుకు పవిత్రాత్మ, అనఁగా

సనాతనధర్మము ప్రకారము మహేశ్వరవిష్ణుబ్రహ్మలు త్రిభుజములోని మూఁడు భుజములు. పృథ్విపై ఈమహాత్రిభుజ ప్రతినిధి అయిన ఇంకనొక చిన్నత్రిభుజములోని భుజమువంటి వారు ముగ్గురు మహాత్ములు – వారే జగత్ప్రభువు, బోధిసత్త్వలు, మహాచోహాన్. ఇందులో మొదటి వారు మానవకోటినిమిత్తం ఈశ్వరుని శ్రీరా శక్తిని క్రిందికి తీసికొని వత్తురు. రెండవవారు ఈశ్వరుని జ్ఞానశక్తిప్రరసారమునకు కాలువ వంటివారు. వీరు మానవజాతిశ్రేయస్సుకొఱకు 'ప్రాయశ్చిత్తము లేక పాపపరిహారము' అను నొకరహస్యధర్మమును నెఱవేర్చెదరు. మూఁడవవారు ఆయనదివ్య మనస్సునకొక ప్రవాహమువలె పనిచేసి మూఁడవమూర్తి కార్యకలాపాలు వెల్లడిచేయుదురు.

ఈశ్వరుఁడు తన పని నిర్వహించునపుడు త్రిమూర్తిగా వ్యవహరించినప్పటికిని ఆయనలో అవ్యక్తముగా కొంత భాగముండును. ఇదేప్రకారము మన పృథ్విలోకానికి సంబంధించిన మహీపీఠత్రయముకూడ వ్యవహరించును. శాసించు చక్రవర్తి, ప్రణాళికను రూపొందించు ప్రధానమంత్రి. ఉత్తరువులను నెరవేర్చు సేనాపతి, ఈ ముగ్గురు మహనీయులే కాక వీరి వెనుక 'మానవద్రష్ట' ఒకరున్నారు. ఈ నాలుగవవారు వెనుకటి చక్రములో మన గోళమునకు జగత్ప్రభువుగా పనిచేసి వర్తమానచక్రములో మహీపీఠత్రయము వెనుకనుండి కనిపెట్టుచు మానవశ్రేయస్సుకొఱకు 'భగవత్ప్రణాళికానిర్వహణకొఱకు' మన మూహింపలేని ఎన్నో ఘనకార్యాలు చేయుచుందురు.

118 వ బొమ్మలో 'మహీపీఠము'లోని అధికారిక పురుషులను అంతస్థులవారీగా కనబఱిచితిమి. మహీపీఠమునకు సర్వాధికారి 'జగత్ప్రభువు'. ఈ గోళముపై మానవులకు దేవతలకు సంబంధించిన సంఘటనలన్నియు, వీరి ఆదేశాలకు ఆజ్ఞలకు లోబడియే జరుగును. మన పృథ్వీగోళములోని సప్త లోకములలోను జరుగు సంఘటనలన్నియు అదివఱకే ఆయన చైతన్యములో పొందుపఱిచి ఉంచినారు. ఆయన తేజస్సు పృథ్వీగోళమంతట వ్యాపించి యుండును. గాన ఆ తేజఃపరిధిలో జరుగు విషయము లన్ని ఆయనకు పూర్తిగా తెలియును. ఆయనకు తెలియని రహస్యముగాని, ఆయన గుర్తునకు రాని అన్యాయముగాని (ఎంత స్వల్పమైనదైనను) ఉండదు.

మహీపీఠములో 'చక్రవర్తి' పదవి వహించుచున్నవారు భూలోకమునుండి జీవన్ముక్తి పొందలేదు. ఆయన నిర్వహించుచున్న మహోన్నతపదవి పొందుటకు మన భూలోకమునుండి జీవన్ముక్తులైన వారికి అర్హతలేదు. ఆయన శుక్ర పరిణామవ్యూహములోనే జీవన్ముక్తులైనారు. పృథ్విపై జరుగవలసిన పరిణామవిధానమును నడిపించుటకొఱకు అఱువదిఅయిదులక్షల సంవత్సరాలక్రింద శుక్రవ్యూహమునుండి మనవ్యూహానికి విచ్చేసినారు. వారిచ్చుటకు వచ్చుసరికే చాంద్రచక్రకల్పమునుండి పృథ్వీచక్రకల్పమునకు మానవ జీవులు పంపఁబడిరి. ఆయన ఆజ్ఞ లేనిదే ఎవ్వరిని శ్వేతసోదర బృందములో చేర్చుకొనరు. దీక్షాసమయమందు, అభ్యర్థిని, మహాశ్వేతసోదరబృందములో ప్రవేశపెట్టినట్లు అంగీకార

## మహాశ్వేత సోదర బృందము

| జ్ఞానదీక్షలు | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| దశమ | మౌనద్రష్ట | | | | | | |
| నవమ | జగత్ప్రభువు | | | | | | |
| అష్టమ | ప్రత్యేకబుద్ధ | బుద్ధ | | | | | |
| సప్తమ | మనువు | బోధిసత్త్వ | మ | హా | చౌ | హా | న్ |
| షష్ఠమ | చౌహాన్ | చౌహాన్ | చౌహాన్ | చౌహాన్ | చౌహాన్ | చౌహాన్ | చౌహాన్ |
| పంచమ | అశేఖ(ముక్త) | అశేఖ(ముక్త) | అశేఖ(ముక్త) | అశేఖ(ముక్త) | అశేఖ(ముక్త) | అశేఖ(ముక్త) | అశేఖ(ముక్త) |
| చతుర్థ | ప్రధమరశ్మి | ద్వితీయరశ్మి | తృతీయరశ్మి | చతుర్ధరశ్మి | పంచమరశ్మి | షష్ఠమరశ్మి | సప్తమరశ్మి |
| తృతీయ | | | | | | | |
| ద్వితీయ | | | | | | | |
| ప్రధమ | | | | | | | |

(118 వ పటము)

సూచకముగ 'చక్రివర్తి' తారక దీక్షనిచ్చు గురువర్యుల శిరస్సుపై నొక్కసారి మెఱయును. సనాతనధర్మములో మహీపీఠచక్రివర్తిని 'సనత్కుమారులు' (నిత్యయౌవనులు) అని అందురు. వారు ధరించునది భౌతికశరీరమైనను వారు అయోనిజులు. వారి శరీరము క్రియాశక్తితో నిర్మాణము చేయబడినందున జరావస్థ నెన్నఁడు పొందదు. ఆయన ఎల్లప్పుడు పదునారేండ్ల యువకునివలె నుందురు. ఈశ్వరుని ఇచ్ఛాశక్తియే సనత్కుమారుని రూపము ధరించినది. ఆయన ప్రేమ, సముద్రమువలె, బహువిస్తారమైనది.

ఆయన చుట్టును భూతముల కధిపతులైన నలుగురు ఉత్తమ దేవరాజులు కొలువు తీర్చి ఉందురు, వీరే మానవుల కర్మలను చక్కపెట్టుచుందురు. గొప్ప గొప్ప దేవతలందఱు వీరి కొలువుకూటమునకు చెందియుండి వీరి ఆజ్ఞకు బద్ధులై పనిచేయుచుందురు. నిస్స్వార్థసేవాపరాయణత్వము వల్ల సనత్కుమారుల ఆశీర్వాదబలముపొందిన పృథ్వీపతులందఱకు అగోచరమగు 'వారసత్వ' రీత్యా ఒక నిగూఢమైన దైవబలము సంక్రమించును. ఇంగ్లాండు దేశపు చక్రివర్తి పట్టాభిషేక సమయములో ఆయన వామహస్తములో ఒక చిన్న గోళము, దక్షిణహస్తములో రాజదండము ఉంచెదరు. ఇది 'చక్రవర్తి' సనత్కుమారులవారినుండి వచ్చిన సనాతనమైన సంప్రదాయమునకు చెందిన స్మృతిచిహ్నము. పృథ్వీగోళము మన దృష్టిలో ఎంత పెద్దదైనను 'సనత్కుమారచక్రివర్తి' అఱచేతిలో ఇమిడియుండును. అందువలననే వారి

ఎఱుక లేనిది ఒక పిచ్చుక కూడ మరణింపదు అనునది పూర్తిగా నిజమని స్పష్టమగును.

ఆయన శుక్రమండలమునుండి వచ్చునప్పుడు ఆయనతో కూడ ముగ్గురు శిష్యులు లేక సహచరులు వచ్చిరి. వారిని హిందూ సంప్రదాయప్రకారము సనందనసనక సనాతను లని అందురు. వీరందరిని (సనత్కుమారులతో సహా) బ్రహ్మమానసపుత్రులని, జ్యోతిష్పతులని అనెదరు. ఈ నలుగురు జ్యోతిష్పతులు శాశ్వతజ్ఞానమునకు శిరస్సు, హృదయము, ఆత్మ, బీజము వంటివారు. జీవతరంగము భూమినుండి బుధగ్రహము పైకి వెళ్ళుసరికి ఈ ముగ్గురు ఒకరి తరువాత నొకరు బుధగ్రహానికి ప్రభువులై అచ్చటి పరిణామము నంతను నడిపించెదరు. వీరినే బౌద్ధమతములో 'ప్రత్యేక బుద్ధులు' అని అనెదరు. వీరు ప్రపంచములో మతములు, స్థాపించుటగాని, బోధించుటగాని చేయరు. వీరు 'ప్రథమ రేఖ' లేక 'పరిపాలన రేఖ' కు సంబంధించిన వారు. కాని 'బుద్ధు' లందరును 'ద్వితీయ రేఖ' అయిన 'బోధన రేఖకు' సంబంధించినవారు. ఈ ముగ్గురు జగద్గురువులపాత్రల నిర్వహింపరు; కాని బుద్ధులతో సమస్థాయిలో నుందురు. వీరిని అందుకనియే బౌద్ధమతస్థులు, అపార్థానికి దారి తీయునట్లు 'ప్రత్యేక లేక స్వార్థబుద్ధులు' అని అందురు. బుద్ధభగవానునితో పాటు వీరి ప్రేమ కూడ అపారమైనదే. వీరు మానవులకు ప్రసారము చేయునది శక్తిగాని జ్ఞానముకాదు.

ఈపృథ్విపై ద్వితీయ రేఖకు సంబంధించిన వారుపొందే మహోత్కృష్టమైన దీక్ష 'బుద్ధదీక్ష'. అనేకయుగాల నుండిచేయుచున్న మానవసేవకు బోధిసత్త్వులవారో,జగద్గురు వరేణ్యులో ఈదీక్షను పొందడమనునది వారు నిర్వహించిన కార్యములకు మకుటాయమానముగా పరిగణించెదరు. వీరు ఎన్నో మతములు స్థాపించిన తరువాత వారి కడసారి జీవితములో, వివిధ దీక్షలను పొందుటకు సంసిద్ధులైన శిష్యులను పోగుచేసి వారితో సహా భూలోకములో జన్మమెత్తుదురు. ఆ విధముగా భూలోకములో అవతరించి సర్వప్రపంచమునకు అనువగు నొకమహోత్కృష్టమగు ఏకైకమతమును ప్రసాదించి భౌతికశరీరమునకు సంబంధించినంత వఱకు తమ పనిని పూర్తి చేసికొని ఇంతకంటె ఘనమైన కార్యమును నిర్వహించుటకు ఇతర లోకములకు వెళ్లెదరు. ఆయన మానవజాతిని విడిచి వెళ్లునప్పుడు 'జగద్గురువు' పదవి నికొంకరికప్పచెప్పి నిష్క్రమింతురు. బుద్ధపరంపరలలో కడపటి వారు 'గౌతమ బుద్ధులు'. వీరి తరవాత 'బుద్ధపదవి'ని ప్రస్తుతము బోధిసత్త్వులుగానున్న మైత్రేయ ప్రభువు నిర్వహింతురు. ఈపదవి స్వీకరించుటకుముందే సాంప్రదాయము ప్రకారము వీరినే 'మైత్రేయబుద్ధులు' అని అందురు.

మిగతా 'అయిదురేఖలలో'ను అనఁగా తృతీయరేఖ మొదలు సప్తమరేఖవఱకు సంబంధించిన వారిలో మానవుల కువీలున్న ఉన్నతదీక్ష 'మహాచోహాన్' దీక్ష. ఈదీక్ష పొంది తత్పదవిని ఎవరో ఒక్క మహాత్ముఁడే నిర్వహించును. ఏయు

గములో ఏ రేఖకు గాని ఏఉపరేఖకుగాని ప్రభావము హెచ్చుగ నుండునో, అట్టి వానికి సంబంధించిన ఒకమహాత్ముఁడు 'మహాచోహన్' పదవి నలంకరించును. ఈయనయే ప్రపంచపరిణామ విధానములకు సంబంధించిన లేఖ్యముల రక్షకుఁడు (keeper of the records). ప్రణాళికను దశలవారీగా అభివృద్ధి చేయుటలో 'శ్వేతసోదరబృందమువారు' నిర్వహించు కార్యకలాపాలను నడిపించుచు ఆపేక్షించుచు నుండెదరు. వీరికి "భవిష్యత్తు" అంతయు కన్నులకు కట్టినట్లు గోచరించుచు ఉండును.

ప్రథమ రేఖకు చెందిన జీవన్ముక్తుఁడు సప్తమదీక్ష నీయఁబడిన తరువాత బహు ప్రయాసకరమైన విధులతో కూడియున్న 'మూలజాతి మనువు' యొక్క పదవిని స్వీకరించును. వారు పదవిలో ప్రవేశించినప్పటినుండియు ఆనూతన మూలజాతిలోను దాని ఉపజాతులలోను పని చేయుటకు అర్హులైన జీవులను నెమ్మదిగా ఎంచుకొనెదరు. లక్షలాది సంవత్సరములు చరిత్రతో నిండిన ఒకమూలజాతి కాలములో వివిధములైన మార్పులతో ఒక ఉపజాతి తరువాత నింకొక ఉపజాతి నిర్మాణము వేయుచు ఆఉపజాతికి సరియైన పద్ధతిని రూపొందించుటకుగాను ఒక్కొక్క ఉపజాతిలో తాను జన్మ ఎత్తుచుండును. ఈపనిని జయప్రదముగా నిర్వహించిన మీఁద 'అష్టమదీక్ష' అయిన 'ప్రత్యేకబుద్ధ' దీక్ష నొందుటకు అర్హత సంపాదించును. అనేకయుగములట్లు గడచిన పిమ్మట జగత్ప్రభువుగ నవమదీక్ష పొందెదరు. గతించిన 'మనువు' లలో

ఇద్దరుమాత్రమే ఇంకను మానవజాతితో నిలిచి యున్నారు. పదిలక్షల సంవత్సరములకిత్రము నాల్గవ మూలజాతిని స్థాపించిన 'చాక్షుష' మనువు, ఆఱువదివేల సంవత్సరాలకిత్రము ఆర్యన్ మూలజాతిని (అయిదవమూలజాతి) స్థాపించిన 'వైవస్వత'మనువు ఇప్పటికిని ఉన్నారు.

118 వ పటమును పరిశీలించినచో అన్నిరేఖలపైన 'అశేఖదీక్ష'నొందిన జీవన్ముక్తులున్నట్లు తేలును. ఈ స్థాయికి వచ్చిన తరువాత జీవన్ముక్తునికి భవిష్యత్కార్యనిర్వహణ కొఱకు ఏడు మార్గములు కలవు. అందులో ఏదైన ఒకమార్గ మెంచుకొనవచ్చును. మానవజాతితోనే కలిసి పనిచేయుటకు నిశ్చయించుకొన్నచో అట్లుచేసి కొంతకాలమైనపిదప ఆఱవ తారకదీక్ష తీసికొనును. ఈస్థితిలో కూడ మానవజాతికి సంబంధించిన పని మానివేసి ఇంకోమార్గము నిర్ణయించుకొనవచ్చును. కాని ఈపనినే సాగించుటకు నిశ్చయించుకొన్నచో 'సప్తమదీక్ష' పొందుటకు అర్హత సంపాదించి 'మనువు' లేక 'బోధిసత్వులు' లేక 'మహాచోహాన్' పదవి నిర్వహింపవచ్చును. ఒక్కవిషయముమాత్రము స్పష్టముగా తెలిసికో వలసియున్నది. సప్తమదీక్ష పొందినయెల్లవారికి పైమూఁడు పదవులు రానేరవు. ఒకే కాలమందు ఎవరో ఒక్కరే ఒక్కొక్క పదవిని నిర్వహింతురు. మిగిలినవారు ఈశ్వర సంకల్పసిద్ధికి ఉపయోగించు ఇతరమార్గములలో పనిచేయుచుందురు. ఇందులో 'మహాచోహాన్' పదవి నిర్వహించిన వారు ఆ పదవినుండి విరమించిన పిదప తిరిగి తమ భావికార్య

క్రమము నిర్ణయించుకొనవలసియున్నది. ఇప్పుడుకూడ మానవ జాతి అభివృద్ధికే పనిచేయుటకు నిశ్చయించుకొన్నచో 'అష్టమ' దీక్ష పొందుటకుఁగాను ప్రథమ లేక ద్వితీయ రేఖ లోనికి వీరు మారవలసియున్నది. అటులనే 'బుద్ధ' పదవిలో నున్న మహాత్ముఁడింకను మహీపీఠములోనే ఉండవలెనని నిశ్చయము చేసికొన్నయెడల 'ప్రథమరేఖ' లోకి మార్చుకొని 'నవమతారక' దీక్ష పొందవలసియున్నది.

'అశేఖ' దీక్షకు మించిన దీక్షలు పొందినవారు, మానవ జాతిని విడిచి వెళ్లినవారు, ఏ రేఖకు సంబంధించిన జీవన్ముక్తులైనను అట్టి ఉన్నతదీక్ష లీగోళముపై తీసికొనుటకు తగిన అర్హత సంపాదింపనప్పుడు ఇతరత్ర అట్టిదీక్షలు తీసికొనవచ్చును. ఒక రేఖకన్న ఇంకొకరేఖకు ఎక్కువగొప్పతనమేమియు లేదు. అన్ని రేఖలపైన అన్ని దీక్షలు తీసికొనవచ్చును. కాని ఒక 'ప్రపంచములో' ముగ్గురు 'జగత్ప్రభువులు', సప్త 'మనువులు', సప్తబోధిసత్త్వులు, కొంతమంది 'మహాచోహాన్లు' మాత్రమే కావలసియున్నందున దీక్షలు తీసికొన్న మహాత్ములందఱకు ఈ పదవులు లభింపవు, కావున 'అశేఖ' దీక్ష తీసికొన్న పిదప చాలమంది నిర్వాణములో ప్రవేశించి మానవ జాతితో సంపర్కములేని ఇతర కార్యములలో నిమగ్నులయ్యెదరు.

దృశ్యాదృశ్య ప్రపంచములలోని పనినంతను 'మహాశ్వేతసోదర బృందములోని' జీవన్ముక్తులు నడిపించెదరు. ఈశ్వరుఁడు తన అధికారమును, జ్ఞానమును, ప్రేమను ఈమహాత్ము

లకు దత్తము చేయును. వారు, ఈశ్వరశక్తిని మానవానసర ములకు సంబంధించిన ప్రతిశాఖకు అనఁగా మతతత్త్వ శాస్త్రకళావ్యాపారాభ్యుదయ శాఖలన్నింటికి పంచి ఇచ్చె దరు. వీనినన్నిటికి ప్రోత్సాహమిచ్చి నడిపించెదరు. వీరు మాన వుల మధ్యమున అవతారమెత్తి గాని లేదా అదృశ్యముగా ఉండిగాని మానవులను, దేశములను చతురంగపు బల్ల పైన కాయలవలె ఎత్తులు వేయుచు నడిపించి ఏలాగున అయిన ఈశ్వర ప్రణాళికతో మానవులు సహకరించునట్లు చేయుటకు పాటుపడుచుండెదరు ; కాని మానవులు తఱచు కనపఱచెడి అనిష్టత వలన వీరి పని కెక్కువ ఆటంకము కలుగుచుండును. కాని మానవులను బలవంతపెట్టి వారి మార్గమునకు త్రిప్పు కొనుట మహాత్ముల కిష్టము లేనందున అపారమైన ఓపికతో శ్రమపడుచు మానవుల మంచిచెడ్డలు రెండింటిని అనంతమైన ప్రేమతో అర్థము చేసికొనుచు వారికి ఉత్సాహముకలుగఁ జేయుచు అందఱను నడిపించెదరు.

మహాశ్వేతసోదరబృందమువారి శాశ్వతహస్తములు మానవజాతిచుట్టు ఒక కవచమువలె నుండెదవు. వారు ప్రణాళికను పూర్తిచేయుటకు శ్రమపడుచుండగా మానవ జాతికి మొత్తముమీఁద అపజయమెన్నఁడు కలుగదు. మన వలెనే వారును ఒకానొకప్పుడు పాపులై లోపాలతోనిండి యుండియు ఈనాఁడు సంపూర్ణత్వము పొందియున్నందున మనముకూడ ఒకనాఁడు వారి వలె జీవన్ముక్తులము కాఁగ లమను ఆశాభావము, సత్యమైనదే కాని కలమాత్రము కాదు.

వారి ప్రేమయే మనకు సౌఖ్యము చేకూర్పగలదు. వారి బలమే మనకు శాంతిని, ముక్తిని ప్రసాదించును. నిత్యము వారి సేవలో నిమగ్నులమైననాఁడు ప్రతివస్తువు 'సత్యం, శివం, సుందరం' అనునవి ధ్యేయముగా పెట్టుకొని పురోగమించు చున్నవను నిశ్చయ బుద్ధి మనకు కలుగును. వారి వలన స్వీకరింపఁబడి వారి చేతి క్రింద పని చేయుటకు మనలను వారి సిబ్బందిలో చేర్చుకొన్ననాఁడు మనము మోక్షమార్గములో అడుగుపెట్టినట్లు ఎంచుకొనవచ్చును.



# 15 అధ్యాయము

## శిష్య పథము

సనాతనజ్ఞానము మహత్తరమైన పరిణామప్రణాళికను అన్వేషకుని కన్నుల కట్టినట్లు బహిర్గతపఱుచుచుండఁగా అందులో కొందరు ఆప్రణాళికకొఱకు ఆత్మార్పణ చేసికొనుదు మని ఎంతో ఆవేదనతో ఆతురతతో తహతహలాడుచుందురు. అట్టి స్వర్గతుల్యమైన దృశ్యమును వీక్షించిన తరువాత ప్రాపంచికవిషయములయందలి రుచి నశించును. అప్పటి నుండి ఆప్రణాళికకు అంకితమై పోయి ఏవిధమైన దాపరికము లేకుండ సేవ, భక్తి, వైరాగ్యములే ఆదర్శముగా పెట్టుకొని జీవితము గడుపును. స్వర్గసీమయందుండు విశాల చైతన్యమును భూలోకములో వ్యక్తపఱుచుటయనునది మానవునిలోని ఉత్కృష్టమైన భావము. ఆదర్శ విషయమును దర్శించుటవలన దానిని పొందు అవకాశము ఎక్కువగును; ఏలయన మానవునిలోనే మార్గము జీవము సత్యము ఉన్నవి. మానవుని ఆత్మలో ప్రకాశించుచున్న వెలుగు చూచుటకుఁగాను ఆతని నిద్రనుండి మేలుకొల్పుట అవసరము.

అట్లు ఆతని మేలుకొల్పుటలో అనేకదశలు గలవు. అతనిలోని ఈశ్వరాంశ మఖండజ్యోతిగా ప్రకాశింపవలెనన్నచో మానవుఁడు అన్నివిధములగు సంస్కృతుల ప్రభావమునకు గుఱికావలసియున్నది. సుదీర్ఘమగు జీవుని చైతన్య

పరిణామచరిత్రలో ఒక ఘట్టానికి వచ్చుసరికి, స్వార్థసంకుచిత లక్షణాలు నశించి పరోపకారచింతన స్పష్టముగా గోచరించు స్థితి వచ్చును. ఆస్థితికివచ్చిన మానవుని, ఆదర్శజీవి అందురు. అట్టి ఉన్నతస్థితికి వచ్చినతరువాతకూడ ఆ ఆదర్శమునుండి, ఎప్పుడైనను తాత్కాలికముగా అనుకోనితలంపుగా దిగజారుట కూడ సంభవింపవచ్చు. ఎంతబాధకైనను ఎంతనష్టానికైనను ఓర్చుకొని ఆ ఆదర్శముమాత్రము ఎప్పటికి పూర్తిగా విడిచిపెట్టడు.

ఈస్థితిలో అతని ఆధ్యాత్మికజీవితమును తీర్చి దిద్ది అతనికి మార్గదర్శకుడుగనుండి అతనికిఁగల ఉన్నతాదర్శము త్వరలో సిద్ధించునిమిత్తము ఒక మహాత్ముడు అతనిలో ప్రవేశించును. ఆమహాత్ముడే జ్ఞానగురువు (పరమగురువు). వారిని 'ఈశ్వరతుల్యుఁడైన పిత లేక గురువు' (Father in God) అని కూడ అందురు. అట్టిజీవి తన జన్మపరంపరలలో,

| శిష్యపథములోని వివిధ దశలు |
| --- |
| జ్ఞానదీక్ష పొందినవాఁడు |
| గురుపుత్రుఁడు |
| స్వీకృతశిష్యుఁడు |
| పరీక్ష్యమాణావస్థ |
| ఆదర్శపురుషుఁడు |

(119 వ పటము)

ఆదర్శజీవితము గడుపుటకుగాను పడినకష్టాలు, సలిపినపోరా టము ఈ మహాత్ముఁడు చూచుచునే ఉండును. అయినప్పటికి ఈ జన్మలోమాత్రమే ఈతని శిష్యునిగా స్వీకరించుటకు నిశ్చ యించి అతనితో ఒక ఒడంబడిక 'పరమగురువు' ఏర్పాటు చేసుకొనును.

'ఆదర్శమానవుఁడు' మొదలు శ్వేతసోదరబృంద ములో జేరుటకుతగిన 'ప్రథమదీక్ష' పొందువఱకుఁ గల శిష్య పథములోని వివిధదశలు 119 వ పటములో చూపఁబడినవి. అందులో మొదటిదశ 'పరీక్ష్యమాణావస్థ' (probationary period) అనఁగా నొకమహాత్ముఁడు సాధకుని 'అంతేవాసి'గా శిక్షణపొందుమని నియమించుట. ఈ సంస్కారము భౌతిక లోకములోను లేక కామలోకస్థాయిలోను జరుగును. సాధారణముగా కామలోకస్థాయిలోనే జరుగును. 'పరమ గురువు' ఆజ్ఞప్రకారము ఒకపెద్దశిష్యుఁడు అభ్యర్థిని వారి వద్దకు తీసికొనివెళ్లగా పరమగురువు నాఅభ్యర్థిని 'అంతేవాసి' (probationer) గాఁ జేర్చుకొనును. ఇదేసమయమందు ఆ అభ్యర్థి 'సజీవప్రతిమ' (living image) ను 'పరమగురువు' నిర్మించును. ఎట్లనఁగా పరమగురువు తమ ఇచ్ఛాశక్తితో అభ్యర్థి కామమానసికశరీరముల నకలు నొకదానిని రూపొం దించి దానికి జీవము పోయును. ఈ సజీవప్రతిమను పరమ గురువుల సన్నిధానములోనే ఉంచుదురు. ఒక ఆకర్షణశక్తి ఈ ప్రతిమతో, అభ్యర్థిని కలుపును. తత్కారణముగా శిష్యునిలోకలుగు ఆలోచనలు, భావనలు ఈ ప్రతిమలో స్పష్ట ముగా ఉల్లేఖింపఁబడును. పరమగురు వీ 'సజీవప్రతిమ'ను

ప్రతిదినము పరిశీలించి అభ్యర్థి ఎంతవఱకు జయాపజయములు పొందుచున్నాఁడో తెలిసికొనుచుండును. ఆయన ఈవిషయ పరిశీలన న్యాయాధికారి హోదాలో జరుపుటలేదు, అని వేఱ చెప్పనక్కఱలేదు. అవసరము వెంబడిని ఈ 'సజీవప్రతిమ' ద్వారా అభ్యర్థి స్వీకరింపఁగలిగినంతబలము, పరిశుద్ధభావము ప్రసారము చేయుదురు.

సాధారణమానవుడు పరిణామము చెందు 'పిపీలికా' మార్గములోఁగాక, విహంగమార్గమున పరిణామముపొందెడి అవకాశమును ప్రసాదింపు మని తనంతట తాను 'మానవ సంరక్షకులైన, 'పరమగురువులను' అడిగినమీఁదటనే వా రతనిని 'పరీక్ష్యమాణావస్థ'లో చేర్చి 'అంతేవాసిగ' గ్రహింతురు. ఇట్లు చేర్చుకొన్నకారణముగా ఇతని కర్మములో కొన్నిసర్దుబాట్లు చేయుదురు. ఇట్లు సర్దుబాట్లు చేయుటలోఁగల ఉద్దేశము లేమనఁగా

(1) ఇత నెక్కువ ఉపయోగపడకుండ చేసి ఇతని అభ్యుదయానికి ఆటంకముగా ఉన్నకర్మముల బారినుండి ఇతనిని తప్పించుట (2) ప్రకృతిరహస్యాలను ఛేదించుటకు తగిన విస్తృతమైన జ్ఞానమును పొందుటకు వీలైన అవకాశములు కలుగఁజేయుట (3) సేవ ద్వారా ఆత్మవికాసమునొందుటకు తగిన నూతన మార్గములను సూచించుట.

ఈ 'పరీక్ష్యమాణావస్థ' కాలములో అభ్యర్థి, తన కర్మము యొక్క తీవ్రమైన తాకిడిని తట్టుకొని ఉదారతను కోల్పో

కుండా ఎట్లుండఁగలఁడో పరీక్షించిచూతురు. సాధారణముగా మానవులకు ఆనందోత్సాహాలను కలిగించెడి భోగాలకు సౌఖ్యాలకు దూరమైన జీవితములోని రసము తగ్గినట్లు కనపడి నప్పటికి పరమగురువులు ఏర్పాటుచేసిన ప్రణాళికను సక్రమముగా నెఱవేర్చుటకు తగినరీతిని సర్దుకొని పనిచేయఁగలఁడా లేఁడా అని కూడ పరీక్షించి చూతురు. ఈశ్వరప్రణాళికలో కొంతభాగము తనపై పెట్టుకొని తాను నిర్వహించుటకు నిశ్చయించుకొన్న వివిధకార్యకలాపాలను ప్రతిపరమగురువు వానియన్నిటికినాయకత్వమువహించుచు వాని మధ్యముననుండి నడిపించును. 'పరీక్ష్యమాణావస్థ' కాలములో జ్ఞానసముపార్జన కంటె గురువుతో సహకరించి పనిచేయుటకొఱకు 'అంతేవాసి'గనుండి శిక్షణపొందుట ఎక్కువ ముఖ్యము. కావున అభ్యర్థులు పరమగురువులుచేయుపనులను, నిర్వహించు అర్హత కలుగుటకుఁగాను అవసరమైన తమవిధానాలను మార్చుకోవలసియుండును. తోడి అభ్యర్థులతో పూర్తిగా సహకరించి పని చేయుటకు అలవాటుపడవలెను. పనులు ఏలాగో నిర్వహించి సంతృప్తిపడుటకన్న ఆదర్శముగా వానిని నిర్వహించితీరవలెనను విషయానికి తా నెక్కువ విలువ నిచ్చుచున్నట్లు అభ్యర్థి ఋజువు చేయవలెను.

'పరీక్ష్యమాణావస్థ'లో ఒకఅభ్యర్థికి ప్రవేశ మిచ్చినప్పుడు, ఆ జన్మలోనే అతనికి ప్రథమతారకదీక్ష నిచ్చు నుద్దేశము వారికుండును. అంతమాత్రాన అభ్యర్థి తప్పకుండ జయముపొందఁగలఁడని చెప్పుటకు వీలులేదు. అతని కట్టి

సదవకాశము లభించుట కొకహక్కు ఏర్పడిన దని అనవచ్చును. కాని అట్టి హక్కును సక్రమముగా వినియోగించుకొను బాధ్యత అభ్యర్థిదే కావున అతను పరమగురువుల పెద్దశిష్యుల సలహాల ననుసరించి ఖచ్చితముగ ప్రవర్తించినచో జయముపొందుటకు ఎక్కువఅవకాశమున్నది.

ప్రథమతారకదీక్షకు తగిన అర్హతలను సంపాదించుటకు గాను తీవ్రముగా సాధనసలిపినయెడల అతనిలో సహజముగా నున్న సద్భావము, అతనికి వెలుగు, బలమునిచ్చి సహాయపడును. ఈ సాధనకు కావలసిన యోగ్యతల వివరాలు 120 పటములో కనపఱిచితిని. 'పరమగురుచరణసన్నిధి'

## సాధన చతుష్టయము

(దీక్షపొందుటకు అర్హతలు)

1. సదసద్వస్తు వివేకము
2. ఇహాముత్రార్థఫలభోగవిరాగము
3. శమదమాది షట్సంపత్తి
   1. శమము (మనోనిగ్రహము)
   2. దమము (ఇంద్రియనిగ్రహము)
   3. తితీక్ష (సహనము)
   4. ఉపరతి (సంతోషము)
   5. సమాధానము (ఏకాగ్రత)
   6. శ్రద్ధ (విశ్వాసము)
4. ముముక్షత్వము = ప్రేమ.

(120 వ పటము)

అను చిన్నగ్రంథమునుండి తీసి పొందుపరచినాను. ఆగ్రంథ మును రచించిన 'కృష్ణమూర్తి'ని తారకదీక్ష నిచ్చుటకు తయారుచేసిన సందర్భములో పరమగురువు ఆయనకు బోధించిన విషయాలను తనవ్యాఖ్యానసహితముగ, (గ్రంథములలో కెల్ల మకుటమనదగు), నీచిన్నగ్రంథములో కృష్ణాజీ పొందుపఱిచియుంచిరి. పరమగురువుల నన్వేషించుచున్న ప్రత్యభ్యర్థి ఈపుస్తకమును చదివి అర్థముచేసికొని ఆప్రకారము జీవితము గడుపుటకు ప్రయత్నము చేయవలెను.

ఈలాగున ఏడు సంవత్సరములకాలము పరమగురువుల పరీక్షలకు గుఱియై తట్టుకొని జీవితముగడిపి వారిదృష్టిలో భగవంతునిపట్ల, మానవులపట్ల స్వార్థరహితముగ సంచరింపం గలడని తోచినచో అప్పుడు పరమగురువు అభ్యర్థిని తన శిష్యునిగస్వీకరించును. ఈ స్థితిలో వీనిని 'స్వీకృతశిష్యుడు' (accepted disciple) అందురు. 'పరీక్ష్యమాణావస్థలో' తయారుచేయఁబడ్డ 'సజీవప్రతిమ' ఇప్పుడు కరిగిపోయి గురు శిష్యులమధ్యమున ఒకనూతనాంతరంగికబంధ మేర్పడును ఒకవేళ శిష్యుని లోపమువలన ఈబంధము తాత్కాలికముగ తెగిపోయినప్పటికి భావి జన్మములలో పరమగురువులవద్దకు తనను నిత్యము లాగుచున్నట్లు అనిపించుచుండును.

వారు 'స్వీకృతశిష్యు'ని కొక దివ్యానుభూతిని ప్రసాదింతురు. అట్టి అనుభూతివలన శిష్యునికి తాను చేయుపనిలో ఉత్సాహమెక్కువగును. తనకున్న అనుభవమునుబట్టి ఏదైన విషయములో కచ్చితమైన తీర్మానమునకు శిష్యుడు రాలే

నప్పుడు అట్టి విషయములో పరమగురువుల అభిప్రాయమును బట్టి తన అభిప్రాయమును సరిదిద్దుకొనుశక్తి కలుగును. ఇట్టి శక్తి, శిష్యుఁడు తన చైతన్యమును పరమగురువుల చైతన్యస్థాయికి అందుకొనునట్లు ఒక్కక్షణము పెంచఁగలిగిననాఁడు నచ్చును. వ్యక్తిగతమైన దురభిమానముల బంధమునుండి విముక్తిపొందిననాఁడు, తన విపరీతాభిప్రాయములబారినుండి రక్షించుకోఁగలిగిననాఁడు, తన గురువర్యుల భావమునుబట్టి తన అభిప్రాయములను సరిదిద్దుకోఁగలశక్తి శిష్యునికి కలుగును. పరమగురువుపేరుతో మానవాభ్యుదయముకొఱకు చేయుకార్యమువలన, ఎక్కువగఉపయోగించు విషయమునకు, తక్కువగ ఉపయోగించు విషయమునకు, ఎక్కువ సహాయకారిగనుండెడు విషయమునకు, తక్కువసహాయకారిగనుండెడు విషయమునకుఁ గలభేదమును గ్రహించు విచక్షణాశక్తి కలుగును,

'పరీక్ష్యమాణావస్థ'లోఁ జేర్చుకోఁబడిన కొందఱభ్యర్థులు ఏడుసంవత్సరములు గడపనక్కఱలేకుండ, ఒక్కసంవత్సరములోపునే 'స్వీకృతశిష్యులు' కాఁగలరు. కాని అట్టి అదృష్టవంతులు బహుస్వల్పసంఖ్యాకులు మాత్రమే ఉందురు. ఇంతత్వరగా వీరిని శిష్యులుగ స్వీకరించుటకు కారణము, వీరు, తమ పూర్వజన్మలలోసంపాదించిన పుణ్యఫలమే. దీనివలన ఇతరులకులేని బలము ఆవకాశము వీరికి ఉండును. 'పరీక్ష్యమాణావస్థ' కాలములో దశాక్రమముగా పరిణామము జరుగును. ఈదశల మధ్యమున ఎంతకాలము గడపవలెనన్నది

అభ్యర్థి సామర్థ్యోపజ్ఞలపైన ఆధారపడి యుండును. అతను కృతనిశ్చయుఁడై శక్తిమంతుఁడైనచో వరుసగా ఆటంకముల నన్నింటిని అధిగమించి త్వరగా యోగమార్గమున ప్రవేశింపఁ గలఁడు ; కాని సదవకాశముల నన్నిటిని పోఁగొట్టుకొన్నచో ఒకేదశలో అనేకసంవత్సరాలు గడపవలసియుండును. పరమ గురువులు మాత్రము శిష్యుల మధ్యమున ఏవిధమైన తేడా చూపరు. అందఱకు ఒకేమాదిరి ప్రోత్సాహమిచ్చెదరు. కాని ఎవరి స్వశక్తినిబట్టి వారు ఆ అవకాశమును వినియోగించుకొందురు.

'గురుపుత్రుని'గా స్వీకరించినప్పటినుండి గురుశిష్యుల మధ్యమున సన్నిహితత్వము మఱింత ఎక్కువగును. పరమ గురువు తనతోడిసభ్యులతో గడుపు అద్భుతజీవితమును, శిష్యుని ఆశయాలు, కలలు క్రమక్రమముగా ఎక్కువగా ప్రతిబింబించును. నెమ్మదినెమ్మదిగా శిష్యుఁడు తన గురువుశరీరములో తా నొక జీవకణమువలెను, అతని చైతన్యములో ఒక కిరణమువలెను అగును. గురుదేవు లిప్పుడతనిఉపయోగనిమిత్త మపారమైన జ్ఞానమును ప్రసాదింతురు. అతనికి చెందని ఎంతోజ్ఞాన మతనిసొమ్మగును.

ఇంతటినుండి శిష్యుఁడింకెన్నటికి ఏకాకికాఁడు, కాలేఁడు; సంతోషములోను దుఃఖములోను వెలుగులోను చీకటిలోను, ఒక్కొక్కప్పుడు శిష్యుని కా మహత్తరవిషయము తెలియకుండగనే వారిమహాచైతన్యము శిష్యునిచైతన్యమును కప్పివేయును. ఇప్పుడు తాను తనగురుదేవుని పథకము నిమిత్తము

పనిచేయునపుడు ప్రపంచమతనిని మెచ్చుకొన్నను లేక నిందించినను ఆపనిచేసినది తా నొక్కఁడుమాత్రము కాదనియు, తనతోపాటు తనప్రక్కనుండి గురుదేవుఁడుకూడ ఆపనివిషయమై శ్రమపడుచున్నాఁడను ధైర్యముండును.

" ఆయన ఇచ్చు ఆదేశాలు మానవులనుకొన్నంత కష్టమైనవికావు. ఆయన నాకు బలమును ప్రసాదించుచు ఎక్కడికి నన్ను పంపినను లెక్క చేయను. ఎక్కడికి ఎప్పుడు వెళ్లి పనిచేయుమన్నను సిద్ధమే. ఆయన పనిమీఁద వెళ్లినప్పుడు ( నాపనికాదు ) నే నొక్కడనే వెళ్లను."

పరీక్ష్యమాణావస్థమొదలు ప్రథమతారకదీక్షపర్యంతము గల ప్రతిదశలోను శిష్యునిప్రవేశపెట్టినప్పుడు 'మహాచోహన్'వారి, సమక్షానికి గురుదేవుఁడు శిష్యుని తీసికొని వెళ్లు ఆచారము కలదు. 'మహాచోహన్'వారు మహీపీఠ లేఖ్యము లన్నింటిని జాగ్రత్తపెట్టెదరు. వారివద్దనున్న శాశ్వతలేఖ్యములలో ఈ నూతనశిష్యునిపేరు, హోదా మొదలగు వివరములన్ని పొందుపఱుతురు.

సాధారణముగా 'గురుపుత్రుని'గా స్వీకరించుట, ప్రథమతారకదీక్షనిమిత్తము శిష్యుని హాజరుపెట్టుట, ఒకే సారి జరుగును. వారి సమక్షములోనికి తీసికొనిరాఁబడ్డ శిష్యుఁడు తాను గడుపుజీవితమువల్ల, ఆదర్శాలవల్ల తన సత్కర్మదుష్కర్మల నడుమను సాధించిన సమతవల్ల తాను మహోఘనత చెందిన శ్వేతసోదరబృందగుప్తజీవితములో పాల్గొ

నుటకు వారి శక్తులను ప్రపంచానికి ప్రసారము చేయుటకు కాలువగనుండుటకు అర్హతకలిగియున్నాఁడని ఆశిష్యుని గురుదేవుఁడు శ్వేతసోదరబృందమువారి యెదుట రూఢిగా చెప్పును. తనగురుదేవుఁడేగాక శ్వేతసోదరబృందానికి చెందిన ఇంకొక పరమగురువుకూడ ఈశిష్యుని అభ్యర్థిత్వమును బలపఱుపవలసియున్నది. మొట్టమొదట అభ్యర్థిని 'మహాచోహాన్' వారి ఎదుట హాజరుపఱిచెదరు. అప్పుడు వారు శ్వేతసోదరబృందములోని ఇంకొకసభ్యుని దీక్షాచార్యునిగ నియమింతురు. దీక్షామందిరములోనో లేదా దీనికొఱకు నియమింపఁబడిన ప్రత్యేకమందిరములోనో వైభవోపేతమైన సంస్కారముతో అభ్యర్థికి ప్రథమతారకదీక్ష యొసఁగఁబడును. ఇదే నూతనజీవితాని కొక నాంది. ఈనాఁటినుండి దేహాత్మ రానురాను జీవాత్మకు ప్రతిగా మాత్రమే యుండును. జీవాత్మ తన తురీయాత్మనుండి శక్తులను గ్రహించుట ప్రారంభించును.

నిజముగా మానవాత్మ తన ఉన్నతస్వరూపమైన 'తురీయాత్మ'యే. కాని వ్యక్తీకరణసమయములో, జంతుసమూహాత్మనుండి కారణశరీరమును 'తురీయుఁడు' నిర్మించుకొన్న క్షణమునుండి విస్ఫులింగము, జ్యోతినుండి, ఘోహాత్ సూక్ష్మాతిసూక్ష్మమైన సూత్రమును ఆధారముగా తీసికొని వ్రేలాడుచునుండును. ఆప్రకారముగా జీవాత్మ తురీయునితో సంబంధము కలిగియున్నప్పటికి ప్రథమతారకదీక్ష పొందువఱకు తురీయుని నుండి జీవాత్మకు సమాచారమందునట్టి ఏ లేమియునుండదు. దీక్షాసమయములో అచార్యుని ఆజ్ఞప్రకారము ప్రమాణము

స్వీకరించు సమయానికి 'తురీయాత్మ' కారణశరీరములోనికి దిగును. ఆ క్షణమునుండి ఘోహాత్ యొక్క బహుసూక్ష్మాతి సూక్ష్మమైన సూత్రము, ఒక సూత్రములపోగు అగును. అప్పుడు జీవాత్మ ఒక విస్ఫులింగమువలె మాత్రము వ్రేలాడుటకు బదులుగా తురీయాత్మవఱకు వ్యాపించిన ఒక పొగ గొట్టము మాదిరి సూత్రములప్రోగులో చివరిభాగముగనుండి, తురీయునినుండి జీవము, వెలుగు, బలము దిగువకు ప్రసారము చేయుచుండును. ఆనాఁటినుండి దీక్షితునకు ఇదివఱలో లేని సత్త్వము, నిరోధశక్తి కలుగును. అందువలన నొక పర్వతమువలె తనలో దృఢమైన స్థిరత్వమును పొందఁగలుగును.

ప్రథమదీక్ష నిచ్చినపిదప, అభ్యర్థిని అతనిగురుదేవుఁడో లేక అనుభవముకలిగిన పెద్దశిష్యుఁడో, బుద్ధిశరీరములో పని చేయువిధానమును నేర్పుటకొఱకు బుద్ధిలోకమునకు తీసికొని వెళ్లును. అనఁగా కారణశరీశమును వదలి పైకి పోవలెను. అప్పుడు ఇదివరలో కలగని నూతనానుభూతి కలుగును. ఇదివరలో ఈ అభ్యర్థి ప్రతిరాత్రి కామమానసికలోకములలో పనిచేయుటకు వెళ్లినప్పుడు భౌతికశరీరమునో లేక భౌతిక కామశరీరములనో పడకపై వదలిపెట్టువాఁడు. పని అయిన తరువాత తిరిగివచ్చి వానిని ధరించువాఁడు. ఇప్పుడుత్తమ మానసికలోకమునుండి బుద్ధిలోకమునకు వెళ్లినప్పుడు, కారణ శరీరమును తప్పక వదలవలసియున్నది. కాని ఈ కారణ శరీరము మాత్రము భౌతికకామమానసికశరీరములవలె వదలిన చోట ఉండదు. జీవాత్మ దానిని విడిచివెళ్లిపోవుటతోడనే

కారణశరీరము అంతర్ధానమగును. బుద్ధిలోకమునుండి ఉత్తమ మానసికలోకమువైపు చూడ కారణశరీరము కనపడదు. కాని క్రిందకు వచ్చినప్పుడు తిరిగి కారణశరీరములో ప్రవేశించును. కాని ఈకారణశరీరముమాత్రము తాను, వ్యక్తీకరణ మొందినదిమొదలు లక్షలాది సంవత్సరాలు తన ఆక్రమణలో ఉన్నది కాదు. ఇది, అసలు కారణశరీరముయొక్క నకలు మాత్రమే.

ఈ అనుభవమువలన శిష్యుఁడు తాను జీవాత్మమాత్రమే కాదనియు అంతకన్న అతీతుఁడ ననియు తెలిసికొనఁగలఁడు. ఏజీవాత్మను తానింతవఱకు నమ్మి అంటిపెట్టుకొనియున్నాఁడో, అదికూడ తాను కానని ప్రత్యక్షముగా తెలిసికొనును. ఆజీవాత్మను తానే తన ఉపయోగముకొఱకు, ఎన్నో బాధ లనుభవించి సృష్టించుకొన్నాఁడు. అట్లు సృష్టించుకొని, తాను పరిణమించుచు, తెలివితేటలు ఎక్కువైనకొద్ది ఆజీవాత్మను సాధనముగా చేసికొని దాని కతీతమైనస్థితిని పొందుటయే అతని ఉద్దేశము. ప్రాణికోటి అంతయు ఒక్కటే అనియు మానవకోటిసుఖదుఃఖాలు జయాపజయాలు కూడ తనవే అనియు అవన్ని తననుండి విడదీయుటకు వీలులేని తనలోని భాగము లనియు బుద్ధిలోకానుభవమువలన ఇదివఱలోవలె కేవలము నమ్మకముమీఁదనే ఆధారపడుటగాక ప్రత్యక్షానుభూతివలన తెలిసికొనును. ఆనాఁటినుండి అతని దృక్పథములోనే ఒకమార్పు వచ్చును. ఇంతవఱకు స్వప్రయోజనమును కొలఁతబద్దగాను 'అహం'ను కేంద్రముగాను పెట్టుకొని పని

చేసిన వ్యక్తి 'అనాధదీనమానవసంఘు' అవసరాలే గీటురాయిగా పెట్టుకొని పనిచేయును.

దీక్షాసమయమందు ఆత్మ 'ప్రవాహములోకి' దిగును. (121 వ పటము) దీక్షితుని (Initiate) జీవితములో కలుగు గొప్పమార్పును సూచించు భౌద్ధవాఙ్మయములోని వాక్యమిది. ఈశ్వరేచ్ఛ అను మహాప్రవాహములో దిగును. పృథ్వీచక్రకల్పములో 5 వ చక్రములో పరీక్షాదినమునకు పూర్వము మానవులలో అధికసంఖ్యాకులు ఈశ్వరప్రణాళికను అనుసరింతురనియు అట్లనుసరింపని సోమరివ్యక్తులు పరీక్షాదినము తరువాత అనర్హులుగా ఎంచఁబడి పరిణామమునుండి జారిపోదురనియు ఈశ్వరేచ్ఛఅయివున్నది. కాని అట్లు జారిపోయినవారు శాశ్వతముగా అట్లుండిపోరు. ఒకయుగముమాత్రమట్లుండి జారిపోయినప్పటిస్థితినుండి తిరిగి పరిణామము చెందుట ప్రారంభింతురు.

## మోక్షమార్గ దశలు

5 అశేఖ=ముక్త=గురువు
4 అర్హత=పరమహంస=పూజ్యులు
3 అనగామి=హంస=తిరిగి జన్మలేదు
2 సకృదగామి=బహూదక=ఒక్క జన్మమాత్రమే
1 శ్రోతపన్న=పరివ్రాజక=ప్రవాహమున కెదురీత

(121 వ పటము)

క్రైస్తవులు, మతేతరులందరు 'శాశ్వతనరకము' అను భవింతురని అనేకిదాని అరము ఇదే. ఇది నిజముగా నిరసింపఁ బడుటకానేకాదు. తమతోడివారితో కలిసివెళ్లలేక సోమరి పోతులై జారిపోయినవారికొఱకు ఏర్పాటుచేయఁబడ్డ పరి ణామవిధానము యిది. ఈనీచస్థితి శాశ్వతముకాదు. మొదట గ్రీకుభాషలో వ్రాయఁబడ్డ 'నూతనసువార్త'లోనున్నట్లు ఈస్థితి ఉండునది ఒకయుగకాలము మాత్రమే (aeonion). ఒకసారి ప్రవాహములోనికి దిగినవాఁడు నెమ్మదిఁగానో త్వరగానో సురక్షితముగా నిర్వాణముపొందఁగలఁడు. పృథ్వీచక్రములో మానవుల చరమలక్ష్యము ఇదే. అందుకనియే ప్రథమదీక్ష పొందినవారిని బౌద్ధవాఙ్మయములో 'స్రోతపన్నా' (ప్రవాహ ములో దిగినవాఁడు) అని అందురు. సాధారణముగ ప్రథమ చతుర్థతారకదీక్షలమధ్యములో ఏడు జన్మల నెత్తవలసియుం డును. ఆలాగుననే 'అర్హత' స్థితినుండి 'అశేఖ'దీక్షపొందు లోపల తగిన పవిత్రత సంపాదించుటకు. సాధనచేయుటకు ఏడు జన్మలుకావలెను. ఒకదీక్షనుండి పైదీక్షకు వెళ్లుసరికి చైతన్యవికాస మెక్కువగుచుండును. కాఁబట్టి ఇట్టి వికాసము పొందుకొఱకు తగిన అనుభవము, శిక్షణ కావలసియున్నది. ఈపనినంతను నెఱవేర్చుటకు కొందరు ఏడు జన్మలకాలము పూర్తిగా తీసికొందురు. కాని తక్కువకాలములో ఈపని పూర్తిచేయఁగలిగినవారు కూడఁ కొందరుందురు. ఇదంతయు ఆవ్యక్తి సంచితకర్మముమీఁద ఆధారపడియుండును. (అనఁగా పూర్వజన్మలలో ఆయన చేసినపని దానివలనపొందఁగలిగిన

శక్తి, పవిత్రతల, అభివృద్ధి) కాని 'ప్రవాహములో దిగి' ఎల్లరు ఆవలియొడ్డు అనెడి ఆనందమయమైన 'నిర్వాణ'ము తప్పక చేరఁగలరు.

ఈ పవిత్రమార్గములో ఒకమజిలీనుండి పైమజిలీకిఁ జేరుసరికి వారి కెప్పటికప్పటికి ఇతోధికమైన చైతన్యవికాసము కలుగుటయేగాక, పరమగురువులు, నూతనమైన జ్ఞానమును, శక్తులను, కూడ ప్రసాదింతురు. ఒకదీక్షనుండి తరువాతదీక్షకు పురోగమింపవలెనన్న మానవసంఘమునకు చేసిన సేవను గూర్చిన లేఖ్యమును సమర్పించుట, కొన్ని ప్రత్యేక నైతిక మానసికలోపములనుండి విడుదలఅగుట కొన్ని అధ్యాత్మిక శక్తులను కలిగిఉండుట కూడ అవసరము. ప్రథమదీక్ష మొదలు, పంచమదీక్షపొందులోపల అభ్యర్థి పది శృంఖలము లను త్రెంపివేయవలెను. ప్రథమతారకదీక్ష పొందినతరువాత, ద్వితీయతారకదీక్ష పొందులోపల ఆయన పై చెప్పిన లేఖ్యము ను సమర్పించుచు మూఁడు శృంఖలములను త్రెంపివేసినట్లు ఋజువుచేయవలె. బౌద్ధ వాఙ్మయప్రకారము వానిని (1) సకాయదిత్తి (స్వకాయదృష్టి) (2) విచికిచ్ఛ (విచికిత్స) (3) సిలబ్బతపరమాసా (శీలావృతపరామర్శ).

'సకాయదిత్తి' అనఁగా 'నేను' ఎవరు అనువిషయ మునుగూర్చిన భ్రాంతి. అధికసంఖ్యాకులు 'నేను' అనఁగా భౌతికశరీర మనియే అనుకొందురు. దాని కోరికలతోడను దురాశలతోడను, ఆరోగ్యానారోగ్యములతోడను దాని చావుబ్రతుకులతోడను చాలమంది ఐక్యభావము చెందుదురు.

ఇంతకన్న స్వల్పముగా అభ్యుదయము చెందినవారు తమ చిత్త వృత్తితోడను, తమ నమ్మకములతోడను, తమ మతభావముల తోడను, కళాభిరుచులతోడను, తమకున్న ప్రత్యేకాభిమాన వ్యతిరేకవిషయములతోడను ఏకీభావము కనపఱుతురు. విజ్ఞులు, వివేకులు, పక్షపాతరహిత దృక్పథముగలిగినవారు తమ శరీరముల పోకడలు, భావములు, తమ చుట్టు నున్న వాతావరణమునుబట్టి అనఁగా మత కుల జాతిలింగ పరిభావములనుబట్టి ఒకనాఁడు తనకొఱకు తయారుచేయఁబడి తాను ధరించిన వస్త్రములేగాని తాముమాత్రము అవి కావని గ్రహింతురు. ఉన్నతాదర్శాలుగల కొద్దిమంది మహానుభావులు తప్ప తక్కినవారందరు తాను, తక్కిన మానవులు వేఱనియే సహజముగా తలంతురు.

ఇట్టి భ్రమనుండి తప్పించుకొనవలెననిన 'ఆత్మ' అనఁగా ఏమిటో తెలిసికొనవలె. 'ఆత్మ' జీవకోటియావత్తునకు హృదయమువంటిది. దానిమంచి, దానిలాభము, సర్వులమంచి, లాభము, పైన ఆధారపడియున్నది. ప్రథమదీక్ష నిచ్చుట తోడనే అనుభవజ్ఞుఁడైన పెద్దశిష్యుఁడు బుద్ధిలోకములోనికి తీసికొనిపెళ్లినప్పుడు అంతవఱకు ఎన్నో యుగాలనుండి ఉన్న కారణశరీరము అంతర్థానమైనన్పుడు కలిగిన ప్రయోగానుభవములవల్ల దీక్షితునకు తనలోని నిజమైన 'ఆత్మ' అన ఏమిటో బోధపడును. అప్పుడే ఈ ఆత్మకు జాతిమతకుల భేదములనునవి లేవనిస్పష్టముగా తెలియును.

రెండవది యగు 'విచికిచ్ఛ' అనఁగా అనుమానము లేక శంక. ఈశ్వరగ ప్రణాళికపట్లనుండు అనుమానము. అందు లోనుప్రత్యేకించిమానవుఁడు కర్మసూత్రముద్వారా జన్మపరంపరలద్వారా పరిణామము చెందునసెడి విషయమునుగూర్చిన అనుమానము. ఈ అనుమానములో అనేకదశలు కలవు. సంపూర్ణమైన అపనమ్మకము మొదలు, దీనిప్రయోగము నిమిత్తము ప్రాతిపదికగా అంగీకరించుటవఱకు కూడ అనుమానము క్రిందకే వచ్చును. ఈ ప్రాతిపదికమీఁద ఆధారపడి ఆచరణలో బహుయోగ్యమైన జీవితములు గడిపినవారనేకులు కలరు. ఆచరణలో పెట్టుటకొఱకు ఆధారముగతీసికొన్న ఉన్నతాదర్శము మానవుని, తారకదీక్షలద్వారమున తీసికొని వెళ్లఁగలదు. ఈనాఁడు ఆచరణలో పెట్టిన కొన్నిసూత్రాలు కొన్నాళ్లకు, తనలో, లోతుగా ఎక్కడనో ఒకమూల దాగియున్నవిషయములే యనియు, అవి స్వానుభవమువలన, బాహ్యపరిశీలనవలన, తనలో భాగములనియు, వాస్తవముగ సత్యములనియు ద్యోతకమగును. కావున, రెండవ తారకదీక్షకు అర్హుఁడగుటకు మానవపరిణామమును నడిపించుచున్న మూలసత్యములపట్లనుండు, అనుమానము పూర్తిగా రద్దు కావలసియున్నది.

'సిలబ్బత్తపరమాసా' (శీలావృతపరామర్శ) అనునది మూఁడవ శృంఖలము. 'పూర్వాసంస్కారములపై ఆధారపడుట అని దీనియర్థము. క్రీస్తుమహాశయుఁడు పాలస్తీనాలో "సబ్బతు (ఆదివారవిరామదినము) మానవునికొఱకు ఏర్పాటు

చేయఁబడినవిగాని, మానవుఁడు సబ్బతుకొఱకు సృష్టింపఁబడ లేదు. కావున ఈశ్వరపుత్రుఁడు సబ్బతునకు కూడ ప్రభువు” అన్నాఁడు. బుద్ధభగవానుఁడు నుడివిన 'సిలబ్బతపరమాసా' కూడ ఇట్టిదే. ప్రత్యేకము పూజలమీఁద వ్రతాలమీఁద సంస్కారాలమీఁద ఆధారపడుట కేవలము మూఢసాంప్రదాయము, మూఢవిశ్వాసము అయియున్నది. జ్ఞాని అయిన వాఁడు ఈ మూఢత్వము త్యజింపవలె. ఈసంస్కారములు అనునవి శాస్త్రపద్ధతిని తయారుచేసినచో నవియు ఒకవిధమైన యంత్రమువలె రూపొందును. ఇవి శక్తిని ప్రసారముచేయును. లేదా సామర్థ్యమును నిలవచేయును. కాని ఇవి మానవుని ఆజ్ఞననుసరించి నడచుకొవలసినవే కాని, మానవునిపై అధికారము చలాయించి తమవశములో పెట్టుకొనుట పనికిరాదు. సంస్కారములపట్ల మనకుండవలసిన దృక్పథమిదే.

మనప్రవర్తన తీర్చిదిద్దుటకుఁగాని, ఈశ్వరునితో సహకరించిపనిచేయుటకుఁగాని, సంస్కారముల ఆవశ్యకత అంతగా లేదు ; కాని కొన్ని రకాలమనుష్యులలో భగవద్భక్తి పురికొల్పి వారిని పరవశులను చేయుట కుపకరింపవచ్చు, కాని సంస్కారాలతోఁగాని, పౌరోహిత్యాలతోఁగాని నిమిత్తము లేకుండ ఎవరంతటవారు అవలంబించెడి తీవ్రమైన సాధనాభ్యాసములవలన ఈశ్వరానుసంధానము బడయవచ్చు. ఉత్తమ పురుషులయు, మానవాతీతులయు, సలహాలు, మార్గదర్శకత్వము, మానవునిలో ఉన్నతదృక్పథము, విశాలదూరదృష్టి కలుగఁజేయుటకు మాత్రమే ఉపయోగపడును. కాని వీరె

వ్వారును మానవుని మోక్షమార్గమున నడిపించుటకుగాని, ముక్తి ప్రసాదించుటకుగాని ఉపయోగపడరు. మానవుఁడు తనకుతానై రక్షించుకోవలె. 'మార్గము, సత్యము, జీవము' తనలోనేయున్నవనియు, బయట లేవనియు స్పష్టముగా గ్రహింప గలిగిననాఁడే మూఁడవ శృంఖలమును త్యజించివేయఁగలఁడు.

శిష్యుఁ డెప్పుడు ఈ మూఁడు శృంఖలములనుండి వదలించుకొని తాను చేయవలసినపని నంతను నిర్వహించునో అప్పుడు పరమగురువు శిష్యునికి రెండవ దీక్షనిచ్చుటకొఱకు హాజరుపెట్టును. వెనుకటివలెనే తిరిగి ఒకవైభవోపేతమైన సంస్కారము జరుగును. ఈసంస్కారము నడిపించు ఆచార్య పురోహితుఁడు దీక్ష నిచ్చెడిసమయములో అభ్యర్థి చైతన్యములో నూతనఅవకాశములను కల్పించి దాని కనుగుణమైన రహస్యజ్ఞానమును, శక్తినిప్రసాదింతురు. ద్వితీయ తారకదీక్ష పొందిన శిష్యుని 'సకదగామ' (అనఁగా ఇంకొకజన్మమాత్రమే గలవాఁడు) అందురు. ఇంక నొక్కసారిమాత్రమే భౌతికశరీరములో జన్మఎత్తును. ఆ జన్మ పూర్తిఅయినతరువాత అతని కిష్టమైనచో తిరిగి జన్మ ఎత్తనవసరము లేకుండ మిగిలిన దీక్షలన్నియు పొందవచ్చును.

మూఁడవ దీక్ష పొందవలెననిన క్రొత్తమనశ్శక్తి నలవఱచుకొనుటయేగాక చేసినసేవాకార్యముల జాబితా సుదీర్ఘముగ నుండవలె. ద్వితీయ తృతీయదీక్షల మధ్యకాలములో ఛేదింపవలసిన శృంఖలములేవియు లేవు. కాని శుద్ధమనస్సు, బుద్ధీంద్రియవికాసజ్ఞానమునకు దర్శనము కావలె. మనస్సు

కని పెట్టలేని సత్యములను శుద్ధమనస్సు, బుద్ధీంద్రియసాహాయ్యముతో ఊహించి వివరాలలోసహా తెలిసికోవలెను.

శుద్ధమనస్సు, బుద్ధి చేతిలోని పనిముట్టుగా తయారై, అభ్యర్థి తానుచేయవలసినంతసేవ చేసిన మీఁద పరమగురువు, శిష్యుని తృతీయతాంకదీక్ష నిమిత్తము హాజరుపెట్టును. అప్పుడు శిష్యుఁడు 'అనగామి' (తిరిగి జన్మమెత్తనివాఁడు) అగును. అతను ఇష్టపడిననేగాని జీవన్ముక్తుఁ డగుటకుఁగాను, భౌతికశరీరములో జన్మింపనవసరము లేదు. అతను చేయవలసినపనినంతను అదృశ్యలోకాలలోనే చేయవచ్చు; అచ్చట నుండియే మిగతా రెండుదీక్షలు పొందవచ్చును.

'చతుర్థదీక్ష'పొందుటకు అర్హత కలుగులోపల ఇంకో రెండు శృంఖలములను తెగ్గింపివేయవలెను. అవి 'కామరాగ' (కామాతురత) 'పతిఘ' (క్రోధము). ఇంతకుముందే మోటుతనముతో కూడియున్న కామక్రోధములను శిష్యుఁ డంత మొందించెను; కాని ఇంకను బహుసునిశితమైన రూపములో ఈ కామక్రోధాలు శిష్యుని బంధములో ఉంచును. ఈశృంఖలములను తెగ్గింపి పాఱవేయుటయు సేవాకార్యములు పూర్తి చేయుటయు గాక కొన్ని అదృశ్యలోకాలను తనవశము లోనికి తెచ్చుచున్నట్లు అవసరమైనప్పుడు తనమేధాశక్తి తన ఉన్నతలోకానుభవాలను జీవితము పొందుపఱుచుకొన్నట్లు నిదర్శనాలు చూపెట్టవలెను. నాల్గవ దీక్ష పొంది అతను 'అర్హత్'అగును (అనఁగా పూజ్యుఁడగును.)

ఈ నాలుగు దీక్షలు ఒకదానితరువాత నొకటి పొందు పర్యంతము అతనిని 'శేఖ' (అనఁగా శిష్యుఁడు) అనెదరు. ఒక గురువువద్ద ఉపదేశము పొందువానిని శిష్యునిగ పరిగణింతురు. దీనితరువాతది 'అశేఖ' దీక్ష అనఁగా అంతటితో శిష్యత్వము సమాప్తమగును. తానే గురువగును.* అప్పటికి జ్ఞానము పరిపూర్ణమగును. ఆయనకు సంబంధించిన చక్రికల్పములోని యావత్తు భూతభవిష్యద్వర్తమానములనుగూర్చిన పరిణామ మునుపూర్తిగా తెలిసికొనుటకు తగినశక్తి అధికారము అతనిలో నిబిడీకృతమై యుండును. అట్టి 'అశేఖ' దీక్ష పొందుటకు అర్హత గలుగవలెనని అయిదు శృంఖలములను తెగఁగొట్టి వేయవలెను. అన్నిటికన్న మిక్కిలి కష్టమైనవిషయ మిఁది.

"అదుగో! చూడు యోధుఁడైనవాఁడు తన ఘోర శత్రువును ఏలాగున హతమార్చునో ఆప్రకారము సాధకుఁడు అన్నిదశలలోను మొత్తముపైన పడి పాపాలను పిండిగుండ చేయును."

స్వకాయదృష్టి, విచికిత్స, శీలావృతపరామర్శ అను మూఁడు కాక కామరాగద్వేషములను రెండింటిని

* హిందూధర్మములో నీ అయిదుదశలను 1 కుటీచక 2 బహూదక 3 హంస 4 పరమహంస 5 అతీత అనెదరు. ఈ అయిదు దీక్షలు క్రైస్తవసాంప్రదాయములో అయిదు పండుగలరూపములో కనపర్చినారు. వానిని 1 కన్యజననము (the Virgin Birth) 2 స్నానము (Baptism) 3 రూపములోమార్పు (Transfiguration) 4 శిలువ వేయుట (Crucifixion) పునరుజ్జీవనము (Resurrection) 5 పవిత్రాత్మయొక్క ప్రవృత్తి నివృత్తులు ( Ascension and Descent of the Holy Ghost.)

అనఁగా మొత్తము ఈ అయిదు పాపాలను ఎవరు అణిచివేయుదురో వారు నాల్గింట మూఁడుపాళ్లు జయించినట్లే లెక్క ;

'అర్హాత' స్థితికి వచ్చినతరువాత, పంచమదీక్ష అయిన 'అశేఖ'దీక్షకు అర్హుఁడు కావలెనన్నచో అయిదు శృంఖలములను (బంధములను) త్రెంపి వేయవలెను. అవి 1 'రూపరాగ' అనఁగా 'రూపప్రపంచములో జీవింపవలెనను కోరిక' 2 'అరూపరాగ' అనఁగా 'రూపరహిత ప్రపంచములలో జీవితము గడపవలెనను కోరిక' 3 'మానో' అనఁగా 'అహంకారము' లేక 'దురభిమానము' 4 'ఉద్ధచ్చ' అనఁగా 'కోపస్వభావము' 5 'అవిజ్జ' అనఁగా 'అవిద్య' అయియున్నవి. వీని అర్థమేమిటో, భావమేమిటో, చెప్పుట అత్యంతకష్టమైన విషయము. ఇంకను 'శిష్యపథము'లో ప్రవేశింపనివానికి ఈ అయిదు బంధములను గూర్చిన జ్ఞానము అవసరములేదు. పంచమదీక్షకు అర్హుఁడగునప్పటికి మానవునిలో మానవాతీతలక్షణములు ప్రస్ఫుటముగా ద్యోతకముకావలెను. అతను అభిషిక్తుఁడయిన 'క్రిస్టాస్టు' కావలె. అప్పుడతడు క్రీస్తు యొక్కసంపూర్ణస్థాయిని అందుకొన్నట్లు ఎంచఁబడును.

ఈ రాజకిరీటమును సంపాదించుటకొఱకే 'తురీయాత్మ' ఇంతకాలము అన్వేషణసాగించింది. అందువలన 'తురీయాత్మ' జీవితములో ఇది మహాపర్వదినము, సంపూర్ణమైన విజయము పొందిన దినముకూడ అయియున్నది. ఈ విజయమువలన కలిగిన లాభమంతయు యావన్మానవమానవేతరమానవాతీతవర్గముల

కొఱకేగాని తనకొఱకు కానేకాదు. కావుననే ఈ విజయము పట్ల ప్రకృతి యావత్తు ఆనందములో మునిగిపోవును. ఈశ్వరునివలె తమ సర్వస్వము మానవజాతి ఉద్ధరణకై అర్పణ చేసినవారిసంఘములో ఒకనూతనసభ్యుని చేరికపట్ల ప్రకృతి ఆనందించును ఒక్కమానవుఁడు 'జీవన్ముక్తుఁడు' అయి నాఁడు.

"ప్రకృతిఅంతయును ఆనందభీతితో పులకితయై, నమ్ర భావమును పొందును. రాత్రి వికసించు పుష్పములకు రజత తార ఈ సువార్తను తన తళుకుమిణుకులద్వారా అందిచ్చును. సెలయేరు, గులకఱాళ్లకు, జలజలమనుచు ఈ సత్కథ వినిపించుచు. నల్లని సముద్రతరంగములు పర్వతాలకు దీనిని గర్జించును, సువాసనలతో నిండిన మలయమారుతము లోయలలో గానముచేయును. గంభీరమైన సాలవృక్షము లీ సంగతిని రహస్యముగా గుసగుసలద్వారా వ్యక్తముచేయును. అదే "ఒకమహాత్ముఁడుదయించినాఁడు ఆయనయే ఈనాఁటి మహాత్ముఁడు" అని యావత్ప్రకృతి ఎలుగెత్తిచాటును. (అంతర్వాణినుండి)

"శిష్యా! ఇంతవఱకు ధ్యానిరహితస్థితిని చవిచూచి ఆ స్థితి ప్రశాంతత ననుభవించి దానిబలమును నిలుపుకోఁగలిగిన వారు, నీవు కూడ అట్టి స్థితిలో త్వరలో ప్రవేశింపవలెనని ఆశించుచుందురని తెలిసికో"

"చీఁకటిశక్తులకు సంపూర్ణవిజయము చేకూరనీయక వానిని వెనుకకునెట్టి వేయుచున్న ఆకొద్దిమంది బలాఢ్యులకు

నీసాహాయ్యమందిమ్ము. అప్పుడు నిజమైన ఆనందసామ్రాజ్యములో భాగస్వామివి కాఁగలవు. ఆ ఆనందస్థితి, నీకు విపరీతమైనశ్రమ, మిక్కుటమైనవిచారమే కాక, నిత్యము అభివృద్ధి చెందు మహానందసమ్మిళితమైన ఉత్సాహమును కలుగజేయును" (మోక్షమార్గప్రదీపికనుండి) ఈ మాటలు భగవంతునో మానవునో ఆదర్శానినో సేవించుటకొఱకు అన్వేషణ చేయువారల కొరకె మహాత్ముఁడు చెప్పెను. పవిత్రోత్సాహము ఔదార్యలక్షణములు గల స్త్రీపురుషులకు మాత్రము 'శిష్యుఁడు' అనుభవించు మహానందస్థితి చేకూరఁగలదు. ఐహికభోగానుభవమువలనఁగాని, మధురస్వప్నాలవలనఁగాని ఇట్టి ఆనందము లభింపదు. మానవుఁడు తన ఊహాశక్తితో భావింపఁగలిగిన మహోత్కృష్టమైన లక్ష్యముకొఱకు పడెడి నిరంతరశ్రమద్వారానే ఇట్టి ఆనందము కలుగును. కన్నెత్తి ఈశ్వరుని చూచి మానవులు ఆయన దూతలము కాఁగలమని తెలియుట; క్రిందకుచూచి మానవులదుఃఖమును అజ్ఞానమును తెలిసికొని తన్నివారణోపాయము వారిచేతులోనే యున్నదని గ్రహించుట ; ప్రకృతినంతయు నొక్కసారి కలయచూచి తను ఆమెకు ప్రవక్త కాఁగలనని మానవుఁడు తెలియుట; ఒక్కసారి తనదృష్టిని లోపలకు మరల్చి 'మృత్యోర్మా అమృతం గమయ' అను సత్యమును చూపు జ్యోతి తనలో కూడ ఉన్నదని గ్రహించుట; ఇదే మనల నావహించియున్న 'స్వార్థం' అను తెరనుచించి గుప్తజ్యోతిని గుప్తకర్మమును కొంతవఱకు చూడఁగలిగిననాఁడు మనలో ఉత్సాహమును

శేకెత్తించును. దివ్యదృష్టి కలిగిన మహర్షులు 'నాన్యః పంథా విద్యతే అయనాయ" (ఇది తప్ప వేఱుమార్గము లేదు) అని చెప్పినారు. ఎవరు ఈశ్వరుఁడుచేయుకర్మమును తద్వారా, ఈశ్వరుని చూడఁగలిగినారో వారు వెళ్లుటకు నిజముగా వేఱే మార్గము లేనేలేదు.'

ఈమార్గము బహుదుర్గమమైనది. శ్రమతో కూడినది. పూర్తిగా ఆశలను, కలలను విసుపును కూడ త్యజింపవలెను. కాని ఈమార్గాన వెళ్లువాఁడు రాత్రింబగళ్ళు క్రొత్తక్రొత్త ఆశలు కలలు పురికొల్పెడి నూతనోత్సాహముతో నిండి ఉండుటయే కాక, జ్ఞానము, ప్రవీణతవలన కలిగినఆనందములో ఓలలాడుచుండవలె. యోగసూత్రములను ప్రవచించు ఒక గ్రంథములో "ఈ మార్గాన నడనఁదలచు సాధకుఁడు తన హృదయమును శిలువకు అంకితముచేయును. శిలువ, హృదయము ఏకమైనప్పుడే అతను గమ్యస్థానము చేరును". అని వ్రాసినాఁడు. ఆ గమ్య మొక రూపాంతరస్థితి ( Transfiguration). ఆస్థితికి రావలసినదనియే ఈశ్వరాజ్ఞ. ఆయన ఎక్కడకు వెళ్లుమన్న అక్కడకు వెళ్లుటఅనునదియే ఇదివఱకు ప్రకటించిన రహస్యజ్ఞానమును కనిపెట్టుటవంటిది.

"మోక్షమార్గములో ప్రవేశించు! ద్వేషముకంటె దుఃఖములేదు, కామమువంటిబాధలేదు, ఇంద్రియములకన్న మోసగాండ్రు లేరు.

మోక్షమార్గములో ప్రవేశించు! ఎవరు తమ కత్యంతప్రియమైన దుర్గుణములను అణఁగఁద్రొక్కఁగలరో వారే పురోగమింతురు.

మోక్షమార్గములో ప్రవేశించు! పూర్తిగా పిపాసా తృష్ణలను తీర్చి ఆరోగ్యము చేకూర్పఁగల సెలయేళ్లు అక్కడ ఉద్భవించును. అచ్చట శాశ్వతపుష్పములు వికసించి దారి నంతను అవి ఆనందము అను తివాసితో కప్పివేయును. త్వరితగతిని పోవుచున్న మధురమైన కాలము అచ్చటనే నిలిచిపోవును.



# 16 అధ్యాయము

## భగవత్సంకల్పమే పరిణామము

ప్లాటో మహాశయుఁడు "భగవంతుఁడు క్షేత్రగణిత సూత్రానుసారి" అని అన్నాఁడట. విశ్వమంతకు ప్రభువైన భగవంతుఁ డొకఁ డున్నాఁడని, ఒక ప్రణాళిక ననుసరించి ఆయన ప్రకృతిని సృష్టించినాఁడని దివ్యజ్ఞానము ప్రకటించిన విషయ మీ సూత్రములో ఇమిడియున్నది. ఆధునికవిజ్ఞాన శాస్త్రదృష్ట్యా నిర్వచింపఁబడిన పరిణామసిద్ధాంతము ప్రకృతికి 'సంకల్పశక్తి' కలదని అంగీకరించును; కాని ఆ సిద్ధాంతము సృష్టికర్త అవసరమును అంగీకరింపదు. ప్రకృతిశక్తుల అకారణసంఘర్షణాఫలమే ఈప్రణాళిక అని అందురు. ఈమధ్యమున నే, విజ్ఞానశాస్త్రజ్ఞులలో చెదురుచెదురుగా ఇది యాంత్రికవిధానమై యుండదనియు దీనిని సంకల్పించి నడిపించు "అద్భుతమైన గణితశాస్త్రజ్ఞుఁడు" (ఒకమహావిశ్వకర్మ) ఎవరో ఉండి తీరవలెనని అనుచున్నారు.

'ప్రకృతికల్పనాశక్తి' వెనుక 'ఈశ్వరసంకల్ప' మున్నదనియు అది ఈశ్వరసంకల్పప్రతిబింబమేయనియు సనాతన ధర్మము స్పష్టముగా చాటుచున్నది. 'ఈశ్వరసంకల్పము' పరిణామము అన్నవిషయము యాంత్రికవిధానముకాదు పైకి "ఆకస్మికమగు అణుసమూహము" అన్నట్లుకనపడునది, ఈశ్వరశక్తుల ఫలమైన కర్మరేఖవంటిది. అది పనిచేయుచుండగనే ఎంతశక్తి

పద్ధతిలో ఉపయోగింపవలెనో ప్రతిక్షణము ఆయనే నిశ్చ యింతురు.

సూర్యమండల మొక సజీవమైన ప్రాణి అని ఆధునికు లూహించలేరు. కాని నిజానికది అటువంటిదే. మధ్యముననున్న సూర్యునినుండి 8 వ బొమ్మలో చూపిన, ఫ్లూటోని యనుగ్రహమువఱకుఁగల దూరమును వ్యాసార్థముగఁ గలి గిన గోళము ఈశ్వరుని భౌతికశరీరము. ఆ మహాగోళములోని వ్యవహారములన్నియు, వారి సంకల్పముప్రకారమే జరుగుచుం డును వారి మానసికశక్తి పరిమాణము ఊహాతీతము. ఏవో అక్కడక్కడ దాని అద్భుతాలు, సృష్టినిగూర్చి మనముచిం తనచేయుచో మెఱుపులాగున కనపడును. అట్టి ఈశ్వరుని మనస్సును మన హృదయముతో చూడఁగలిగిన అది అనంత మైన ప్రేమరాశివలె కనపడును. అభ్యుదయకరమైన కళా దృష్టితో చూడఁగలిగిన, అది అంతులేని సౌందర్యరాసివలె కనపించును.

దృశ్యప్రకృతిలో అది చేయుపని చూచుచుండ క్షేత్ర గణితప్రపథకము మనకు గోచరించును. ఎందుకు 'భగవం తుఁడు క్షేత్రగణితసూత్రానుసారి'యో మన అల్పమనస్సులు ఆమహామహుని గొప్పమనస్సుతో కలియువఱకు మనము తెలియఁజాలము. అంతవఱకు కన్నులతో చూచి ఆలోచనా నిమగ్నులము కావలసినదే. మనము చూచిన విషయాలలో ఒకక్రమము సౌందర్యము సామరస్యము గోచరించును.

పదార్థమంతయు విద్యుచ్ఛక్తిమయము. విద్యుచ్ఛక్తి అన్నను, దానివలన ప్రేరేపింపఁబడు అయస్కాంతశక్తి అన్నను ఏమిటో ఇంతవఱకు ఎవరికి తెలియదు. ఈ రెండు శక్తులయొక్క స్వభావము తెలియకపోయినప్పటికి వీనిలో ఒకటైన అయస్కాంతశక్తి పనిచేయుచుండ క్షేత్రగణితస్వరూపాలు ఏర్పడును. బీలుగుబెండునకు సూదులుగుచ్చి వానిలో




(122 వ పటము)

అయస్కాంతశక్తి ప్రవేశపెట్టి వానిని ఉత్తరదక్షిణధ్రువములుగల అయస్కాంతములుగ చేసి ఆ బెండులను నీటిలో పడవేసిన అవి నీటిమీఁద తేలును. అప్పుడు ఆనీటిమీఁద తేలుచున్న సూదులపై ఒక శక్తివంతమైన విద్యుదయస్కాంతమును దగ్గఱగా పెట్టి పట్టుకొన్నయెడల అవి 122 వ బొమ్మలో చూపిన రూపములను పొందఁగలవు, ఆసందర్భములో ఒక్కసూదియున్నబెండు తేలుచుండ ఈవిద్యుదయస్కాం

తముపరిభావమువలన అది నిలువుగా నిలఁబడును. అట్లే సూది గ్రుచ్చఁబడిన ఇంకో బెండును కూడ నీళ్లలో వేసిన అప్రభావమువల్ల మొదటిది రెండవది ఒకదానిప్రక్క కొకటి వచ్చును. ఆప్రకారమే మూఁడుబెండ్లు ఉన్ననాఁడు త్రిభుజాకారముగా తేలును. నాల్గు ఉన్ననాఁడు చతురస్రాకారము దాల్చును. అయిదు అయిన పంచకోణరూపము పొందును. ఆఱు అయిన పంచకోణరూపముదాల్చి 6 వ సూది ఆపంచకోణముయొక్క కేంద్రములోకి వచ్చును. ఈలాగున 52 బెండులతోఁగూడిన సూదులతో ప్రయోగము జరపడమైనది. 51 సూదులతో ప్రయోగముజరపగా 6, 11, 14, 19 సూదులకలయికతో నాల్గువృత్తములుగా రూపొంది మిగిలిన ఒక సూది వాని కేంద్రములో ఉండును. 52 అయినప్పుడు అదే ఆకారముండును, కాని కేంద్రములో రెండు సూదులుండును. అయస్కాంతప్రభావములో నున్న ఈ సూదులీప్రకారము క్షేత్రగణితస్వరూపాలు ఎందుకు పొందుచున్నవి? అయస్కాంతశక్తి ఈ ప్రకారము పని నిర్వహించుటకు భగవత్సంకల్పమే దీనికి కారణము.

ఈశ్వరప్రణాళికరీత్యా ఏవస్తువు ఏపని నిర్వహించవలెనో నిర్ణయింపఁబడినది. భౌతికశక్తుల ప్రారంభదశలోనే 'సంఖ్య' 'క్షేత్రగణితము' ముఖ్యపాత్రవహించుచున్నవి. 'సంఖ్యా' సూత్రముపైనే ఈ విశ్వమంతయు నిర్మాణము చేయఁబడినదని 'పైథాగరస్' మహాశయుఁడు బోధించినది ఇందుకనే. ఎటువైపుచూచినను క్షేత్రగణిత స్వరూపాలే

గోచరించును. నిర్మాణములోను చలనములోను గల సమ శృతియే సంగీతము గనుక "విశ్వము" పని నిర్వహణలో, గీతాలాపన చేయుచునేయుండును. 'మహాకాశము 'గుండ 'ఎలెక్ట్రాన్లు' వేగముగా చొచ్చుకొనిపోవుచు కెరటాలను ఉత్పత్తి చేయును. కాని ఆ విధానములో ఉద్భవించు నాదము సాధారణమానవునికి వినిపింపదు. సూర్యుని చుట్టును తిరుగుటకు 'మహాకాశము 'లో చొచ్చుకొనిపోవుచున్నప్పుడు జనించు మధురధ్వనిని మనము వినవచ్చు (ఇది నాకు స్వానుభవము) దృశ్యాదృశ్యగ్రహములు ప్రతిదానికి ఒక ప్రత్యేకస్వరము కలదు. కావున 'గోళములమధురాలాపము' (music of the spheres) అనునది వాస్తవమే కాని భ్రమమాత్రము కాదు.



(123 వ పటము)

తుది భౌతికాణువువైపు నొకసారి దృష్టిని మరలింపుడు (123 వ బొమ్మ) అది హృదయాకారముగ నుండి జీవముతో తొణికిసలాడు చుండును. మూడు లావుపాటి ఏడు సన్నని పెనవేసిన తీగెచుట్టల (whorls) తో అది ఒక 'శక్తిని మార్చు' పనిముట్టుకూడ అయియున్నది. అందులోని ప్రతి పెనవేసినతీగచుట్ట ఏడు తరహాల మర తిరుగుడుచుట్టల (spirals) తో చేయబడును. ఈ పెద్ద, చిన్న మరతిరుగుడు చుట్టలే దాని నిర్మాణమున కాధారభూతములు. వీనితో అణువు ఒక ప్రత్యేకపని నిమిత్తము రూపొందింపబడినది.

"మూడు లావుపాటి పెనవేసిన తీగచుట్టలగుండ మూడురకముల విద్యుచ్ఛక్తి ప్రవహించుచుండును. ఏడు సన్నని పెనవేసినతీగగచుట్టలు మహాకాశములో అన్నిరకముల తరంగములకు అనగా వేడి, వెలుగు, ధ్వని మొదలైనవానికి ప్రతిస్పందము చేయుచుండును. ఇవి సప్తరంజనిలోని సప్తరంగులను కనపర్చును. సంగీతములోని సప్తస్వరములు వానినుండి బయలుదేరును. అనేకవిధములుగ భౌతికస్పందములకు ఇవి ప్రతిస్పందించును. అవి ఈ ప్రకారము మెఱయుచు, పాడుచు, సంచలించుచు, నిత్యమును చరించుచు ఊహాతీతమైన తేజస్సు సౌందర్యము కలిగి ఉండును. అణువునకు మూడువిధములైన చలనముకలదు. ఇవి బైటనుండి ఒత్తిడి అవసరములేకుండ సహజముగా తనకుకలవు. తన ఇరుసుపైన నిత్యము బొంగరమువలె తిరుగుశక్తి ఒకటి. తన ఇరుసును కేంద్రముగా చేసి ఆ ఇరుసుయొక్క తిరిగొడు

పై భాగము ఒక చిన్న వృత్తాకారములో కదలుచున్నట్లు తన ఇరుసుతో ఒకవృత్తమును వివరించుశక్తి రెండవది. హృదయ నాడి స్పందించు నట్లు ముడుచుకొనుచు, తెఱచికొనుట మాదిరి క్రమపద్ధతితో కూడిన స్పందములు కలిగిన శక్తి మూఁడవది. ఒకశక్తిని దానిపైకి ప్రసరింపచేసిన అది క్రిందకుమీఁదకు ఆడును. ఇటుఅటుదుముకును. ఆశ్చర్యము కొలుపునట్లు అతివేగముగా పరిభ్రమించును. కాని పై చెప్పిన మూఁడు రకములచలనములు మాత్రము ఎప్పుడును నిలిచి ఉంటవి. ఏడురంగులలోను ఏదోఒకరంగు వచ్చుటకు తగినన్ని స్పందములు స్పందించునట్లు చేయఁగలిగిన ఆరంగునకు సంబంధించిన తీఁగచుట్ట దిట్టముగా మెఱయును." ( అనిబిసెంటు-లెడ్బీటరు వ్రాసిన "గుప్తరసాయనశాస్త్రము" అను గ్రంథమునుండి సేకరింపఁబడినది).

అణువు కిట్టి విచిత్రమైన స్వరూపము ఇన్ని విధముల చలనము, విధులు ఎందునకు ? అది ఈశ్వరసంకల్పము కాఁబట్టి, అణువు అల్పజీవి అయినను తనతో అది సహకరించి పనిచేయవలె నని ఈశ్వరుఁడు ఎదురుచూచుచుండును. ఆయన ప్రతినిధులు యుగాలతరబడి, అణువునకు తన విధులు సక్రమముగా నెఱవేర్చుటకొఱకు శిక్షణ ఇచ్చుచునేయున్నారు. ఎప్పుడు మానవులు తమవిధులను సంపూర్ణముగా నెఱవేర్చుటకు ఇష్టపడుదురో అప్పుడు ఈనాఁడు సాధ్యముకాని శక్తితో మానవులు, అణువు కలిసికట్టుగా ఒకేపని నిర్వహింతురు.

రసాయనికమూలద్రవ్యముల ఆకారములను చూచిన ప్పుడు ఒకక్రమపద్ధతి సామరస్యము, సౌందర్యము, స్పష్టముగా గోచరించును. అన్నిరకముల మూలద్రవ్యముల నిర్మాణము నకు అయిదు ప్లెటానిక్కు-ఘనములను (five platonic Solids as in Fig. 124) ఆధారముగా తీసికొన్నట్లు కనిపించును (124వ బొమ్మలో ప్లెటానిక్కు-ఘనముల చూడవచ్చు). ఈశ్వరుడు మొదట ప్రపంచనిర్మాణముకొఱకు సృష్టించిన 'ఇటుక'లతో సూర్యమండలమును నిర్మించినప్పుడు ఆయన, నిజముగా 'క్షేత్రగణితసూత్రానువర్తి' అనిపించును. ఎందువలన కాల్షియం, చతుర్భుజాకారము 'భాస్వరము' షడ్భుజాకారము కలిగియున్నవి? అది ఈశ్వరసంకల్పము కాఁబట్టియే. ఈశ్వరప్రణాళికలో ప్రతిమూలపదార్థము ఒక పాత్రవహింపవలసియున్నది. ప్రతివస్తువు విశ్వానికి తమకు చేతనైనట్లుగా ఈశ్వరస్వభావమును వ్యక్తపఱుచును. ఈశ్వర చైతన్యపు అనంతమైన సంపూర్ణత్వమునకు ప్రతీవస్తువు ఒకదర్పణము వంటిది. ఈశ్వరచైతన్యశక్తులను భూలోకమునకు కొనివచ్చుటకొఱకు ప్రకృతి ప్రత్యుత్తరమును ఈశ్వరచైతన్యానికందిచ్చుటకొఱకు పైకిలోపలకు ప్రసారముచేయుటకొఱకు ప్రతిమూలద్రవ్యము ఒకప్రవాహామువంటిది.

అణుప్రపంచములోనికి వచ్చునరికి ఖనిజములను చూచి, స్ఫటికములు క్షేత్రగణితస్వరూపాలలో సంపూర్ణత తీసికొనివచ్చినట్లు అందఱు కనిపెట్టఁగలరు. ప్రవీణులైన వారు తయారుచేసిన అతిసునిశితమైన పనిముట్లతో చేయఁగలి

గినవానికంటె ఈస్ఫటికములలోని కోణము లెక్కువ కచ్చితముగనుండును. కోణములుగల ఘనములను మంచిఅందముగను, పొందికగను నిర్మించినపిదప, వంపులతో కూడిన ఘనములను, ఖనిజములోని జీవకళ, వానినుండి రూపొందించును. 125 వ బొమ్మలో చూపినట్లు, శిలాలోహ స్ఫటికములను మరచుట్టమాదిరి వంపులతో తీర్చిదిద్దినప్పుడు ఆఖనిజ కల్పనాశక్తి లేకవైచిత్ర్యమునకు మనమెప్పుడును చకితులము కావలసియే యుండును. ఖనిజవర్గ కార్యకలాపాలు చూచుచున్నకొద్ది అవి ఈశ్వరోద్దేశముయొక్క ఘనతను శ్లాఘించుచున్నట్లు కనపడును. ఈశ్వరోద్దేశములో 'సంఖ్యాతత్త్వము గోచరించును. ఆతత్త్వప్రభావమువలన మూలద్రవ్యముల సంయోగము జరిగినప్పుడు ఒక క్రమపద్ధతి, సామరస్యము, అందము కలిగిన స్వరూపములుగ తయారగును. ప్రతిఖనిజము తనకు సంబంధించిన ఈశ్వరప్రణాళికో దేశమునువెల్లవేర్చుచుండును. కళాకారుడు ఊహించి తెలుసుకొనగలిగినట్టి, గణితశాస్త్రజ్ఞుడు కనిపెట్టగలిగినట్టి ఈశ్వరోద్దేశములో నిమిడియున్న క్షేత్రగణితసూత్రములకు స్ఫటికప్రపంచ మొక దర్పణము వంటిది.

ఈశ్వరచైతన్యము ఇంతకన్న కొంచెము మెత్తటి పదార్థాలలో వ్యక్తమగునప్పుడు నాదము, శ్రావ్యత, ఉన్నత స్థితికి వెళ్లినకొద్ది క్లిష్టమగుచుండును. ప్రతిమొక్క కళాదృష్టితో నిర్మాణముచేయబడినది. చెట్టుమొదలులో కొమ్మ ఏస్థలంనుండి బయలుదేఱవలెనో ఆకొమ్మలో రెమ్మలు




(126 వ పటము)

ఏప్రకారము ఉండవలెనో ఆరెమ్మలపై ఆకులు ఏస్థానములో ఉండవలెనో ఇవన్నియు ఒకఉద్దేశమును పురస్కరించుకొని క్షేత్రగణిత సూత్రముల ననుసరించి నిర్మింపఁబడినవి. పుష్పములన్నియు, ఏదో ఒక సంఖ్యానియమముతో, వాద్యసాధనములోని తీగవలె, తయారుచేయఁబడిన ట్లగపడును. పుష్పములోని, రేకలు, కర్ణికలు, అండకోశములు మొదలైనవాని ఏర్పాటునుగూర్చి ఆలోచనచేయఁగా, ఖనిజవర్గములో మనము గుర్తించిన క్షేత్రగణితస్వరూపాలు తిరిగి కొన్ని కొన్నిమార్పులతోడను, క్రొత్తమోస్తరు కలయికతోడను వృక్షవర్గములో మనకు కనపడును. 126 వ బొమ్మలో కన

పడిచిన నాలుగురకముల స్వరూపములను నిర్మాణము చేయుటలో 'ఈశ్వరుడు, క్షేత్రగణితసూత్రానువర్తి' అను విషయము స్పష్టముగా తెలియును. జంతువర్గములోకి వచ్చు సరికి, 127, 128 బొమ్మలలో కనపడిచిన గుల్లలఆకారములో ఈశ్వరుని క్షేత్రగణితస్వభావములోని వైభవము మరింత స్పష్టముగా గోచరించును. అవి చాల అందముగా ఉన్నవనుటలో సందేహముమాత్రము లేదు. గణితశాస్త్ర సూత్రముల కనుగుణముగా నున్న సొబగైన వంపు, యంత్ర విద్యాపాటవాన్ని మైమరపించుచునట్లు వానిలోపల నిర్మాణము చేసినచక్కని గదులు మాటఏమిటి? ఈ గుల్లలను రూపొందించుట ఒక గొప్పగణితశాస్త్రజ్ఞుని పని అనియు ఆయన మనస్సంతయు సంశాస్త్రవ్యతతో సమశృతితోడి నిండిఉండు ననియు స్పష్టముగా మనకు గోచరించును.

ఖనిజ వృక్షవర్గములలోవలె ఈశ్వరుడు జంతువర్గానికి సంబంధించిన కోటానకోట్ల ప్రాణుల నిర్మాణములో కూడ క్షేత్రగణితసూత్రాలనే అనుసరించును. పైకి అంతఎక్కువగ ఈ విషయము గోచరించకపోయినను, జంతువుల కండరముల చలనము అందముగను లయబద్ధముగను కనపడును. ఖనిజ, వృక్షములలో కంటె, జంతువర్గములో సౌందర్యమెక్కువగా ద్యోతకమగును. అవయవములసొంపు అంగవిన్యాసపుతీరు, కదలుచు తిరుగుచున్నప్పుడు కనపడు క్లిష్టమైన లయబద్ధమైన పొందిక, జంతువర్గముయొక్క ప్రత్యేకలక్షణములని చెప్ప వచ్చు. ప్రతిజంతువు విషయములోను ఈశ్వరుడు క్షేత్ర

గణితసూత్రాలను అనుసరించుచు తన ప్రణాళికోద్దేశనిర్వ
హణ కది చేయవలసిన కర్తవ్యమును బోధించుచుండును.

అణువు మొదలు జంతువర్గమువఱకుఁగల అన్ని జీవవర్గ
ములోను 'భగవత్సంకల్పము పరిణామము' అనెడు సూత్రము
పనిచేయుచున్నట్లు కనపడును. ఎప్పుడు ఒకజంతువు జీవకళ,
తురీయుని ఉపాధిగా రూపొంది పరిపూర్ణత్వము పొందుట
కొఱకు యాత్రప్రారంభించునో, అతనికి. ఏలాగున జీవింప
వలెనో తెలిసి ఉన్నట్లయిన, దృశ్యాదృశ్యప్రపంచములలో,
ఉపాధిపరంపరలలోని మానవుని జీవితసరళి అంతయు మనోవా
క్కాయకర్మముల ఏకస్వనము, సమశ్రుతి కాఁగలదు. ఈశ్వ
రుని మధురస్వరసమ్మేళనములో నొక సుస్వరముగా తన
జీవితమును రూపొందించుటలో అతనిలో ప్రత్యణువు, ప్రతి
జీవకణము కూడ క్రమబద్ధముగాను, సౌందర్యముగాను అను
గుణముగాను ఉండుటకుఁగాను ఉజ్జ్వాతలూగును. మన మెచ్చ
టకు వెళ్లినను మన భౌతికకామమానసికకారణశరీరములతో
గీతాలాపనచేయుచునే యుందుము. ఈశ్వరుని నాదముతో
మన గీతమును మేళవింపచేసి ఆ నాదమును కొంతవఱకు వృద్ధి
పఱచుచు నూతనస్వరములను కల్పనచేయుటయో లేదా
ఆనాదముయొక్క శ్రావ్యతను ధ్వంసముచేసి దానిని బల
పఱుచుటకు ఉత్తములుచేయు ప్రయత్నమును తారుమారు
చేయు అపశ్రుతిని ప్రవేశపెట్టుటయో జరుగుచుండును.

మానవునిలో నిగూఢమైయున్న దైవశక్తిని వికాస
వంత మగునట్లు చేయుటయే మానవులకు సంబంధించినంతవ

అదు ఈశ్వరోద్దేశమైయున్నది. మనము జననమరణచక్రానికి బంధింపఁబడి, జన్మపరంపరలద్వారా వేలువేలుగా ప్రత్యేకజీవితములు గడిపి అనుభవముసంపాదించుటకొఱకే ఈశ్వరుఁడు ఆయనలోనున్న మనలను బయటకుపంపును. మన సంపూర్ణజీవితములో ప్రతిజన్మ ఒకదినమువంటిది. ఒకవర్గము నుండి ఉన్నతవర్గమునకు వెళ్లుటకు తగిన బోధలు, జన్మపరంపరలలో వారి దూతలద్వారా నేర్చుకొందుము. (129 వ బొమ్మ చూడుడు).

| మోక్ష మార్గములో | |
|---|---|
| దశ | కర్మకు హేతువు |
| జీవన్ముక్తుడు | నాదేంవేదు ఆయన సంకల్పమే |
| శిష్యుడు | ఈశ్వరుని కొరకే |
| ఆధ్యాత్మికవేత్త | నీకు నేను తోడ్పడెదను |
| నాగరికుడు | అందరము కలసి పంచుకొందము |
| ఆటవికుడు | ఇది నాకు కావలెను |

(129 వ పటము)

ఆటవికుని పురోభివృద్ధికి కావలసినది 'స్వార్థపరత్వము' అతనిలోని వ్యక్తిత్వము బహుపటిష్ఠమైన కేంద్రముకావలెను. అందుకొఱకు నిత్యము 'ఇది నాకు కావలెను' అనునదియే అతని

జీవితవినాశము కావలెను. ఈలాగున అనేకజన్మలు గడిపినతరు వాత ఈశ్వరసంకల్పములో కొంతమార్పు వచ్చును. అప్పుడా వ్యక్తి 'నాకు కావలెను' అని అనక 'మాకు కావలెను' అను విషయానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చును. ఈస్థితిలో అతను తన కొఱకేకాక 'అందరము' కలిసి అనుభవించుటకొఱకు ఈశ్వరుని సహకారమును వాంఛించును. సంఘమునకు చెందిన ఒక పౌరునిగ తనను భావించుకొని 'అందరము కలసి పంచుకొందుము' అను సిద్ధాంతానికి కట్టుబడును. తరువాతస్థితిలో అతని మనస్సు ఆధ్యాత్మికవిషయములపైకి మఱలును. అప్పు డతని కితరుల కష్టాలను పంచుకొనుటయే జీవితపరమావధి అనిపించును. ఆధ్యాత్మికమువైపు పురోగమించు మానవుల హృదయాలలో 'నీకు నేనుతోడ్పడెదను' అను, భావమే, తనసంకల్పమైనటుల భగవంతుఁడు నిత్యము స్ఫురింపఁజేయుచుండును.

గురుదేవుని పేరు చెప్పి ప్రతికార్యము చేయుట యను నది 'శిష్యుని' ప్రథమకర్తవ్యమని ఈశ్వరోద్దేశము. తన గురుదేవుఁడు ప్రపంచాభ్యుదయముకొఱకు సృష్టిచేయు ఆశీస్సులను ఎప్పటికప్పుడు జాగ్రత్తపఱచి, ధర్మాధికారివలె వానిని వినియోగించవలెను. జీవన్ముక్తుఁడగుటయే ఈవిధానమునకు చరమలక్ష్యము. అంతటితో మానవునికి సంబంధించినంత వఱకు ఈశ్వరోద్దేశము పూర్తిగ నెరవేఱినట్లెంచవలసి యున్నది. ఆస్థితిలో జీవాత్మ పరమాత్మతో వర్ణనకతీతమైన పద్ధతిలో ఐక్యము చెందును. "భగవదిచ్ఛయే నాకు వరవడి గాని నా ఇచ్ఛ ఎంతమాత్రము కాదు" అను సూత్రమే అతని

పనికి ఆధారభూతము. తన విజయమునంగతి తనకు తప్ప తనక్రింది స్థితిలో వారికి తెలియదుగనుక 'అహంబ్రహ్మాస్మి' అను ఆర్ష వాక్యముయొక్క 'నేనునాపితఒకటే' అన్న క్రీస్తు చెప్పినవాక్యముయొక్క అర్థము అప్పుడతఁడు గ్రహింపఁ గలఁడు.

పరమగురువునకు ప్రతీక్షణము అనుభూతిలోకివచ్చు ఈఅద్భుతవిషయమే ఆటవికులకైనను, నాగరికులకైనను, ఆధ్యాత్మికవేత్తలకైనను, శిష్యపథములోనున్నవారికైనను, వేయేల యావత్తుమానవకోటికి ఈశ్వరుఁడు సంకల్పించిన అంశమైయున్నది. పాపాత్ములయు పుణ్యాత్ములయు సర్వుల సహకారముతో ఈశ్వరుఁడు తన ప్రణాళికను నియమిత కాలానికి నెఱవేర్చితీరును. అందుకొఱకే మనమందరము జీవితములు గడిపి అభ్యుదయము సాధించుటకొఱకు అనువైన ప్రపంచమును తానెంతో త్యాగముచేసి రూపొందించి నాఁడు. ఆయన ఎచ్చటపనిచేసిన అచ్చట అపజయమనునది వుండదు. అయిన నిర్వహించుపనిలో ఆయనతో కలిసి పని చేయుటలోనే, ప్రవీణత, అమృతత్వము పొందగలము.

అప్పుడప్పుడు మనకు అనిపించునట్లుగా, ఈశ్వరప్రణాళిక బాధతోడ అలసటతోడ నిండియున్నట్టివిగాని, అనేక విధాలుగ దుఃఖములపాలుచేసినఁగాని ఈమహాత్మ్రమైన ఆనందమును ప్రసాదింపని నిర్దాక్షిణ్యవిధానముగాని, కాదు. నడక నేర్చుకొనుటకు ఒకశిశువు తనువేయు తప్పటడుగులవల్ల చాల ఆయాసము ఆదుర్దాకూడ పడును. కాని వానికి ఉత్సాహము

కలిగించు తల్లి నవ్వుముఖమును ఆనందపారవశ్యముతో నిండిన కళ్లను చూచుసరికి, ఆమె ప్రేమకౌగిట పొందబోవు ఆనందము ముందు ఈఆయాసమును పూర్తిగా మరిచిపోవును. అన్నిజీవరాసులకు ఇదేవిధానము వర్తించును. ఒకవిధముగా చూస్తే పరిణామవిధానము అంతులేని ఆయాసమయమైన దైనప్పటికి, ఇంకోదృష్టితో చూస్తే ఉల్లాసాన్ని కలిగించు క్రీడవంటిది అనిపించును. దీనినే భగవంతుని 'మహాలీల' అందురు. 'సన్మార్గప్రవర్తనకు సంబంధించిన సూత్రాలే, ఈక్రీడలో ముఖ్యముగా గమనించదగిన నిబంధనలు.

ప్రకృతికార్యకలాపములకు అంతర్వాహినిగా ఉన్న ఆనందమును ఎవరంతటవారు అనుభవించి తెలిసికోవలసి ఉన్నది. ఎన్నికష్టాలు అనుభవించినను, ప్రేమయే పరిణామ పరాకాష్ఠ, అని చెప్పగలుగుటకు ముందు అనేకజన్మలు ఎత్తవలసియుండును. అన్నివస్తువులకు ప్రేమ, ఆనందము, గుండెకాయవంటివని, పరిణామమార్గములో కలిగెడి విషాదము యావత్తు బహుతాత్కాలికమైనదని మానవుడు తెలియువఱకు అతని పరిణామము పూర్తికాదు.

జగత్కార్యమంతయు ఒకక్రీడవంటిది అని గుప్తవిద్య బోధించుచున్నది. పరమశివుని నృత్యములో సృష్టియావత్తు బయలుదేరిన దని హిందూమతముబోధించుచున్నది. ఎల్యూషియన్ గుప్తసిద్ధాంతములోకూడ ఇట్లే చెప్పఁబడియున్నది, ఈగుప్తసిద్ధాంతము ప్రకారము దీక్షపొందునాతఁడు 'పవిత్ర పాత్ర'లో ఉన్న దివ్యకిశోరుని (అతనినే 'డయోనిసస్'

అందురు). ఆటవస్తువులను గ్రహించి తెలిసికోవలె. అందులో పాచికలు, బొంగరము, బంతి, అద్దము ఉన్నవి. వానిని 130 వ బొమ్మలో చూపితిని. స్ఫటికములయు, రసాయనిక మూలద్రవ్యములయు అభివృద్ధికి ఇరుసువలె నీ 'పాచికలు' అనగా పంచప్లెటానిక్ ఘనములు' (five platonic solids) ఉపయోగపడును. 'బొంగరము' కడపటిస్థూలాణువు యొక్క నమూనా. 'బంతి' భూగోళానికి చిహ్నము. ఈశ్వరుడు ఉన్నతస్థానము నుండి రూపొందించు కార్యక్రమమును ప్రతిబింబింపచేయు సప్తలోకములకు 'అద్దమొక' గుర్తు. ఇవన్ని ఈశ్వరుని దివ్యకిశోరునిగా భావనచేసినప్పుడు ఆయన అటవస్తువులుగా చిత్రింపబడినవి. ప్రకృతికార్యవిధానాలకు అంతర్వాహినిగా ఉన్న ఆనందమును ఎల్యూషియను గుప్తదీక్ష పొందినవారికి ఈరహస్యార్థమును గ్రహించి, అనుభూతిలోనికి తెచ్చుకొనుట ఎట్లో బోధింపబడెడిది.




(130 వ పటము)

ఇంతవఱకు నీగ్రంథముద్వారా నేను బోధించుటకు ప్రియత్నముచేసిన దివ్యజ్ఞానసూత్రముల సారమును 131 వ బొమ్మలో పొందుపఱిచినాను.

## పరిణామ సూత్రములు

1. దివ్యచైతన్యము జీవోపాధుల ననుసరించియున్న దాగి యుండును.
2. జీవిని బంధమునుండి విడుదలచేయుటకొఱకు ఉపాధి నశించి అంతకన్న సున్నితమైన ఉపాధిలో తిరిగి ప్రవేశించును.
3. దృశ్యాదృశ్యోపాధులన్నియు క్షేత్రగణితసూత్రముల ననుసరించి నిర్మాణముచేయబడుచున్నవి.
4. సృష్టినిర్మాణము యావత్తు ఈశ్వర సంకల్పితమైన 'ఆదర్శ నమూనా' ననుసరించి జరిగెను.
5. మానవుడు స్వార్థముద్వారా తన వ్యక్తిత్వమును బల పఱుచుకొనును. స్వార్థత్యాగము ద్వారా తన శక్తులను లోకసంగ్రహార్థము ప్రసరింపచేయును.
6. ఖనిజ, వృక్ష, జంతు మానవ దేవతా వర్గములన్నిటి యందు దైవాంశము అంతర్వ్యాప్తమైయున్నది. తరతమ భేదములు లేకుండ అన్నిటిలోను ఈశ్వరుడు సమాన పరిపూర్ణస్థితిలోనే యున్నాడు.

(131 వ పటము)

మనచుట్టు నిత్యమునుజరుగు విషయాలలోఁగల మర్మమేమనఁగా, సర్వము చైతన్యస్వరూపమనియు, అది ఎప్పుడును ఏవిధమైన లోటులేని సంపూర్ణస్థితిలో నుండుననియు, 'ఆయన ఎచ్చట ఏస్థితిలోనున్నను సంపూర్ణమైన స్థితిలోనే యుండు'నని తెలిసికోవలెను.

ఇంతవఱకు మానవుని ప్రమాణముగ తీసికొని అతని వ్యక్తిత్వానికి సంబంధించినంతవఱకు మాత్రమే ఈశ్వరప్రణాళికను గూర్చి ఆలోచనచేసితిమి. అప్పుడప్పుడీ అన్వేషణలో దాని బృహద్రూపపుచిహ్నాలుకూడ మెఱుపువలె కనపడుచు ఉండెడివి. ఇప్పుడు ఈప్రణాళికాసంపూర్ణ స్వరూపమును చూచుటకు ప్రయత్నముచేయవలసి యున్నది. మనము నివసించు గోళపుహద్దులను అతిక్రమించి వెళ్లఁగలిగిననాఁడు సూర్యమండలమునకంతటికి వర్తించు, ఈశ్వరప్రణాళికను ఆకళింపుచేసికోఁగలుగుతాము.

అట్టి ఉన్నతస్థాయినుండి సూర్యమండలమును చూడఁగలిగిననాఁడది అనేకరేఖలుగలిగి వివిధరంగులతో విరాజిల్లు అద్భుతమైన విశ్వపుష్పమువలె కనపడును. ఆ పుష్పకేంద్రములో సూర్యభగవానుఁడు ధగధగామెఱయు బంగారువర్ణము కలిగిన గర్భకేసరమువలె కనపడును. ( 132 వ పటము మొదట నున్నది చూడుఁడు ). సూర్యమండలమంతట సప్త గ్రహామండలేశ్వరులలో ప్రతిఒక్కరు సూర్యభగవానుని ప్రభావమును ప్రసారముచేయుచు చొచ్చుకొని తిరుగుతారు. కాని వాటిలో ప్రత్యేకము ఏదో ఒకరకమైన ప్రభావానికి

లోనైన పదార్థము యావత్తు ఆకాశములో 'కోడిగుడ్డు' ఆకారమైన రూపము దాల్చును. అట్టి ఒక్కొక్క రూపానికి సూర్యభగవానుఁడు బృహత్తేజః కేంద్రముగను, ఆ ప్రత్యేక ప్రభావము ప్రసారముచేసిన గ్రహమండలేశ్వరుని అధిష్ఠాన గ్రహము, అల్పతేజః కేంద్రముగను ఉండును. ఇట్టి ప్రభావమును వెదజల్లు అండాకారగోళముల, పరస్పరసంబంధాలలో మార్పులు కలుగుచుండును. అట్టి మార్పులు మనకు భౌతిక గ్రహాల స్థానచలనమునుబట్టి కొంతవఱకు తెలియఁగలవు. కావున ఈశ్వరుఁడైన సూర్యమండలేశ్వరుఁడు వారిచేతిక్రింద వారితో కలిసి పనిచేయు సప్తగ్రహమండలేశ్వరులు కలిపి కేంద్రములో ధగధగ మెఱయుచు స్వర్ణవర్ణోదయముతో విరాజిల్లుచున్న అనేక రేఖలుగల మహాపుష్పమువలె కనుపించును. (పూర్తివివరములకు లెడ్బీటరు మహాశయుని 'అంతరంగిక జీవితము' అనుగ్రంథములోని 'సాంకేతవిద్య' ను గూర్చిన అధ్యాయము చూడనగును).

ఎవరు సూర్యమండలేశ్వరుని విశ్వరూపమును సందర్శింపఁగలిగినారో ఆయన ప్రేమసౌందర్య మహిమపట్ల వారికి అనుమానము ఏమాత్రము ఉండదు. మతతత్త్వములద్వారా గాని, కళావిజ్ఞానములద్వారా గాని సేవామానవత్వముల ద్వారాగాని కలుగు సత్యదర్శనానుభూతి, లక్ష్యానికి ఒక అడుగు దగ్గఱగా తీసికొనివెళ్లును. అనఁగా మన సూర్యమండలేశ్వరునిలో అమితమైన ఆనందముతోను పూర్తిచైతన్యముతో ఉండి చరించుచు జీవితము గడపఁగలుగుదుము.

# ఉపసంహారము



మానవుఁడు వానివిధి, ప్రకృతి దాని సందేశము. ఈశ్వరుఁడు ఆయన కార్యకలాపాలు – వీనినిగూర్చి దివ్యజ్ఞానము ఏమిచెప్పినది, శీఘ్రగతిని చేయఁబడిన ఈసింహావలోకనముద్వారా కొంతవఱకు మనకు తెలిసినది. ఆదర్శభావాలలోను ఆశాజనకసిద్ధాంతాలలోను విశ్వవిశాలమయిన కారుణ్యములోను దివ్యజ్ఞానముతో సరిపోల్చఁదగిన తత్త్వదర్శనము వేఱొకటి లేదు. మానవమేధస్సునకు దృశ్యాదృశ్య ప్రపంచాలలోని జీవితరంగానికిసంబంధించిన వివిధకార్యకలాపాలయొక్క అద్భుతమైనవిశ్వదృశ్యమును, దివ్యజ్ఞానము వెల్లడిచేయును. ఆదృశ్యమును తిలకించి మొదట మానవుఁడు కొంతవఱకు నిశ్చేష్టుఁడైనను తరువాత దాని సౌందర్యమును అవలోకించి ముగ్ధుఁడై తన్మయుఁడగును. ఒక్కవిషయము స్పష్టముగా చెప్పగలను; ఏమనఁగా దివ్యజ్ఞానము ప్రతివిషయమును సప్రమాణముగా ఖండితముగా నిర్వచనముచేయును. అనుమానానికి ఎట్టితావు ఉండదు. "ఇవన్నియు ప్రకృతికి సంబంధించిన శాశ్వతసత్యములు." అని పరమగురువులు మనకుచెప్పి, మనలనొక ఆదర్శమైన జీవితము గడపవలసినదని సలహానిచ్చిరి; ఏలయన పొరపాటుభావములకు లోనుగాక ఋజుమార్గమును అనుసరింపఁదలఁచిన న్యాయమైన స్త్రీపురుషులకు ఆదర్శజీవితము తప్ప వేఱుమార్గము లేదు.

కాని 'ఇదంతయు సత్యమని నాఅంతటనేను ఎట్లు తెలిసికొనఁ గలను' అని, పైకి కేవలము నమ్మకముపై ఆధారపడినట్లు కనపడు దివ్యజ్ఞానసిద్ధాంతములను గూర్చి ఎవరైన జిజ్ఞాసు వయినవానికి సందేహముకలుగవచ్చును.

జ్ఞాన మనేకవిధములు - ఇంద్రియములు నివేదించునట్టిది మనస్సునకు గోచరమగునట్టిది, హృదయము భావన చేయునట్టిది అంతరాత్మ తెలిసికొనునట్టిది కూడ జ్ఞానమే. ఇందు ప్రతీది ఏ మానవుని స్వభావమునుబట్టి ఆ మానవుఁడు సత్యమును తెలిసికొను మార్గము అయియున్నది. మన మందరము ఒక్కమోస్తరుగ లేము. ప్రపంచము, అందు నిత్యము జరుగుచున్న సంఘటనలయొక్క విలువలు జీవితములో మన మన్వేషించు విషయములనుబట్టి మారు చుండును. మానవుని మానసికహృదయనిర్మాణమునుబట్టియే అతని జీవితదృక్పథముండును.

ఒకనికి సత్యమనితోఁచిన దింకొకనికి మాయవలె కనుపించినను, సత్యాసత్యమును తెలిసికొనుటకు అందరకు పనికి వచ్చు గీటురాయి ఒకటి ఉన్నది. సత్యమునకు నిర్బంధించు శక్తి కలదు. ప్రకృతియందలి సత్యమును మనము స్పష్టముగాను కచ్చితముగాను చూడఁగలిగిననాఁడు అది మనస్వభావమును తనవైపు ఆకర్షించి తన ననుసరించి పనిచేయునట్లు చేయును. అసత్యప్రభావము మనపై ఒక్కొక్కప్పుడు చురుకుగను ఒక్కొక్కప్పుడు మందముగను పనిచేయవచ్చు; కాని దానిప్రభావము ఎట్టిదనఁగా దాని గుప్పిటనుండి మనస్సు

ఎన్నటికీ తప్పించుకోలేదు. మనస్సు నిజముగా మాయనుగాక సత్యమునే దర్శింపఁగలిగినను అది దినదినప్రవర్ధమానమగుచు అతనిదృష్టికి మహోత్కృష్టవిషయములను క్రమక్రమముగా వెల్లడిచేయుచుండును. కోట్లాదిగా సందేహము లుత్పన్నము కావచ్చు కాని అవన్ని కలిపి ఏ ఒక్క సత్యమునుకూడ బలహీనపఱుపలేవు ఎవరు సత్యములు గ్రహించితి నని అనుకొనునో అతఁడు తనలో ఉదయించు వేలాదిశంకల నన్నింటిని ఒకదానితరువాత నొకదానిని సంహరించుచు మంచి ఓర్పుతో నిత్యము పోరుసల్పుచు ముందునకు సాగి వెళ్లును.

ఈ దివ్యజ్ఞానప్రవచనాలన్నియు ప్రకృతిసత్యాలైనచో ఎప్పటికైనను ప్రతివారికి అందలి సత్యము ఋజువుకాఁగలదు. మానవుఁడట్టి సత్యముల కనుగుణముగ యోజనచేయఁగలిగిన ఈ సత్యములన్నియు నేడో రేపో ప్రతిమనస్సులోను హత్తుకొనిపోఁగలవు. మానవునిలో తగిన ఆంతరంగిక శక్తులు అభివృద్ధిచెందుచున్నకొద్ది ఒక సత్యము తరువాత నింకొకసత్యము నాతఁడు చూడఁగలఁడు. ప్రస్తుతపరిణామస్థాయిని బట్టి అణువు మొదలు సూర్యమండలమువఱకు భగవత్సంకల్పముప్రకారము అవి నిర్వహించు అన్ని కార్యములు చూడఁగలుగుట మనలో చాలమందికి సాధ్యము కాదు. అతని చైతన్యము వికాసము చెందుచున్నకొద్ది, అతని శక్తిసామర్థ్యాలుకూడ అభివృద్ధిగాంచుచున్నకొలది, ఎక్కువ విషయములాతనికి గోచరింపఁగలవు. మొదట కేవలము నమ్మకముపైన ఆధారపడిన విషయాలన్నిటి

యదార్థత ఇప్పుడు ప్రత్యక్షానుభూతివలన స్పష్టముగా తెలిసి కొనును. ఇట్టి ప్రత్యక్షానుభవము అప్పుడప్పుడందరకు కలగ వచ్చును. కాని అత్యంతవైభవోపేతమైన సంపూర్ణసాక్షా త్కారము జీవన్ముక్తునికిమాత్రమే సాధ్యము.

అట్టి సుదినమాసన్నమగునటకు ప్రతిమానవుఁడు తాను దర్శింపఁగలిగిన సత్యానికనుగుణముగ శక్తివంచనలేకుండ పనిచేయుచుండవలెను. పంచేంద్రియములు మనస్సు మాత్రమే గాక, మన ఆశయములు, భావనలు, ప్రేమ, త్యాగములు కూడ జ్ఞానమును మనకు ప్రసాదించు సాధనలని తెలిసికొన్న నాఁడు ఇప్పుడు మనము మూసిపెట్టివుంచిన అనేకమార్గముల ద్వారా సత్యము ప్రవాహమువలె మనలోకి వచ్చిపడుచుం డును. మనస్సుతోను గ్రహింపఁగలుగు విషయాలకు జీవితము అతీతమైనది. మనస్సు ఎక్కువ ప్రయోజనమైన ఉపకరణ మైనప్పటికి దానిశక్తి బహుపరిమితమైనట్టిది.

దివ్యజ్ఞానసత్యముల నొకదానితరువాత నొకదానిని ఋజువుచేసికోవలె నని ప్రయత్నముచేయు జిజ్ఞాసువునకు ఒక ముఖ్యసత్యమును అంగీకరించి ఆచరణలో పెట్టుటకన్న దృఢ మైన మార్గ మింకొకటి లేదు. అదే విశ్వమానవసౌభ్రాత్ర మనెడి సత్యము. ప్రతిమానవుఁడు తనవంటివాఁడే అనియు ఉభయులందు అంతర్వ్యాపినిగా ప్రవహించుచున్న ప్రకృతి ఒకటే అనియు, తనకేది బాధగాను కష్టముగాను ఉండునో అదే అతనికి బాధగాను కష్టముగాను నుండుననియు ప్రతి మనుష్యుఁడు జ్ఞాపకముంచుకోవలెను. తన ఇరుగుపొరుగు

వానిని చూచినప్పుడెల్ల "ఇంతవఱకు నాకు తెలియనిరూప ములోవున్న నేనే అతఁడు" అని అనుకోవలెను. తనకు బయటనున్నను అతఁడు తనలోని గుప్తభాగ మని ఓపికతో పరిశీలనచేసి తెలిసికోవలెను. తన ఔదార్యమువల్ల, చిర కాలముగా అనుభవించు బాధలవల్ల అభ్యుదయము చెందుచు, ఈశ్వరునికి, మానవునికి సంబంధించిన రహస్యజ్ఞానమును శ్రద్ధగా కనిపెట్టి తెలిసికోవలె నను ఆతృత పెరుగుచుండును. ప్రేమతో చేసెడిసేవయే ఆచరణదివ్యజ్ఞానము. అట్లు ఎవరు ప్రేమపూర్వకముగ సేవచేసెదరో వారు దివ్యజ్ఞాను లయి తీరెదరు.

దివ్యజ్ఞానప్రవచనాలన్నియు, యదార్థములనియు, ఒక తత్త్వవేత్తయొక్క ఊహాజనితములు కావనియు, నిరూపిం చుట కిది ఒకటే మార్గము, ఒకవేళ దివ్యజ్ఞానబోధల నన్ని టిని ఎవరైన సంపూర్ణముగ విశ్వసింపలేకపోయినను అధవ పక్షము వానిని ఆచరణలో పెట్టిచూచినయెడల దివ్యజ్ఞానము అద్భుతమైన సత్యములను ప్రవచించిన దని తెలియఁగలదు తాను, తనసర్వస్వము అనఁగా, తనలోని ఉన్నతమైన ప్రేమ. త్యాగము, సంపూర్ణమైన విశ్వాసము ఆత్మార్పణము తనలో దాగియున్న సత్పదార్థమే యనియు తత్పదార్థము తాను వేఱుకాదనియు, నిత్యము తనలో స్పందించు ప్రత్యాణువు తెలిసికొన్నప్పుడు ఇందుకు అవసరమగు ఉపకరణము లన్నియు తనలోనే యున్నవని తెలిసికోఁగలుగును. మానవ ప్రకృతిలోనే దివ్యసత్యము లన్నియు ఇమిడియున్నవి. మాన

వునికీ సత్యము లపరిచితములు కావు. అవి అతనిని నిత్యము వెంటాడు స్వప్నమిత్రులవంటివి.

మానవుఁడు భగవదంశసంభూతుఁడు కావున జ్ఞాన మతని జన్మహక్కు, జ్ఞాన మొక్కటియే కాదు. శక్తి సామర్థ్యాలుకూడను సాహసకార్యాచరణకు, బాధల ననుభవించుటకు, విజయము సాధించుటకు, అవసరమైన శక్తికూడ అతని జన్మహక్కు. ఎవరు తనను ఆదరాభిమానములతో ప్రేమింతురో వారికి 'దివ్యజ్ఞానము' సంపూర్ణానందమును కలిగించెడి విజయోత్సాహమును కానుకగా ప్రసాదించును.

సన్మంగళానిభవన్తు.



# కొన్ని పటములను గూర్చిన వివరములు

14-20 పటముల వివరములు 2 వ అధ్యాయములోనున్నవి

21 వ పటము  పదిలక్షల సంవత్సరములకిత్రం భూగోళస్థితి

22 వ పటము  ఎనిమిదిలక్షల  ,,  ,,

23 వ పటము  రెండులక్షల  ,,  ,,

24 వ పటము  క్రీ॥ పూ॥ 9564  ,,  ,,

38 వ పటములో a=అ, b=చ, c=క, d=త, e=జ అయియున్నది

39 వ పటములో f=ద, g=బ, h=న, i=వ  ,,

42 వ పటములో p=ట, r=ధ, o=థ  ,,

60 వ పటము  పెద్దవృత్తము విశ్వము లేక బ్రహ్మాండమును, 7 చిన్నవృత్తములు సప్తవిశ్వగ్రహమండలేశ్వరులను, వాటిలోని నక్షత్రములు, ఒక్కొక్క విశ్వగ్రహమండలములోనున్న కోటానకోట్ల సూర్యమండలాలను సూచించును

62 వ పటములో పెద్దవృత్తము సూర్యమండలమును, 7 చిన్నవృత్తములు సప్తగ్రహమండలేశ్వరులను సూచించును

64 వ పటము  మూలప్రకృతి లేక శూన్యము=కోయిలాన్ సూచింపబడినది దీని, ఒకక్యూబిక్‌మీటరుబరువు ·000, 000, 000, 000, 001 గ్రాములు; ఇది లెక్కకు అతీతము, దీని సగటు పీడనశక్తి ఒకచతురపుఅంగుళమునకు 750,000 టన్నులయియున్నది మొదట్లో ఉన్నది చీకటిమాత్రమే—బైబిలు

65 వ పటము  అట్టి మూలప్రకృతిలోనికి విశ్వేశ్వరుడు తనశక్తిని ప్రసారముచేసి గట్టిగా నొక్కిపట్టగా అనేకతేజఃకేంద్రములు వెలువడినవి వాటినే నల్లపలకపై తెల్లబిందువులుగ సూచించడమైనది

79-80 పటములలోని వివరములకొరకు 257-58 పుటలలో చూడవలెను

90 వ పటములో నత్రజనియొక్క, 91 వ పటములో ప్రాణవాయువుయొక్క వివిధనిర్మాణదశలు కనపర్చబడినవి

92 వ పటములో ఏకసంయోగరసాయనికములైన సోడియం, క్లోరినం, రాగి బ్రోమినమ్, వెండి, అయోడినముల అణు నిర్మాణమును గూర్చి తెలుపబడినది,

# తప్పొప్పుల పట్టిక.

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 12 | లైపీయ | ' లైఫ్ ' అను |
| 17 | 21 | నశించినట్లే | నశించనట్లే |
| 23 | 19 | సంభవించినవి | సంబంధించినవి |
| 31 | 9 | కిష్టపడుదు | కిష్టపడుదురు |
| 80 | 13 | భావజీవితము | భావిజీవితము |
| 86 | 14 | ప్రియమ | ప్రియతమ |
| 88 | 18 | ప్రేయసీ ప్రియులు | ప్రేయసీ ప్రియులు— |
| 91 | 10 | రుద్రభూమి, | రుద్రభూమి |
| 97 | 12 | సమయమును | విషయమును |
| 104 | 12 | నూనత | నూతన |
| 116 | | 38 వ పటము (బదులు) 44 వ పటము | |
| 132 | 8 | నామకరణముచేసినవాడు | నామకరణముచేసెను |
| 137 | 9 | కాలమానసిక | కామమానసిక |
| | 20 | ముంచి | మించి |
| 141 | 10 | మృతిచెందినట్లు | మృతిచెందనట్లు |
| 143 | 10 | ఇట్టివే | ఇట్టి |
| 159 | 8 | దగతీర్చుకొనుటకు | దప్పితీర్చుకొనుటకు |
| 170 | 1 | సర్వము | స్వరము |
| 178 | 10 | వివరము | వర్గము |
| 190 | 5 | పంపుచున్నది | పంపుచున్న |
| 209 | 16 | జంతువులు | బిందువులు |
| 220 | 69 వ పటములో క, ప, య (లకు బదులు) ఇ, గ, చ అని చదువవలెను. | | |
| 225 | ఆఖరు పంక్తి | 3 | ఇ |
| 227 | .. | చక్రికాలము | చక్రికల్పము |
| 248 | .. | లంబాంతరాయస్కాం | లంబాంతరాయస్కాంతము |
| 290 | 5 | రాకుండా | కాకుండా |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 309 | 9 | తత్రిమును | మాత్రిము |
| 311 | 18 | పరిణామము | పరిమాణము |
| 323 | 20 | స్వజనాత్మక | సృజనాత్మక |
| 326 | 12 | చైత్య | చైతన్య |
| 335 | 1 | తారక | తార |
| 338 | 18 | వేయుచు | చేయుచు |
| 340 | 17 | నిందరకు | అందరకు |
| 360 | 21 | పూజాసంస్కారము | పూజాసంస్కారములు |
| 363 | 2 | వివరాలలో | వివరాలతో |
| 384 | 16 | అయిన | ఆయన |
| .. | 19 | నిండియున్నట్టివిగాని | నిండియున్నట్టిదిగాని |
| 392 | 6 | సత్యములు | సత్యమును |

